చ॥ వెలఁది నొసంగుమంచు నను-వేఁడుకొనం దగ దేనువేరె? యీ
వలసిన నిమ్ము. కొమ్మకు శు-భంబొనఁగూర్చుట నీదికాదె నీ
యలరిన పుత్త్రి కీమెకిసు-మంతయు భేదము నెంచఁబోకుమా!
తలచిన యట్టివాని సహ-ధర్మిణి జేయు జిజాకుమారికన్ 104

కం॥ శూరాగ్రే సరుఁ డంహో
హోరుఁడు మాలోజి యతిని-నడ్డెడు కొడుకున్
వీరుండౌటను నాదు కు
మారిక నిచ్చెదను నీదు-మర్యాదలచేన్. 105

కం॥ అనినన్ మూర్తి ని జాంసహుః
డనఘా! నా మాట గడువు-కతివనొనఁగె దం
నును బల్కినాఁ డనల్లా
కనుకూలము దంపతులకు-నగును శుభంబుల్ 106

మ॥ అనికార్త్తాం తికుమోముసం, దన దృగ-గ్రాలోకముల్ నింప 'శో
భన లగ్నంబిదె, యెల్లిపంచమి వధూ-భర్త్రానుకూల్యంబు, మెం
డు, నవాంశార్కుఁడు, ఋక్షభేందుబలముం-దోరంబు, జీవోశనే
క్షు, సయంబౌ శుభకార్యమీ
మిథునల-గ్నంబందుఁ జేయందగున్ 107

కం॥ ఆ మాటలు విని పాదుష
హా! మారేటికి? శుభాని-కతిశీఘ్రంబన్
బ్రామాణ్య వచనములచే
నా మోదము భద్రలేఖ-నంపింపుఁడనన్ 108

ఉ॥ భూమిధవుండు జాదవుఁడ-మూల్యసరంబుల మించు వర్ణముల్
వేమరుగాక యొక్క పరి-విన్నను, వ్రాయగలట్టి నేరుపున్
శ్రీ మొదలంతమందుగల-శ్రీవరకొక్క విధంబు వ్రాయు బళ్
గామిడి జూచి పెండ్లికిటు-కమ్మను వ్రాయుఁడనంగ నాతండున్ 109

శా॥ పాదాబ్జంబుల బాష్పధారదడుపన్-బద్ధాక్షి యగ్రాత్మజా!
యేడ్వీ, నీదగు ముద్దుమోము బదిరెం-డేండ్లాయె నేఁజూడ, నా
మీఁదన్ బ్రేమయొకింతలేదకట యే-మీనాక్షి నన్గాంచెరా!
యెదేండ్లీడున, నన్నుఁబాసి యెటుల-న్నా యుండినావొంటిగన్ 233

శా॥ అన్నా! నాయెడఁ బ్రేమలేదకట! యే-నన్యాయపుంబుట్టు వీ
పిన్నన్ జిత్తమునం దలంచుకొని యుం-బ్రేమింపవా తండ్రి!
నున్నట్లించుకయేని నీమనము సం-దూహించుటల్లేదు; వేఁ
గన్నుల్ గ్రైకొనుధాన బీజపురమా-ర్గంబందు నీ రాకకున్ 234

ఉ॥ ఎన్నఁడు మమ్ముఁజూడఁగను-నీవరుదెంచెదవన్ననాశ నే
గన్నులఁజూడఁజూడఁగను-గాయలుగాచినవన్న! నాపయిన్
మన్నన నీకులేదు; తగు-మాన్యుఁడు నీ జనకుండవీడ, హా!
బన్నములెక్కువల్లలుగ-బంధులు ప్రోచిరి నన్నుఁబుత్రికా! 235

తే॥ ఎంతవారింటఁబుట్టిన-నెట్టివానిఁ
జెట్టవట్టినఁదొలిజన్మ-జేయు సుకృత
దుష్కృతంబుల బాలగా-ద్రోలఁదరమె?
కాననేఁజేయు కర్మలే-యాయెనె నన్ను 236

మ॥ అనుచున్, బుత్రికులిద్దఱుంగొలువ, న-య్యబ్జాక్షి హాయిన్గొనన్
దినమున్ విద్యల నభ్యసింప గురు సా-న్నిధ్యంబులన్ జేరి, శై
వనృపాధీశుఁడు, జెట్టికాండ్రఖురళీ-వాటంబులన్ మల్లయు
ద్ధనియుద్ధంబుల సాముగాద్గయుధి చే-దంబుల్ దగన్ నేర్చుచున్ 237

కం॥ తొల్లిటి రాజుల చరితము
లెల్లపురాణములు వర్ణ-వృత్తులు నిశలం
దుల్లాస మొదవ విను, బుధు
లొల్లని సడవడులదాను-నొల్లకయుండున్ 238

ఉ॥ ఆయెడ సహ్యాభూమివరు-నాత్మజ పుణ్యచరిత్రయే, సుయీా
బాయి, శివాజి రూపగుణ-బాహుబలాధిక శౌర్యవీర్యముల్
వేయి విధంబులన్ జనులు-వేమరుజెప్పఁగ, వించు నా మహా
రాయుని జెట్టవట్టమది-రంజిలు టాత్మనెఱింగి తండ్రియున్ 239

కం॥ తన పెదతల్లి కుమారుని
తనయ సయీాబాయిని దన-తనయ సుయీా బా
యిని, జ్యేష్ఠానుక్రమముగ
ననురక్తులఁ జేయుమని శ-హాజికిఁ దెలుపన్ 240

కం॥ విని యతఁడియ్యకొనన్ దన
తనయల సహ్యాగిరిరాజు-తక్షణమందున్
జననుతులకిచ్చి పెండ్లిం
డ్లనుకూలముగా నొనర్చి-యంపించంగన్ 241

కం॥ అది మొదలు శైవరాయఁడు
త్రిదిశాలయములకు నేగి,-శ్రీహరిహరులన్
మదినిడి తొండరి డీప్పొడి
సదయం జేకూర్పుమనుచు-సాగిలి వేడున్ 242

కం॥ గురువుల వృద్ధుల సాధుల
నిరతము సేవించు వారు-నియమించు విధుల్
గొరకొను శ్రేయోమార్గము
నరయుచుహితవర్గములకు-నవ్విధిదెలుపున్ 243

కం॥ సుర నిలయంబుల నావులఁ
బరిమార్చుచు, దేవళముల-బాలిశవృత్తిన్
దొరకొనుఖలులకు నెప్పుడు
పరమతహేయంబు నీర్ష్య-వలదనిచెప్పున్ 244

కం॥ అనినద మధిపు సంజ్ఞా
ధ్యానంబని యెఱిగి భాజి-తారణకోటన్
భూనాయకుండు లోఁగొనెఁ
గాన మనము రిపులనిపుడు-గవియుదమనుచున్ 89

కం॥ హుంకారంబుల దల్పులు
సంకులరావములు బాహు-సంరావములున్
ఢంకా నగార భేరీ
ఝాంకారంబులను జెవుడు-బరపెం దెసలన్ 90

కం॥ ధారాధర సంఘంబులు
ధారాసంపాతములును-ధరఁగురియుగతిన్
సారోదార శరంబులు
తారణపురవరుని తుటుము-తనువులనింపన్ 91

కం॥ ఉరువడి ప్రళయాభ్రంబులు
గురిసెడు పిడుగులను మించు-కోదులజడకిన్
భరియింపలేక ప్రుక్కుచు
తురకమొనల్ పోరు పుడమిఁ-దొలఁగి చనంగన్ 92

కం॥ తారణపట్టణ విభుఁడం
గారము లక్షులను నోలుకఁ-గాఁజూచుచహో!
భీరులయిపారి తిరుగం
బోరికినూలొక్కనిరి వింత-పోటరులనుచున్ 93

చుట్టుపల్ గల కరి-పుట్టకాపరియ నా
వేచి హుమ్మని తల-యూచి యూచి
యుత్తిగసాము పీం-డ్లెఱగలి గప్పిన
వెలిగుండు దొర తేజు-బొలిచి పొలిచి
వడగొట్టు నుడక్క కే-ల్వాలకంటి బోదునా
కడకంటి కిత్తులఁ-గలచి కలచి
దిప్పలూ కెరగలి-కుప్ప మేల్దాలనా
నిట్టూర్పు వడకడల్-నింపి నింపి

కం॥ అరదముల నేమి రవములు
ద్విరదంబుల ఘీంకృతులును-వీతుల హేషల్
హరిదంబరములు నిండఁగ
శరధరరావములు నిలవ-జాగాలేమిన్ 83

కం॥ కయ్యంపునేల కాపుర
మయ్యెన్ గోలాహలముల-కంతటిలోనన్
సయ్యాదులనికిం దుముకుచు
నయ్యారే! యేయుఁడనిన-నాటవికదొరల్ 84

కం॥ పులులం గను లేళ్లవలెన్
బలపలనై మూకపీడి-బలు తెఱవులకున్
దలకొందినట్లు బారఁగ
నిలునిలుఁడని యవన వరు న-నీకినులొకటన్ 85

తే॥ వెంబడించిన చెట్టొక-పిట్టవట్టు
గతి, పలాయనమ్మై దవ్వు గడచి మగుడి
నిలచి, యని కుత్సహించు నా-నేర్పుగనక
బీతులని యెంచి తారణ-నేత వలికె. 86

కం॥ కాయలు గసవలు దినుచున్
హాయింగొని మలల నుండ-కా గొంటునకై
గాయంబు లేలవిడిచెద
రీయెడ దయదలచినాఁడ-యేగుండనినన్ 87

కం॥ తారణ పురమున డాగిన
చారులు ఖాన్పురము వెడలు-సంగతిఁ దెల్పన్
ఖా కసుఃఖఁడేగి కోటన్
భోరుననాఁకొని శృంగ-ములఁబూరింపన్ 88

కం॥ ఆచారుని వచనంబులు
నా చెవులంబడినఁదక్షు-ణము జముకిడకా
రా చూలిసంప బోదే
యీ చెడుగు నిషాకుషీని-నింతలు జరిగెన్ 77

శా॥ ఐనన్ మించెనె మొన్న బీజపురమం-దాదిల్షహా కొల్వులో
వీనింగూర్చి ప్రశంస, రా, యవనులి-వ్వీకాశవాసున్యమున్
గానంజేసినవానికిత్తునని ఖా-న్ఖానంక మద్దానికై
యేనూహింప నతండె వచ్చెవలలో-కే తెంచు మీనంబనన్ 78

కం॥ కావున నీతనిఁబట్టిన
వేవచ్చును ఖానుపదవి-వినుఁడీ చెడుగున్
నావంతుఁజేసి మీరీ
గ్రావనివాసులను నూళ్లు-గొల్పగవలయున్ 79

మ॥ అని సేనాని ముఖంబుగాంచి మన సై-న్యంబందు మేలేరి వా
హినులీరారులవేల గూర్చి రథ భ-ద్రేభార్వముల్ నూరుగ్గై
కొసినీవేగుమటంచు సాదిగను చ-తుర్ద్రాశ్వపత్తంబునై
ఘనచక్రాసిగదాది సాధన శతాం-గంబొండుదోతెమ్మనన్ 80

కం॥ ఇరు దుగ గుడుసులు వెన్దరు
వరి నడగడుల వెడకెల్లి-వాటపుఁడెక్కెం
బర చట్ట చిలుకు తరకస
మరదముఁదోలుకొని సాది-యాదట నిలువన్ 81

గీ॥ సీమమునఁజుట్టు దిరిగి స-లాము నర్చి
చరమదెస వాయిసిడి ఖురాన్-చదివి చదివి
ఆవురే బ్రోవుమల్లా య-టంచు వేడి
స్యందనం బెక్కి వెడలె నా-స్కందమునకు 82

గీ॥ భాజివర్యుని భేరిని-క్వణములదర
తోరణేశుండు విని యిది- యేరి భేరి
యెఱిఁగి యెవ్వాఁడు మిత్తికి-నెదురుగ విసె
ననిన నవ్విధమున గన్న-యనుఁగుబంటు 7

గీ॥ దేవ! యవధారు! తోరణా-ధిప! వినుండు!
బీజపురినుండి యెవఁడో శి-వాజియట మ
హాబలుండట! పూనా పు-రాధిపుఁడట
యడవి వేటల మీది పులి-నణచెనంట 7

కం॥ అది గని మనదగు కొండల
ముదికోదులు వానిఁగొలిచి-ముల్లెలొసఁగఁగన్
చెదరక స్నెయ్యెడలన్, ద
న్నెదిరింగనుగొనక చివ్వ-కేతెంచెననన్ 7

శా॥ ఔరా! యేమిటి వార్తలీపలుకు తౌ,-నౌ, రాణివాసంబునన్
గోరీగారి నమాజు ముచ్చటలు పే-కున్ రోజబీబీవహా
వ్వారే దెల్పబడే, నిసాకుపిని బా-బా-హాయి యుక్కా-గొనన్
చారుండయ్యెడ నీ పసాలిదుడుకుల్-జర్పించె నీతురునన్ 74

కం॥ దేవ! శివాజీ యనెయెడు
భూవరుఁడొక్కండు కొండ-పోల్గాగి కరం

...-దానని చెప్పన్ 75

...ంబడ
...ుపిని-మాతోగీటా
...డొకఁడు వెలువడె
...న చప్పతి వంచుగిని సి-యతని నులిమిఁతిన్ 76

గీ॥ సకలయోధులఁ గనుఁగొని-సంతసమున
తారణాధీశు గెల్చెడి-వారలెవరొ
దెలుపుఁడన నేను నేనని-పలుకనందు
హెచ్చు భాజిని గని నృపుఁ-డిట్టులనియె 65

కం॥ అతులిత కార్ముక విద్యా
న్వితులందఱు బాహువీర్య-విక్రములిందున్
హుతవహు సంగతి భాజి
ప్రతిభుఁడు భాసిల్లెనతనిఁ-బంపుదమనికిన్ 66

వ॥ అని యమ్మహామహు నాననంబాలోకించి

కం॥ మేలేరిన తుటుముల నిరు
వేలంగొని, యూరిఁబయల-విడియించిన నీ
కాలుగమి కొంచెమని వాఁ
డాలమునకుఁగోటవిడిచి-యదటున వచ్చున్ 67

ఉ॥ వచ్చిన భీతినొందుగతి-వానికిఁగన్పడి తేనివెన్కనన్
జొచ్చి, భవచ్చమూవితతిఁ-జుట్టుకొనంగ,ఁదలంచునంతటన్
జెచ్చెరఁగోటమేముగొని-శృంగరితంబుగొనర్పవించు మీ
రచ్చట దాక మధ్యబడి-యాతఁడు చిక్కునటంచు బల్కుచున్ 68

కం॥ తనకంటె నధికుఁడౌ రిపు
మొనకొని రెండవయుపాయ-మునను జయంబున్
గొనవలెనను విబుధోక్తులు
గని కార్యము తొలుతఁజేయఁగా వలెమనమున్ 69

ఉ॥ ఈగతి నిర్ణయించి ధర-ణీశ్వరుఁడంతనె భాజినంపుచున్
వేగమ నాల్గువేలు బలు-వీరులతోఁదమరెల్ల రాత్రియం
దేగుచుఁదారణావని మ-హీధర గుల్మములందు నిల్పి, తా
వేగులవానిచేనచటి-వింతనుడుల్ వినుచుండ నియ్యెడన్ 70

గీ॥ ఈ ప్రతాపాజి కడకన్ను - లెఱ్ఱఁ జేయ
విలయకాలంబటంచు భా-వించి సకల
శత్రుకామినులీతని-సన్నిధికిని
పట్టుతోరంబులను గట్టి-పంపుటరుదె 59

కం॥ గదయందు భాజి ఘోరుని
నెదనెంచి కురుప్రవీరు-నెంచగవలె నీ
మదకుంజరుతో రణమున
గదిసిబ్రతుకు వీరు నెందుఁ-గానము సామీ! 60

గీ॥ ఏకలవ్యునితోఁబోయె-మా కులమున
వింటినేరుపులను బల్కు-గంటుపఱచి
యతని మార్పుట్టుకగుచు సూ-ర్యాజి నెగడె
నితని వింటికి నెదురు వి-ల్లెవ్వఁడెత్తు 61

కం॥ సను నేను జెప్పఁకొనదగ
దనఘా! పరుగెత్తు భల్లు-కాంగమునందున్
సునిశిత శరములఁ జెక్కెద
వనజోద్భవు నతనిరాణి-వాసంపుసతిన్ 62

కం॥ కావునఁ దారణ విభునిం
జీవముతోఁబట్టఁదగిన-సేనాధ్యక్షుల్
నీవద్దఁబదుగురుండఁగ
నేవాఁడని నిర్ణయింతు-నితఁడితఁడనుచున్ 63

గీ॥ అయిన నుత్సాహ మంత్ర తం-త్రాధిప బల
ములను నాలుగు శక్తులు-గలిగి నృపతు
లఖిల కార్యంబు లొనరింతు-రనెడు శాస్త్ర
పద్ధతులఁబట్టి వీరిని-బంపెదమని 64

నిద్దురాత్మునిం బరిమార్చి యయ్యావరణంబు చేకొనవలయు నది యునుంగాక, యితండింతకుమున్ను మన యుత్సాహంబునకుం జూపోపక మన కార్యంబులు విఫలంబొనర్పఁ దలంచుచున్న వాఁడౌట నితనిందప్పక బరిమార్పవలయు, నట్లైన నితని సామంతుండగు బీజపురీంద్రుండు. మనపైఁ గయ్యంబున కేతెంచునప్పుడీ దుర్గాశ్రయణంబుచేఁ బోరంజాలుదుము గాన, తారకేశ్వరుం బరిమార్ప నోపు బల్లిదుని మన సైన్యాధిపులందెంచవలయు ననినఁ దానాజి యిట్లనియె :— 54

గీ॥ రాజమార్తాండ! భీషణా-రాతిగండ
నీదు యోధులలోన నె-న్నిక యదేల?
నందఱసమాన విక్రము-లమితయశులు
పోరనగఁబెండ్లిగతి వారు గేరుచుంద్రు 55

ఉ॥ ఆలమునందుఁ బ్రాణము తృ-ణాగ్రమునట్లుమదిందలంచు ధీ
శాలులు, శూరు లిద్ధబల-సాహసశీలుర గర్జితాంబుదో
ల్కా-, లసదుగ్రశాత శర-లాఘవులీ మహనీయులిందునన్
మేలును నీకసల్లలవెమృత్యుముఖా కృతులిందఱిందఱున్ 56

గీ॥ మున్ను పాండవ మధ్యము-నెన్ని పిదప
నెన్నఁదగువాఁడు నేసాజి-యితని యెదుటఁ
గన్నుదెఱచెడి రాచము-క్కంటి నొకని
మందునకుఁజూడ దొరకక రే-మందు నధిప! 57

కం॥ నేతాజీతోడ జోడుగ
సీతాధిపునొకని గీటు-సేయక పెరభూ
నేతల నెవ్వరి వినను మ
హీతలమున వింటి నేర్పు-లెఱిగినవారిన్ 58

సీ॥ పండువెన్నెలతేటు నిండునవ్వులమీటు
నీటుతో చదలేటి బోటితోడ
దారుపాలులదార-లోర జూపులజూచు
చూపుతో వెన్నెల పూపతోడ
గాలుమబ్బుల బారుతీరులూరగగేరు
నట్టుతో దాలివేల్పు పుట్టితోడ
గాలిమే పరిచాలు-వెలుపేరుల గ్రాలు
చెలువతో ముక్కన్నెవలువతోడ

తే॥ మేలిడాకేల ముమ్మొన వాలుతోడ
తోడవెనకయ్య ముద్దయ్యతోడ గూడ
గూడినడయాడు వెలిగిబ్బకోడెతోడ
పోడల గెంటుముదాలుపు పోలుచునంచు

తెలుగులువాడటలో ఈమహాకవి చూపించిన ప్రతిభ ప్రశంస్యము. శివాజి అభ్యుదయసంపన్నంగా పెరుగుచూ మావళీసైన్యాని ధనుర్విద్యలో విశారదులనుచేస్తూ, ఇష్టసఖుల నేతాజి, నేతాజి, భాజి, ప్రతాపాజి, తానాజి, సూర్యాజి, కొలువైయుండగా "తారణదుర్గం" కైవసం చేసుకోటాన్కి తగినవీరుడు ఎవ్వడాఅని విమర్శించెను. తానాజిలేచి,

"రాజమార్తాండ! భీషణారాతిగండ నాదుయోధులలోన నెన్నికయదేల? నందఱ సమాన విక్రముల మితయశులు పోరనగ బెండ్లి గతివారు గేరు చుందురు" "అలమునందు బాణము తృణాగ్రము నట్లు మదిందలంచధీ శాలులుశూరు లిద్దబలసాహసశీలురగర్జితాంబుదోల్కాలన దుగ్ర శాతశరలాఘ వులీమహా నీయులిందునన్ మేలును నీరసల్లలవె మృత్యుముఖా కృతులింద రిందరున్॥

అందరందరే చిచ్చర పిడుగులు, అన్నభావము ఎంత అభిరామముగ వ్యక్తమగుచున్నది. ఛంద సౌందర్యము ఈయనమనస్సు నకెంత చక్కగ హత్తుకొన్నదో చూడుడు. కడకు భాజిమహశూరుడు. తారణదుర్గమును జయించును. శివాజి అతనిని బహుధా ప్రశంసించును.

శా॥ ఘోరారణ్యపథంబులన్ బహులతా-కుంజంబులన్ లేశకా
సారప్రాంతములందుఁ జాటున, విపక్షశ్రేణిఁ దూలించుటల్
సూరుల్ డాసిన నింద్రజాలముగతిన్-సూక్ష్మాంగులై, డాగుటల్
దారనోన్యము యుద్ధవీరులకు బో-ధల్ సేయునత్యంతమున్

కం॥ దినమున్ మావళి వీరుల
కని తంత్రములెఱుఁగఁ జెప్ప-చరివర్గము, గ్ర
మ్మిన యెడఁబరచిన గతిగా,
మునుకొనవలె నొక్క-మాత్ర-మురళిధ్వనులన్,

వ॥ ఇవ్విధంబున మావళీసైన్యంబులు, ధనుర్విద్యా కౌశలులంజేయుచు
దాదోజీ కొండదేవుని వలనందాను ధనుర్విద్యాభ్యాసంబొనర
నప్పటి సహాధ్యాయులగు, నేసాజియు, నేతాజియు, భాజియ
ప్రతాపాజియు నను వీరచతుష్టయంబును, తానాజియు సూరా
జియుంగూడి యొక్క దివసంబున, రసాల సాలాతప శశికాంతమ
కుట్టిమంబున శార్దూల సంవృతంబై నిండుకొలువుండు కంఠీరవంబ
చందంబున నగ్రాసనాసీనుండై శివరాయుండి మహారణ్యంబ
నంగల పల్లియలు మన యధీనంబులయ్యె, రాష్ట్రాధిపత్యమునకు
దగు నావరణంబులుండవలయు నిప్పల్లియల వచ్చు బడి తుటుంబు
వేతనంబుల కుంజాలనందున నవీనంబుగా దుర్గంబొక్కటి నిర్మింపందగు
దీనికుపాయం బారయ నీయరణ్యంబునకు సమీపంబున తో
ణంబను నొక్క-సాలంబు గలదయ్యె వనాధిపుండతి దురాత్ముండ
పురాతన దేవాగారంబుల గూల్చియు, గోబ్రాహ్మణానాథ హింస
లొనర్చుటంజేసి, వర్షాభావంబున సస్యనాశనంబై జనంబులు దరి
ద్రావస్థలంబొందుటచే ధర్మంబు నాపుమాసి, యధర్మంబు చతు
ష్పాదంబుల వసుంధరం, బరుగులు వెట్టందొడంగెఁ గాన, నియ్యరా
చికంబు మాన్పవలయు, మఱియు, దుష్టశిక్షణంబు నృపనీతిగావున

కం॥ మధురసములొలుకు ఫలములు
పృథువిశిఖంబులను డుల్చి,-భిల్లులకిడుచున్
విధుకాంతకుట్టిమంబుల
ప్రథితులకుందెలు పుసాంప-రాయిక విధులన్. 46

ఉ॥ అంబరచుంబితాగ్ర శిఖ-రాగ్ర మధూత్కర కోశమొక్క-శా
తాంబకమంటి, చీల్చి, గళి-తాసవధారలు వేణుఖండ పూ
రంబునొనర్చి, యందు, వన-రాజన, తండులముల్ ఘటించి, వ
హ్నిం,బచనంబొనర్చి,హిత-భృత్యులఁదృప్తులఁజేయనొక్కెడన్ 47

శా॥ రంగత్తుంగ తరంగిణీ తటలుఠ-ద్రమ్యాంభసాకీర్ణ నా
రంగ, చ్ఛాయల శీతసైకతములన్-రక్తాశ్మ పీఠంబులన్
రంగప్రక్రియల న్వచించు శబరీ-వ్రాతంబులన్ గూడి, రా
జ్యాంగ, న్యాయ, చతుర్విధోక్తములుసూ-ర్యాజీకిబోధింపుచున్ 48

కం॥ చోరరాని:కాననంబుల
గిరిసానుల, మలలనడుమ,-కృషివృత్తులు ని
బ్బర మొప్పన్ మరగింపుచు
నరిగొను. పూఁదేనెలంటు-నళివలె నతఁడున్ 49

ఉ॥ తేనెల నిప్పపూవులును-తింత్రిణికంబులు, కృష్ణజీరకం
బేనుఁగుకొమ్ములశ్మ సుమ-మేలకులు ద్రిఫలంబులాదియే
కాననవస్తుజాతములు-గైకొన, పణ్యములేర్పరించి, నా
నా, నృగణంబులొక్కటి ది-నంబున నయ్యెడఁగూడఁజేసెడిన్ 50

కం॥ కంటకపూర్ణాధ్వంబులు
ఘంటాపథములనొనర్చి-కడు దవ్వుల రే
లొంటిగ, రోఁగొనిపోయిన
గొంటులయలజడులు లేక-కూర్చెం ద్రోవన్ 51

మ॥ వినుమర్వీశ్వర! మేకలవ్యుఁడను తాన్ని-భృన్నాథు గోత్రంబునన్
జననంబందిన మావళీకులములో-సంస్తుత్యముంబొందె మా
జనకుండైన వనాజి, యాతనికినా-సత్యద్వయింబోలుచున్
దనయద్వంద్వమునై జనించితిమిటన్-దానాజి, సూర్యాజినాన్ 40

మ॥ శరసంధానమొనర్చుటల్ చెదల ల-లక్ష్యంబేయుటల్ గుంత, తో
మర, చక్రాసి, కళావిధానములు నీ-మప్రక్రియల్ నేర్చి, యే
ధరణీనాథుని మెప్పుఁగాంతుననుచున్-దర్కింపనాకున్ భవ
చ్చరణాబ్జంబులు జూపె నేటికినుమా-శంభుల్ దయాపూర్ణతన్ 41

మ॥ అని తానాజివచింప నమ్రుఁడయి సూ-ర్యాజీ ప్రతీక్షుండహా!
జననాథోత్తమ! నిన్నుఁజూచినమొదల్-స్వాంతంబు నుప్పొంగెడిన్
ననుమున్, భృత్యుని జేసికొమ్మనుచుఁజెం-తన్నిల్వవారిర్వురా
దినమాదిన్విహితంబులన్మెలఁగి రెం-తే సైన్యముల్గూర్చుచున్ 42

మ॥ బలవిన్యాసము లొడ్డికల్ రణ విధుల్-పార్శ్వంబులన్ జుట్టుటల్
దళవిధ్వంసమొనర్చుటల్ గమన భే-దంబుల్ చమూస్తోమ సం
కుల జన్యప్రతిపక్ష శిక్షణములున్-గోదండ పాండిత్య ని
స్తులభారంబులు నాదియౌ కళలఁదో-డ్తో, వారికన్నేర్పుచున్ 43

మ॥ చరియించున్, గహనాంతరోద్ధతమహా-శైలంబులన్ భిల్ల భూ
వర, కౌమార, కుమారులొక్కతతి శుం-భద్విక్రమంబొప్పఁగా,
హరి, శార్దూల, తరక్షు, భల్లుక, ఎలా-య, క్రోడ, సారంగ, సిం
ధుర, గోకర్ణ, చమూరు శల్య, ముఖ-జంతుశ్రేణి వేటాడుచున్ 44

మ॥ హరిణవ్రాతము బాఱ, వెంటఁబడి, నల్పార్థంబునన్ బట్టుచున్
గరియూథంబుల తుండముల్ గలిపి ప-త్కంఠంబులన్ గట్టుచున్
హరి, శార్దూల, లులాయ, ఖడ్గమృగజ-స్యక్రీడ నాడించుచున్
కెరి పశ్చాత్ప్ర సృతాళి పట్టుకొని యా-ఖేటంబుఁగావింపుచున్ 45

చ॥ పలికినవారి కిట్లనియె-భాస్కరవంశజుఁ డోరయోరి వీరా
పొలమున నుండు క్రొవ్విల్లులుల-పొంకమణంచెదఁ జూపుఁడన్న వా
రలరుచు రేపు చల్దిదిని-యవ్వల బోదమటంచు నమ్రులై
బలుకుచుతేని దోడ్కొనుచు-వచ్చిరి మావళితేని యింటికిన్. 34

ఉ॥ అంతకుమున్నె యా దొరకు-నచ్చోటికి న్వినవచ్చె మావళీ
కాంత కరాంత తాంత తత-కార్ముక రంజిత సింజినీ ధ్వనుల్
సంతమస ప్రభాలక ని-షాద పురంధ్రి కరాంత నిస్వ నా
క్రాంత విషాణవంశ రవ-కాంస్య విమర్దళ డిండిమ ధ్వనుల్ 35

కం॥ ఆ నినదంబులు చెవిఁబడ
తానాజి, యదేమి నాగ,-దరిగల జెంచుల్
భూనాథుఁ డోకఁడు క్రొవ్విల్లువలి
జానేయగఁ జూచుకొండ-జాతి రొదలనన్. 36

కం॥ విని యమ్మావళి వరుఁడ
మ్మనుజేంద్రుని కెదురనేగి,-మన్ననలిడి ప్రే
మను దోడ్కొని వచ్చి మృగా
జినమునఁగూర్చుండబెట్టి-సేమముఁగోరన్ 37

కం॥ శివరాయుఁడతని కిట్లను
నవనిన్ బూనా పురమున-కవనిపుడు శహా
జి వరుండతనికిఁ దనయుఁడ
శివాజియంద్రు జనములనుచు-ఁజెప్పనతండున్ 38

ఉ॥ నృపవర! నీ పదాబ్జములు-నిత్యము సేవరొనర్చు భాగ్యమే
నెపుడు గ్రహింతునంచు విధి-నెంతయుఁ బ్రస్తుతిఁ జేయుచుండ నా
తపము ఫలించి యియ్యెడకుఁ-దారరుదెంచితి రేగు తీర్థమున్
గృపనెదురైన యాత్రికుని-హృద్యముకై వడి నాదు భాగ్యముల్ 39

చ॥ కొకిబకి మూపునం జివుకు-గొంగళులున్ దడవిండ్లు చెంపలున్
మకమకమాయు తాయెతుల-మందడి గట్టిన జిల్గురాళ్ళ ప
ట్టికె సిగలున్ గుడాకుపొగ-బెంకుల జారెడు జల్లువాయిలున్
బికపికలాడి దారి తెరి-పింగొని వచ్చిరి చెంచులత్తఱిన్. 2

తే॥ ఇసుక జల్లిన పుడమిపై-నించుకైన
రాలనట్లుగవచ్చి దూ-రమున నిలచి
ముక్కులను వేళ్ళమోపి దా-రొక్కరొకరిఁ
గాంచి పలికిరి యిదియు న-క్కజమటంచు, 2

ఆ॥వె॥ మాటుగాసి మెకము-మనపుంజు లేయుట
సూసినాముగాని-సొరవ నిట్లు
కలపటంబునొచు-కత్తితో నఱకిన
నొంటరీని నెపుడు-గంటలేదు. 30

గీ॥ ఓరి మన యజ్జ డొక్కరో-డొరుగు సింత
బొజ్జలో నాసి యేసిన-యెజ్జ జీవము
డొక్కదూసిన పిల్లాడి-నొక్కమారు
యిదలకించదె జాతర-లెదరుచున్న. 31

గీ॥ నిన్న పొద్దోయి మాడొక్కు-డున్న నల్ల
బండలోవను పురజాలు-బట్టి చీకి
కండలిడఁదీసి నవిలిన-గుండెకాయ
యిదియె కావలె దీనికి-నిట్టి పాట్లు. 32

గీ॥ అనుచు నెఱుకలు మన్నె వా-రాటవికులు
కోయ సవరలు గదబలు-కొండజాతు
లధిపుఁ గనుగొని పల్కిరో-యయ్యనేట
నుండి నీయాజ్ఞ దలసెడి-యుండెదమని. 33

కం॥ గుంపులుగఁ గూడి కోడులు
చంపునురా ప్రజల, దీనిఁ-జంపఁగలాఁడే
తెంపరి ప్రభునకుఁ జెప్పం
బంపుదమని చెట్టులెక్కి-పల్కెడు నంతన్. 24

శా॥ ప్రావృట్కాల పయోదకాభ్యుదయ శం-పావల్లికన్ మీఱుచున్
దేవీ నామ కృపాణపాణియగు చా-ధీరుండు వ్యాఘ్రంబు నే
త్రోవంబోయెదు, నిల్వు, ఛీ, యనుచు న-స్తోక ప్రభావాఢ్యతన్
గ్రీవాంసంబుల సంధినేయ, చతురం-ఘ్రిచ్ఛేదమై కూలఁగన్. 25

కం॥ దరినది చూచిన కోడులు
సరుదందుచు, నేగి, పల్లి-యలఁ జెప్పంగా
బరువులు వెట్టుచు వచ్చిరి
యిరుల మవసరేయి దెసల-నీనెడు రీతిన్. 26

సీ॥ కన్ను లీకెల కుంచె-లెన్నియో తురిమిన
వేల్సిగల్ నెమళుల-వింతసూప
మొలచుట్టుఁ జుట్టిన-తలవెండ్రుకల త్రాళ్లు
నీలంపు మొలనూళ్ల-పోళిఁ దనర
పలురంగులఁ జెలంగు-తళుకు దోమాలలు
పొడలుబ్బు గుబ్బల-తడబడంగ
చెవుల తమ్మియలంటి-చెవ్వాకు నిగనిగల్
చెక్కుల జేగురు-జిగి దలిర్ప

తే॥ పిడికిలిని గుంపులుండిన-వెదురు విండ్లు
నుక్కు ములికలు గల్గిన-నూచకట్టె
లక్కజముఁజూప దరి చెంచు-పక్కణముల
జవ్వనులువచ్చి రిదిమహా-శ్చర్యమనుచు. 27

కం॥ అహరహమును బూనాపురి
మహీధర సంవాసియగు ను-మాంచరణాంభో
రుహ సేవ జేయుచుం దన
కహితులఁ గసిమసఁగి చెండ-నసి గోరు నెడన్. 18

గీ॥ ఒక్క-నాడు చండికదయ-నెక్కు-డైన
బ్రహ్మజాతిఁదనర్చు వ-జ్రంబు దొరక
తీక్ష్ణలోహంబు గలిపి హే-తిని నొనర్చు
మనిన కలఁగాంచి శివ వరుం-డట్లు చాని. 19

ఉ॥ బారువ లోహమందు నల-వజ్రరజంబున మేళగించి వే
సారక పెక్కు-మారులు భు-జంగ విషంబున ముంచి హస్త వి
స్తారము నంగుళీత్రయత-తమ్మ్రతటిన్నిభమున్ని శాతమా
దారుణ హేతిగూర్చుకొని-దాని భవాన్యభిధన్ భజింపుచున్. 20

మ॥ తన దోర్దండ పరాక్రమంబు రణ వి-ద్యా కౌశలుల్ మెచ్చ' భం
డన భీమా' యని మల్లురెల్ల గొని-యాడన్ దానరాధేయుఁడై
దీనమున్ దీనులఁబ్రోచు, ధర్మము ధరి-త్రీభార నాశంబు నా
ననుచున్ బ్రాజ్ఞులు బ్రస్తుతింప శివరా-యస్వామి పెంపొందఁగన్ 21

గీ॥ మఱియు నాతండు దాదోజి-మంత్రివలన
ప్రజల సౌఖ్యంబు కొఱకునై-పలువిధముల
పాటుపడ నెంచి శబరుల-పక్కణముల
కేగనట నొక్క శార్దూల-మేవుమిగిలి. 22

కం॥ గుబ్బుమను చావులింపుచు
నబ్బును నిగుడించి నోట-నటమును దిను బల్
పుబ్బె నొకదాని నుమియుచు
జబ్బున శబర్రాళి వెంటఁ-జని తఱుమంగన్. 23

కం॥ బలువైన యినుప గుదియను
నలువది హస్తములదవ్వు-నంగల సూక్ష్మా
మలకంబు సగము నాటఁగ
నిలఁ బరువెట్టుచును బొడుచు-నేరుపు మెఱయన్. 12

తే॥ గుదను కైదువుఁ జేఁబట్టి-కొంతదూర
మందు పాతిన యనఁటిపైఁ-బొందుపరచు
బంతి, యిలఁ బడకుండఁగాఁ-బదియువైదు
తునియలు గ వ్రేయుననఁటిని-దూచినట్లు. 13

తే॥ ఒక్క-చేతను లికుచంబు-నుంచి మించి
మిగిలిన కరంబుచే వాలు-నెగరవైచి
కత్తి బడుచున్న ఫలమున్న-కరము నొద్దు
ఫలము తునియలు రెండుగా-బంచినట్లు. 14

కం॥ డోలిక నూగెడు బాలిక-
ఫాలాభరణమున వ్రేలు-బటు వగఫాలున్
ధూలుగతి, గుణము నఱకున్
వాలూని శివాజి యెల్ల-వారు నుతింపన్. 15

గీ॥ ఉదయమందు ధనుర్గదా-యుద్ధ సరణి
కుతుప సమయాంతముల దేశ-కోశ నియతి
రేయి తొల్లి వెలింగిన-నృపుల చరిత
ములను కాలంబు శివరాయ-మూర్తి గడుపు, 16

ఉ॥ కోశము వృద్ధియౌ తెఱఁగు-కోవిద పద్ధతి దుష్టశిక్షణం
బౌశన మంత్రి తంత్రి విధు-లాహవ విక్రమ శౌర్యకాల ము
ర్వీశుల గెల్వ నగుతఱి-నెవ్వను పెల్లడి గామి సంధియున్
లేశ మహత్తరారుల న-లీక హితంబులనెల్ల నేర్చుచున్. 17

గీ॥ శుభ ముహూర్తంబునందు భూ-సురులు నుడువు
మంగళాశీర్వచనములు-మాగధాళి
వినుత ఘోషంబు లొక్కట-విన్ను ముట్ట
శైవవరుఁడు గృహప్రవే-శంబు నొంది.

కం॥ కురుకుల గురునిభు కొండయ
గురునొద్దన్ జదువునేర్చు-కొనవెంచి మహీ
వరసుతులు హితులు భూమీ
సుర సుతులంగూడి చదువు-చుం గుశల మతిన్.

మ॥ దినముం గల్యపువేళలేచి, గిరిజా-దేవిం బ్రశంసించి, మి
త్ర నృపానీకముతోడ మల్ల ఖురళీ-స్థానంబులన్ ముష్టియు
ద్ధ, నియుద్ధ, భ్రమణాంగ విభ్రమగదా-ధన్వాది జన్యంబులున్
ఘనసైన్యంబుల పండభోగవిమలన్-గావించుటల్ నేర్చుచున్.

మ॥ తురగస్యందన వారణోష్ట్రములపై-తూణంబులందాల్చి తా
శరవేగంబున నేగి లక్ష్యములు సూ-క్ష్మ ప్రక్రియన్ ద్రుంచుటల్
బరువుల్వేట్టుచు, తొల్లిటంబలె నొ-నర్పంజాలు నాస్త్రారముల్
గరవాలంబున మింటఁబారు పులుగున్ ఖండించుటల్ నేర్చుచున్.

శా॥ తూలంబున్గల సూక్ష్మకందుకములం-దోయంబులందుంచి, బ
ల్వాలుంగైకొని నాల్గుఖండములుగా-భాగించుటల్ తామసీ
వేళం గూయుచు మింటనేగు పులుగున్-వేధించుటల్ బంతిగా
నాలాపంబులు ద్రిప్పు వేటొకటిచే-నన్నింటినిన్ వ్రేయుచున్.

తే॥ కందుకము మిన్నునంట నొ-క్కండు విసర
నొండు మనుజుండు నొకచెండు-నుర్వి గొట్ట
నదియును మింటదాకెడు-నప్పుడు వాడి
కోల నొక్కట నిరుచెండ్లు-నుర్చి నేర్చె.

# ఛత్రపతి శ్రీ శివాజీ చరిత్ర

## ద్వితీయాశ్వాసము

కం॥ శ్రీ వాక్కాళీ హృద్రా
జీవేందిందిరము శ్రీ హృషీకేశాంభో
జావిర్భవ భవరూపం
బై వెల్గి జగంబుఁ బ్రోచు నవ్యయమూర్తీ! 1

గీ॥ అవధరింపుము శివరాయఁ డట్లు తండ్రి
చే ననుజ్ఞాతుఁడై తల్లితోన, గురుని
గూడి కతిపయ దినములకుఁ బునాపు
రంబు చేరనైయుండ వేగంబు మీఱ. 2

కం॥ చనఁజన సత్యద్భుతమై
ధన వసు నవరత్న నిధిని-ధానాకరమై
జననుత విశ్రుత ఘనమై
మన మలరఁ బునాపురీర-మంగను గొనియెన్. 3

శా॥ భూయోషామణి ఫాలభాగమునఁ గెం-పుల్ గూర్చు చేర్చుక్కా, రా
టూన్యయార్వాధ్వర, వేదికాంతర, మహా-శుక్రాఢ్య, ధూమాంబర
వ్యాయామాంబుద మష్టదిగ్జయ రమా-వాసాగ్రి శుద్ధాంతమా
మ్నాయానుక్రమ నిస్వనాకుల దిశా-నాగాష్టకోన్మాదమున్. 4

కం॥ కని మనమునందు నలరుచుఁ
జనఁ దనుఁ గనవచ్చు పౌర-జనుల సతుల్ గై
కొని వారి నాదరింపుచు
జనకుని శుద్ధాంతమందు-జనని గురులతోన్. 5

వర్ణముగలధాన్యవిశేషములు పండించుచుచే, కాలాంతరమున "గుప్పిశి"గా, మారిన ఊరు, వీరికావాసము. ప్రశస్త శతకనిర్మాత శ్రీ గోగులపాటి కూర్మనాథ కవి, వీరి మాతృవంశమునకు, చెందినవాడని, వినికిడి. ఆచార ఔదార్యములకు ఆలవాలమైన వంగడములో బుట్టి, పరమఅమాయకముగ ఈశ్వరా రాధనము చేయుచూ, ప్రొద్దులు పుచ్చిన మనీషి గౌతమ గోత్రజుడు ఆరువేలనియోగి శ్రీ కొమఱ్రాజు లక్ష్మణ (రావు) సూరి విరచిత శివాజి చరిత్ర వచన కావ్యము ఆధారముగా, పితృపితామహేప్సితముగ, ప ద్య కా వ్య ము వ్రాసి, పితౄణమును తీర్చుకొన్న ధన్యులు, చంద్రశేఖర, కరుణా కటాక్ష లబ్ధ చతుర్విధ కవితావిలోలుడట. భగవద 'నుగ్రహ' విశేష సంపాదితమైన, కవిత్వమును, భగవంతునికె సమర్పించిన పుణ్యవ్రతుడు. ఇం త కు మిం చి కావలసినదేమున్నది! శ్రీరామమూర్తిగారు లభ్యమయిన ఆధారములనుబట్టి 65 ఏండ్లు జీవించి యుండును, తనఏబదిఏండ్ల ప్రాయములో ఈమహాకావ్యము నారంభించి మరొక ఐదారేండ్లుకాలములో పూర్తిచేసియుండవచ్చును. ఈయనగారు 1933 సం॥ లో పరమపదించినట్లు తెలియుచున్నది. ఈ వి ధ మ గు సాంప్రదాయసంపన్నమగు, కావ్యమును నిర్మించినవారు ఈరోజులలో అరుదు. చరిత్రకావ్యములుగా ర చిం చి న మహనీయులు లేకపోలేదు, శ్రీ తిరుపతివెంకటకవులు, శ్రీ ధు ర్భా క వా రు, శ్రీ గడియారంవారు, శ్రీ మధునాపంతులవారు, ప్రశస్తకావ్యములను వలికించినారు, పద్యకవిత్వమునకు ప్రాకుడువట్టిన ఈరోజులలో ఒక మహాజాతీయ నాయకుని, కావ్యనాయకునిగా ఎన్నుకొని, ఎన్నికగన్నరీతిలో కా వ్య ము ను, నిర్మించుట క ష్ట మై న ప ని, శ్రీ గౌరికమాలాసరస్వతులకు జే జే లు సమర్పించి దైవతశిరోమణులకు ప్రణతులుచేసి, గీర్వాణాంధ్ర కవీశ్వరులకు అభివాదంబువల్కి గురువునకు ఏటికోళ్లు పచరించి 'వంశానువర్ణనంబుచేసి' షష్ఠ్యంతములలో ఈ శ్వ రా ర్ప ణ ము గా కావ్యము నారంభించెను,

శహాజి, జిజాభాయి దంపతులు అనపత్యతాశోకంతో కుమిలి, బిడ్డను అనుగ్రహింపుమని ఈశ్వరుని సేవిస్తారు ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు.

# గద్య

ఇది శ్రీమద్భవానీ వరప్రసాదాసాదిత స్వతంత్ర మహారాష్ట్ర
రాజ్యసంస్థాపన ఛత్రపతి బిరుదాంచిత, య వన గం
డరగండ కథాకుతూహల, చంద్రశేఖర కరుణా కటా
క్ష లబ్ధచతుర్విధ కవితా విలోల, ఆర్వేలవంశ ప
విత్ర, గౌతమగోత్ర, బలిజపల్లి కుల కల శా
బ్ధి కల్హార కళత్ర, అయ్యనామాత్య
పుత్ర, నిరంతరపరచింతిత, కవి
తా వినోద బిరుదవిస్ఫూర్తి,
రామమూర్తి విరచిత,
శివాజీ చరిత్రంబు
నందు ప్రథమా
శ్వాసము స
ర్వము సం
పూర్ణ
ము.

శా॥ లోకేశాంశభవుండు, నిత్యసుకృత-శ్లోకుండు, ధీరాత్ముఁడ
స్తోకాంచద్ధ నురస్త్రలక్షణ నవ-ద్రోణుండు, షాడ్గుణ్య వి
ద్యాకౌశల్యవిపక్ష శిక్షిత బిడౌ-జాచార్య విఖ్యాతుఁడౌ
నాకొండావని దేవుఁగూడి శివరా-యాధీశ్వరుండేఁగఁగన్ 263

## ఆశ్వాసాంతము

చ॥ సకల చరాచర ప్రకర-సంభవనీయ శ్రుతిస్మృతీలస
న్నికర తపస్వివాగ్విభవ-నిస్తుల సత్యశమక్ష మాధ్వర
ప్రకటపరైక ముక్తిపథ-భాస్వర భాస్వరవేదసార ని
త్య,కలుషనాశ! యీశ! పర-మాత్మ పరాత్పర! భవ్యనాశకా 264

మాలి॥ పరమ పదవిహారా! భక్తమందార హారా!
నిరవధిక కటాక్షా! నిర్మలాత్మైక దక్షా!
భరిత భువనమూర్తీ! పద్మజాతాండవర్తీ!
దురితవనకుఠా రా! దుఃఖసంహార కారా! 267

కం॥ మునిజన మానస నూతన
వనజాత దళామృతైక-వాల్లభ్యతపో
ధనసంసేవిత చరితా!
వినుతామ్నాయార్థసార-విహితాకారా! 266

మ॥ అని చింతింపుచు సూరి గోష్ఠుల నుప-న్యాసంబులన్ జెప్ప పు
త్రునిసీక్షించి శహాజి, యన్న! నిను సంతోషంబుతో, ఖానుఖాన్
దనరచ్చంగొలు వంగరమ్మనియెఁదా-నన్ శీఘ్రముంబోయి, యా
ఘనునిన్ వర్ణనఁజేయగా, నొసగెడున్,-త్సైనాథచిహ్నంబనన్ 251

మ॥ గురువర్యా! భవదీయ వాక్యములు నా-కున్ హృద్యమేయైనని
ప్పూరి, ఘంటాపథసారనాళులను సం-పూర్ణంబుగా బారు న
య్యారచూల్ గ్రేపుల నెత్రుటేర్లు సుర నం-ద్యావర్త విధ్వంసదు
ర్భరకర్మంబుల మాన్పనట్టి నృపుగో-ల్వాన్ జిత్తమెట్లొప్పెడున్ 252

మ॥ అనుచన్యోన్యముఁబల్కి శాజి యొక నా-డాదిల్ షహారచ్చకున్
దనయుంబంప, సలాముఁజేయకను,నా-తంఁడొక్క పీటన్గొనన్
గని, యేదుల్పతి, శాజిరాట్సుత కన-త్కంఠీరవంబీతఁడా!
యనినన్, వించు, మురారిమంత్రి హితవా-క్యప్రౌఢిఁదానిట్లనెన్ 253

శా॥ ‘తస్మాద్రాజముఖం భయం’ బనెడు వి-ద్వాంసోక్తులున్దప్ప తా
నాస్మేరాంకురముల్ జనించెడు త్వదా-స్యాంభోజమీక్షింపఁగా
నస్మన్ముఖ్యులు భీతినొంద,-బసివాఁడౌటన్ భయంబంది, రా
జస్మర్తంబులొనర్పఁడైన హిత సౌ-జన్యప్రభావాఢ్యుఁడౌ 254

తే॥ కాన మన సైన్యనాయకా-గ్రణి పదంబు
నొందఁజేయుట కర్హుఁడం-చొత్తివలుక
పటుతరోద్యోగ మొసఁగె, శి-వాజి కప్పు
డభినవాంబర ధరుఁజేయ-నతఁడు పిదప 255

॥ ఆనతినొందకేగి తన-కాదిలషాయిడు నవ్యచేలముల్
దీనులకిచ్చి, కిల్బిష వి-ధేయులు నీ సభప్రాడ్వివాకు లెం
తేనియు, ధర్మదూరులని-యించుక యించుకుపన్యసింపుచున్
ఖానులనాలఁజంపుటలు-గైకొనకుండగ బోధఁజేయఁగన్ 256

కం॥ 'మంచివచించిన కోపము
మించున్ జెడుగులకు' ననెడు-మేటియుపమ గై
కొంచప్పురి కుజనులు మఱి
నెంచి శివాజీని సభల-హేళనఁ జేయన్ 245

ఉ॥ అమ్మహనీయుఁడిట్టి పరి-హాసములాత్మఁదలంప నీశ్వరున్
సమ్మతివేడి దుష్టజన సం-హరణంబున కేదిసాధనం
బిమ్మహినెల్ల శేరజము-లేఁదొడంగిరి, శేండ్లబీరమున్
వమ్మయినీటఁ బారె, తులు-వల్ గలికాలమునాట హెచ్చెడిన్ 246

శా॥ ఆహా! చంద్ర, దినేంద్రవంశములు శూ-న్యంబయ్యెనో, నిల్చియున్
బాహా సత్వములుల్లసిల్లవొకో! శుం-భద్ధైర్యశౌర్యంబు లా
స్వాహానాథునియందుడించెనొకో! వి-శ్వంబెల్లెడన్ దుష్టసం
దోహంబుత్కటమయ్యెనియ్యెడదృఢా-త్ముల్ లేరెసాధింపగన్ 247

ఉ॥ ఎన్నడు సర్వభూవలయ-మేలెడిరాసుతులుద్భవింతురో!
యెన్నడు దుష్టసంహరణ-మిద్ధరఁగల్గునొ, సాధురక్షణం
బెన్నడుసాగునో? జనము-లెన్నడు సౌఖ్యముఁగాంతురో? మహా
భ్యున్నతినాల్గుపాదముల-నుర్వినిధర్మములెప్డు మించునో 248

ఉ॥ అక్కటనీయరాజక మ-హార్ణవమారగఁ జేసి భూమి న
ల్దిక్కుల మానవాళి సుకృ-తింగను నట్టులొనర్ప, భూవిభుం
డొక్కడయేని పుట్టఁడొకో-యుర్వినిహా! కలికాలమిట్టిదే
స్రుక్కెపశువ్రజంబులు వ-సుంధర సస్యవిహీనయయ్యెడున్ 249

శా॥ పారాశర్య, భవిష్యవృత్తములలో-భర్గాంశజుండై కలి
ప్రారంభంబునఁబశ్చిమాశను మహా-రాష్ట్రావనిన్ ధీరుఁడౌ
వీరాగ్రేసరుఁడిద్ధ తేజుఁడొకఁడా-విఖ్యాతముంబొంది భూ
భారంబుందొలఁగించు'నన్న నుడువుల్-వ్యర్థంబొ,తథ్యంబొకో! 250

గీ॥ నెలుకలొప్పిన నెఱసరి-నెగడిపల్లు
దీటినొడలుబ్బఁజేసి మున్నీటి యలల
సద్దుపోలిక సింగణి-గద్దరించె
గంటుతుటుముల సరముల-గంటి గంటి 94

ఉ॥ విల్లున నమ్ముఁగూర్చుటయు,-వేడిసిలుంగుల గంట్లు పిండ్లొడల్
జల్లులువోవనేయుట వ-జీర్ణ జిరాలు గొనంబుల త్తెముల్
బొల్లులొనర్చుటెల్ల కను-మూసినమాత్రనొనర్చుచుండు నా
బల్లిదు పగ్గెఁబేరుగొనఁ-బ్రాబలుకుల్దణి కేని శక్యమే 95

మ॥ నిలువుల్నిల్పిన బోలి బల్గొలిమలన్-ద్రెంపన్ భువింజారు న
ల్లలు కొనేఱులకై దు వంగములు మీ-లంబోల గావించు చ
బ్బలు పుంజోదుని దేరి జూడఁగను నా-వంతైన వీలుండ వ
మ్మలగీముల్ మొనగాండ్రు పారిరి దెసల్-మార్మ్రోయుగా వెట్టుచున్ 96

ఉ॥ పెక్కురవాల నొక్కసరిఁ-బీచమణంచుచు గబ్బుచెంపలన్
మొక్కపడంగఁ గేల్దునిమి-బొందళపుం దిటవర్ల తేరులన్
మొక్కలుగా నొనర్చి గొన-మున్ వడిఁదీటుచు నెల్లమేనులం
జెక్కలుజేసి, యాముగొను-చారమొకంబన తేజునొందగన్ 97

కం॥ విల్లమ్ము బొ ఱమెట్టుగ
నెల్లదణీయులును బాలు-సిరు కన్నెవల్
పెల్లెఱ్ఱదనముఁదోపఁగ
నల్లెందీటుచును బాజి-యవనుంగవియన్ 98

మ॥ పటకుంగుబ్బలి కవ్వపున్మలయు, ము-వ్వన్నె ల్మెకంబేనుగున్
వటచక్కంజముదిక్కు సంద్రములు చి-వ్వాండాయునట్లొప్పి పె
న్కపటల్ బొమ్ములు జంకలునొక్కసళుల-న్గాటంపుఁదూపుంగముల్
జటివాటల్ బలె సింపచట్టలను స-ల్లల్గారగాఁబోరుచున్ 99

ఉ॥ ఖానువజీర్లుకొండఱవి-గైకొన కీచకురాచపట్టికన్
గానకక్రిందు మీఁదరయ-కన్ దొరకొల్పెనఁదుచ్ఛవాక్కులె
న్నేనియుఁ బ్రేలెమొన్న; నిక-నీతనిఁజుట్టలతోడ బంది ఖా
నానిడ, నేమలేశుసద-నంబునఁజెప్పెదమంచు నున్నెడన్ 25

చ॥ శహజి మురారిరావు లోక-సంగతి నున్నెడఁజుట్టలేగి, యీ
బహుమనిసీమనున్న మన-బంధుగులెల్లరు నేటినుండియున్
గహనములన్ వసింపఁగల-కాలముచేకురె, మీ శివాజి దా
నహరహమిప్పరీశున ప-హాస్య మొనర్చెడు కారణంబునన్ 25

కం॥ ఏ యెడఖాను వజీరులు
మాయావులు తుచ్ఛులను చ-మర్యాదోక్తుల్
గోయని కూయుటచే పా
చ్ఛా యెదుటన్వారు చెడుగుఁ-జదువుటకతనన్ 25

కం॥ అని యొత్తియొత్తి చెప్పన్
విని, వారు శివాజి సధిక-వినయము, భయమున్
గనపరచి ఫలితమించుక
గాననేరక యొక్కయుక్తిఁ-గూరిచిరిట్లున్ 26

కం॥ మనదగు పూనాపట్టణ
మున వచ్చెడు వచ్చుబడి స-మూలము రాకుం
డీనఁదచ్చోటికిఁజని నీ
వనఘా! రాజట్టుమచటి-యర్థంబనుచున్ 261

సీ॥ కుంభభవతుల్యు దాదోజి-కొండ దేవుఁ
డనెడి విప్రునిజతఁ జేసి-యంబతోడ
నా శివాజిని నటకంపి-యప్పుడె శహాజి
ద్రవిడ కర్ణాటకములపై-దాడివెడలె 26

కం॥ కఱకుం దూపుల యవనుని
యేఱుచిన్నిలు వెల్లనొలిచి-యిసుమంతిసుమం
తేఱుచట్ట జీల్చి నల్లం
బఱగించిన దిమ్మవట్టి-పాశ్చాత్యుండున్ 100

సీ॥ ప్రళయకాలాభ్రంబు-పగిది గర్జించుచు
నుల్కానిభశరంబు-లొకట గురిసి
సంవర్తమార్తాండ-సన్నిభవదనుఁడై
రదన ఘట్టనలగ్ని-రవులఁజేసి
కాలాంతకోదగ్ర-గాఢా ట్టహాసుఁడై
మృత్యుసన్నిభ శర-వృష్టిముంచి
క్షయధిష్ట నిటలాంబ-క, మహోగ్ర నేత్రుఁడై
శూలోపమాంబక-జాలమేసి

తే॥ వాలమును ద్రొక్క భయద దు-ర్వార పక్ష
కృష్ణసర్పంబు పగిది లం-ఘించి గవిసి
తారణేశుండు నబ్బాజి-ఘోరునాగి
పారిపోవక నిలుమని-దూఱి దూఱి 101

వ॥ మఱియు సమ్మోహధనుర్ధరుండు ప్రళయ సమయ ధారాధరంబు చందంబున పిడుగులు గురియుచు, మహాగిరి శృంగంబుల విజృంభించు దావానలంబు పగిది,జాజ్వల్యమాన కీలాని ఘాంబంకంబులం గుమిగూడిన నాటవికసేనాసము దయేంధనంబుల భస్మీ భూతంబు గావించుచు, నాయుధ సహిత హస్తంబులును మణిమకుటపిహిత మస్తకంబులును, గ్రైవేయ పూరితోరచ్ఛదంబులను, నంగుళీ భరిత చపేటంబులునుందెగనేయుచు యుగాంత ప్రళయ భైరవుం బోలి యట్టహాసంబొనర్చిన మున్చరుంగులిడి చేరు నమ్మావళులు

క౦|| కాంతా కనక ద్రవ్యము
నెంతయు మోహింపఁజేయ-నిమముల బరచున్
జింతిల్లుదు రవి గూర్పదు
రంతంబను చింత, నించు కైనం గొనకన్ 203

క౦|| తనకుఁగల కొలది మాత్రం
బున మనుజుఁడు దృప్తినొంద-నుల్లోకములన్
వినుతయశుండౌ దుర్యశ
మునుబొందును నాస పెద్ద-బొడమిన యతఁడున్ 204

శా|| శాల్యన్నంబు ఘృతంబు సూప మరిచ-స్వచ్ఛామ్ల సారంబు సా
కల్యాపూప యవాల్పమిశ్ర దధి భ-క్ష్యస్థేమ భిస్సాదులన్
గళ్యస్ఫూర్తిగ మెక్కియున్మఱియు మె-క్కంగోరు పీయూష స
త్తుల్యక్షీరముగా ననాసలకుఁ దృ-ప్తుక్ మేరలుంగల్గునే 205

గీ|| ఎంతమెక్కిన చేకూరు-వింతరుచుల
నొల్లకుండునె జిహ్వాయ-ట్లొనరుచున్న
నవని వారలుగాక ది-వ్యాంగనలను
ఏలకుండిన తమిదీరు-నే, మనంబు 206

కం|| మానవులు బ్రతుకు కాలము
లో నారవపాలు వయసు-లో పల గన్నల్
గానరు కాలంబెల్లను
జానగు వయసైన నెట్టి-సంగతిఁగనునో 207

కం|| పెఱతెరవఁ జూడవేడుక
గఱచెడు కన్నులను జీకు-గావించియు నా
పెఱవనిత నొందు నాసను
మఱగిన నింద్రియములెల్ల-మ్రందింపవలెన్ 208

మ॥ అని చింతింపుచు నివ్విలాసిని నితాం-తానంద కల్లోలి నీ
కనదుత్తుంగ తరంగ సంఘ ఘన రిం-ఖా డోలికా సీనయై
వనజాతాయుధ కేళినాథుని పరి-ష్వంగంబులందేలుచున్
మనుకాలంబిటు లౌటకున్ నృపుల దు-ర్మార్గంబె మూలంబగున్ 199

గీ॥ ఇట్టి సౌందర్య ఖనియైన-యిందువదన
గర్భమునఁబుట్టువాఁడె జ-గన్నుతుండు
నాదుజనయిత్రికిట్టి సౌం-దర్యమున్న
బుట్టనే యేను ధర జగ-త్పూజ్యుముగను 200

సీ॥ ఈ మిన్న ముక్కంటి-సామేని యై యున్న
నడుగు దమ్ములు బత్తి-నలరి గొలుతు
నీ నాతి లుకజీ మ-హీం జాని సుతయైన
గన్నతల్లియటంచుఁ గౌగిలింతు
నీలేమ శహజి రా-చూలియైయుండిన
సహజాత యని మది-సంతసింతు
నీ యింతి నే గన్న-యెలనాగయై యున్న
నంకమందిడి ముద్దు-లాడుచుందు

గీ॥ నీ విలాసాంగి వీరిలో-నెవరుగామిఁ
బలుకరించుటకింత యొ-ప్పదు మనంబు
తెలియకేరీతి భాషింతు-దీనితోడ
పరవనిత గాన నేమని-పలుకరింతు? 201

కం॥ దీనింగైకొన బాజీ
సోనుఁడు నాకొసఁగె నిదియ-శోధన నా శం
బౌ నని శ్రీహరహరయని
ధ్యానింపుచు దృష్టిదోష-మని వెత పడుచున్

ఉ॥ చిక్కఁగఁబూయు చందనము-చెల్వన నొప్పెడు గంచుకంబులో
చెక్కిన బొమ్మకుంబలెనుఁ-జేవజెలంగు కడింది చన్నులున్
బిక్కటిలంగ జారు తలి-పెంపు చెఱంగును సర్దుకొంచిసన్
జెక్కులుగాదె డెందము ఋ-షి ప్రతిమాదులకైన జూడఁగన్ 193

మ॥ చతురంభోనిధి మధ్యభూవలయ మో సాకత్న సౌందర్య మీ
సతిలావణ్య పృథక్ప్రతీకరుచిరా-సారంబు లొక్కెత్తుఁ దూ
చి, తులన్, ధాత, లఘుక్రియంబరఁగ, స-క్షీణైక సామ్రాజ్య మం
చు, తులాపాత్రల నక్కునుంచు గురుతుం-జూపట్టె వక్షోజముల్ 194

తే॥ అఖిలజన దర్శనీయాత్మమై ప్రతీక
హృద్యమీక్షింపజాలదు-దృగ్యుగంబు
మోద సంపూర్ణమా గుప్త-మూర్తి రుచుల
నీక్ష సేయంగఁజాలదు-దృక్ఛతంబు 195

కం॥ కట్టాణి ముత్యమందున
బిట్టాడెడు నీరుపగిది-బింబాధరమే
నట్టిట్టున లావణ్యం
బుట్టిపడెంబ్రీతినెల్ల-యెడలంజూడన్ 196

గీ॥ భవ్యసౌవర్ణ కదళీస-వదళము చెలి
చరమ భాగంబుతో సాటి-సాటవచ్చు
రోమరహితమ్ము తత్కాటి-రుచివిశదము
లల్లి గదళీదళంబున-కమరెనేని 197

చ॥ కుబుసముప్రీల పిక్కటిలి-గొంకక పయ్యెదనుబ్బి మీఁదుగాఁ
జుబుకమునంటి నాసగను-బొక్కపుసిబ్బెపు గబ్బిగుబ్బలీ
యబల మనోహరాంగముల-కన్నిటికిన్ బరువంపునీరడన్
బ్రబలిన హేమకుంభముల-భంగిని దీనికుచంబు లొప్పెడిన్ 198

సుందర చరిత్రము. దీనిని పదిఆశ్వాసములలో ప్రతీపద్యమనోజ్ఞముగా చిత్రించి, శివాజిని కన్నులకు కట్టించినవారు, కవి, కవితావినోద శ్రీబలిజపల్లి రామమూర్తిగారు, వారిప్పుడులేరు, వారికావ్యము మీముందు న్నది. ఇక ఇందలి గుణదోషములకు కావ్యానందరసికులగు సహృదయులే ప్రమాణము. రెండుమూడేండ్లనాడు,ఒకవేకువన, ఈయనగారి కుమారులు ఎనుబదవ పడిలో బడ్డవారు, శ్రీరామారావు పంతులుగారు, మా ఇంటికి వచ్చిఇది మానాయనగారు వాసినది, మీకువినిపించవలెనని యున్నది, ఏమేని దోషములున్నచో సరిచేయుడు అని అన్నారు. అధికారమున్ననూ లేకపోయిననూ, ఆనందించుటకు తగిన సౌహార్దమున్నదికదా! అని, మొగమాటపడితిని. చదువుటకారంభించితిమి. దిద్దుటకేమున్నది. ద్రాక్షాగోక్షీర, పాయస మాధుర్యమగు దీనువోని అరచనలేమి? మరి మాఅంతరములేమి? కిమ్మనకుండ ఆయన కావ్యమాయన కప్పగించి, ఇట్టిని అచ్చొత్తించకుండ ఏల దాచియుంచిరి? పోగా మిగిలిన చెక్కో ముక్కో, అమ్మి, అచ్చొత్తించి పితౄణమును తీర్చుకొండని చెప్పి పంపితిని. ఇంతలో సాహిత్య అకాడమీవారి ధర్మమా 'అని' ఈసత్కావ్యము ఈరూపములో వెలుగుచూచినది. ఇందులకు ఎకాడమీ వారిని హృదయపూర్వకముగ అభినందించుచున్నాను.

దీనికి మీరేపరిచయ వాక్యము పలుకవలెనని, పూజ్యులు శ్రీరామారావుగారు నన్ను నిర్బంధించిరి వారిమాటకాదనలేను చెప్పుటకు మాటరాదు, సత్కావ్యము చదువుకొని ఆనందింపగల మనసున్నది, కాని, పరామర్శించుటకు మాటలులేవాయె. ఇట్లున్నది నాఅవస్థ.

ఎక్కడనో కొండలలో, కోనలలో మాటుమణిగియున్న ఈకొండ మల్లికి, ఇంతటి పరిమెళమెట్లులబ్బెనా, యని, నివ్వెరపోతిని. అంతలో సమాధానపడితిని ఈశ్వరానుగ్రహమున్న ఎంతటివాడయిననూ అగును దివ్యశక్తి విలాసమట్టిది. మూగవానిని, అజ్ఞాతముగ మాటలాడించును, కుంటివానిచే కొండలును, దూకించును, అద్భుతాద్భుతకములగు పనులు, చేయించును, అంతయూ సర్వేశ్వరాధీనము.

శ్రీశివాజి చరిత్రమును నిర్మించినవారు. కవి, కవితా వినోద శ్రీబలిజపల్లి రామమూర్తిగారు, సామాన్యమగు గ్రామోద్యోగి, "ఘుస్రుణ"

సీ॥ పసిమి బంగరు రంగు-పసలీను మోముతో
పూర్ణేందు నేరీతిఁ-బోల్పవచ్చుఁ
గాటుక దిద్దిన-కన్గవ నీటుతో
వెలిదమ్ము లెట్టులఁ-దులకు వచ్చు
పిడెంపుఁదావులు-వెడలు వాతెఱతోనఁ
బగడంబు లీడని-బలుకు టెట్లు
కలరవంబులె సంగు-బలుచని కుతికతో
చిందంబు సమమని-చెప్పుటెట్లు

తే॥ లవయవంబుల సొగసిట్టు-లతిశయింప
నేమియుపమని బోల్చెద-నిందు గిందుఁ
దమ్మి గిమ్మని మఱి పగ-డమ్ము గిగడ
మల్లశంఖంబు గింఖమ్ము-లవయవములు 189

ఉ॥ మంచుమునుంగు నెమ్మిగతి-మానిసి మేలి మునుంగు లోపలన్
మించెడు గ్రొమ్ముడింగనిన-మేను చెమర్చి, తనూరుహంబు లా
క్కించుక పుల్కరింపవె య-తీంద్రులకైనను గాన దీని ని
ర్మించు విధాతయున్ జగము-సృష్టినొనర్చు విధాత వేరగున్ 190

ఉ॥ మేలి మునుంగులోఁదళుకు-మించి వెలింగెడుఁగుందనంపు ము
త్యాలహారంగునత్తు నిసు-మంతయు నూరుపుగాలి నూగు నా
లీలలఁగాంచి మబ్బుల చ-లించెడు మించును బోల్కి సేయు ధీ
శాలురు బుద్ధి సూక్ష్మము వి-చారణఁ జేయ దరంబె యేరికిన్ 191

ఉ॥ చిక్కఁగఁబూయు చందనము-చెల్వొననొప్పెడు కంచుకంబునం
దొక్కసలాడి సందిలిని-ద్రోయుచునంతరమందు సూత్రమున్
గ్రుక్కఁగనీక నెమ్మొగము-గొంచెము డించగరాని రీతి స
మ్మక్క! చెలంగు నమ్మగువ-యందపుఁజన్నుల నిక్కలెంచగన్ 192

కం॥ తల్లివలె నాత్మ నెంచుచు
ముల్లానుఁ డెఱుంగ కుండ ముద్దియనిడి తాఁ
దల్లిని. నాలిని, బంధుల
నల్లన్నుపచారములకు-నాతండిడియెన్ 18

కం॥ ఉపహార మొసఁగు వేడుక
నపుడా బాలికను శాజి-యాహ్లాదమునన్
నృపతికిఁ గానుక నిచ్చెనఁ
గృపా పరవశమున రాజ కిల్బిషవృత్తిన్ 18

కం॥ ఈ రామ జగన్మోహన
తారుణ్యానయన, దీని-దర్శించు యతుల్
గోరరె దారా సౌఖ్యము
లీ రూపము సాటి యుండు-నే లోకములో 18

సీ॥ ఒక్కింతఁ జుట్టిన-యుంగరాల్ముంగురుల్
రవమూనె మెఱుంగుల-జవలు గట్ట
మిసిమి బంగరు రంగు-లెసగు నెమ్మోమున
వలపువాసనలజ-వ్వనము పొడమ
అనదు కాటుక రేఖ-లలరు వాల్గన్నులు
కోలికల పీనుల-బలుకరింప
తేనియ జిల్కు వా-తెఱ జగా జిగినాని
యాణి ముక్కెర కెంపు-నా వెలుంగ

తే॥ మోముడించగనీక చ-న్మొలక లెమగు
బరువు గొనలేక లేగాను-బడలనీకు
భయమదేటికియని నితం-బంబు గ్రాలు
బోల్కి బాట్రవేలు నిల రాచు-పొలతిఁ గాంచి 180

ఉ॥ ఆయసదండ సంఘటిత-మ్మైన గవాక్షములన్ గవాటముల్
మూయనిద్వార పార్శ్వముల-ముద్గర, కుంత, శరాసనా, సి, ము
ఖ్యాయుధముల్ ధరించి యసి-తాంశుకవర్మములంటి, క్యా! అరే!
భాయి! పరాకునొందిన స-పామరగాయని బల్కు నిక్కలో 179

చ॥ తలవరులొక్కరొక్కరి క-దల్పులు చెప్పుచు విచ్చుకత్తులన్
జళుకొమవంగఁ ద్రిప్పుచుఁబ-చార్లొనరించుచు కబ్రదారనా
బలుకులు పల్కనొక్క గృహ-ఘంటికలోఁజెఱునున్న ముల్కనా
మలక వరేణ్యుఁగాంచి కడు-మన్ననచే విడిపించి యిట్లనెన్ 180

మ॥ తను మర్యాదలెఱుంగకీతఁడు భుజా-దర్పంబుచే నాజి వి
క్రమ శౌర్యంబు పయోగ పర్చెను కటా!-కాలంబొకేరీతిగా
సమరజ్యేష్ఠుని కేని యుండదు మహా-త్మా! యంచునూరార్చి, ర
త్నమయాలంకృతుఁజేసి, బీజపురికిం-దైచేయఁగా నొప్పినన్ 181

కం॥ ఆమల్కని నగ్ర స్నుష
సోమకళా సారితాస్య-సుందర గాత్ర
స్థేమ జితహేమ రామా
ప్రేమామయమూర్తి టాజ-బీబీ సదృశన్ 182

తే॥ తన మనంబట్టు లెదిరిడెం దంబు ననుచు
దలఁచి కుత్సితుఁడౌట ఖాన్-దలఁకి తనదు
గోడలికి శత్రువులచేతఁ గీడు మూడు
ననుచుఁజాటునఁబుట్టింటి-కను పునంత 183

కం॥ ఆ బాజ పీరు లందొకఁ
డా బాలిక పుట్టినింట కరుగుటఁగనుచుం
దాఁబట్టి బాజి కొసగం
గా, బల్గారాబమును స-గౌరవమొప్పన్ 184

మ॥ అపుడా రాజకులావతంసము హిర-ణ్య ప్రేష్ఠికల్ గూర్చు ని
ద్ధపుఁగుడ్యంబుల దీప్తమౌక్తిక సుధా-ధావళ్యరుట్చంద్రికల్
దవనీయాన్విత వజ్రమూల కురువిం-దస్తంభ కళ్యాణ మం
డపముల్ గాంచుచు పద్మరాగమణి వా-టంబంటి యేతేరగన్ 176

సీ॥ హేమసుధాలిప్త-ధామకుడ్యంబుల
కాంతి నీరెండల-గతి వెలుంగ
భాస్కర ప్రస్తర-భవనవి తర్దిక
వీక్షణావళి మృగ-తృష్ణ నెరప
శోణాశ్మవేదికా-స్తోకమయూఖముల్
జరఠారుణాతప-చ్ఛాయ లెసఁగ
వైవాత్యృకోపల-స్థగిత నంద్యావర్త
దీధితుల్ పూర్ణేందు-దీప్తులొసఁగ

తే॥ సదనమణిమయ రుచులు త్రి-సంధ్య రాత్రి
ధిష్టములు దెల్ప జనులు సం-తుష్టినింక
నేల తపనేందులుదయించు-జోలి యనుచు
నెంచగలయట్టి భవనముల్-గాంచి చనగ 177

సీ॥ తెలిరాలఁజెక్కిన-తళుకు కంబంబుల
నీడలద్దంబుల-జాడఁదెలుప
పసుపు పూసిన ద్వార-బంధాళి నిగనిగల్
పసిమిబంగరు పూత-పదిగి నొప్ప
పిసైన నెఱిగప్పు నిండించు తలుపుల
తళుకులు నీలంపు-బెళుకులీన
కెంపులొంపిని నింపు-నింపైన పాదికట్లు
పగడంపుఁ గొణిగల-నిగనిగలన

తే॥ ముగ్గులుంచిన గడపలు-ముత్తియంపు
సరులునించిన గతి చూడ్కు-లరుసు పఱుప
వింతలైనట్టి పనులు వి-భ్రాంతి గొలుపు
మేడలెడ నెడఁగని యొక-జాడనరుగ 178

మ॥ పురయోషామణు లబ్బురంబెసఁగ సం-ఫుల్లాబ్జ కల్హారముల్
నిరతిన్ సేసలు జల్లుచున్ గపురపు-న్నివ్వాళు లర్పించుచున్
వరుసల్గట్టి విసారసారహిత సౌ-వర్ణాంబు కుంభంబులన్
బరితోషం బొదువంగ దెచ్చిరెదురై-బల్మారు నయ్యయ్యెడన్ 170

ఉ॥ ఆయెడ నొక్క-ప్రౌఢ నృపు-నాస్యమునందసనేత్రముల్ ప్రతి
చ్ఛాయలొనర్చునట్లు గని-సన్నిధి కాంతనుదట్టి వేమ! యీ
రాయు ముఖాబ్జమందు భ్రమ-రంబులు నాలుగు గూడెఁజూడుమం
చాయతచిత్తవిభ్రమయు-నై బలుకన్నగ బోడి చేడియల్ 171

శా॥ కంజాతాస్యయొకర్తు చన్నుగవపై-గాశ్మీరజంబంటి, రా
యుంజూడం జనుదెంచి, తప్పిదములే-కోహో, మరుండా శర
త్పుజంబుం బరగింప, రక్తమురిసెన్-భూమీశ నన్గాంచి వే
భంజింపన్వలె వానినంచు వినుతిం-పన్వచ్చె నన్నట్లుగన్ 172

శా॥ భూనాథుంగడగంటఁజూచి సుదతుల్-ముక్తావిహారుల్ పయః
పానప్రార్చక వర్జనాత్మలగుచున్-బ్రహ్మంబునే కాగ్రతన్
ధ్యానప్రక్రియఁగాంచి దృగ్యుతప-దార్థంబెల్లఁ దద్బ్రీతగా
నానందించెడు యోగినుల్బనై మహా-నందాత్మలై యుప్పెడున్ 173

శా॥ ఈ రాజేంద్రుని సింధుజవ్వనము నో-క్కింతైన నీక్షింపఁగా
నేరామామణి మోహమూప గల దెం-తేహ్రీ చ్యుతింబొంద కే
నారీరత్నము సీతనిన్మది కరం-డంబందు సంధింపదే
తారుణ్యాంగన స్వప్నమందయిన భ-ర్తంగా మదింగోరదే 174

గీ॥ అంచు గుంపులుగాఁగూడి-యతివలెల్ల
నేక పత్నీవ్రతుండగు-నీనృపాలుఁ
డేలు నేలను జవ్వనుల్- రేలు హాయి
గని, సుఖించెదరని చెప్పి-కొనుచు నరుగ 175

కం॥ ఆ నిమిషంబున యందున్
తానాజింగాంచి యిపుడె-తాఁ గళ్యాణ
స్థానీయమునకుఁ జనవలెఁ
గానం దెప్పించు మొక్క-గాంధర్వమునన్ 165

శా॥ యంతానీత వినీత తల్లజము శు-భ్రాంగంబు పూర్వాపరా
శాంతాస్వీనము సన్నిగాళమణి స-ప్తాశ్వాశ్వరంహంబు, రే
వంత స్వాంతహిత ప్రచారము రట-త్ప్రత్యర్థి సైన్యాబ్ధి దు
ర్దాంతప్రాభవహేషవన్మథితమంథానంబునౌ, యార్వవమున్ 166

కం॥ తెప్పించి యెదుట నిలిపిన
నప్పుడె తానాజి కొంద-అనుచరులును చె
ల్వొప్పగఁదోడను రాగా
మెప్పార వాలెక్కి యొకని-మేషములోనన్ 167

మ॥ చని కళ్యాణ పురో పకంఠమున న
శ్వంబున్ దగన్ డిగ్గ నా
ఘన గాంధర్వము దిగ్విదారితముగా
గర్జాధ్వనుల్ సేసినన్
విని సైన్యాధిపుఁడైన భాజి యిడియు
ర్వీజానియా శాజిరా
డ్తునయా శ్వక్వణ మంచునెంచి మదశుం
డాలంబు లీలం జనన్
జననాథోత్తముఁడా తనింగని పరి
ష్వంగంబు గావించియున్ 168

శా॥ ముల్లాన్ఖానుఁడు పట్టుబడ్డ క్రమమున్-మున్మున్న నాలించినా
యుల్లాసంబునకీదినంబె ప్రతిప-ద్యోగంబుగాయంచు నీ
కిల్లా నీకిదె యిచ్చెదంగొనుము స-త్కీర్తింబ్రవర్తిల్లుమన్
సల్లాపంబులు బల్కుచున్నగరి ఘం-టా వీధినే తేరగన్ 169

దృఢోక్తింబలుక నెక్కుడు గొడవలేకుండ నొక్క నిశీథిని మితపరి వారంబుతో జని, యానృపతిం బట్టి బందీకృతుం గావించి, యద్దేశం బాక్రమించి, తత్సామీప్యంబున విజాపుర రాష్ట్రంబు నందలి, కొండణాధీశ్వరుని హితంబు వడసి యా దుర్గంబాక్రమించిన పురందర దుర్గాధిపతియగు నీలకంఠుండు లోకాంతరుండైన, నతని సుత త్రయంబునందగ్రజుండు రాజ్యాధికారంబు వహింపంగూడదని యాజ్ఞాపింపం, గనిష్ఠులచ్చట నిల్వక, యేతన్నిమిత్తంబు శివరా యుం దగువు గోర, నక్కలహంబు నివారింపఁ బురందర దుర్గంబు నకు ససైన్యంబుగఁ జనునంతం, గనిష్ఠు లిర్వు రగ్రజుండు నిద్రించు తఱిం బట్టి, బందీకృతుం జేయ, గని, శివరాయుం డిద్దురాత్ములు రాజ్యపాలనంబున కనర్హులని, యా దుర్గంబు తన వశంబున నుంచు కొని యమ్మువ్వురకుం దగిన వేతనంబులొసంగి, సన్నిధి నిడుకొని యెనిమిదొక్క వత్సరంబులో, రక్తపాతంబు గాకుండ, దుర్గత్రయం బాక్రమించి, యయ్యైపురంబుల నభేద్యంబులగు సాలంబులుగట్టించి, లోహ గడాది దుర్గంబులు క్రమక్రమంబుగా లోఁగొని, కొంకణ ప్రాంతంబునం గల కళ్యాణ పట్టణం బాక్రమింప నూహించి బాజి సోనుండను సైన్యాధిపుం బంప, నతండాకస్మికంబుగా జని, తత్పుర పాలకుండగు ముల్లాన్హానుం బట్టి బందీకృతుం జేసి, తద్వృత్తాంతం బాద్యంతంబు లిఖిత పూర్వకంబుగా శివరాయునకుంబంపిన వేగ రులు రాఢ్డకుంజని తానాజీ సహితుండగు మహీపాలున కెఱిం గించిన 162

మ॥ అమితోత్సాహము చెక్కుల న్వొరియగా-హర్షా శ్రువుల్ వక్షమం దమలామూల్య లలంతికా చయమున-ట్లాచ్ఛాదముం జేయ, హే మమయాలంకృతులంగ సౌష్టవము సం-భావింపఁగా త్యాయనీ రమణీనామ కృపాణ మంకమున స్వ-ర్భానుస్థితిన్ వెల్గగన్ 163

కం॥ పులకాంకిత గాత్రుండై
బలుమాఱుమ్లానుఁ బట్టు-బడు వాక్యంబుల్
గలలేఖఁ జదివి చదివియు
వెలలేని మహాధనాళి-వేగరులకిడెన్ 164

కం॥ తన సత్వ మెదిరి సత్వము
గనుగొనకని, కుత్సహింప-ఘనుఁడై నఁజెడున్
వినవె బలాధిక సర్పం
బును జలి చీమలకు జిక్కి-పొలియుటలెల్లన్ 158

కం॥ దాదోజి యిట్లు చెప్పిన
కాదనకా నృపతి పూని-కన్నెరవేర్పన్
భూదేవుఁడెంచె మది నీ
భూదయి తుండుగ్రునంశఁ-బుట్టుట నిజమా! 159

శా॥ కాదే నన్యమహీపతుల్వలెఁదురు-ష్కస్వాములం గొల్వ నా
మోదంబీతని కేలపుట్టదు? కటా!-మున్వీనివంశంబులోఁ
బ్రాదుర్భావమునంది శంకరుఁడు భూ-భారంబు వారించునన్
స్వాదూక్తుల్ వితథంబులౌనె? నిజమా-శర్వాంశజుండీతఁడో 160

గీ॥ అనుచుఁజింతించు నాతని- కంత కంత
కధికరుజ మించ ప్రాణాంత-మాటఁదెలిసి
శహజి తనయుని బిలిపించి-సమ్మతమున
దేశకోశము లర్పించి-దివికినేగె 161

వ॥ ఇట్లు వృద్ధుండును, గురుండును, పితృతుల్యుడు నగు, దాదో
కొండదేవుండు దివంబున కరిగిన, పూనా రాజ్య భారంబును ద
భుజంబలంకరించిన శివరాయండు, తత్ప్రాంతాధి పులం బిలు
నంప, వారలు నిరాకరించినం గని, వీరితో సయ్యోడ కయ్యంబు
వెట్టుకొన్న మదీప్సిత స్వరాజ్య మహత్కార్యంబునకు విఘ్నంబు
వాటిల్లుని దూరాలోచనంబుఁజేసి, చాకణాధీశ్వరుండగు, ఫిరం
గాజిం గని. యమృతోపమాన సంభాషణంబుల నతనిందనవశంబు
జేసికొని, సుపామండలేశ్వరుండును, త్రిసహస్రాశ్వ సైన్య సమన్వి
తుండును ననేకానేకప, వీరయోధ పరివేష్టితుండును వైమాత్ర
భ్రాతయగు భాజి మోహి తను నతండు శివరాయుతో వైరంబు
నొంది భవజ్జనకు నాజ్ఞంగాని మిమ్ముంగొలువ నవసరంబులేదని

కం॥ వినియా, చారులు నిర్వారు
జని బీజపురేంద్రు వాక్య-సరణులు దెలుపన్
మనమున నలిగి నరే తె
మ్మని దన పూనికను విడువ-కధికమొనర్చెన్ 152

కం॥ ఇట శహాజి నృపతి సుల్తాన్
చటు లార్చటి దూతదెల్ప-జళుకంది కటా!
కుటిలుఁడు మా తనయుఁడు మీ
రెటులను శిక్షింప దాని-కేనోడఁబడితిన్ 153

కం॥ అని చెప్పి చారునంపియు
తనయుఁడ సాధ్యుండు చెనటి-తనము విడువఁడే
మనియెద ననియడరుచు లే
ఖ నొకటి యిటు కొండ మంత్రి-కడకుం బంపెన్ 154

గీ॥ కుంభభవతుల్య నీకు నా-కొడుకు నొప్ప
గింప, కుల నాశనమును నప-కీర్తి వచ్చు
బుద్ధి నేర్పితివనుచు జా-బును లిఖించి
పాదుషా లేఖతోఁ దానిఁ-బంపునంత 155

కం॥ ఆ రెండు లేఖలం గని
భూ రమణునితోడఁ బల్కె-భూసురుఁడో హో
ధీర వర! నీ వొనర్చిన
దారుణ దుర్గముల రచన-తప్పక తప్పా 156

ఉ॥ భారత యోధులంబలె న-పారబలంబులు గల్గు నా విజా
పూరు నవాబుతోడ దుర-ముంగొన జాలక నూరకుండె ది
ల్లీరమణాదులట్టిడి ని-లేశము వానినిగాగ నెంచుచున్
వేరము బూని తీవ్రతని-వీకకు నిల్చెదవా యెఱుంగు మీ 157

గీ॥ నిలువ నిచ్చిన కాల్చాప-నెలవు వెదకు
నెలవు కాల్చాపగాశయ-నింపగోరు
శయ్య చేకూర నిలుగట్ట-సాహసించు
నిల్లుగట్టిన నూరేల-నిచ్చగలుగు

పతుల చేతః

ంతమునందున్
స్మదుముఖ్యుడు మీామచూచుచున్
ము పాయలు దువ్వి మీాసముల్
-వేగరుఁజేరఁగఁజీరిపల్కెనీ
దస్మదుదీర్ణవచోనిరూఢిగాన్ 1

గాదనఁదనకున్

మచు నోడువుమీా

ల్లకు మను
ణ-బడయు మనుము
ద్ధిఁదలఁచు మనుము
క్షీణదశలొంద దానిట్లు సేసెననుము

కం॥ అని చెప్పి పంపి యింకొక
యను చరునింగాంచి వేగ-మరిగి శహాజిం
గని నీవిట్లను మీా నీ
తనయుని చెడుగుల నణంచి-దామన మనుమీా

వెచ్చబెట్టిరి. కావ్యమననేమి? కావ్యాత్మస్వరూప స్వభావన లెట్లుండును? కావ్య ప్రయోజనమేది? కవిప్రతిభాస్వభావములెట్లు అభివ్యక్తము కావలయును? కావ్య మీదగిన సందేశమెట్లుండ వలయును? ఈ విధమగు కావ్య మీమాంసవారు క్షోద క్షమముగ చేసి మనకందించినారు. ప్రతి భాపరమేశ్వరులు గనుక వారువారు చర్చించిన తీరు వేరువేరు ధోరణులలో ఉన్నను. అందరను అంగీకరించిన ప్రమాణమొకటున్నది. కావ్యమునకు ప్రాణప్రాణము రసము అని రసమనగా మహానందము. చచ్చిదానంద స్వరూపమగు. అపరతత్వమునకు. కావ్యనిష్పన్నమైన. రసమునకు భేదములేదు. ఈరసము ఔచిత్యమువలన సంపాదింపదగినది. ఔచిత్య మననేమి? అదెట్లుండును? దేనియందుండును? ఈ ఔచిత్య విచారము నిర్వహించుటలో అలంకారిక శిరోమణి. క్షేమేంద్రుడు పట్టభద్రుడు. ఆయన చెప్పనే చెప్పెను. పాత్ర ఔచిత్యము. ప్రబంధ ఔచిత్యము. సన్ని వేశ ఔచిత్యము రసౌచిత్యము. వాక్ ఔచిత్యము పదౌచిత్యము. ఇట్లు అనంత విధములుగా ఉండును. "అనౌచిత్యాదృతే నాన్యద్ర సభంగస్య కారణ" మన్నారు పెద్దలు. రసము విరగుటకు. అనౌచిత్యము కారణమటు ఎక్కడనూ కావ్యములలో అనౌచిత్య దోషము సంక్రమించకుండా నిర్వ హించుట సామాన్యమా! అది అనన్యప్రతిభులకే సాధ్యము. ఒక కావ్య మును. ఎన్నుకోనుటలో. ఇతివృత్త సంగ్రహణము ప్రధానము. అది యునూ రసౌచిత్యముగా నుండవలయును. అందుననూ ప్రధానరసము. వీరశృంగారములలో ఒక్కటైన. ఇక చెప్పవలయునా? అందులకె కాబోలు మనపూర్వులు. వీరశృంగారములకు పెద్దపీటవేసిరి. ఉత్సాహము కులుకు. ఉబలాటము. ఎవ్వరికక్కరలేదు? తొంబది ఏండ్లతొక్కను, కదలించిననూ ఉత్సాహమున్నచో. ఉత్కంఠయున్నచో ఉవ్వెత్తునలేచును. ఇది ప్రాణి సహజమగు లక్షణము. జీవసామాన్యమగు లక్షణమును పండించుటలో. చేవయున్నది. వీరము ప్రధానరసమైనచో. ఆయా అవసరములనుబట్టి ఇయారసములు. శృంగారహాస్యాదులు చోటుచేసుకొనును. వీర రసము నకు పెట్టినది పేరుగానున్న

శ్రీఛత్రపతి శివాజీ చరిత్రము ఈమహాకావ్యమునకు ఇతివృత్తము స్వతంత్ర్య భావములున్న ప్రతిసహృదయుడున్నూ స్పందింప దగిన

కం॥ ఈగతి వార్తలె గానీ
స్వాగతమొసఁగుటయు కరము-సమకూర్చెడు ను
ద్యోగము లేమిని నచటి ని
యోగులు గనిపెట్టి, యావ-నోర్వీశునితో 139

కం॥ తోరణ కోటం గైకొని
భూరమణుఁడు నవ్యదుర్గ-ములు గట్టించెన్
దారిప్పుడూరకుండిన
మారెందును దనకు లేక-మసలు నను నెడన్ 140

వ॥ మరియు నవీన దుర్గ రచనంబు కర్ణాకర్ణి నెఱింగినవాఁడై 141

కం॥ వృద్ధామాత్యుండపుడొకఁ
డద్ధరణీశ్వరుని జూచు-నయ్యా! శివరా
జుద్ధతిఁగట్టిన కోటలె
సిద్ధముగా ముందు మనకుఁ-జేటొనరించున్ 142

ఉ॥ అంతరమింత గన్పడని-యట్లు ఘటించిన, రాతి కోటలన్
గ్రంతలు జేయలేవట వ-నస్పతులుద్భవమొందు నప్పు డొ
క్కింతలునై గనంబడును-పేక్షయొనర్చి హరింపకున్న మీ
దెంతప్రయత్నముంగొనిన-నేటికి కాఁగలకార్యమెవ్వ కడన్ 143

ఆ॥వె॥ కనవు పెరిగ నేని-పస తగ్గు సస్యంబు
లిరుగు బలిసె నేని-యిల్లు గూలు
యేరు పెరిగనేని-యిరుదెసల్లోఁగూలు
వైరి పెరిగనేని-వసుధఁబొందు 144

గీ॥ పగిదికిని చుంచు పనులందుః-బందికొక్కు
వన్నెకును మేక గంతులు-వైవ పులియు
పట్టుటకుఁగప్ప కఱచిన-పడగపాము
రాచకొమరుని నమ్మగా-రాదు మనకు 145

సీ॥ అధ్యాత్మ తత్త్వవి-ద్యా ప్రశంసలు కాని
పారుష్యములకుఁ బా-ల్పడగ నీక
జీవేశ్వరుల భేద-చింతనంబులె కాని
మత చర్చలావంత మరుఁగ నీక
అహమేవ బ్రహ్మాస్మి-యను చిత్సుఖమె కాని
యైహిక సుఖవాంఛ-లాసగొనక
ఆనందమయ మహా-వ్యక్తి వాసనగాని
పరవిచికిత్సలఁ-బడయ నీక

గీ॥ సంచిత జ్ఞాన విరహిత-పంచవిషయ
ములు మనంబును బంచిన-ట్టులవశంబుఁ
జేసికొని మోక్షమార్గ సం-సిద్ధి నొంద
నెల్ల జనులకు నుపదేశ-మిచ్చి ప్రోచు

కం॥ ఈ రీతి నొప్పుచుం దన
దారుణ దుర్గముల రచనఁ-దలఁచి. యసూయన్
బోరికి బీజ పురీశుఁడు
దారత నొప్పునని యెరిఁగి-తన మదిలోనన్

కం॥ మన దుర్గమ దుర్గములన్
జెనకఁగనేదులన కింత-సేమము లేదా?
చెనటి పగఁబూన మనకును

న్

,తుల న-య్యాదిల్షహా చెంతకున్
మీకొసఁగుగ-ప్పంబించు కేనంపమిన్
ొంచి పట్టణము నా-కంబెట్టియున్నాము త
గువారముయధా-ర్థంబంచునూహించుఁడీ

పం

గ, యాదిల్షా మనంబు-గౌరవమొప్పన్
మను జవిభుండ సహాయుం
డని సంశయమొంద కరికి-నాసం గొనియెన్

ఉ॥ సత్త్వగుణ ప్రధాను లఘు-సామజ సింహుల సత్త్వలోభ ధూ
ర్తత్వ వివర్జితుల్ నియమ-ధారణ యోగ సమాధులన్ మహ
త్తత్త్వవిచారు లాత్మ పర-తత్త్వ విమర్శను లద్వితీయ వి
ద్యాత్వ నిదర్శనాత్మక మ-హాత్ములు నప్పురి నెల్లవారలున్ 130

కం॥ ఆరామ పరిక్రమముల
నారామల కుచవిలేప-నాగ్ని శిఖా శ్రీ
చోరత్వంబునఁబయ్యెర
లారామము లన్వసించు-నత్యంతంబున్ 131

కం॥ ఆ నిగమమునకు జనవిభుఁ
డై నెగడు శివాజి యాతఁ-డతి విమలతర
జ్ఞానార్ణవ దీనావన
దైనందిన ధన నిధాన-దానఘనుండై 132

సీ॥ తన కోశమునఁగల్గు-ద్రవిణ మారవపాలు
కోపింపకొసఁగువ-నీప కులకు
తన పంక్తినాఁకటఁ-గనలు వారలుఁజేర
నమిత భక్ష్యములు హృ-ద్యముగ నొసఁగు
తన దృగగ్రములకుఁ-దారసిల్లిన మాత్ర
నిరుపేదలకును పె-న్నిధు లొసంగు
తనుగొల్చు భృత్యుల-మనము లుత్సవమంద
మితకోశముల బహు-మతు లొసంగు

గీ॥ తనయశో చేలములను ది-క్త్రైణమునకు
భవ్యకౌశేయ చేలము-ల్పగిది నొప్ప
పద చతుష్టయ యాన సం-పత్సుకృతుఁడు
పగుచునుతిఁగాంచె శివధరా-ధ్యక్షుఁడిలను 133

సీ॥ చేర్చుక్క ముత్తెముల్-చిందులాడగ నీక
చూపులెల్లెడలందుఁ-జూరగ నీక
ముఖ పాద సరసీజ-ములు గాక తక్కిన
మేను చూపఱులకుఁ-గాన నీక
అడుగిడఁ జప్పుడిం-తైనఁగల్గగ నీక
భాష లేరికి వినఁ-బడగ నీక
హాసంబులను రద-నాంకు రంబుల దోప
కెదురైనఁ బురుషుల-కెదురు రా

గీ॥ నిత్యనై పథ్యలై గృహ-నియమములను
జరిపి శుచులయి, తమ కులా-చార సరణి
నారకూట ఘటంబుల-నీరు నింపి
బంతులై యేగుదురు గేస్తు-భామలచట

సీ॥ అజ్ఞాన భూయో మ-హాంధకారము బాయ
నెమకెద రెంత క-ష్టముల నైన
శ్రేయోఽభివృద్ధికై-చింతించుచుండెద
రితర ప్రసంగంబు-వెల్లవిడిచి
పరులకు నుపకృతు-లరయుచు నుండె ద
రంగదలలవను-నప్పుడైన
సత్యంబ హింసలా-ర్జవమొనర్ప నుపన్యా
సించును బరము నా-సించు నేఁటు

గీ॥ సతతమధ్యాత్మ తత్వ వి-చారణమును
నవ్యయానంద పదవి మో-క్షైకకాంక్ష
జీవమీశ్వరు నైక్యంబు-చిత్సుఖముల
నొప్పు నాబాల గోపాల-మప్పురమున

సీ॥ ఒక భుజంగుండింట-నుండ వేరొక్కని
గాంక్షింపరెంత రొ-క్కమునకైన
మును నోము విటునకు-ముల్లి సైకంబైన
ముదుసలి నెన్నండు-మూల్గనీరు
వెలయెక్కు వబ్బిన-కులహీను నొల్లక
యల్పార్థ మొసఁగిన-నధికు నెంత్రు
వేతనంబొసఁగెడు-విటకాండ్రు గల్గిన
ముంగిట గుమ్మంబు-తొంగి చూడ

గీ॥ రచటి వెలయాలులంతః పు-రాంతరముల
వెలుగు దొరసానులం బలె-విలువ గలిగి
వలపు గలిగించు గోవాండ్ర-మలుపు గొనక
నియతిఁదప్పక వర్తింత్రు-నేర్పు మీరి 126

సీ॥ కోకపైఁగప్పఁబూ-గుత్తులు గొనుటెట్లు
బైటనుండిన వెలఁ-బడయ వనుచు
పూరెమ్మలెత్తినఁ-బుచ్చుకొందు మటన్న
గొనునప్పు డారీతు-నొనరు ననుచు
నల్లగల్వల దండ-నాకుఁజూపుమి యన
పై చెండ్లు గొనకవి-బడయఁదగదు
పున్నాగ విరియేలఁ-బొడసూపవన్నను
నేత్రంబు మాటు దా-నికిని నీకు

గీ॥ చెలువమరు పూజకొప్పిన-చిన్నచెండ్లు
కడిగినంతటి వెలయిత్తు-ననిన వలపు
లెంత వెల, యంచు, సరసుల-నెదలు మలిపి
పూవులమ్మెద రవ్వీటఁ-బూపుబోండ్లు 127

క॥ జంగమ శైలంబులు సుర
గంగాసంపూరితోగ్ర-కరశీకరముల్
భృంగీరవ గండంబుల
భంగా హవ శరధులచటి-భద్రేభంబుల్

క॥ ప్రాగపరాశాంతర భూ
భాగాశ్వీనముల శ్రమము-బాటింపక య
న్నాగరి కార్వ్యములం బుధు
లీగతి లంఘింతుమనుచు-నెత్తుపదంబుల్

క॥ చిచ్చైచ్చనఁ బట్టుఁ బిడికిట
నొచ్చిన వెన్నీరు తెగిన-నొగులక పరులన్
బుచ్చెదరు జముని వీటికి
నచ్చటి భట వర్గ మధిపు-నానతిమైనన్

సీ॥ వార్షికాగమ వారి-వాహాంత రీయమై
వెడలు విద్యుల్లతా-వితతులనఁగ
శారదానేహ స-న్నీరదంబులఁ బాసి
వెలువడు పూర్ణేందు-కళలనంగ
క్షీరాబ్ధి నా ప్రతి-సీరఁ బాయఁగఁ ద్రోచి
పొడఁజూపు నచ్చర-బోటులనఁగ
తలచీరవెలిమైన-తళ తళ ద్యుతు లీని
పొంగారు బంగారు-బొమ్మలనఁగ

గీ॥ గోత్ర భిద్రత్న నిర్మిత-గోపురాగ్ర
వజ్ర పటీర ఏముల, దు-వ్వాలువ పైట
లర్ధ మూర్తులు దర్శనీ యముగ నిల్చి
వేశ్యలప్పారి మునుమాపు వేళలందు

కం॥ స్వాధ్యాయాను క్రమముల
నధ్యాపక గౌరవముల-నధ్వరముల నా
తిథ్యభ్యాగత పూజల
నధ్యాత్మిక విధుల విప్రు-లప్పురి నొప్పన్ 116

చ॥ జవమున కుంభకార ఘన-చక్రము చుట్టు పరిభ్రమింపను
త్సవమున లక్ష్యముంచి, గురి-తప్పక వ్రేయును బెక్కుమారు లా
హవమున శత్రులం, దునుమ-నట్టుల పైఁదలలుండి శోణిత
స్రవమొనరింప నట్లు, పురి,-రాజకుమారులు సూపునైపుణుల్ 117

కం॥ పరధనము గోరి వారలు
పరి పరి విధములను పాటు-పడు నెప్డుపురిన్
పరధనముఁగోరి రాజులు
పరి పరి విధములను బాటు-పడరెప్డుపురిన్ 118

కం॥ మానసమునేని కల్లలు
దానంబుల విసువు ధేను-తతిఁబ్రోచుటలో
హీనత్యాగంబులు నా
స్థానీయార్యులకు లేమి-సతతంబుండున్ 119

కం॥ ఫలకాలంబుల సర్షము
గల కాలము నిలిపి యాథ-కము లొకతీరై
తొలియేటివి, మలియేటివి
వెలిధాన్యము లరువులిచ్చు-వీటింగాపుల్ 120

కం॥ వీటంగల రథకేతన
కోటి పటాచ్ఛాదనమునఁ-గుంఠితమగుటన్
హాటకగర్భుఁడు వేరిడె
సూటిగ నంబరమటంచు-సుర పద్ధతికిన్ 121

ఉ॥ ప్రాంశుశిఖా చతుష్కము న-భస్థలచుంబిత గోపురంబు శు
భ్రాంశుశిలావినిర్మిత మ-హోత్తరకుడ్యవిభా మిషాభ్రమున్
సంశయ నాక మర్త్యవన-జాతముఖీవిహారాగ్ర హర్మ్యము
ష్ణాంశుతురంగమశ్రమ ని-హంతృపతాకమునై సనాలమున్ 110

మ॥ పరిఖాంభోనిధి నోలలాడు శబరీ-పాఠీన కుంభీరపు
ష్కర వేదండ కుళీరసంతతులు వ-జ్రవ్యాప్తప్రాకార దం
తురచిత్రప్రతిబింబితంబులయినన్-జూపించుఁజే సన్న, భా
స్వర శిల్పిప్రవరుండు జూపరులకుం-బాంచాలికా భ్రాంతిచేన్ 111

మ॥ ఖసరిత్పుష్కర సారసారణ చర-ద్గండూ పదగ్రస్తముల్
వసురాట్కాంత సుధాచ్ఛసాలరుచి న-వ్యక్షీర విభ్రాంతి మా
నసలై దూకి, తదూహ మిథ్యయగుటన్-భ్రష్టంబులై మింట, గ
ద్దు,సుడింద్రిమ్మరి, రాసినామముల పెం-పుంబొందెభూమండలిన్ 112

శా॥ లీలాసౌధ విశాల భాగముల నో-లిం,గన్నియల్ రత్నపాం
చాలద్వంద్వములన్ వివాహములనా-చార్యోక్తి దామాధ్రువు
బ్రేలంజూప బహిఃప్రదేశములలో-వేమారు వీక్షింప న
చ్చో, లేమిందగు మేడడిగ్గ, ధ్రువుడుం-జూపట్టునాప్రోలునన్ 113

కం॥ సకల గృహాంగణ ములయం
దకలుష వజ్రోత్కరంబు-లలరుట నిసి దీ
పికలొప్పఁగ రాకా చం
ద్రిక లట్టులు ననిశముం బ్ర-దీప్తిల్లు బురిన్ 114

కం॥ ఏకడ కరిగెడు నతిథుల
రాకటకును నూరి బయల-రచ్చలయందా
లోకించి, భుక్తి కేగుమ
రాకటకములోనఁగల గృ-హస్థులు దినమున్ 115

గీ॥ మఱియు దొరలకు గండపెం-డెరములొసఁగి
యుద్ధనిహతుల సంతతు-లుండు వరకు
వేతనంబులు సమకూర్చి-విప్ర వంది
మాగధావళి కెల్ల స-న్మాన మిచ్చి 104

ఉ॥ తారణదుర్గముం గెలిచి,-దర్పితుఁడై శివరాజు తత్పుర
ద్వారమునం దశీతి ద్వశ-తంబున శీతియు గారుడాశ్మ ప్ర
కర్పూరిత తోరణావళుల-మున్నిక దాను జయించుకోట లే
తోరణ సంజ్ఞలంచు రణ-ధుర్యులు చెప్పుకొనంగ ధీరుఁడై 105

కం॥ తనకుం బందొమ్మిది హా
యనముల కాయమ్మునందు-నరిదుర్గము గై
కొనియెన్, జేనెత్తురొకిం
త, నేల బడకుండ మిగుల-దర్పోద్ధతుఁడై 106

కం॥ అందందమైన రథములు
పందొమ్మిదికరులు, రెండు-పదులొంటెలు నూ
ఱుం దేజు లన్ని గొల్లె న
లుందగటులయవి యిరుపదు-లు దొరకగనచటన్ 107

గీ॥ సాలభిత్తిక మిగుల ని-స్సారమనుచు
క్రొత్తగావింప నట పెక్కు-రొక్కమబ్బ
దానిఁగొని కట్టె నతఁడు న-వీన దుర్గ
మదియె రాజ్ఘడ యనెడి వి-ఖ్యాతిఁగాంచె 108

కం॥ అన్నగరిఁజూచి పిదప వి
యన్నగరము విశ్వకర్మ-యలవరచె నటం
చెన్నగ,ఁదగు చిత్రంబులు
గన్నులు రెండున్న నెట్లు-గానఁగవశమా 109

గిరిశిఖరంబులు మఱల నాలోకింపంగని భాజిప్రభుండోడకుండోడ కుండుఁడు శరీరంబుల స్థిరంబులని యెఱుంగరే, మనకీర్తి బీజాంకురంబులు వృద్ధినొందు కాలంబరుదెంచె, నియ్యెడనపయశంబు బాలాట మనజేనికిం గాదుపగాదే, యించుక యోర్చిన నీతనిఁబొలియించెద చూడుండని యయ్యేకవీరుం డవష్టంభ జృంభితుండై ధనుష్టంకారంబున నరాతి హృదయ కవాటంబు భేదించి, తారణాధిపుంగవిసి, పుంఖాను పుంఖంబులుగాఁ దీవ్ర నారాచంబులు పరగించి, యొక్క శరంబున సారధింగూల్చి, రెండు బాణంబుల రధ్యంబులంబడనేసిన, ని పీడిత సటాచ్ఛటంబగు హర్యక్షంబు పగిది నయ్యవనుండి లాతలంబునకు లంఘించి, మృత్యుముఖ సన్నిభంబగు కరవాలంబు గిరగిరం ద్రిప్పుచు భాజి వీరు కంఠంబు తెగ, విసరిన దత్సాధనంబొక్క యర్ధచంద్రాశుగంబున భాజిప్రభుండు తుండెంబులొనర్చి, త్రిశరంబు లలికంబునం గ్రుచ్చినంగని, యవనవరుండు విలయకాలమేఘ మధ్యధగద్ధగాయ మానసౌదామనీ వల్లికంబోలు వేరొక్క ప్రచండ మండలాగ్రంబు జళిపించి, దిక్కులద్రువ నార్చుచు,మండలీకృతపాదభ్రమణాంతర్భ్రమణంబుల నిలాతలంబు గంపింపఁబడ ఘట్టనంబులొనర్చుచు, భాజి కంఠంబు దెగనేయ నుంకించు సమయంబున విశిఖపాత దూరంబున పశ్చాద్భాగంబున గంధగజేంద్రారూఢుండై, యూచు, శివరాయుండ రాతిహస్త సహిత మండలాగ్రంబొక్క నెలవంక కోలం దునిమిన భాజీవీరుండయ్యేక హస్తు తల నఱుకం గరవాలంబునెత్తినం బెద్ద యెలుంగున వలదు వలదని శివరాయుండు నివారించి యుతనిందగు చికిత్సకులం జేర్చి భాజి ఘోరుంగాఢాలింగనంబు గావించి, రెట్టించిన కుతుకంబున నిట్లనియె :— 102

కం॥ ఒడలనోకించుక నల్లం
బొడఁజూపక పగఁతుటుము -బొడి చేసిన నీ
గడిదపు మగటిమి కిల నె
వ్వాఁడు బోడగునంచు పెక్కువగలంబొగడెన్ 103

# ఆవేదనం

కదాకాలే మాతః కథయ కవితా లక్తక రసం
పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజనజలమ్!
ప్రకృత్యా మూకానా మపిచ కవితా కారణతయా!
యదాధత్తే వాణీ ముఖకమల తాంబూలరసతామ్॥

సౌందర్యలహరి

అని శ్రీశంకరులసూక్తి

తల్లీ ఎన్నటికి నీచల్లని కరుణ లభిస్తుంది? నీవెలుగును తెలుసుకొనే విద్యార్థినై కైతలత్తుక రసం లాంటి నీపాదపూజ జలాన్ని ఎన్నటికి సేవిస్తాను? సరస్వతీముఖ కమలతాంబూల రసం పసలొలికించావే. మూగవాడిచేతకూడ. కవిత్వం పలికించావె. నీకు కానిదేమున్నదమ్మా? జగత్కల్యాణివి. పలుకులరాణి. కాళిదాసురాణి. ఎరుపులు – ఒకింత సోకినా చాలు. వాని వైభవమే వేరు. భావరసనాదంగస్థలం. వాణీ చరణమూపుక. ఘలం ఘలా రావంతో మారు మోగుతూఉంటుంది. కళ్యాణమయ మయిన కవితవాని సొత్తు. అనంతలక్ష్మీ సంపన్నమైన ఆలాంటికవిత్వం అబ్బినవానికి సంపదలతో పనిలేదు. సామ్రాజ్యాలతో పనిలేదు. వారు సదాశివులు.

ఛత్రపతి శివాజిపేరు చెప్పిన. ఒళ్లుజలదరించని. భారతీయు డుండడు. శివాజి. వీరరసాధి దేవత. ధర్మమునకు ప్రభువు మాతృ దేశము చెరవిడిపించిన మహాపురుషుడు. ఆయనకేమి కొదువ? జగదీశ్వరి కళ్యాణి కాత్యాయన దేవి అనుగ్రహమున్నది. ఆమె స్వయముగ. అను గ్రహించిన కరవాలమున్నది కరవాలము ఝుళిపింపులతో దేశద్రోహు లైన ముష్కరుల పీచమణచి. మహారాష్ట్ర సింహముని పేరెన్నికగన్న వాడు. సర్వశుభలక్షణలక్షితుడైన శ్రీశివాజి చరిత్రము పరమపవిత్రము కాదా! ఉరకలువెట్టు ఉత్సాహమునకు ఆతని చరిత్రము పలక్షణము.

మన అలంకారికులు మహాప్రతిభావంతులు. అనేకసత్కార్యము లను ఆవలోడనముచేసి కావ్యాత్మ పరిశీలనమునకై వారిసర్వ జీవితములూ

గీ॥ ఒరులుదనకెద్దిచేసిన-నొప్పకుండు
నొరులకది తానొనర్చుట-నొప్పదనెడు
భారతోక్తిని బాటించి-ధీరుఁడెట్టి
యోగులందని సంతోష-మొందకున్నె 209

కం॥ కావున నీ సు చరిత్రయు
నా వృషముల్ వృద్ధియే ది-నంబులు దెల్పన్
దేవతగతి చేకూరట
చేవడి నా తల్లిచెంతఁ-జేర్చెదననుచున్ 210

కం॥ వేలపుదొర మానికములు
జాలకముల తలుపులమరి-చందురు కావిం
గ్రాలెడుఁబుప్పొడి తలి మల
దేలెడునందలమునంద-ధిష్టించి సతిన్ 211

కం॥ తేర్చి జగాజిగి యవనిక
దీర్చి కెలంకులను దొరల-దేవేరులనుం
గూర్చి ముది లెంకపిండుల
జేర్చి జిజాబాయి టెంకి-జేరం బనిచెన్ 212

కం॥ వెండియు భాజని నప్పురి
నుండఁగ నియమించి యచట-నొదవువిడిముడిన్
బండిని నిడుకొని రాడ్వాడ
భండారము జేర్చి మాత్రు-పాదానతుఁడై 213

కం॥ అమ్మా! నీ దగు దీవన
లమ్ముల్లానుని జయించె-నచ్చోటి సర్వ
స్వమ్ము, ననుఁజెందె మఱియుం
గొమ్మయుఁజేకూర నిన్నుఁ-గొలువనంపితిన్ 214

చ॥ పగతురచేతఁజిక్కి-పలు-బాములనొందరె నాలియంచు లో
వగచుచు గండు బిడ్డపెను-వంతలు గుందునటంచు నెమ్మదిన్
బెగడెడుతండ్రి, కోడలరి-వీరుల బాల్యాడ బ్రోవనేర నన్
దిగులు వహించు మామకడుఁ దేలిక యీగతులన్న సోదరుల్ 215

కం॥ చింతాంభోనిధి మునుగక
సంతోషము సెందినాడు-సహజా తగితిన్
వంతల నొందగనీక
త్యంతము దయఁజూపి యింటికంపెదననుచున్ 216

మ॥ పసుపుంగుంకుమ కజ్జలంపుబరిణల్-పాందానలున్ గంచెలన్
ముసుగుంబావడలంగ వస్త్రములు నా-మూల్యాంగద వ్రాతముల్
వసుటంకంబులొసంగి హేమమయ ప-ల్యంకంబు నర్పించి బం
ధుసమూహంబులు మెచ్చఁదన్ కుజనసం-దోహంబులజ్జింపఁ గన్ 217

తే॥ అనిననట్లే యటంచున య్యమయు గూతు
నత్తవారింటి కంపించు-నట్టు బోలి
కానుకలొసంగి బుద్దులు-గరపిశ్వ సుర
సదనమునకంపె జగమెల్ల-సన్నుతింప 218

కం॥ ఆ యింతి యత్తవారిలు
డాయంగని బంధు జనము-డాసి, మ తల్లీ !
యే యెడనునింత కాలము
కాయము దాచితివి తెల్ప-గావలె మాకున్ 219

తే॥ ఏ మహాత్ముఁడు జరిపె నీ-కిట్టి పెంపు
నా మహాత్ముని సల్లాయు-టంచు నెంతు
మనిన శివరాయులని చెప్ప-నతని యింద్రి
యగ్రహణమునకుబ్బి య-య్యతివగమియు 220

మ॥ బహుళారణ్యములన్ దపోవనములన్-బర్ణాలయౌఘంబులన్
సహకారద్రుమ మూలవేల్లిత హిత-ద్రాక్షాఫలాచ్ఛస్రవా
వహకుల్యాళుల శైలసాను శిఖరీ-ప్రాలేయ భాస్వర్ఝురీ
లహరీతుంగ తరంగ సంఘములను-ల్లంఘించుచున్ బోవగన్ 17

చ॥ నిలచినమాత్రనా సవడి-నేర్పున బట్టుకొనంగనేగుచున్
గలియుదునంచు డాసి, తమ-కంబున ముట్టిన యంతబాఱినన్
గళవళమంది చూచుచునె-గాదిగ దవ్వున కేగునంతలో
బిలిచినఁ జేరురీతి వల-పించుచు జెంతల నిల్వనాతఁడున్ 18

కం॥ వడికినిమ్రించదు నన్నున్
గుడియెడమల వెనుక మున్ను-గూడందాటున్
బుడమిని గొఱిజ-ల నిలువక
నడుమనె పలుగతుల నెగసి-నల్వందాటున్ 19

శా॥ మున్నుగ్రాటవులం దరక్షు కదళీ-భూదార శార్దూలముల్
మిన్నుల్ముట్టగఁబాఱుచున్న నిమిషో-న్మేషంబులోఁబట్టనే
యున్నిస్సారకురంగ మవ్విధముగా-నే బట్టెదేనంచు ప
ల్కున్నిక్కంబొనరింప కేగనగునే-క్షుద్రప్రభావుండనే 20

చ॥ దశరథరాముఁడాలికి హి-తంబొన గూర్ప, కడానిలేడి నీ
వశమొనరింతునంచు జని-పట్టుటమాని కలంగి తీవ్రమౌ
విశిఖముపాలు జేసె, నటు-వే సరికే బటు విక్రమంబునన్
దశదిశలందు బాఱినను-దగ్రత దీనిని బట్టి తెచ్చెదన్ 21

కం॥ అనుచుంగ్రోధము నిప్పులు
కనుగొనలంజాలు వారి-కటములదరగా
గినుకంజూచుచు నేణము
వెనకొనిబరువిడియెవాత-వేగ స్ఫురణన్ 22

కం॥ తోరపు టీరమునందున
దూరిన దిక నెందుఁబారుఁ-బోడ్త్రోదీనిన్
జేరెదనని మెల మెల్లన
దారన్జడి వినుచు గిరుల-దరులం బారున్

కం॥ పొంచి వెనువెంటనంటుచు
నించుక కడకాలు వట్ట-నెంచెడులోనన్
మించువలె మెఱిగి పొదలన్
జించుకొనుచుఁబారి మఱలఁ-జేరువఁజేరున్

మ॥ వెనువెంటంబరువెత్తు, డాయు, సమమా-వేసారుసంతంతటన్
జను, నొక్కప్పుడు మించియేగు, మరలన్-సంధించు, లో, నవ్వు, నొ
క్కని మేషంబునఁబట్టికొందునని దీ-క్షంబూను, నిష్ణాత వృ
త్తి, నికుంజంబులదూరి దారికమితా-ప్తింబట్టనూహింపుచుల్ 1)

సీ॥ మాయాకురంగంబు-చాయను బరదెంచు
మైదిలీనాథు జా-మాత పగిది
అల జగన్మోహిని-కెలన నెవ్వగ బారు
మాయా కిరాతు సా-మ్యంబు బూని
బాధాంధకారంబుఁబాపగా వెన్నంటి
పైకొను ప్రత్యూష-భాను పగిది
దుర్వాసమౌనీంద్రు-ధూర్తత గలిగిన
నంబరీషు సుదర్శ-నంబుఁబోలి

తే॥ యురికి కుప్పించి లంఘించి యురుపడించి
పల్లములఁబొంచి మిట్టల బయలగాంచి
యోరములఁజించి వెనువెంట-నేగుదెంచి
పంతమున మించి యాజింకఁ-బట్టనెంచి
నిమిషమున రాజు-గప్యాతి-నేలమించి

తే॥ కొమరు పచ్చిక మేయుచు-నెమరు వేయు
తాలువులు జోకగన నెమ్మి-తత్తరించె
పూర్ణనై పథ్యములు లేక-పొంక మొదవె
సహజ సౌందర్యమున కెద్ది-సాటివచ్చు 9

గీ॥ అవయంబుల సొగసెన్న-నలవిగాని
యీ మహైణంపుఁదర్శక-మెట్టులైన
పట్టుకొన వేడుకొనని-పరుగువెట్ట
కల్లనల్లనబొంచి డా-యంగ నదియు 10

సీ॥ అమృతాంశు మృగముతో-నాడఁబోయిన మాడ్కి-
నుప్పరంబున దాటు-నొక్కమారు
పయ్యెరజింకతో-వియ్యంబు గొనురీతి
నుఱికి మూలకు బారు-నొక్కమారు
ముక్కంటి లేడితో-ముచ్చటాడెడు భాతి
నుత్తర దిశ కేగు-నొక్కమారు
తన బంధువులపొందుఁ-దనియెదనను నట్టు
లుర్విపై బరువిడు-నొక్కమారు

గీ॥ పొదల నొకమారు వడిదూరు-పొంచిమీరు
పచ్చికబయళ్లకును దారు-బదరి జారు
డెక్కతుదలను వీనుల-చక్కిగీరు
చేరుమని గేరు గికురించి-పెడకుదారు 11

కం॥ ఇదిగో! పట్టెద ననుచున్
గదియన్ గడకంటఁజూచి-కడు దవ్వేగున్
వదనంబుఁద్రిప్పి బిర బిర
పొదలందున డాగి పసక-పొంతల నిలుచున్ 12

క॥ స్తుతిపాఠక వందిజనా
న్వితుఁడై భటగాయక కార్య-వేత్రధర మహా
శ్రిత బంధు సచివ పార్థివ
హితులున్ దోతేరనేను-గెక్కి-యతండున్

తే॥ సహ్యభూధర కాంతార-సరణి నరిగి
వేటతమకంబుచే దవ్వు-విపినములను
వక్రకంటక వల్లికా-వననికుంజ
పుంజములఁజొచ్చి మొకములఁ-బొడుచునంత

సీ॥ తిగవ్రేలి మితిగల-వగనులిగొమ్ములు
కాటుక గలరీతి-కన్నుగవయు
పుడిసిళ్లచెనకు సొం-పులసీను వీనులు
దట్టంపు జిగినెరుల్-దలిరుమోము
వేఁగంటిదొర రాల-వెలివెట్టు గొరి జలు
మరునత్తలముల మా-ర్మలయు కాళ్లు
కెందమ్మి తుదిరేకు-లందమ్ము్మై నిగ్గు
కపురంపుఁదునియడా-ల్కడపుబోర

తే॥ నొసలహొంబట్టుపట్టియ-మిసిమి చెలఁగ
నల్లముమ్మల రాపేరు-లరుతఁగల్గు
చిరుతప్రాయంపు లేడియ-చ్చెంతమెలఁగ
గొబ్బునంగాంచి శివరాయుఁ-డబ్బురముగ 8

సీ॥ రవనూనె మెరుగున-రాళకుంతలములు
గలుగక తలమెంత-పొలుపుగాంచె
కనుతెప్పకొలికల-కాటుకించుక లేక
ఖంజనమ్ములరీతిఁ-గన్నులమరె
విరిదమ్మి మేలిమి-వింతహొయల్లేక
నెమ్మోము ముద్దుల-గ్రుమ్మరించె
చాపిన చేరల-సొగసొంతయులేక
వీనుల చొక్కంబు-వెలుపు చుండె

# ఛత్రపతి శ్రీ శివాజీ చరిత్ర

## మూడవ ఆశ్వాసం

### శివాజీ మృగయా విహారము

కం॥ శ్రీ దుర్గాముఖ నీరజ
ప్రాదుర్భవ మధురసార పావనభృంగా!
యాదోరాశి నిషంగా!
పాదనరుటూచ్ఛ్రద శృంగ-సంపల్లింగా! 1

తే॥ అవధరింపుము శివరాయుఁ-డమిత విభవ
సాంద్ర దేవేంద్రుఁడై నిజ-జనని ప్రోది
వడయనోచని పుత్రు శం-భాజిఁ జూచి
యలత మృగయావినోదార్థ-మరుగనెంచి 2

కం॥ వలలురుల్లు జిగురు గండెలు
పులిబోనులు డేగగూండ్లు-పొలచిక్కంబుల్
తెలి నును గోరుల బైరును
పులి కొదమలఁబోలు శ్వాన-ములును తరక్షుల్ 3

కం॥ కైజా మోరలు నలరిన
నాజానేయములు నిగళి-తాంఘ్రిద్విపముల్
తేజూనిన యుష్ట్రములం
భోజాప్తస్యందనంబుఁ-బోలురథంబుల్ 4

కం॥ సింగపుఁగొదమలు పైకిం
జెంగునకుప్పించి యెక్కి-శీఘ్రమరవగా
లంగదలు వెట్టి మేల్ తొ
రంగిక శతములను దన కు-రంగట నడువన్ 5

# గద్య

ఇది శ్రీమద్భవానీ వరప్రసాదాసాదిత స్వతంత్ర మహారాష్ట్ర
రాజ్యసంస్థాపన ఛత్రపతి బిరుదాంచిత, యవన గం
డరగండ కథాకుతూహల, చంద్రశేఖర కరుణా కటా
క్ష లబ్ధచతుర్విధ కవితా విలోల, ఆర్వేలవంశ ప
విత్ర, గౌతమగోత్ర, బలిజపల్లి కుల కల శా
బ్ధి కల్హార కళత్ర, అయ్యనామాత్య
పుత్ర, నిరంతరపరచింతిత, కవి
తా వినోద బిరుదవిస్ఫూర్తి
రామమూర్తి విరచిత,
శివాజీ చరిత్రంబు
నందు ద్వితీయా
శ్వాసము స
ర్వము సం
పూర్ణ
ము.

## మత్తేభ కంద గర్భ సీసము

వినతసానంద-వీన తారపధరా నాగేంద్రసద్భూషణా! మహేశ!
విహితదీనావన-విశ్వరక్షణమహా-హీరాభ దేహా! హరా! స-భూష!
అమితసంపల్లల-నాతివత్సల శిఖో-న్మేషాభ్రకల్లోలి-నీ విలాస!
నిశితశూలోద్ధత-నిర్జితాసురసునా-సీరాది సేవాఋ-షీ సమేత! 293

తే॥ శరధి వరతూణ దానవ-హరణ మహిత
శోభి తరుచిహార గిరిజ-సుందర హృద
య, కమల, సుధ, బంభర, కామ-హరణచరిత!
విమలయశః కలితా ముని-వినుత గిరిశ 294

మ॥ నతసానంద నవీన తారప, ధరా!-నాగేంద్ర సద్భూషణా!
హితదీనావన విశ్వరక్షణ మహా-హీరాభ దేహా-హరా!
మితసంపల్లల నాతివత్సల శిఖో-న్మేషాభ కల్లోలినీ!
సితశూలోద్ధత నిర్జితాసుర సునా-సీరాది సేవా! ఋషీ! 295

కం॥ తారాద్రివాస! వాసవ
హీరాభగళాంకసాంక! హితసుకుమారా!
మారా పహార శూరా!
సూరాబ్జ రథాంగయుగళ! సూరిస్తుత్యా! 296

**గీతములో, కందము :—**

శరధి వరతూణ! దానవ
హరణ! మహితశోభిత రుచి-హారగిరిజ సుం
దర హృదయ కమల సుధ బం
భర! కామహరణ చరిత! మలయ, శ కలితా 297

గీ॥ శిశువక్త్రో ముఖమాత్రజీ-చేడి బడలి
గర్భవేదన నెక్కుడుఁ-గాసి నొంది
యింటి వేల్పుల కెల్లను-నిడియె ముడుపు
లసురలకుఁబోసె చే బియ్య-పస్నములను

చ॥ ఫలితపచేళిమంబుగతి-భామపిచండిల గహ్వరంబునన్
నెలకొను కందు రిక్క తెగి-నేలనువ్రాలిన శేవ దాసిచే
తుల వడకార్త్తవంబుడి పి-త్రోడను ద్రుంపెను నాభి వెండియున్
బొలుసు గశింగె నొక్కసతి-బోరున నా పసిపాపఁడేడ్వగన్ 2

కం॥ వెలిపట్టుచీరచేఁదడి
కలయంగా నొత్తి మేను-గాచి ప్రసూతన్
మలిచేపు పాలు గుడిపియు
నెలకొలిపెం దల్లిపజ్జ-నిసువును మరియున్ 28

గీ॥ పురిటి గీముసఁగావించు-పోడెములను
వరుసఁగావించి-పుణ్యాహ-వాచనాది
జాత కర్మలు దీరిచి-జనకుఁడతని
పేరు శంభాజి యని పిల్చి-ప్రియముఁబొంద 290

కం॥ ఈ గతి నెల్ల జనంబను
రాగంబునఁబొదల శివక-రావరుఁడుర్వీ
భాగంబేలుచు నిజ దా
రాగార్హస్థ్యముకరంబు-రంజిల్లంగాన్ 291

శా॥ సారోదార విహార, హారకృత శే-షా, శేషసత్ప్రాశిసం
చారా, చారణగీత, గీతసుషమా-సౌభాగ్యభాగ్యోలస
త్కారుణ్యామృతధార, ధారణ వివే-కాఖేదనా, ఖేదలే
ఖారాతి ప్రతిభా తిరస్కృతసురా-హార్యోల్లసత్కార్ముకా 292



ప్రచురణకర్త సతీమణి

బలిజపల్లి సోమసుందరి

సీ॥ అతి మనోహర పుష్పి-తారామకుంజంబు
లందు డాగిలి మూత-లాడి కొనుచు
కృత్రిమాచల మూల-కీలార తర్ణకో
ల్లంఘనాలోక లా-లసులు నగుచు
నిబిడ శాద్వల చర-న్మృగ తర్ణకంబుల
పరిరంభణ లొనర్చి-పట్టికొనుచు
పుషితామ్ర పల్లవా-బూతి కోకిల కల
క్వణ గీతముల హాయి గడలు కొనుచు

గీ॥ సారకాసార సారణ-సారసముల
చారు విహరణ మొనరించు-చంచరీక
మిథునసంపద కాత్మల-మెచ్చికొనుచు
సమ్మద క్రీడలను దేలె-సతియుఁబతియు 283

ఉ॥ అంతటఁగొన్నినాళ్లకు ల-తాంగికిఁజీరచెరంగు మాయుచో
ప్పెంతయు దప్పి, వేవిళులు,-హెచ్చి, విహారమునొచ్చి చిట్టుముల్
గొంతయుపెచ్చి, మంటిచవి-గోరికసొచ్చి తనూ విలాస మొ
క్కింతయునచ్చి నెన్నడలో-కించుకనించుక మందమై చనన్ 284

మ॥ బిగువయ్యెన్ బహుతప్తకాంచనమణీ-భృన్మేఖలా ఘంటికల్
జగిదేరెన్ సకలాంగ సంధులును ల-క్షింపంబడెందుందిలం
బుగిలాసంబులు జూపెమోము విలస-ద్భూయిష్ఠ భారంబునన్
బాగరెక్కెంజనుదోయి గర్భభరమం-భోజాక్షికిం గల్గగన్ 285

కం॥ రెండైదుల నెల లయ్యెడ
నిండన్, బడలికలు మించి-నెక్కొన నంతన్
గొండాడి హితభుజిష్యలు
యండన్ జని చేరె సూతి-కాలయమునకున్ 286

కం॥ అందఱి ప్రమదాదులకా
నందంబున ప్రొక్కి మఱియు-నందీశునకున్
వందనశతమిడి హరునభి
నందింపఁగఁ గాంస్య నిస్వ-నముఁ జేసి వెసన్ 277

తే॥ జయమహాదేవ! శంకర! సాధు రక్ష
తావకాంఘ్రి పయోజనం-దకులఁ బ్రోవు
జయ శివా! చంద్రశేఖర! -జయ జయోఽస్త్వ
టంచు భజియించి తీర్థంబు-లనలు గొనుచు 278

కం॥ చతురంత యానములపై
సతిపతులంతఃపురంబు-సంధించి మహో
న్నత రాజ్య ధురంధరుడై
శతమన్యు పులోమజాప్ర-శస్తిన్ వెలిగెన్ 279

ఉ॥ లేములు మధ్యమంబుల జ-లింపులు చూపుల, బంధనంబులున్
కాముని కేళులందెను మ-కారణ వైరములందు పీడలన్
భామల కంచుకంబులను- బాములు తత్త్వవిచారణంబులన్
దామిడి యేలెరాజు సహ-ధర్మిణిఁ గూడి యశోవిశాలుడై 280

ఆ॥వె॥ పంచపర్వములను భాను-వాసరముల
సంజవేళ గ్రహణ-సమయములను
పతిని గురుని రీతి-భావించి యా, సుయీ
పట్ట మహిషి పుణ్య-ఫలము వలన 281

కం॥ ప్రథమ ప్రహరము పద్మిని
వధువునకుం బుష్పశరుని-వాల్లభ్యమహా
ప్రథనోద్దీపన మగుటను
నిధువనములఁ దేలె నపుడు-నెలతయు బతితోన్ 282

మ॥ చెలియల్గొందఱు తీగటుయ్యెలలలో-జిత్రప్రచారంబుగాఁ
గలనాద శ్రుతిమేళగించి దివిష-ద్గాంధారి రాగంబులన్
గలయంబాడ కుతూహలంబున భుజం-గవ్రాతమున్ సచ్ఛిఖా
వళముల్వ్రించును నృత్తమున్ సలుపులో-నైరంబులన్ బొందకన్ 272

ఉ॥ వారిజపత్ర నేత్రలిటు-వారి విహార మొనర్చి కూలమున్
జేరి జలార్ద్ర చేలములు-చెచ్చెర వీడి నవాంబరంబులన్
గూరిచి, దేవి యానతిని-గుంద, కరంటక, కోవిదార, దు
త్తూర ముఖాది పుష్పముల-తోరపుసజ్జలనింపి తెచ్చినన్ 273

కం॥ స్ఫటికోపల విరచిత వి
స్ఫుట కుట్టిమ గోపురాగ్ర-భూరివిచిత్రో
ద్భట నంద్యావర్త రుచిర కటం
కట కవాట హితని-కాయము గనుచున్ 274

కం॥ మహిషీ మహివరు లబలల
సహితంబుగ నభవునతని-సతిఁబూజింపన్
బహుళార్చా ద్రవ్యమ్ములు
గ్రహించుకొని యరిగి ముందు గాఁగనుగొనియెన్ 275

సీ॥ ఆవాహనాసనా-ద్యర్ఘ్యపాద్యంబులు
స్నానాచమానము-లాచరించి
యజ్ఞోపవీత మా-ల్యాంబరాక్షతగంధ
సార కస్తూరికా-చర్చలొసగి
అమల సహస్ర ఘ-టాభిషేచన జేసి
ధూప దీప నివేది-తాపములిడి
పాహిమాం శంభో! శి-వా! శంకరా! మహా
దేవ! దేవేశ! వం-దే గిరీశ

తే॥ భక్త జన పోష శివ మనః-పద్మమోష!
కుండలీభూష! శైవరా-ట్కుల మనీష!
దారితా శేష విద్వేష! దైత్యతోష!
యనుచునుతియించి భక్తిసా-ష్టాంగ మెఱఁగి 276

వింపులగు మల్లియల-నందికొని యే గొనగ
మందమతి మీరలవి-కెందొడలటంచున్
బొందితిరి భ్రాంతియను-చుందరిమి, బల్కి, విన
గ్రంపుగలహాసముల-నొందిరి లతాంగుల్ 269

**లయగ్రాహి :-**

శైవలగు భామినులు-పేరెములు గట్టుచు న
పారిముగు భంగముల తూరికొను చెంతే
తీరముల నొంకొపుల-జేరుకొని పయ్యెదలు
వారికణ సంతతుల-పారముగ నింపన్
భూరి జలముగ్నులయి-సారెకును దేలుచు న
సారసరసీజముల-నేరికొని లోలో
నీరముల మున్గి పరి-వార మిరు వాగులయి
నేరుపున నొక్కొకరి-బోరుమన ముంపన్ 270

సీ॥ జలనీలిమంబుల-గలచివేసినవంత
పుండరీకంబుల-చెండు నేవ
ఇందీవరంబుల-గుందించు వలవంత
కమలనాళంబుల గలచు సూడు
ఆ వెక్క సంపద-లాకిం జేసిన రట్టు
సైకతంబు నేల-జదువు కొదువ
ఘన రసేభకరాళి-గారించు సాడిక
తరుణ కచ్ఛపముల-దఱుము దూఱు
తే॥ గాంగ్రకొనియెను-గాంతల పద్మజాక
రముఖ జలకేళి దేలుచు-శమ శుభైక
కచ, సుముఖ, నేత్ర, కర, నాభి-కటితటోరు
చరణ సంపదచేత నా-సరసిం గాని 271

సీ॥ ప్రాలేయ భూషిత-భర్మ పత్రము రీతి
నెమ్మోము చెమటలు గ్రమ్ముకొనియె
కన్నొతలాడిన-మన్నీని చందాన
దోర్భూషణంబులు-మసికిలించె
అధికానిలాపాది-తాస్ఫోట లత లీల
మంజులాకారంబు-మాఱ్పుఁజెందె
దూరప్రయాణ పాంథుని బోలి నెన్నొడల్
బడలి కలను దొట్రు-బాటు వడియె

గీ॥ సడలు కంచెల చెమట చే-ఁదడసి బిగిసె
తరుణి యీగా యొడనిక నిల్వ-దగదు పోవ
సారె సరసీజ కాసార-వారి కేళి
కరుగుదము వేగరమ్మని-యతివఁగూడి 266

తే॥ అసిత మణిమయ సోపాన-విసర కూల
ఘటిత జలయంత్ర సుమకోల-కర్ణధార
సహితకాసార విహరణా-సక్తమైన
వరవపులఁగూడి సారసా-కరముడిగ్గి 267

ఉ॥ పావన వారి కేళిసలు-పందగు పావడలం ఘటింపుచున్
గావిహారంగు పయ్యెదలు-గంచల లంటగ జుట్టు చుట్టి భూ
షావళులొల్చి మేల్మనుగు-లందున భద్ర మొనర్చి చిమ్మనం
గ్రోవియలొక్క కేలగొని-కోయవి నిమ్నగఁజొచ్చి పైదలుల్ 268

లయగ్రాహి :-

అందమగు మల్లియల-పందిళుల మానములు
సుందరి యొకర్తుగొన-కొందరన బోడుల్
కుందముల నోయ కల-కెందెవరు మంకెనల
జెందితిరిటేల యని-కంమ్మవులు బల్కన్

క్రొమ్ముడిని శిఖియించు పిప్పన-కోర్కెమై పెనగంగ వ్రాలును
కనఁగ మంకెన పూవు దేనియ-కలికికిడి తమిగూడె సరఘము
పలుకు పలుకుల కలరి ప్రియునకు-గొనబు ముద్దులొసంగె కలవవ
మతివనెలిగెఁ దానిదాచుట-లప్సానరానె మదిం దలంపుము
తనకుఁ గల్గినయంత వర్ధికి-దాచకొసగుటలసము లేరికి
పాత్రజనముల కోర్కెదీర్పని-మైత్రి మైత్రియె యెంచి చూడఁగ
ప్రియులకీయని కలుములడవిని-పెరుగు వెన్నెల చందమెంచుము
కెలతచేయుని బిలువబోకుము-నీదు పలుకుల జాతి పిలుపని
కెంపుగన్నుల పుల్గుపుంజిక-కేకిసల్ బలుమారు కొట్టును
పాకబోదియ నల్గునేలకి-పాదలజొంపములందు డాగిలి

మాతలాడు కిరాత కాంతల-మోముచందురు సోగ వెన్నెల

క్రోలగా నెదలందు వ్రాలిన-కొదమజక్కవ జంట నాయన
వర్తులస్తనయుగ్మమంటిన-వ ప్రసూన గుళుచ్ఛ మాఘురి
వర్వణాగతసార వారమ-సారసంగత భృంగసంతతి
చారుమృదుభవాని లాళి ల-సద్వ్రాతా వసిరస్థ రత్న వి
భావి భాద్యుతికోడి బరిఁడు-బాధ తామసి బృంద సంగతి
భావమానముఁ గాచు నొప్పెడు-వలుదమూలు జెలంగు బంగరు
వన్నికప్రపవంటి యాకుల-వాటమా చరమాంగముల్లల
వన్నెలాడుల పాఁబలంగల-పద్మరాగ విపంచికారవ
లీన మాఱు వరాగ సంపద-లెస్సబారిన పాట లస్మణి
కూటకోటి కజంగి నిర్ఘర-కుల్యలై ప్రబహించు నాచ్ఛటి
గూడుకొను సింగంపుఁబోదల-గుండెలదరఁగఁ జేయ భీతిని
ప్రముల్లి లేచి మనో భ్రమంబుల-దూరుపెత్తెను చూడు కోమలి 234

అనుచు చెలికిట్లు నాయుడా-హాను తోట
కల్పితా హార్య దంతుర-కటకసాను
కూటకోటి నరీ తల-కుంజ పుంజ
చిత్రములఁ జూపియులయు దే-చేడి యనిన 235

గీ॥ దృఢ పరిష్వంగ వాసనా-ధిక్కృఁజేచు
భయద పంచాస్య శార్దూల-పంక్తిఁజూపు
నృపవరోత్తముఁడంతఃపు-రేందు ముఖి కిఁ
బ్రమద వన కేళి గావించు-సమయమంచు. 260

కం॥ పతి బాయు చోకట చేటీ
వితతులఁ గూడుకొని సూన-వీరుధములలో
సతి వేడుక విహరించును
బతిడాయుచు నొక్క-వేళ-ప్రౌఢిఁజెలంగున్ 261

మ॥ చరియించున్ ఘనసారసార కదళీ-చంచద్దళాచ్ఛాదిత
స్ఫుటదేలాలతికానికుంజ కుహరా-స్ఫోటోచ్ఛ యోద్భూత మా
ధుర సౌ సస్య సకాయమాన నియతో-త్తుంగైక శయ్యాతలాం
తరరోలంబ వధూవరా యుత నితాం-త క్రీడ వీక్షింపుచున్ 262

మ॥ అలరుంబూవులు గోయు కేలలరిజా-పం, బేంట్లు జమ్మించు నా
చెలి నెమ్మోము సుగంధ బంధురస రా-జీ వప్రభన్ వ్రాల ను
త్పల నీకాశ కటాక్షముఁగ్రమ్మగిచి భీ-త స్వాంతయై నాథు నా
లలనా రత్నము కౌగిలింప నతఁడు-ల్లాసంబుతో నిట్లనెన్ 263

సిరియు గల్గిన దానవంచును-చేతనంటకు మాసుమంబును
కలదు దానిని గందు తుమ్మెద-కాంతనీమొగమంబుజంబని
బదరి వ్రాలగ నెంచు గావున-పద్మగంధిరో? యచోట వేగకు
మరువముంజిగిరించె ద్రెంపుము-మాకు మిక్కిలి ప్రీతి సుమ్మది
సగము ముక్కునఁజిల్క నొక్కిన-జామిపండది యంది కోయకు
పలుకుబోటికి యెక్కిరింతల-పక్కిమానిక మాటఁగావున
గులుకు దాడిమ పండ్ల జంటది-కోరి నీయెద వ్రాలు చున్నది
యబల దానిని గాననింతట నారగింతము దాచియుంచుము
పొరలు విచ్చిన యంటి బోదెల-పొంత జేరిక చేరబోవకు
కప్ర పుష్పజమంటి పావడ-కఱకు దేరిన కందు నూరులు
బర్హిణాంబల శాఖనున్నది-పరుగు పరుగున నరుగు దేరకు

ఉ॥ తూచిన వాసి వీసమును-దోపనిదాడిమ సస్యయుగ్మమున్
రాచతుపాసి కుంకుప గొ-నన్వనపాలిక వేగ మీయఁగాఁ
జూచి యతండు మంచిసొగ-సుం దనముండిన వారు వీటి నిం
దాచగఁబోలునంచు సహ-ధర్మిణి కిచ్చిన నవ్వెనాపెయున్ 257

కం॥ చేయెత్తి పూలగుత్తియఁ
గోయ వదేమనిన నవ్వి-కోమలి, నాథా!
మీ యెరుగని దే మున్నది
చే యెత్తుట కనుచుబోదివె-చెలిమి గరములన్ 258

సీ॥ పుషిత వాతాయన-పోత తర్ణకముల
బట్టి మూర్కొని దువ్వి-యట్టె విడుచు
ఉన్మాద నవబంధ-నోన్మాద పంచాస్య
మిథునంబులను జళ్కు-మీరి చూచు
రాజిత పంకేజ-రాగ రత్న గ్రస్త
విశదచ్ఛదాళి వె-న్వెంట నరుగు
కనక పంజర శారి-కాకీరములవరా
మరి కలకుబ్బ చ-క్కెరలు పెట్టు

గీ॥ గోవ జవ్వాది భద్ర సం-కోచ పిశుల
మగురుగోరో జనము చంద-నాగ సుమము
లచ్చ కస్తూరి శబర క-న్యకల లొసంగ
వరుని యనుమతి గైకొనె-వారిజాక్షి 259

సీ॥ ఇరుగడఁ జన్రుగేన-వీక్షింపఁగాంక్షించి
పుషిత కీరమ్మోదఁ-బొదల విసరు
వేసవి విరియింగ-వీక్షింపనెంచుచు
వేల్లిత కుంభముల్-వెంటఁదూరు
నా వర్తనాభి గ-న్నార నాలోకింప
నొడిగాలి కెదురుగా-నడువఁజేయు
పావడసై కెత్తు-పాటుఁగాంక్షింపుచోఁ
బన్నీటి వాక న-గ్రబముగ డిగ్గు

సీ॥ కీర సందష్టబిం-బౌరమంగనుగొని
కలికి వాతెఱ నొడు-గఱచుచుండు
యమ్మిజంటల గజ-నిమ్మపండ్లను జూచి
పణతి కంచల గొగ్గు-లణఁగజేయు
పుడమిపైఁబడియున్న-పున్నాగ విరినెంచి
నాతి సంవాసంబు-నాభినంటు
పొరలూడు ఘనసార-తరుమూలములఁగాంచి
సకియ పావడనింత-సర్దుచుండు

తే॥గీ॥ అధరకుచ, నాభి, యూరుల-య్యతివకిట్లు
వన్యజాతంబులను నేల-వనజభవుఁడు
సకల జన దర్శనంబుగా-సంఘటించె
ననుచుఁజింతించి తలవంచి-యవ్వధూటి 253

తే॥వె॥ విరియుఁబూ గుత్తియల దేనె-పెరలు జిల్చి
మధువు దారకొసఁగి రతిమరులు కొల్పు
తేటిజంటను జూపి పృ-థ్వీవరుండు
జాయకౌగిలి కాసింపఁ-జనియెనాపె 254

ఉ॥ ఉన్నత శాఖశాఖతుద-నున్న పచేళిమ ద్రెంపుమంచు నా
యన్నుల మిన్నతోఁబలికి హస్తము, పైకెగియింపుమన్న య
వ్వన్నెల కొల్లకాపె నును-పయ్యెదఁజూచుచుఁ గ్రేవసర్దు న
భ్యున్నతిఁగాంచి భూమివిభుఁ-డున్నదిపోయెనటంచు నవ్వెడిన్ 255

కం॥ సుశిగాలిని బున్నాగము
వడిచేడియ కేలుగంటు-వడ్డాణమునన్
బడియున్నఁగాంచి రాయుఁడు
పడతికిఁబొక్కిళులు రెండు-బరగునెయనుడున్ 256

కం॥ పుష్పాదులు పరచు దారిని
కప్పూరపుటనంటు లిరుతె-గన్ బెనువలపుల్
గప్పుమన బొండు మల్లియ
చప్పరములనీడ నిలువఁ-జనఁజన నెదుటన్ 250

సీ॥ తనమోము రుచులతో-డను సాటిరాఁదగు
విరియు నా పొందమ్మి-విరుల నేర్చి
తన దృగగ్రంబుల-కెనఁజాలి యుండిన
రమణీయ నీలాంబు-జముల నేర్చి
తన పీనసమకుచ-స్తబక ద్వయముఁబోలు
పసలుబ్బు గజనిమ్మ-పండ్ల నేర్చి
తన నాభివర్తుల-త్వమున కీడగునన
నవ్యపున్నాగ సూ-నముల నేర్చి
తే॥ ఏర్చి కదళీపుటంబులఁ జేర్చి పేర్చి
ప్రమదవన పాలికలు రాజ-పట్ట మహిషి
కెదురుగా నిల్చి యుంకువ-లిచ్చివాని
సుగుణ సంపద లిట్లని-పొగడి రంత 251

సీ॥ తల్లి! యీ గాంగేయ-దళసారసంబులు
నెలయేగునందాక-వలపు చెడవు
అమ్మ! యీ నీలాంబు-జమ్ములు మైఁదాల్పఁ
బ్రియుని నెయ్యంబెంత-పెచ్చు పెరుగు
జనని! యీ గజనింబ-సస్యసారము గ్రోల
రుజలంటకుండు దా-రుఢ్యమొదవు
మాత! యీ పున్నాగ-మాలికల్ధరియింప
సకలాంగములు సువా-సనలు పొడము
తే॥ అవ్వ! యీ యుక్తి నిజమని-యవధరింపు
మనుచుఁ జేతులు జోడించి-యవ్వనైక
కృతకగిరి సానుకటకసం-కేత కుహర
సారసమసారదంతుర-స్థలులఁ జూప 252

॥ కలకాలంబిటులీ నృపాలవరుఁడే-కచ్ఛత్రదీప్తిన్ ధరా
తలమేలన్వలె నంచు బాల, యువ, వృ-ద్ధ, వ్రాతమేకోక్తి వే
ల్పుల నత్యంతము సన్నుతింపఁగలుషం-బుల్ క్షామముల్ విప్లవం
బులునోక్కింతయులేకయుండనృపుఁడున్-భూభారమున్బూనెడున్ 244

## వన విహారము

॥ అంతనితాంత సౌరభల-తాంతములెల్ల వనాంతరంబులం
దెంతయుఁ గ్రాలకింశుకము-లించుకయించుక శాఖశాఖలన్
గంతుని కుంతసంతతుల-కైవడిఁదోఁపఁగిశోరవాత్య, మ
త్యంతరతాంత యౌవనల-కామెతఁజూప వసంతమబ్బగన్ 245

ం॥ ఆ రామ పరిక్రమమున
కై, రామను గూడి కర్పు-రాందోళికలం
దారూఢలయ్యు వరవుడు
లీరెడఁగొలువంగ వనికి-నేగెడునంతన్ 246

కం॥ మంచి మెడతేని యానల
మించిన యూహాసుతోట-మిడికావలులే
తెంచి, దొరఁగాంచి శిరముల్
వంచి జోహారులిడి యణుకు-వల్, మీరంగన్ 247

కం॥ అయనమ్మున కిరుగడలను
కయిమోడ్పుల నడచి తోట-గవకునవారల్
నియతగతి నిల్వతోమిడి
పయిరలులేతెంచి దేవి-పజ్జను నిలువన్ 248

కం॥ చతురంత యానధుర్యు, లు
చితరీతిని నందలములు-క్షితిదింపి చనన్
సతి పతికేలూతంగొని
హితవనపాలకులతోడ-నెంతే వేడ్కన్ 249

చ॥ ఘన గణికాగ్ర జన్మ నృప-గాయక, వందిపశేలు లాదియా
జనులకు మేలిమాన్యములు-జాలనొసంగి భవిష్యకాలమం
దినుమడి పైకమంటగనొ-కించుకవీల్వడ నా కృతిన్ మఱిన్
ఘనమును జూపుపత్రముల-గైకొని భద్రము జేయు వాటినిన్ 239

శా॥ దేవాదాయము లెట్టివైన బలు వృ-ద్ధిం జేసి, క్షద్రవ్యముల్
బ్రోవుల్గూర్పఁక పాత్ర సేవకుల తా-వుల్ జేర్పగానీక వి
ద్యావస్త్రంబుల నాకటంగనలు పం-గ్వంధాతురానాథ ఖా
ద్యావాసంబుల కౌషధాన్నహిత స-త్రార్థంబు నీమించెదున్ 240

కం॥ ఏ సీమల మణిగంబులు
నాసీమలనున్న బుధుల-నరసి యొసగుచున్
మోసములు దెలియ బంధుల
నా సన్నిధినుంచి నిజము-నరయుచునుందున్ 241

కం॥ ఈ రీతి ప్రజల సౌఖ్యము
లారయుచుందల్లి పిల్ల-లట్టుల హితముల్
నేరిపి జాతిద్వేషము
లారసి ధర్మంబునాలు-గడుగుల నిలిపెన్ 242

సీ॥ మువ్వన్నె మెకముల-మొలదోలునావుల
మందలరీతి నెమ్మదులు లేక
తోడేళ్లనడుమ ని-ద్దురగోరు జింకల
పగిది డెందముల ని-ర్భయము లేక
చేవాడికాండ్లకై-జిక్కు రొక్కపు కాండ్ల
గతి చిత్తములకు స్వ-స్థతలు లేక
బొజుగుల గుంపుచే-బొదివిన జవ్వనుల్
బలెబైసిప్పినింత-భ్రాంతిలేక

తే॥ ప్రాణములు పోయి రొక్కంబు-బయసాకింత
దమదిగాదని చెనుగుల-దాడికోడి
పారునిక్కట్టు లీరాజు-పాల నమునఁ
దొలఁగఁగాంచితి మని ప్రజల్-దలకులుడిగె 243

కం॥ ఉపరితలంబుల నైనను
నపరిమిత జలాశయంబు-లలవరచి ప్రజల్
గృపగలవారను వారిన్
గృపీట పతులుగ నొనర్చు-కృషికులు మెచ్చన్ 233

కం॥ ఫలసమయంబుల నెద్దడి
గలతేఱి, నతివర్షమపుడు-కాల్వలొకగతిన్
వెలువడనీయక కాలగ
తులుగని యధికాల్పములుగఁ-దోయములొసగున్ 234

కం॥ దుష్పంథలకిరుగడలును
గోష్పదమాత్రముల నినుప-కోలలనిడి రో
చిష్పతి పీడాహారమున
పుష్పాగము లిరుగడలను-బొంపుపరచెడున్ 235

కం॥ కలహములు దీర్పనూరన్
గలవారలు పసుగు రెన్నఁ-గామిడి చౌకం
బలవరచి, వారుమణిపఞ్చన్
గలసికొనుచుతగవు దీర్పఁ-గా, నియమించెన్ 236

కం॥ తెరవాటికాంధ్ర తావులు
నరయుచుఁదలవరులు రాత్రు-లందును తన్మం
దిరములను లేనివారల
కురుశిక్షలొనర్ప నాజ్ఞ-లూహూర నిడెన్. 237

కం॥ కొట్టిక తెక్కలు లొక్కెడ
చుట్టల కెంకులకు మేగఁ-జూపట్టిన నా
చుట్టల కెంకుల దమరు
న్నట్టుల జాబులను దెచ్చుంనానతులిచ్చున్ 238

కం॥ తన భూములందు గోవధ
మొనరించిన జనులనెల్ల-నొక వత్సరముం
బెను మలలనుండఁజేయును
కనుగొనువారలకు భీతి-గడలు కొనంగన్ 227

కం॥ పలుచోటు లొకని కుండిన
పలుదెరఁగుల పన్నులొకట-పదిలపరచి పై
నలతులగు పావులర్ధలు
ద్రొలగించుయు నింకుపన్ను-తో, గవులిచ్చున్ 228

కం॥ పల్లియల పట్టణంబుల
కొల్లలుగా, జ్ఞానధనము-గోరక చెప్పన్
తల్లజులగు నాచార్యుల
కుల్లాసంబొసగ ముల్లి-నొసగుచు నిలిపెన్ 229

కం॥ ఫలభరితా వనికైనన్
వెలయెక్కువ నిడకపంచు-వేళలపన్నుల్
దలపెట్ట కొక్క పరిఁగొన
కలఁతి గతుల పుచ్చికొనగ-నానతులిచ్చెన్ 230

కం॥ ఏయే గ్రామము పన్నుల
నాయా గ్రామముల మణిగ-మాదా జేయన్
ధీయుక్తిఁబన్ని తత్కర
మాయా పక్షములు కోట-కంప విధించెన్ 231

కూలాగ్రంబుల నిల్పి జూడనగులం-గొంచెంబు కానేటను
పాకాలంబైనను నెద్దడింగనక ము-క్కారున్ యవల్ బండగా
పేలై యొప్పు తటాకముల్ గ-ఱవడన్ వేమారుగాకొక్కెడన్
గీలాలంబుల నింప పండగల బ-ల్కేదారముల్ గూర్చెమన్ 232

తే॥ అప్పుడా బాల యచ్చోటి-యఖిల జనులఁ
గాంచి యబలలయెడ స యీ కాంతునకును
నిశరులకుఁగల్గు భేదంబు-లెంచి యెంచి
పరవధూ గౌరవార్థమై-పాటుపడియె 221

కం॥ ఈ వృత్తాంతంబేమల
భూవిభు సభలోన దెలియ-బొజుగు తుటుమ్మున్
దా వెరచి శివాజీ రా
జే విధిగా, మనహితంబ-పేక్షించెననన్ 222

ఉ॥ ఆవచనంబులన్నియని ము-రారియ నా, ద్విజమంత్రి యిట్లనెన్
ధీవరులార! బీజపురదేశము-లెన్నియొ మీహితార్థమే
శైవవరుండు జేకొనియె-సాత్పుర దుర్గము లాక్రమించి య
య్యావనకోటి గీటడ చె-నాయవివేకపుమాటలేటికిన్ 223

కం॥ అని వల్కు నచటి కూళల
మన మలుగన్, గాంచి, యవన-మనుజాధిపుఁడున్
విసికని రజ్జులు వల్కుట
ఘనమా, యన, నూరకుండ్రి-కాపురుషవరుల్ 224

శా॥ ఆ వృత్తాంతము గూఢచారి తతిచే-నాద్యంతమాలించి, హృ
ద్యావర్ధిష్టత మేనుపొంగి శివరా-యస్వామి కళ్యాణ పూ
ర్ణ్యాభ విస్తారములెక్కలెల్లఁగొని, శ-మ్యాభసారముం గాంచుచున్
దా వేర్వేరుకరమ్ములేర్పరచి, యే-తద్ద్రవ్యమాకం గొనున్ 225

కం॥ మకరము దాటిన నరికిం
బ్రకటింప గ జేసి, యట్టి-ప్రకటన, మునూ్మ
టికి విని కరమొసఁగని వా
నికి, దినమొక్క చిరునూక-నిర్దేశించెన్ 226

మ॥ వెనువెంటంబరతెంచు తేనిఁగనియ-వ్విభ్రాంత వాతాయువున్
వినతాసూను నతిక్రమించురయమున్-వీర్యంబునన్మించి, కా
ననముల్గుల్మములద్రిసానువులఖండ ప్రస్తరంబుల్ ఝరీ
వనకూలంకషసారసాకర జలావర్తంబులందాటుచున్ 23

కం॥ సాళువపు డేగ కైవడి
నోలిం బటుమెగయు-చొక్క యుద్యానంబున్
లీలమెయిం జేరఁగ భూ
పాలుండును వెంటనంటి-బాయక నేగెన్ 24

శా॥ ఆయుద్యానము నందనంబనగ పు-ష్పచ్ఛందనానో కహ
చ్ఛాయోర్వీభవ గోస్తనీనవలతా-సంకీర్ణచూతద్రుమా
ధేయంబౌ ఘనసారసార కదళీ-దీర్ఘచ్ఛదా సంవృత
వ్యాయా మాత్తకిశోరవాత నియమ-వ్యాకీర్ణమై యొప్పెడున్ 25

సీ॥ స్వచ్ఛనుత్స్యందికా-స్వారస్య శీతల
ఫలజల లాంగలీ-పంక్తి గలిగి
ప్రవిదళిత్రసవించెడు-పీయూష శీకర
ఫలిత రంభా తరు-పంక్తి గలిగి
సమధికమాధుర్య-సాంద్ర గంధాయుత
పరిపక్వ ఫలచూత-పంక్తి గలిగి
చిక్రోడ దంత వి-చ్ఛిన్నేక్షు రసతుల్య
పానీయ దీర్ఘికా-పంక్తి గలిగి

గీ॥ కలిత చందన కోటర-మలయ పవన
గంధసంయుత బహువిభా-గములు గలిగి
చలితకలకంఠ గళ కల-స్వనములలరి
యొప్పెషద్రుతు శోభన-య్యుపవనంబు 26

కం॥ శుకపిక మధుకర కేకీ
నికర కలక్వణన రామ-ణీయక లీలా
వికసిత కుసుమ సుగంధ
ప్రకరామోదమున వనము-భాసిలు చుండెన్ 27

చ॥ చలువల రేని యెండలను-జాబిలి రాలుగరంగి పాఱువం
కలు మగఱాల చెక్కడపుఁ-గాల్వలఁ జేరి గమింపుచుండు. టె
ప్పాల ములకా నలన్మెలగు వూపసదుల్ వడ ప్రొద్దులందునన్
వలిగొను వీచుసంచదను-వాకొనుచుబ్బురమొంది యాతఁడున్ 28

సును తేనె మంచుల-మునుకొని క్రొమ్మావి
చిగురులు సతము భ-క్షించు వలన
అమృతోపమాన సు-మాఘు మరందమ్ము
దారు నిత్యంబును-ద్రావకొంట
తపనీయ బిస నవ-దళవరాటకములు
సతముదా మశనంబు-సలుపనొంట
పరిపక్వమాధుర్య-ఫలమృదు ద్రవములు
జిహ్వాగ్రముల భంజింపనొంట

తే॥ పికమధువ్రత కలహంస-శుకనికరము
కాకలీధ్వన వల్లకీ-గాన మధుర
రుతమృదూక్తుల మానవ-తతికి నింపు
గలుగఁజేయుటకే వనా-గమము లెల్ల 29

మ॥ లలి చక్రోడలు నాళికేర ఫలమూ-లంబుల్ వ్యథల్సేయ, త
జ్జలమత్యంతమదభ్ర పత్రదళితాం-చత్సీకరాకారమై
యిలవర్షింపగఁగాంచి చాతకములెం-తే ప్రీతి నెల్లప్పుడీ
ప్పాలమందెక్కుడు ఖాదమబ్బు ననుచిం-పున్మీరినట్లొప్పెడున్ 30

మ॥ కృతకాహార్య శిఖాగ్ర వజ్రరుచి పూ-ర్ణేందు ప్రకాశంబుగా
నుతిగావింపుచు గృష్ణపక్ష నిశలం-దున్గాడమౌకబ్బు ఖా
దితమంచీయెడ త్రోటులెత్తుకొని వ-ర్తించుం దివారాత్రముల్
ధృతినన్యోన్యము తర్ణకీయుతముగా-దృష్టించజకోరాఘముల్ 31

శా॥ నానా పుష్పపరాగ సంతతుల నం-టం శోకగా నీక ను
ద్యానంబందున మాలికుం బలె జగ-త్ప్రాణుండు ప్రత్యాహమున్
దానభ్రంబునకంటి జిమ్మనదియుం-ధారా ధరంబంచు దా
మానందంబున బర్హిణుల్సతము నా-ట్యం బియ్యెడం జేసెడున్ 32

శా॥ నిర్దాక్షిణ్యమనస్కు- లూర్జిత మహా-నిష్ఠా తుటాదార్యులా
శార్దూలాచ్ఛ వరాహ, ఖడ్గ, శల, ఋ-క్షశ్రేణులం గూర్చి; సా
హార్ద్రత్రాస భయాని కాద్భుత రసా-హ్లాదంబులం జూపుచున్
దోర్దర్పంబులు దెల్పు చామృగములం-మన్ మేలు లర్పించినన్ 147

కం॥ కృతముఖ వైతంసి కులీ
ప్సిత మాంసల వంధ్య కిటుల-వృక్ష్యము త్రిఫల
ప్రతిగా ఖండించియు రస
వతి యధ్యక్షున కొసంగ వడి నాతండున్ 148

కం॥ అంధ సికున కొసంగినదు
ర్గంధము, వో, తూళనంబు-గావించిని శా
సైంధవ ధత్రాత్ర్థామల
సంధించిన పక్వమైన సమయము దేలుపన్ 149

కం॥ చేటువ జలాశయంబున
నీరంబుల నాడి యుచిత నియమము లెల్లం
దీరిచి పలువల వలి వలి
నూరిచి కొని రెటుక విశాల కుజ విచ్ఛాయన్ 150

కం॥ బంతులు దీరిచి-నృపసా
మంత, చమూనాథ, సచివ-మాన్యాధ్యక్షుల్
మంతి దిని సత్కృతంబులు
నెంతయు గావించి మెచ్చి-హెచ్చిన యంతన్ 151

కం॥ ద్వీపదా శ్వారథము లందును
హరి మాకర ఖడ్గ భల్లు కాది మృగాళిన్
దిర వరచి యెల్ల వారలు
పుర మార్గము బట్టి నడువ-భూమీశ్వరుఁడున్ 152

కం॥ వలపూరి జాలు వారుచు
సొలపుల సొబగుట్టి పడుచు-సుందరి చెలువం
బలమెను నామది నాయస
వలయము సూదంటురాయి-వడువున నకటా! 141

ఉ॥ దీని విలాస పుష్కలన-దీజల విభ్రమణాంతరంబునం
దేనిక వోలు నామన మొ-కించుక నించుక సుళ్ళవారె నిం
కే, నియ మంబునం దరికి-నీదెద నీదెదనంచు బోవని
మ్మా నిని చూపు వాగురులు-మల్చి కొనుందమి నీటి సుళ్లకున్ 142

కం॥ కాలాయస బాణములీ
బాలిక వాల్జూపు లిది, య-బద్ధంబనము
మ్మూలల రవ బోలు నాయెద
యేలా ఓగురాకు రీతి-నెట్టం బారెన్ 143

కం॥ ఇందీ వరాక్షి యీ చెలి
యిందీవర బాణుఁడ తనుఁడీ స్నేహముచే
నిందీ వర సతినే చర
నిందీ వర రిపుధి కులుఁ డ,-నేననియే చెన్ 144

కం॥ నను వేచి చెలిని వే చని
ఘన పాతకి. వక్షపాతి-కరినాత్ము మరున్
దను హీనతకై కాత్యా
యని సేవించెద నటంచు-నరుగగ నెదుటన్ 145

కం॥ సామంత దండనాధ
గ్రామణు లూర్జ స్వలాళి-గంధే భార్వ
స్తోమంబులతో నెదురై
యా, మహనీయునకు మ్రొక్కు-చానందమునన్. 146

కం॥ కనుగొన్న యొక్క నిముసము
వెనుకొనియెన్ జపకు కొదుకు- వ్రీడా భరమా
నన బోడి చెంత కరుగన్
మునికొనియెన్ గూడనట్టి-మోమోటంబున్. 135

కం॥ చెలి చిలుక కొఱకునై యొక
కలకండను దెచ్చు నెపము-గా నెమ్మోమున్
వెలిక్రొడ్డి నన్ను జూచుచు
వల కేల్పయ్యెదను జేర్చు-వగ లేమిటికో॥ 136

కం॥ వలిగా లిందెర దొలగిన
కలికియు దొలు కాఱు మెఱుపు-కై నడిఁజను-చో
కెలన గల పాత్రమందెడు
మెలపున ననుజూచెఁ బ్రేమ-మే లెట్టిడిదో 137

కం॥ ఉపురా ఘా కట్టడమున
నడుగుందోవ తొగరు ఛాయ-దాసతి యేగన్
గడియవర కట్టి మై జిగి
నెడ దన్మారు నంగ నించు-కేనియు వశమే॥ 138

కం॥ ప్రేమయను నూలి పోగున
సామజముం గట్ట వచ్చు-సామ్యంబున ని
క్కామిని ప్రేముడి హాటక
దామనులై నన్ను గట్టె-దారుఢ్యముగాన్. 139

కం॥ తలఁచిన కొలఁదిని బ్రేమం
బిలమించుచు దెసలు దాటి-యేగఁ దొణంగెన్
వలపుల నుడిగెదనని సన్
దలపాక నిముసంబు మరువఁ-దాళదు చెలిపై॥ 140

ముఖ్యంగా,

తే॥
కోపమిసు మంతఁ జూపక గొణుగు కొనక
మురువు సూపెడి దరహాస ముఖముతోడ
సరసగతి నచ్చువేసిన శ్రీసాయిబాబ
ముద్రణాలయ విభుడు సత్పుణ్య గుణుడు
పుడమి వెల్గొందు చింతలపూడి వంశ
రసహృదయుడై అప్పలరాజ సఖుని
అభినుతింతును సంతోషి తాంతరాత్మ.

తే॥
పట్టుదలతోడఁ దప్పుల నిట్టె. పట్టి,
యొప్పులుగఁ దీర్చి, శ్రమకోర్చి యోర్మిఁ జూపి
కవికి, గ్రంథాని కెనలేని ఖ్యాతిఁ గూర్చ
ముద్రణా భోగమహిత సమ్మోదమిచ్చు
రాజితుఁడు కోడిదాసు శ్రీరామమూర్తి
సఖుఁడు వానికి మన్నమస్కార శతము,

విపశ్చిద్వర్గ వినీతుడు

**బలిజపల్లి రామారావు**

ఆనందపేట

డోర్ నెం **20-6-4**

విజయనగరం- 2

గీ॥ నెన్న నిలువెల్ల నొయ్యార-మున్న మిన్న
చిన్ని జింకను ముద్దాడ-నున్నగతిని
నన్ను క్రేగంటఁ జూచిన-చెన్ను దలఁప
మరపురాకున్న దహహా! న-మశ్శివాయ. 131

కం॥ మగరా మగటిమి మిగిలిన
బిగి గల నాడెంద మినుము-బీడై నుగ్గై
యెగసెడు దుమ్మై పోయిన
వగనయ్యె నటంచు బొగిలి-వనటను నడువన్ 132

సీ॥ గండు కోయిల గుంపు-గదియని చిగురులు
పొరలు వీడ్వడి యున్న-పొంబనంట్లు
నును గాలి గదలు కుం-దన పేటి తరకలు
యెమ్మె జంటల గజ-నిమ్మపండ్లు
సరములల్లినరీతి-గెరలు పూరెమ్మలు
కసటు వోయిన చంద్ర-ఖండములును
దొరువుల విరివారు-దొగనును రేకులు
పూదేనెగొను బమి-పుర్వగములు

గీ॥ నచ్చుటచ్చుటఁగని యతఁ-డబల యడుగు
లూరువులు బొజ్జ ముడుతలు-బాగు కుచము
లలరు కేల్దమ్ములును జెక్కు-టద్దములును
కన్నుగవ ముంగురులునుము-న్మన్ను బోల్చి॥ 133

కం॥ ఆ తెలివాలుం గన్నులు
వాతెఱ తేనియలు జిల్కు-వలపులనుమ లిం
కి తలిరు బోడి కలవను
రాతిరియుం బవలు మరపు-రానుర దానిన్. 134

మ॥ అతఁడట్లు మహారాజ పుత్రిక భుజి-ష్యల్ సేయు నాహూయమున్
గుతు కంబున్ బరితాపముం బొడమ సం-కోచింపు చునోర్వుచో
ధృతి నొక్కొక్కెడ నిల్చి, చూచుచు, మనో-దృష్టిన్ని దానింపుచున్
స్రుతులన్ జేరల నొడ్డి వారి నుడుల-స్తోకంబు నాలింపుచున్ 127

కం॥ అడు గిడుచు వెనుక జూచుచు
తడబడు చున్నందుఁ జూచి-తద్దయు మిన్నం
బొడఁ గనుచు దెసలఁ గాంచుచు
బుడ మింగని యున్న రనుచు-బొమ లెగయించున్ 128

ఉ॥ మించిన ప్రేమ నయ్యతివ-మేని మెఱుంగులునప్పుడప్పుడో
నెంచుచు వీపు పైని నటి-యించెను క్రొమ్ముడి చిట్ట-చీకటిన్
ముంచు జగత్త్రయంబనుచు-మోహ సరస్వతి మున్గి, తేలుచున్
బంచ శరార్తి పల్కునుడి-బల్కుచునున్నరు మంచు నిల్చుచున్ 129

కం॥ ప్రతి సీరమరుగు నందు
ద్ధతి ఘన మధ్య చపల వలె-తనువు మరీచుల్
హితమైన యోర చూపులు
మతిఁదలఁప విరాళి వొడము-మస్కరి కనుచున్ 130

సీ॥ చీకు వాల్మిత్తి మే-ల్చెంగనా లింతయ
వ్వాలఁద్రోయ మొలకన-వ్వులమొగంబు
ఇత్తిగకాళుల-మొత్తం బులీనుచు
జేరల మించిన పారునలును
ఎగుచుసాకుము పులు-గెలుగు నీరొనరించుఁ
దివ్యసుడువుల-దివ్య కొలిమి
యుదిరికడాని డాలొ దవు గింజెము చెంగు
ద్రోచిపై కుబికెడు-చాచు కవయు

సీ॥ అతఁడు దుర్వార తీవ్రశౌ-ర్యాఢ్య చండ
మండలాగ్ర విఖండిత-దండి తారి
భండనోద్దండ గండర-గండ శౌండ
మండితా ఖండలుఁడు శివ-మహీ వరుండు, 121

కం॥ కులిశ, హల, కలశ, తోమర
జలజాత విసార ఛత్ర-శంఖా కృతులున్
గల కర, పద, రేఖల యీ
యలఘు బలుని రాక శుభము-లలవడు మనకున్ 122

కం॥ అని పలుకు కీర రాజము
గనుఁగొని నృప వరుఁడు మిగుల-కౌతుక మతి యై
నను బోలు నట్టి పట మిట
గనుగొని యీ శుకము తెలుపగా నోపె గదా ! 123

కం॥ పసి తనమున మెలగు నెడన్
పసి దిండి మొకంబు దీని-బట్టి కొసంగా
కసి గంద నీక పెంచితి
మసదృశ ! వెన్నంటు మాత్ర-మది, మీయదియే 124

కం॥ భూ వరుల కాసలో దవిన
నా వస్తువు వారిఁజెందు-టర్హముగానన్
భావి శుభంబును గల్గెడి
నావర కేణంబు మా, య-ధీనంబనియెన్ 125

సీ॥ శీఘ్రు కాలంబులో మీకు-శ్రేయమబ్బ
నేగి రమ్మని వెనువెంట-నేగి చెలులు
మము భుజిష్యలు గా నేలు-మా ! మహీశ !
యనుచు మ్రొక్కుచు సెలవెందు-చట్టె నిలువ॥ 126

కం॥ తములము తమ్మి నొసంగియు
సుముఖి! నీ వెఱుఁగనట్టి-చోద్యంబిలలో
నెమికిన లేదది గనుకీ
విమలాంగుని వృత్తమాఖ్య-వివరింపఁగదే! 117

మ॥ అనినన్ జేరెలు గొప్ప కీరమటఁ గు-డ్యాకీర్ణ చిత్రింబులన్
దనమోమెత్తియెగా దిగన్గనియునీ ధాత్రిన్ మహారాష్ట్రమన్
ఘన దేశంబు శివాజి నామమున రం-గత్ప్రాభవం బొప్పని
మ్మను జాధీశ్వరుఁడేలు రాడ్ఘడ పురిన్-మా రోడ్డులేకుండగాన్ 118

చ॥ వినుత యశఃప్రభావుఁడరి-వీరనృపేంధన మాలికాశుశు
క్షణియు కృపాబ్ధి ధైర్యఘని-కాయహిం మాచలుఁడుగ్రశాసనుం
డనుపమభోగ జిష్ణుఁడు, మ-హాహవ శిక్షణుఁడార్త బాంధవా
వనుఁడు, పరాంగనా విముఖ-భావనుఁడాశ్రితవత్సలుఁడెన్నఁగన్ 119

చ॥ పరవనితా సహోదరుఁడ-భంగుర విక్రమ శౌర్యసాహసుం
డరి ధరణీశమౌళి ఖచి-తాశ్మధగద్ధగి తైక పాదపు
ష్కరుఁ డుగు దుర్విదోఘ జన కల్ప మహీరుహుఁడెల్లభూతసా
దరణుఁడు, కానరానురవి-దారణి పాదసరోజ భక్తుఁడున్ 120

సీ॥ ఢిల్లీ మహాపురం బుల్లాస కందకం
బెవ్వాని దీర్ఘ దో-ర్వృత్తములకు
ధుండి రాజపురిందు-భండార మణి ముద్రి
లెవ్వాని యీవికి-తృణ సమములు
బీజపూర్ఖానుల-బెడగు బీచపు గుంపు
లెవ్వాని యసముచే-నేపుగాద
నైజాము పాదుషా-వైజయంతిక చేల
లెవ్వాని రిపుకాంత-కెసగు ముసుగు

కం॥ అని పలికెడు ననబోడిం
గని నృపతి యగౌరవంబు-గాదే జనముల్
దన పేరు దా వచించుట
మనుజేంద్రులకింత తగదు-మానిని! యనినన్. 111

కం॥ పేరుం జెప్పుట తమకా
చారము గాదనిరి రాజ-సతుల విహారా
గారంబు దూర మీకున్
మేరా? యోచింపు(డెదన-మేయ గుణాఢ్యా! 112

కం॥ ఇరుగడలను ధర్మంబులు
సరిగా నుండి నవియుగాని-సతులకు వేరై
పురుషులకు వేసు కల్గునె?
ధరిణిప! మీపేసు మాకు-దప్పక తెలియున్ 113

వ॥ అది యెట్లంటి రేని

కం॥ ముల్లోకము లెఱిగిన శుక
మల్లదె మా దేవి హస్త-మందుండిన దా
తల్లజము నడుగ పేరుం
దెల్లము గావించునని వి-ధేయం బొప్పన్. 114

కం॥ రావే! ముద్దుల చిలుకా!
రావే! మరుతేజి! వేగ, రా,-రమ్మనినన్
దేవీ హస్తాంభోజము
వేవిడి చి భుజిష్యకరము-నేడ్కన్ వ్రాలెన్. 115

కం॥ శిరమున్ మూరొక్కని రెక్కలు
సరిగాని మురుచును ఖండ-శర్కరనొసగన్
జరణ ములనంటి ముక్కున
బిరబిర(దా(గొరుకు కొనుచు-బిట్టుంగూయన్ 116

గీ॥ నృప తనయ మాఱు కలవాణి-నిలిచి పలికె
కుశలమే, తావకావని గో. ద్విజులకు
యుష్మదీయాంఘ్రి రజమున-నుదవసితము
మించి సిరులను మేము త-రించినాము. 105

కం॥ నవరేఖావృత కరమై
పరివిమల రక్తాబ్జరాగ-రాజితభవమై
భువన పరిపూజితములగు
భవ దంఘ్రులుసోకి గృహము-పావనమయ్యెన్ 106

కం॥ నవరత్న దీప్తమయ మగు
భవదీయ కిరీట రుచులు-పార్థివ చిహ్నల్
తవణించెఁ గాన మీరీ
భువి, జిష్ణులటంచు పలుక-బోలుమహేశా॥ 107

కం॥ పంచాశ ద్వర్ణములం
దెంచిన పుణ్యాక్షరంబు-లెవ్వవి? మీ, నా
మాంచితములు వివరింపుఁడు
పంచాశ ద్రివిణరూప! పంచ పృషత్కా! 108

కం॥ ఉత్తమ కుల జాతులు రా
డుత్తము లూర్జస్వలాఢ్య-చరితులు గాకే
బిత్తరి లేడిం బట్టుట
సత్తువలే జీబుదొరక-సాధ్యము గాదే! 109

కం॥ భవదీయాహ్వాయ వర్ణము
లివి యని రా చెవుల పండు-విఁచుకసేయం
గవలయు, మీరావిధమున్
వివరింపక దాచుకొనవి-వేకమె సామీ! 110

కం॥ ధీరోదాత్తుఁడు గావున
భూరమణుఁడు వారినెల్ల-పొదపొదఁడని సు
స్మేరానన గంభీరా
కారమృగేంద్రార్భకంబు-కై వడి వేడ్కన్ 99

కం॥ చెలియొకతె లేడి కొదమను
వల కేలం బట్టి హర్మ్య-వర్త్మనియైనన్
దళుకొందు మొగులలో చం
చలగతి నతఁడసిత రత్న-సౌధంబెక్కన్ 100

ఉ॥ అంపు సువర్ణ రత్నని చ-యాన్విత పంజర కీర శారికా
బృందము శైవ కీర్తనలు-హృద్యముగాఁ బఠియింప బర్హిణుల్
మందర మధ్య తాళ లయ-మానములన్, నటియింప, రాజ సం
క్రందనుఁడప్పుతావహావి-కాసము దోపఁగ, నిల్చినంతటన్ 101

కం॥ ఎన్నిక భుజిష్యయనుమతిఁ
గ్రన్నన నొకచోటి జవని-కం దీర్చి మహా
భ్యున్నత మణి మయపాత్రిల
నన్నరపతి కొసఁగె,ఁబాద్య-మర్ఘ్యము భక్తిన్ 102

గీ॥ అంత నొక లేమ క్రిమిజపీ-తాంబరమున
రాకుమారుని పదపుష్క-రముల వేడ్క
నంటి తడియొత్తి కర్పూర-హారతిచ్చి
విడెము మధుపర్కమిడి, యుప- విష్టుఁ జేయ॥ 103

కం॥ ఒక చిత్ర పుత్రి గంధం
బొక పాంచాలిక మధురస-మొసఁగిన వేరిం
కొక యంత్ర కన్య నరపతి
నికటంబునఁ జూపుసుటటి- నెనరున వీవన్ 104

గీ॥ పెరుగుచుండిన వికచోటు-వేదయనుచు
కప్పు కలువలదండ చే-గట్టిముడిని
వెట్టినట్టులఁదోచెనీ-వెలది మిన్న
యొఱపు జారిన సోగ పె-న్నెఱులతీవి 93

కం॥ స్తనభారము చరమాంగజ
ఘనభారము రుచిరకుసుమ-కచభారము యౌ
వనభారము దాల్చుట నీ
వనిత చతుస్సాగరోర్వీ-వలయము నేలున్ 94

వ॥ అయ్యవసరంబున

కం॥ ఒరు దార నభిలషింపుట
దురితంబను నాదు బుద్ధి-దోషంబనకీ
తెరవ పయి చూడ్కి నిలుపుట
నోరు చెట్టం బట్టుకున్న-యువిదను తలపన్ 95

గీ॥ అఱుత వ్రేలు నిశాసూత్ర-మందురూపు
శ్రుతుల తాటంక హీన సం-గతమునరయ
నిదియు పాణౌ కృతింగాని-యది నిజంబు
కానిచో నాదు చూడ్కులు-గనునె యాస 96

కం॥ అని మదినెంచెడు నంతన్
గనకాంగి భుజిష్యయోర్తు-గ్రక్కున వారిం
గని, మీరు జింకగోను నా
తనితో, రా రమణి శెలవు-దయచేసె ననన్ 97

కం॥ భీతా వహ చిహ్నములా
నాతి య లాస్యములఁదోప-నయ భయములచే
నీతరి నేమూనో విధి
నీతికి నడ్డేది యనుచు-నేతం జూడన్ 98

గీ॥ లలక, ముఖ, ఘోణ, దృగ్దంత-మధుర చరమ
భాగ, కచ, మూరు, కుచ, నితం-బ, కటి, నాభి
మధ్యమూఁపులంఘ్రులు-మహిమ దనరె
రాజసుతగాన జాతివై-రంబులేక 88

గీ॥ సకల మనుధర్మశాస్త్ర ర-సాయనంబు
తర్క మీమాంస నీతి వి-ద్యారసంబు
సలువ చేరలనింపు చి-హ్నములు నాగ
ప్రతలమాలఁబోలె నీయింతి-శ్రవణ యుగము 89

కం॥ కాదనిన బరువు బూనవు
నాదిన్ బలపరపకున్న-నౌనే యనుచీ
పైదలికుచభరమూనగ
బీదంబడి నడుము కటిని-బెంచినదేమో ! 90

చ॥ గురుకచభారమోర్వక ది-గుల్వడి చెంతలనూగు కౌనుపై
గరుణ, నుగోజముల్నమము-గాఁ బెరుగన్, నడుమూగకుండను
స్థిరముగ నిల్చెఁ బద్మిని సు-శీలమునన్, దనరెన్ సువృత్తులెం
దొరులకు హానిగల్గదమ-రోపర నానుడు లేల కల్లయా 91

గీ॥ ఒక్క భారంబుపై బరు-వోర్వరిదియు
నొండు రెండును మఱి రెంటి-నోర్చి వాని
మూఁడుముడులను బిగియించి-మోయదొడఁగె
నెంచపంచాక్షరిని జపి-యించునేమో 92

సీ॥ అపరంజి పూతల-యద్దంబు సరివచ్చు
వీపున నిల్వగా-విసువుఁజెంది
తళుకుపావడి మీద-గులుకు గిండెమునంటు
పిఱుదుల నడుగిడ-వెగటునంది
పొరలూడు జిగియంటి-బోదెల కెనవచ్చుఁ
దొడలంట నించుక-త్రొక్కులాడి
చిగురాకు సొబగు మ-చ్చిక జేయు మణిమల
పొందుగావింప నిం-పొందకుండి

గీ॥ భ్రమణ మింతయులేని చ-క్రము నితంబ
మక్షియుగ్మంబునకు న-లక్ష్యంబు నడుము
కొసరి రావిడి పెరుగున-క్షోజములును
పలుచనైన శిరోధియుఁ-బడఁతికమరె 83

గీ॥ భవ్యసౌవర్ణ కేతకీ-నవ్యదళము
దీని చెక్కుల జిగినంత-జూనలేక
కంటకావృతపత్రమై-మింటనంటి
దేవపూజ కనర్హమై-దీవులంటె 84

కం॥ చిలుక యొకింతయు వ్రాలని
వలిపపుఁజిరు దొండపండు-వాతెర పుంస్కో-
కిల రుతములు పలుకులు నీ
చెలువకు చెలువమరు నెట్టి-చెలువలు సరియే 85

కం॥ కుందమ్ముల బృందమ్ముల
కుం, దమ్ములె యిందువదన-కుం, దశనమ్ముల్
కెందమ్ముల యందమ్ముల
కందమ్ములు సుందరాంగి-యడుగుందమ్ముల్ 86

ఉ॥ వాతెర తేనెలూరు పుల-వాయువుచే సతమంది పుష్పగం
ధాతిశయంబు గూడఁ, గొనె-నంగన ముక్కట రెండు వాచవుల్
బ్రీతిగ్రహింపనౌనని ద్వి-రేఫములయ్యెడఁజేరి, నాసికం
బాతత చంపకంబనుచు-నంట నిరీతికురుల్ సెలంగెడున్ 87

సీ॥ సాంద్రదశీ మూతంబు-చంద్రబింబమ్మును
చాంపేయముకుళంబు-షట్పదంబు
దాడిమబీజంబు-దర్పకకీరంబు
కదళికా దళము శి-ఖావళంబు
దంభోళిశాతంబు-ధారుణీధరమును
జక్రవాళంబును-సైకతంబు
పున్నాగవృత్తంబు-పురుషహార్యక్షంబు
దంతిశుండంబును-దామరసము

కవితా వినోద" బిరుదప్రదానంచేసి, ఘనంగా సత్కరించడం జరిగింది, అది గిర్దేవత కొక ప్రసన్నమంజులాభరణం.

1939 వసం॥ లో, కవితా విమర్శనాది సాహిత్య ప్రక్రియలలో సిద్ధహస్తులైన శ్రీ కొవ్విడి రామంగారు, 'అవ్వయ్యపైజరు' పత్రికలో యిందలి
పద్యాల ఉపోద్ఘాతంతో ప్రచురించి, దీని ఉనికికిప్రాధాన్యమిచ్చినారు.

పరమేశ్వర కృపాకటాక్షంచేత, పెద్దల ఆశీర్వాద బలంచేత, ఈనాటికైనా, ఈగ్రంధంపైకిరావడం నాకేగాక నాతండ్రిగారికి నా తాత గారికి పూర్వీకులకుకూడ బ్రహ్మకూ కటిముట్టినంత పరమానందం కలిగించింది దీనికి ఎన్నోప్రతులు వ్రాసి, తప్పొప్పులను పరిశీలించి, నేటికిని తోడ్పడుచున్న శ్రీభరద్వాజ తుమరాడ సత్యనారాయణగారికి నాధన్యవాదాలు. సాహిత్య ఎకాడమీసహాయం కలుగజేసి. నాకెంతో సాయంచేసిన, శ్రీ పురిపండా అప్పలస్వామిగారికి నేను ఋణపడి యున్నాను. వారికి నాకృతజ్ఞతలు, సుదీర్ఘమైన పీఠిక వ్రాసి, యీపుస్త కానికి వర్చస్సును, ప్రేయస్సును, జ్యోతిస్సును సమకూర్చిన. సంస్కృత కళాశాలాధ్యక్షులైన శ్రీమానా ప్రగడ శేషశాయిగారికి నా శతసహ స్రవందనము లర్పించుకొనుచున్నాను. ఆరంభంనుండి, నేటివరకు ఈ గ్రంధంమీద అభిమానంతో ఉండి, తన అమూల్యా కాంక్షనందించిన శ్రీ కొవ్విడి రామంగారికి నాహార్దికాంజలుల నర్పిస్తున్నాను ఇది వెలుగులోకి రావడానికి సర్వవిధ సహకారాలనిచ్చిన సాహిత్య ఎకాడమీ వారికి సర్వదా నేను కృతజ్ఞుడను. ఇందులోని దోషాలునావి. గుణాలు పాఠకులవి.

కం॥ ఇరులుదయాబ్జుని బైకొన
తరమించుకగామి, గుహలఁ-దపమొనరిచి త
ద్వారమున చెలికురులై ముఖ
హరిణాంకుని సతముగ్రమ్మి-నట్టుల నొప్పెన్ 77

గీ॥ వదన లావణ్య జలఝష-వర్ణితములు
వనిత కన్నులు శ్రుతికూప-వాంఛనలరి
నిక్కి దుమికెడు తీరున-నెగడుచుండె
నవ్యరుచు లెంతవారికి-సేవ్యములగు 78

మ॥ ముఖలావణ్య జలంబులున్ దనియు నీ-ముగ్ధాక్షి వైసారిణుల్
నిఖిలార్థామృత సారపూర శ్రుతులన్-నెయ్యంపుఁగూపంబులన్
సుఖముంబొందదలంచి డాయుగతులన్-జూపట్టెనూత్నాభిఖో
న్ముఖులై కల్గిన మాత్ర సంతసిలకుం-డన్ గాదె యెవ్వారలున్ 79

ఉ॥ మామక జాత కోకనద-మానొకయింతయు హ్రీనొనర్చెనీ
భామపదంబులంచు దలఁ-బైకొని వారి పృషంతి కాకృతిన్
వేమరు తత్పదాబ్జముల-వేడినయట్టులఁగానుపించె నీ
కోమలి శుభ్రకాంతియుత-కోరక సంగతిగా, నఖంబులున్ 80

గీ॥ కాయరుహ పూజ్యమ-కూ్కట కళ విశదము
మేలిసల పందనంబులు-మెఱుగు లీను
భర్మశాలిశ గర్భముల్-పంచశరుని
కాహాళులు దీని ప్రసృతయు-గ్మంబు దలప 81

కం॥ ఈక్షింప దుర్లభంబై
యక్షీణ తటిత్స్వరూప-మై ప్రేముడులన్
శిక్షించు సీతలో దరి
నిక్షిప్తోరువులు కాంతి-నిచయము తలపన్ 82

ఉ॥ మేలికడాని దీని నను-మేని జగాజిగి-రాఁదలంచి బల్
చీలికలయ్యె సత్పుటము-చెంది మరుత్ప్రభవాప్తిఁగోరి పె
న్గీలల మధ్య తప్తమయి-నీరొక యింతయునింత యయ్యెఁగం
సాలికయిన్ విరూపుఁగొని-సారము తగ్గి కృశించె నెంచగన్ 72

కం॥ మానిని మైజిగి బోలం
గానెంచి తటిత్తు నీల-ఘన మధ్యమునం
దానక్కి నిక్కి సలిఁగన
గా, నేరక రూపుచెడుచు-ఖంబై పోయెన్ 73

సీ॥ పసుపు చాయల దేరు-మిసిమిగూ నెమ్మోము
నిండు చందురు బోల్ప-నిరుప మంబు
రవనూనె మెఱుగు న-రాళకుంతలములు
శైవాలముల బోల్ప-సందియంబు
చూడఁజూడఁగనాస-జూపట్టు నును మేను
మెఱుపును బోల్ప న-మేయతరము
కలదు లేదను బుద్ధి-గలిగించు నవలగ్న
మణువుతోఁదుల యను-టబ్బురంబు

గీ॥ పన్నిదం బిడీ చెంతలఁ-బలిసి నడుమ
కలయునట్టుల బెరుగు చ-న్గవను చక్ర
వాకము లటంచు పల్కుట-పాటిగామి
దీనికెనవచ్చు నిదిమెఱ-గాన నసుచు 74

ఉ॥ మేలికడాని డాల్గొనబు-మించులఁజుల్కనఁజేసి, నిచ్చలున్
గ్రాలు హిరంగు మేని జిగిఁ-గన్గొన జూపులు సుల్లునొందె, నీ
బాలిక సుప్రతీకరుచి-వార్షిక దిష్ట తటిత్తు గానిచో
నేల మదావలోకనము-లింత భ్రమించును నప్పటప్పటన్ 75

కం॥ మనుజులు తపము లొనర్చియు
ననిమిషపద విగ్రహింప-నతిదుర్లభ మీ
ననఁబోడినిఁ గనినంతనె
యనిమిషపద విగ్రహింప-నయ్యెన్నాకున్ 76

కం॥ వారెల్లరు భయ విహ్వలు
లై, రోజుచు నచ్చటచట-నడుగుచు నొండొం
డారాజ వదన సన్నిధిఁ
జేరంగా నరుగురీతిఁ-జేడియలుండన్ 68

కం॥ అదియేమని రాజేంద్రుఁడు
వదనముపై కెగిచి చూడ-వారిద పదమం
దుదిరికడానిన్మించుల
బొదివిన జిగిగల్గు మోము-పొలతుకఁగాంచెన్ 69

సీ॥ స్వర్ణరంభా తరు-పర్ణస్థబర్హినా
పీపునఁగ్రొమ్ముడి-వేలుదాని
రహి యమునా నదీ-లహరుల శోభనా
రమణీయదీర్ఘ కే-శముల దాని
ఇందీవరచ్ఛదా-నందంబుతో ననా
కాటుక కన్నుల-నీటుదాని
శుచిపక్ష మధ్యమ-శుభ్రాంశు చిహ్నానా
మృగనాభి తిలకంబు-మేలుదాని.

గీ॥ చందనాగురు కర్పూర-సరళచూర్ణ
లిప్త గండకవాసనా-లీఢ మలయ
పవను నెల్లెడ వెదఁజల్లు-ప్రౌఢిదాని
కని విననిదాని నొకకన్యఁ-గాంచితేఁడు 70

కం॥ కిసలయు నవమంజుల మిా
యసితాలక మేని సొబగు-నందెదనంచున్
బసరొంది ముదిసి పండుచు
ద్రదసరేణువు సాటి రాక-తపియింపనగున్ 71

కం॥ తరుణీ మగు పోతు టీగయు
జరగల మస్కరులు కేని-చరియింపంగా
సరిపడదీయెడఁగావున
పురుషవరా! మీరలిచట-పొదరుట తగునే? 62

గీ॥ కాననీయెడ మెలఁగుట-కాంత దెలియఁ
జిక్కగల్గున దేరీతి-చెనకనగును?
తారు శౌర్యాఢ్య విక్రమ-ధైర్యవంతు
లక్కటా! వేగదయచేయుఁ-డనుట తగదు 63

శా॥ తావక సుందరాననము-దర్శనమించుక నొందుకూర్మిమే
మే, వగ, బాయ చిత్తము స-హింపదు మిమ్మెడఁబాసి యియ్యెడన్
బోవుఁడటంచు బల్కుటకు-బుద్ధియొడంబడ దాకుమారి సు
గ్రీవ మహోగ్ర శాసని స-ఖీ పరిచారిక మిట్టిదే కదా! 64

శా॥ ఏ దిక్కాంత భవద్యశోంబరము సం-తృప్తింగటించాల్చె నిం
కేదీవుల్ భవదీయ దోర్యుగమణీ-హేమాంగద వ్రాతమా
ఏ దివ్యద్భవనాళి యుష్మదురు, మా-హేలా విలాసంబు నా
నేదీనావళి నీ కటాక్షముల నెం-తే శ్రీదుటా పూరుషా 65

ఉ॥ ఎయ్యెడకేగు వారలిట-కేటికి వచ్చితి రార్య! శ్రీ వసం
బియ్యెడ నేలసొచ్చిరి? వ-నేందిరఁబోలు కురంగతర్ణకం
బియ్యెల నాగప్రోదిగల-దిచ్చట దీనిని బట్ట మేరగా
దయ్య! యిదేటి సాహస మ-హా! పరభూముల సత్వమొప్పునే 66

కం॥ అని బలుకు నంతలో నొక
వనజాక్షి యలీకభీత వదనముతోఁజ
య్యన నృపకన్యా సౌధం
బున మెలగెడు జాడదోఁచెఁ-బోడగనుఁడనినన్ 67

ఉ॥ వీనికులంబు గోత్రమును-వీర్యము సంపదలేలు భూములుం
దానముపామముం దెలిసి-తామరసాక్షికి విన్నవింతు మం
చానతబొండ్లు బూమియల-నచ్చోటికిం జనివేడ్కనాతనిం
భూనుత విక్రముండయిన-పూరుషుఁడంచు దలంచి వారలున్ 56

కం॥ మణిఖచిత మకుట మస్తక
మణిమాద్యైశ్వర్య సిద్ధి-యఖిలాంగ మహా,
గణనా తీతంబును గని
ప్రణుతారి నృపాలుఁడంచు-భక్తిని మ్రొక్కన్ 57

ఉ॥ ఓ మహితాగ్రగణ్య కరు-ణోదధి పూర్ణశశాంక! పూరుష
గ్రామణి చిత్తగింపుము ధ-రారమణుండు మహూరు పట్టణ
స్వామి నృపాగ్రజుండు "నర-సావజి" యాతని పుత్రి సోయరా
రామకు, హాళితోటయిది-రాదగదెన్నడు పూరుషాళికిన్ 58

శా॥ ఆ నారీతిలకంబొకా నొకయనే-హంబందు వాహ్యాళికిన్
దీనారస్థగితాబ్జరాగమణి స-ద్దీప్తైక పల్యంకికన్
దానారోహణమైన కంచుకులు చెం-తన్, భార్యసుల్ గొల్వగా
ధ్యానాసక్త భవానియై యుచటకం-తర్థాప్తినే తెంచెడున్ 59

కం॥ ఒరుల కొకించుక తెలియమి
తరుణీమణి వచ్చుఁగాన-తత్కాలమునన్
బురుషులు కడునిటు మెలగిన
కరుణింపనిదాట దప్పు-గలిగెఁదమయెడన్ 60

కం॥ పులివాతి లేడి నినువును
చలమున విడిపించి ప్రేమ-సాకుచునుంటన్
వలపెక్కుడు గల వీనిని
బలయుతులై బట్టి కొనుటఁ-బాడియె మీకున్ 61

ఉ॥ వీనులనంటు దీర్ఘమును-విస్తృత పక్ష్మములైన చూపుల
మానిని కాది నొప్పటను-మానవ నాథుని సుప్రతీకముల్
దాన తిరాగమొంది కను-సమ్ముల నెక్కు డొనర్చి చూడగా
తానములేని చింతనల-ధారణ యోగి విధానఁజూచెడున్

కం॥ ఆ రాజేంద్ర కుమారుని
తారుణ్యం బాననాబ్జ-దళ కేసర బా
ధారాళ వాగురిం బడి
సారసదళనేత్ర దృష్టి-జడమది యయ్యెన్

మ॥ సకలాంగంబుల మంజులంబను లస-త్సంతాన సూనాసవం
బకలంకాభికలైన భూమిని దృగా-పాంగాళి దాగ్రోలి యు
త్సుకతన్ వ్యత్యయనూచు మైమరచి వి-ద్యుద్వల్లికా లోకన
ప్రకటాత్ముల్వలె చిమ్మచీకటు లవి-భ్రాంతిన్ గతుల్దప్పెడిన్

కం॥ మనమునఁదనివిందీరమి
జనపతినెమ్మని మించు-ఛాయల నొకటన్
గనుగొని కాంతాలోకము
ఇనుమడి ముమ్మడిని జూచి-తృప్తిం గొనకన్

కం॥ ప్రేమయను తీక్ష్ణరజ్జువ
వేమరుఁ దెగఁగోయ నింత-వృత్తము గామిన్
గామిని విసువుం జెందియుఁ
దామసమున నవలిమోము-దానిడుసంతన్

కం॥ ఆ రామ చెలిమికత్తెలు
నారీతులపాంగములను-నలతింగని తా
మీ రాజవదన డెందం
బీ రాజకుమారు చెలిమి-నిమిడెంగానన్

కం॥ అని పలుకు బోటులంగని
తన ప్రేమము మాటి రాజ-తనయ కురంగం
బన బొందెఁ జూడుడని వా
రిని ప్రేరేపించి దాగు-రిం దిలకింపన్ 46

మేనిమెఱుంగు నిగ్గు తొలి-మించును మించ దృగం చలంబులన్
గానగలేక విభ్రమము-గైకొని ఱెప్పలన ప్పళించుచున్
మానవనాథ శీర్షమణి-మండనమైనయి రమ్యదాంబుధిన్
జానునితంబ కంఠదశ-నచ్ఛదముల్ దగముంచి తేల్చుచున్ 47

●॥ సుడివడిన వాలు మీలన
పడతుక తొలి చూపులధిపు-పాదాధోర్విన్
బడి వడి ముఖలావణ్యపు
జడధింగల వాలుమీల-సరసమెలంగెన్ 48

సీ॥ ఒకమారు నవరత్న నికర కోటీరాగ్ర
మహనీయ చిత్రిత-మహిమగాంచు
నొకమారు పూర్ణేందు-నకలంకు గావించు
లావణ్య వదనవి-లాసమెంచు
నొకమారు జలధి రుద్ధోర్వీ మహా భార
ధుర్యదోర్యుగ్భూషణ-ద్యుతుల మెలఁగు
నొకమారు నిఖిల రాష్ట్రోర్వీశు విజయాంక
మణితులా కోటుల-గణన సేయు

.॥ నకట సకలాంగకముల నూ-త్నాభికమున
త్వరితఁగతిఁగాంచి వక్త్ర సు-ధారసాబ్ధి
మగ్నమై తేలియాడుచు-నుగువచూపు
లొక్క యెడనైన విశ్రాంతి-నొందదయ్యె 49

కం॥ హరినీలరుచులగార్కొను
వరమేచక క్రిమిజ తంతు-పటలమురీతిన్
తరుణము పొడమిన యాతని
కరుణా ననమందుఁదోచె-గడ్డము మీసల్ 42

కం॥ వలమురివలె నీతని మెడ
వళిత్రయము గల్గి వారి-వాహార్భటులన్
దులకించు భావలలవడె
వెలయుం గద సామ్యమైన-విశ్రుత గుణముల్ 43

ఉ॥ ఈ మహనీయ రూపము మ-హేశ్వరి నెక్కువ కుంకుమంబునన్
క్షేముడిఁబూజఁజేసి, తద-భీష్ట రజంబు సురేఖ రీతిగా
మోమునఁదీర్చినాఁడ నెడు-పోలిక గన్పడె శోణరేఖ శో
భామహిమంబుచేఁదనరి-పార్థివచిహ్నాల లాటసీమపై 44

సీ॥ కాముని పట్టంపు-టాముటేనుగ తేవ
డీకొను మేని పో-శీమము తోడ
గట్లరాయని పట్టి-కత్తులాని చోకాట
మాకళించెడీ చూపు-డాక తోడ
గుండుల చిట్టుపల్-చెండు జే జేరేని
సిరుల మించిన జాతి-చెలువ తోడ
కడలిచేఁజుట్టిన పుడమి మేల్-గురు తన
కుడి కేల దాల్చిన-నాడిమ తోడ

గీ॥ దెసలు నిండిన తనతగు-నసము తోడ
చలువ గిండెంబు వలివాటు-జాను తోడ
వెలుగు నిఁడేలు పజలెల్ల-వేల్పుప్రోడ
లనగదగి యుండెనని వార-లాఘు తోడ 45

సంకుపలెనొప్పు కుత్తుక- సొరువాని
జానుగులసంటు మూపుల-జానువాని
పొలుపుగలజంక నొకకేల-బొలుచువాని
నొక్క-రాపట్టఁగని వార-లౌ అపు తోడ 38

వీని విలాస దివ్యఘని-వెల్వడువాలుగు మీలు కన్నులౌ
వీనియురః కవాటమున-వ్రేయు మహార్గళముల్ ప్రవేష్టముల్
వీని సకుండలై కమణి-వేల్లిత వీర్యతరాంసయుగ్మమె
వ్వానికిలేమి నీతఁడని-వార్యపరాక్రమ భూభుజుండగున్ 39

కరుణా రసాపాంగ-ఖంజరీటంబులు
శష్కులీ నిభమైన-శ్రవణ యుగము
పరిమళ వాసనా-స్పద దీర్ఘ ఘోణంబు
పంచరేఖాయుత-ఫాలతలము
అష్టదిగ్జయ రమా-హర్మ్య వరోరంబు
శ్రవణ బాంధవ్య మం-సద్వయంబు
దస్యుమారణకాల-దండాభదోర్దండ
మవలగ్న మభియాతి హారణకంబు

దారుణాస్కందనాత్యయ-దస్యువితతి
కడ్డుపాటింతలేక ది-వ్యాలయమున
కరుగ నీలాల నిచ్చెన-యనెడి హేతి
వరలుటను నీతఁడొక రాజ-వస్యుఁడౌను 40

తలిరుం దేనియ గొనబుం
దలపించెడు సొబగు మేని-తపనీయరుచుల్
దిలకించిన చతురబ్ధుల
నిలయేలు తుపాసిగాగ-నెన్నందగియెన్ 41

కం॥ అని కొనియాడెడు నెడ న
వ్వనమునలో, మెలగువారు-పైఁగలవారిన్
గనుఁగొన పైవారికి లో
జనములు గనుపడని భిత్తి-చక్కఁగనొప్పెన్

కం॥ వెలిమెలఁగు వారు లోపలఁ
గలవారికిఁ దెల్లముగను-గనుపడ లోనం
గలవారలు వెలివారికిఁ
దిలకింపన్ వీలుగాని-తెఱఁగున నొప్పెన్

గీ॥ రాయుఁడాకీలు దెలియఁగా-రాకనచట
నొరలునెడ లేడి యాగోడ-నుఱుకుచున్న
నెరిగి సందిటఁబట్టిన-కరము బెగిలి
బేఱుమని యార్వఁగా నది,-వారెరింగి

కం॥ మనప్రోది నున్న జింకను
గొనకొనియెవ్వారొ తరిమి-కొనునట్లుండెన్
గని యెదమని తద్భిత్తిం
ఘనవేదిక నిలిచి వెలికిఁ-గనుగొన నెదుటన్

కం॥ తొలుకారు మెఱపు లొక్కెడ
నిలిచినకైవడిని మేని-నెరి, జిగి కన్నుల్
దిలకింప జిగ్గుమన న
క్కెలన దగు రూపువారి-కింగను పడగాన్

సీ॥ ఉదిరి కడానిడా-ల్పొదుపు గ్రొమ్మించు నా
నెమ్మొమ్ము జిగిసొరు-నెఱపు వాని
నతరెండు తెగరాల-నతికిని వారుమంజి
కుళ్లాయి తలమీద-గులుకు వాని
కడియాము పేనుగు-కై బోలి నిడుదలై
చిరుదొడలంటు కే-ల్చెలువు వాని
జిగిమించు నెమ్మించు-బిగినించి దలపించు
వలపించు నెమ్మేని-పసల వాని

విజయనగర సంస్కృత కళాశాలాధ్యక్షులైన శ్రీమానాప్రగడ శేష శాయి మహాభాగులకీ సర్వోదంతాన్ని పూస గుచ్చినట్లు ట్టంకించి గ్రంధాన్ని వారి కరకమలమునందుంచినాను. వారు దీనిలోని సాహిత్య వైభవాన్ని, కవితాసామ్రాజ్య పట్టభద్రత్వాన్ని తిలకించి, పులకించినారు "ఇది ముద్రణ పొందే ఉపాయాన్ని చూడండి. కావలసినంత భూవసతి ఉన్నవారుకదా! చెక్కో, ముక్కో, అమ్మి అయినా సరే, ముద్రించండి సారస్వత సంపదని అందరికి అందించండి, కావలిస్తే నేనేదీనికి పీఠిక వ్రాస్తా, నని యెంతో ప్రోత్సాహ పూరితంగా మాటాడినారు.

కాలాంతరంలో నేను విశాఖపట్టణం వెళ్లినాను కాకతాళీయంగా సాహిత్య ఎకాడమీ మెంబర్లైన శ్రీపురిపండా అప్పలస్వామిగారిని కలిసి, యీ గ్రంధం తాలూకు సర్వవిషయాలని మనవిచేసి, వారి సహాయం అభ్యర్థిస్తే, వారుసంతోషించి సాహిత్య ఎకాడమీ వారిసాయం నాకు వచ్చేలాగ ఏర్పాటుచేసినారు. వారి చలువవల్ల నేటికైనా మాతండ్రిగారి చిరవాంఛితం ఈడేరుతున్నందులకు నాకు పరమానందంగా ఉన్నది.

శివాజీచరిత్ర సామాన్య కావ్యంగాదు. మహాకావ్యం ఇందులో నన్నయ తిక్కన యెఱ్ఱనార్యుల కవితాగుణాలు, శ్రీనాధుని కవితా శిల్పవైభవం పోతనా మాత్యులవార శబ్దార్ధాంత్యాను ప్రాసాది లోకోత్తర భక్తిభావనా గుణవిన్యాసం, మను చరిత్రలోని సరససంభాషణ చాతుర్యం వసు చరిత్రలోని నానావిధ మాధుర్యశైలీ, శ్లేష, యమకార్థా లంకార శోభావైవిధ్యం నాన్యతస్సాధ్యాలైన అచ్చతెనుగు పలుకుబళ్ల పొబగుల జాడలు, ఉత్తర రామాయణ, భాస్కర రామాయణాది గ్రంధజాలాల్లో నిక్షిప్తాలైన ఝరీవేగ సదృశ కవిత్వరహస్యాలు, అష్టాదశ వర్ణనలు, శబ్దార్థశిల్ప విన్యాసకళలుకోకొల్లలుగా వెదజల్లబడి ఉన్నా యని కవితా ప్రియంభావుకులైన పెద్దల నిష్కర్షాభిప్రాయం

విజయనగరంలో శ్రీమానాన్నగారి చిన్నతనంనాటికే విద్వత్సం స్థగా విపులఖ్యాతి గడించిన భారతీ తీర్థ అముద్రిత శివాజీ చరిత్రచూచి, యొక సభగావించగా, విపశ్చిద్వరు లెల్లరూ, ఆసభలో మానాన్నగారికి

కం॥ కర శీకర చయముల పు
ష్కరమున దంభోధు గణము-గల్పించెడు కుం
జర రాజా రూఢుండై
పరమోత్కంఠమున నగరి-ద్వారముఁ జేరెన్. 153

సీ॥ ఎదురుగా వచ్చిన-హిత మహీశ్వర కోటు
లర్పించు జోహారు-లంది కొనక
వంది మాగధ భట-బృందముల్ బఠియించు
స్తుతి పాఠములొకింత-శ్రుతులనిడక
ఫలపుష్ప సౌగంధ్య-పల్లవంబులు వట్టి
యాశ్రితు లొసఁగ నిం-తైన గొనక
తపనీయ పాత్రిల-తలిరు బోడులు పట్టు
కర్పూర హారతుల్-కాంక్ష గొనక

గీ॥ వివిధ కక్ష్యాంత రంబులు-వేగ గడచు
చేను గను డిగ్గి వడి వడి-నేగు దెంచి
దెసలఁ జూడక తలవంచి-విసుగు కొనుచు
నంచ తూలంపు తలిమంబు-నధివసించి॥ 154

చ॥ పలచని వల్వఁ గప్పికొని-పాదములం దలిరాకు దిండుపై
నిలిపి వియత్తలంబునక-నీని కలూని నృపాల పుత్రిహా
వలపుల మూట జవ్వనపు-వారికి బట్టగు నూట మవ్వపుం
జెలిమికి మేటి కోట నిను-జెందని పోటరి దేట మాటనున్ 155

ఉ॥ ఇంచుక సద్దు గల్గునపు-డెల్ల వయస్యల బొంచి క్రేవలం
గాంచి యొకింత నేరుపునఁ-గాటుక కన్ను బెడంగు తుళ్కలన్
గాంచనగాత్రి మన్మనను నె-గా దిగ గాంచు విలాస మెంచగా
గంచకునాటి నట్టివరి-కై వడి జెందము తూఁకు లొందెడున్ 156

చ॥ మృగ మద చందనాగురుల-మేలిమి తావులు గుప్పు గుప్పునన్
బాగలెగ యంగఁగంచుకము-పొంపిరి వీడిన నత్తలో దరిన్
దగ బిగియార కౌగిటను-బట్టెడు భాగ్యము మమ్ముఁజెందెనం
చెగుపుఁజెలంగు డెందము స-హింపను కాల విడంబునంబునన్ 157

ఉ॥ తేనియసోనలం జిలుకు-దీయనివా తెఱసీత్కృతంబులెం
తేనియు, సోదు ముట్టికొన- హెచ్చుగ బీల్చెడు భాగ్య రేఖలన్
న్నానుదుటన్ లిఖించె విధి-నాది నటంచుఁ దలంచు హేతువ
మ్మానిని జేడెలన్ మొరగి-మాటలు సన్నలఁ బల్కుచుండుటన్ 158

ఉ॥ మాటికి మాటికిన్ జెలుల- మాటున సన్నని జాల కంబులన్
సూటిగ నన్నుఁ జూచి యొక-జోటిని బిట్టుగఁ గౌగిలించి స
య్యాటల జాడ పయ్యెదనొ-య్యారముగా సవరించి క్రొవ్వెదన్
నీటుగ దిద్దు సోకడలు-నెమ్మదిఁ బ్రేమఁ దలిర్చుటల్ గదా! 159

సీ॥ మోహాంధ కారంబు-ముజ్జగంబుల ముంపు
చొప్పుగాఁ గ్రొమ్ముడి-విప్పి యూర్చి
తియ్యని పాటెల- తేనియసోనలు
జిలుకఁగాఁ, జిలుకకుఁ, బలుకు లిచ్చి
క్రొక్కారు మెఱుగులు-పిక్కటిల్లగ మేని
తళుకులు తెర చీర-తొలఁగ నడచి
బలు వాలుగుల నేల-గల కన్ను గొనడాలు
చూపరుల్ జూప్పు వి హాపొనర్చి

గీ॥ నాము నెమ్మేను తరగలు-నాము చికిలి
చూపులును నాము గలుగగాఁ-జూచు చూపు
పోయగం బింత నా మదిఁ- బాయకున్న
దకట! గాఢోట్టి వలరాయ- నాముజోటి. 160

కం॥ వాలిక తీరుల నుదురుల
గీలింపగ తోకలుబ్బి-గేరుచు వెనుకన్
గేలుగల మెకము చాలిల
వ్రాలంగా నేయు కలన- వడి వాండ్రో కటన్. 259

సీ॥ చేరువలం జలఁ-జెలరేగు నెఱిదుమ్ము
నీరు మోపరి చాలు- తీరుగాఁగ
గడుపరి కార్బారు- లడిదముల్ జిగి మబ్బు
నురుకు కార్మించుల- తెరఁగుఁదోప
దిట్టల చేమరుపుల్ -దీర్చు సీవరు లీద
గాటంపు వలినాలి- గాలిగాఁగ
దేరుల గుడుసుల- తీండ్రము ల్కదుపుల
గొలగొలలు రుముల-గోలగాఁగ

తే॥ యెక్కుడు మెకాలనెత్తియు- చెక్కలందు
రాలు పాణులు నీరుక- ల్వాలుగాఁగ
పౌజు మైజారు నల్లలు-వానగాఁగ
కలన తొలకరివలెనప్డు- గాన నయ్యె. 260

కం॥ అయ్యెడ ఱేని దణాపెను
జియ్యలు మోరో ప్రతాప సింగున్ హంబీ
రయ్యయు, శాంతాజియు నుం
గయ్యంబున నుదుటు జూప-ఖాన్దొరలొ కటన్ 261

శా॥ మోరో మంత్రిన మీరు ఖానుఁడుదుటౌ-మూడమ్ములన్ గుండియల్
దూఁగంజేసి పదారు సిల్గులను టో-డ్రో నెన్క్షు సల్కొటు చో
నీరారల్గులు మేన గ్రుచ్చి పది రెం-డింటన్గళా సంబునుం
జీరన్ సుర్కిక్కయతండు వాని మెయినిం-చెన్ నూరు వాలమ్ములన్.

గీ॥ బడియలను మోదఁ దుమురులై - పంటవలతి
నల్లకొలకులు బారగా - నాల్గు తెగలు
చేరుప్రుల బారులరి మురి - బోరొనర్చి
రేపు తీపుల జంకు గొం-కింత లేక॥ 254

మ॥ గొనముల్ జానుగులంటగా దిగుచు చె-గ్గుల్బబ్బిలు చుడ్డమ్ములా
క్కని కాల్గెలును గొంతుకొక్కపరి జక్కం(దెంప కీలూడు బొ
మ్మనుపోలెన్ వెరగొప్ప నొక్కడను సో-మ్మంజేయు సింగంపుబొ
బ్బను నొక్కొక్కెడ నిష్టు లెక్కటులు డ-బ్బాటొప్ప మూయించుచున్.

కం॥ మునువడు కలుగుల నలుగులు
జొనియింపుచు వత్త్రలముల-సూటిగ నందున్.
దనియించు చినుప బడియల
వెనువెంటనె నచొట్టు తూర-వెర వరులేయున్ 256

చ॥ ఇరుగడ దిట్టలుం గవియు-చేడ్డెర నొక్కట(తొకండు మీరు-చో
సరములు జిల్కుచోఁ గడవ-సంబులు జెక్కుచు కీల్లు (దెంపుచున్
దురికియలేనుఁగుల్గణిలు- దూరుపు లెత్తగనేయు చెక్కడా
నరదము లెల్లెలున్ సిడము-లారడి నూకుచు పోరిరొక్కటన్. 257

సీ॥ అరదంబు లరిగిన-బరువుల తడవుల
నిడుపడు దొర యట్టు-లడుగు లంట
రెండు (తొవుడు లాము-కుండల కలయంపి
నింపినట్టుల నేల- రొంపిగాఁగ
నడ గండ్ల గొరిజల-నలి దుమ్ము తోడనెవ్వ
బండీడు గూడియల్-నిండఁగప్ప
ఎక్కట్ల బొబ్బల- చక్కెరుచక్కట్టు
లుక్కిరి బిక్కిరి- (క్రిక్కి(వీల

గీ॥ యడ్డ తెగి కూటువలు దాకు- చోడ్డు మిగిలి
జడ్డి బడియల రోకండ్లు-(దుడ్డులలుగు
లడ్డ కత్తుల నరిమురి- సడ్డదప్ప
చెడ్డలను జింప నెత్రువ- ట్రొడ్డి బాఱ 258

కం॥ కాని మైమ్మనన్మించె నె
యీని ముసము నందేపి ని-యేపణగింతున్
నానుదువు దప్పనే బెను
కానం డాగినను వెగటు- కడలింబడినన్. 249

కం॥ అను చతఁడొయ్యన కలనికి
జను దేరఁగ నాన తిచ్చి- చయ్యనఁదానున్
విను నంటు గూబసిడ మె
త్రినయొక తీర్కెకి వెడలెఁ- దేకువ మీరన్ 250

కం॥ మిన్నున గడిదప్పు బూమియ
మన్నన్నెలకొలిపెతుటు ము-మట్టడి దుమ్మ్రున్
వెన్నుని తలిమని తలలుస
గ్రన్ననతో కంటునట్లు- కాల్వురు నడిచెన్ 251

కం॥ ఇవ్వడుపునఁజని యవనులు
చివ్వకు గడీగినను రాచ-చేవ దళాలున్
గివ్వన కేరుచుఁ బురికొని
కవ్వపు మల సంద్రమట్లు-గాఁ బెనగంగన్ 252

కం॥ ఉడ్డు తెగ చేరువలు దా
జడ్డిగములు మీరి తూపు-జడుల నలంపన్
సడ్డగొన కరిమురింబస
నొడ్డులు దీరిచి కడంగు-చురికి పెనంగన్ 253

సీ॥ అరచందమామ మే-లమ్ములు పరపిన
నేలపై బడునడి-యాలములును
నత్తలంబుల గ్రుమ్మ- నెత్తురు వఱ్ఱుల
మేనులు ముని గెడు-నేనుగులును
అడిదంపు వాతుల- యమ్మ్రులి జిమ్మిన
పుడమిపైఁబడి దొర్లు-నడగడులును
తూపుల పరపిన- తూలి నల్దెసలకు
పంచబంగాళమా-పౌజుగములు.

మ॥ కడలున్వ్రీలఁగ మిన్ను మన్నదర జు-క్కల్దూల ప్రాబల్యమే
లోడయుంగ్రుడ్డు పనంట్లు చీటలిడి మూ-యూరుల్ దణాసూడుది
ప్పడరన్ సంద్రము లేడు కెల్కావడ నీ-రార్మ్ని దిట్టాఁగ న
వ్వడకుం గుబ్బలి కల్లులూడి పడు శే-వన్ రాయుఁడే తెంచినన్ 243

కం॥ నాలుగు తెరగల తుఁటుముల
కాళులు మట్టాడు దుమ్ము-గడలున్మిన్నన్
నేలయు నిండఁగ చీకటి
జాలు కొనన్ దారు పెరలు-సన్నం గనమిన్. 244

కం॥ అదిగని యావను లబ్బుర
మొదవఁగ పత్తే తుపాసి. కొంజలి తెలుపన్
గొదగొని యాతఁడు వేగరు
నిది యేమిటి వింత తెలిసి- యే తెమ్మన్నన్. 245

కం॥ పడవాడ దియుం గనుగొను
చొడయాయీ దుగ్గిలెంకి-నోరెము తిండీ
డెడరున శివరాజు పరా
నిడ వేడిన వానిరాక- యేద్దెర నిది యా॥ 246

కం॥ అని పలుకు పీను లంబడ
గొనమెట్టిన చుట్టు ఫురువు గుదియనెదుటఁ జా
పిన రెండు త్రావుషుంబలె
గి నియుచుః దలయూచి, నవ్వి- కేరి యతండున్ 247

ఉ॥ పప్పులు నేతులుం జెఱుకు-పానకముల్ దనియంగ మెక్కుచున్
గప్పలు వొల్కరింబలె బె-కా బెక గూయుచు దేవళంబునన్
జొప్పడు వాటి దొంగిలి బొ-జుంగు నెలంతల కిచ్చుబత్తులన్
దప్పని కొల్లవెట్టుమము-దార్కొన నొప్పనె నాతుపాసికిన్ 248

కం॥ అత్తఱి సత్త్రిం గొలువగ
క్రొత్తగ నేతెంచు దాది- గుబ్బెత లోకటన్
దత్తర మొందం గనుచు
వ్రొత్తున వారలను పుట్ట-పింటను నిడుచో॥ 238

కం॥ లోగీము చొరవ దుగ్గికి
బాగాలుంజో తలిఁడు చు-బాము దొలంగన్
వేగతుల వేఢు పరునపు
జోగి జడల్ మెకము పొడను-జూడన్ జూడన్ 239

సీ॥ చిగురాకు చెలువంబు- దెగడు కెంజెడ తల
నెట్టెంబు తీరుగాఁ- జుట్టువాని
కసవు దిండి మెకంబు- కడవసంబునఁ జుట్టు
పులు త్రాడు వలమూపు-బొరలు వాని
మూతెగ తీవెల-ముప్పిడి యొడిమలు
నిరుగేల దండల-నెనయు వాని
కటికి జేవురు నిడు-కమరు జంటజ్జును
హజ్జలనంటి వేరి-లాడు వాని

గీ॥ పటిక కన్సాన బొరకై- బట్టువాని
నొక్క మోమున్నరుది రక్క-యొడిమ వాని
తమ్మి మటమిడి ముక్కు కద్దోయు వాని
నూపరెగ వెట్టు చరకంట- జూపు వాని॥ 240

గీ॥ ఒక్క పాయంపు జడదాలు-పోజబంతి
నెదుట గను చొర యీ జోగి-యీడలంతి
వేసమది పెద్ద గావున-వీని నరయ
వలయునని చుట్టు వారుచు- వారలెల్ల 241

గీ॥ సత్త్రి క్రిందను రతనాలు- చాలగలుగు
గాన నీబొమ్మ నగలించి- కైవసంపు
రొక్క మంటెద మని వార-లుక్కు మీరి
త్రవ్వుమని కోడెత పసిన-దల్చునంత॥ 242

గీ|| జావుకలి తీపకావురే-జలిది జల్ది
ఘాసులారే! యరే! గాండు-గద్దగద్ద
ఘాము దోనేకు తుంపాని-బంది బంది
యనుచు గుడినున్న వారిని-యవలకీడ్చి|| 233

ఉ|| గోడలనెక్కి నిల్వబడి గోపుర చిత్రములందు మూర్త్రముల్
జాడలగట్టి యర్చకుల-జత్రు తలంబుల జారబోయుచున్
బోడి బడే వడోరియని-బొమ్మను బొట్టుల నట్టెనాకుచున్
మాడుగులందు డాగుకొను-మానినులన్ బలు బాము లెట్టుచున్ 234

కం|| జాతర మొక్కులిడంగా
నేతెంచిన పజలమ్రల్లి-నెల్లంగొని భే
భూతూజావ్ జల్దియని
యాతనల న్వెట్టి మఱియు-యవనులు తఱుచై 235

కం|| బలువుగల యాల పడ్డల
వలిమల తోలిపట్టి గీము-వాకిట పలలం
బొలియించు చాము నీరుం
దలమును కలుగాను ద్రావి-తలకించె పజన్. 236

గీ|| ఉజ్జయినీ నాథుం-డొసంగిన మణి తాళి
భోజరాజిచ్చిన-బొమిడి కంబు
యోరుగల్లు మహీశు డొసంగు మేఖల కాంచి
బుక్కరాయల మణి- ముద్రికలును
ఢిల్లీశ్వరుండి చ్చు-దివ్యతులా కోటి
డెంకణేశుని రత్న- కంకణములు
కృష్ణరాయ నృపేంద్రు- కీల్కడి యంబులు
రామరాయల మహా-హేమ చేల

తే|| మఱియు నెన్నిక విలువగు-మణి పతకము
లంబికా వాసమునం జొచ్చి-యవన తుఱుము
కొల్లవెట్టి సిమోజ్యుల-నెల్ల దోలి
సర్వమంగళ విగ్రహ-చ్ఛాయం జేసి|| 237

సీ॥ చక్కఁ గుబ్బలులతోఁ-సత నీరువాముల
యిలమోచు నరదంబు-లెన్ని నూర్లు
తెరగంటి తెరువునే-డ్త్రెర మూపులను రాయు
పలుగొమ్ము మెకములేఁ-బదులపదులు
దచ్చిక డల్మించి-దాటుతే జూనిన
వెలి కత్తులానులు-వేనవేలు
జక్కఁ పేరిటి కిత్తు-నొక్కఁ ముద్దలు మెక్కఁ
నెక్కటి కాండ్రును-బెక్కువేలు

గీ॥ లాము బసవను లొంటెయ-లావు లెనుము
లెన్నియేనియు దివి బువి-యీనినట్లు
వెంటనే తేరశివరాజు-గంట మిగిలి
కన్ను వాల్దార యావిల్లు-కడకు నరుగ॥ 231

సీ॥ జన్నంబు లొనరించు-జమిలి ఫుట్టువులను
బట్టి వేలిమిపనం-ట్లట్టె విసరు
బూచుల నోడయుపా-పోసుల గడిగెడు
బత్తుల మొలనూళ్లు-బట్టి త్రెంచు
వింతసువ్వాలను-వెడ వెడబాడెడు
వెలయాండ్ర చాచులు-వెలియొనర్చు
నిత్తిగ ముద్దర-లత్తెడు జోగుల
చెవుల లాగులరొచ్చు-కలియఁజిలుకు

గీ॥ గండుమీరి కబడ్డారు గాండ యనుచు
ధుండిప్రోళ్లాను గండర-గండ దండు
మెండుకొని దేవళంబున-నిండి చేయు
మెండగములకు పజలెల్ల-గాండ్రు వెట్ట॥ 232

సీ॥ కడి దంపు మగఱాల-కమరు జంటను దోడి
సత్తి పేరిటి కత్తి-సంతరించి
తడబ్రమాని సింగాణి-నెడ మూపునం బూని
కరకు తూపుల తర-కసము నాని
యుడ్డంచు బడియను బ్రద్దు దంట నమిర్చి
వాడి యత్తలము బ్రకే-వలను బెట్టి
చిరువాలు లోఁగల-మెరుపుఁ గాశను గూర్చి
గుడుసుకై దువ నూర్లు-గుదురుపరచి

గీ॥ తళుకు మగఱాల కుళ్లాయి-తలను బెట్టి
యాణిలెత్తులు కుత్తుక-యందు నిలిపి
పొడుపు గుబ్బలి కొన దూరు-పొద్దు రీతి
ననికి, నిరవగు సింగార-మలవరించి॥ 228

గీ॥ కాలి యడియాల మెల్లియు సీవురములు
గలుగు నరదంబు పాది యొ-కండు తెసరు
తలఁపున మెలంగు బాబాల-దచ్చి పూచి
యెదుట నిలుపంగ శివరాయుఁ-డెక్కె నవుడు॥ 229

సీ॥ లోవాడి కాంబ్రెడద-లోని యత్తైళమద
బ్బలి తుపాసుల కొలి-మలయడి దమ
తెరవల యీలువుల్-చెరచు కూళల మిత్తి
చిలుము వాల్దణియుల-చేటుసత్తి
తొడుకుల గారించు-దోసగుల బలియుండ
జన్నముజ్జెరుచులు-త్స్రలజముండ
అడిగొట్టుదునె దారు-లట్టుల తిగ వంగ
వెతచీకు వాలకు-వేవెలుంగ

తే॥ ఆలపాలమే పరులగుండె-గాలమగుచు
కవ్వు ముత్తెదు విలుదోచు-గామిడులను
గెలువు గెలువు మయని బ్రోల-బలుకు బిరుదు
పద్దెములు బట్లు చదువగాఁ-బయలు దేరె॥ 230

ననివ్రాసియున్నారు. అదినా భాగ్యవిశేషమని యిప్పుడనుకొంటు న్నాను.

ఛత్రపతి శివాజీ చరిత్ర పది ఆశ్వాసాలుగలిగిన మహాగ్రంథం. మహారాష్ట్రదేశానికేకాక, సమస్త భారతదేశానికే గర్వించతగ్గ ఏకైక మహానాయకుడు శివాజి ఉదాత్త గుణగణసంపన్నుడు వీరవిక్రమసాహ సాది క్రియానిపుణుడు అట్టి ధీరోదాత్తుడు దీనికి నాయకుడు. ఇతివృ త్తంచూస్తే లోకోత్తరమైనది. కవియైన వానికి ఇంక కావలసినదేమున్నది. ఏతత్కార్యసంజాత సర్వస్వమే నాన్నగారి కవితారచనకి మూలకంద మైనది.

శ్రీనాన్నగారు క్రీ. శ. 1868 వ సంవత్సరంలో జన్మించినారు. బాల్యమంతా చెప్పుకొనదగిన విశేషాలు లేకుండానే గతించింది. ఆపిమ్మట విజయనగరం తాలూకాలోని గుమిణి గ్రామాధికారిగా చిరకాలం పని చేసి, అజరామరమైన శివాజీ చరిత్రను సృష్టించి 1933 వ సం॥ లో ఆగ్రామంలోనే పరమపదించగా, ఏకైక కుమారుడనైన యీనేనే శివదీక్షా పరులైన తండ్రిగారికి. పరమపావన భాగీరథీ వాహినీపునీతమైన కాశీ క్షేత్రంలో అంత్యక్రియలు గావించి భాగ్యవంతుడనైనాను.

శివభారతం, పేరుతో శివాజీ చరిత్ర పద్యగద్యాత్మక మహా కావ్యంగా ముద్రణభాగ్యం పొందింది. శ్రీగడియారంవారు వ్రాసేరుట దాన్ని తెనుగు దేశమంతా గౌరవించి ప్రశంసాధునులను ప్రవహింప జేసింది. రాణాప్రతాప చరిత్ర అతః పూర్వమే ప్రచురితమైనది. ఆంధ్ర పురాణమనే పేరుతో ఆంధ్రులచరిత్రయిటీవలే బయటపడింది. ఈదృశ వచనోత్సాహ పరంపరలనిటీవల, నేను విన్నాను. మాతండ్రిగారు, వీరందరికంటే పూర్వులు వీరందరి చరిత్ర రచనలకంటే ముందే రచించి పూర్తిచేసి, లిఖితప్రతిని సాకందించి దివంగతులైనారు. నాఅశక్తివల్ల, కుటుంబవ్యవస్థవల్ల దానిని నేను ముద్రింపించి తెలుగు దేశంలో వీరందరి చారిత్రకప్రబంధాలన్నింటికంటే, ముందే అందించలేక పోయినాను. ఆనాదిగులు నేటికిని నన్ను బాధిస్తునే యున్నది. ఒకనాటి ప్రభాతంలో.

గీ॥ అంజకంజకు బార్వతీ !- యభవు రాణి !
శక్తి ! మహేశ్వరీ ! యని- సన్నుతింపు
చక్షు మాలను దేవిని- నావహించి
జపముఁ చేయుచు జనియెనా- సదనమునకు 222

క౦॥ ఆయెడ రాడ్ఘడమున శివ
రాయుఁడు చిత్తమున సోయ- రాసతి మీదన్
నేయమ్మున లీనమ్మై
ధైయం బొనరింప నొక్క- భృత్యుండు వడిన్. 223

క౦॥ దేవా ! మాహూరు పురం
బావాసము కొల్ల పెట్ట- నై పత్తే ఖాన్
చేవనరు దెంచెఁ గావున
నావన జేయుమని వార-లంపిరి-లేఖన్. 224

క౦॥ ఆ వచనంబులు చెవిఁ బడ
శైవ వరుండాజ్య హిత కృ-శా నుని భంగిన్
మై వెంచి కోప ఘూర్ణ
ప్రావృడ్కా- లాభ్రి మట్లు-వదరుచుఁ బలికెన్. 225

క౦॥ కన్నులు పొరలుం గప్పిన
వన్ని చాగ్రిణికి వాని-యా మార్పంగా
నెన్నిక పౌజుల నెల్లన్
గన్ననఁ బయనం బొనర్పఁ-కా, వలయుననన్. 226

క౦॥ అతఁ డవ్విధిఁ గావింపఁగఁ
జతురంగ బలంబు లొకట-సత్వర మొప్పన్
ధృతి మాహూర్పుర బాహ్య
క్షితికిం బయనం బొనర్ప- శివరా యుండున్. 227

గీ॥ అనుచు బల్వగ నిల్చిబడ్డ-లడరి యడరి
చెలియ నెయ్యెడ గానక-చింత నొంది
సోది తెలియంగ దేవిని స్తుతి యొనర్ప
నల భవానీ గృహంబున-కరుగ నచట 218

గీ॥ సోయరాబాయి యుపవని-కాయజాతు
సాయకాఘాత విస్మయ-కాయ యగుచు
కప్పు ముత్తైదు వను వేడ-గాఁ దలంచి
వలపు కన్నీటి కొలను లో-పలను మున్గి॥ 219

సీ॥ గంగానదీ జూటు-కై వడిఁ దలచేల
మల్లికా కుసుమదా- మంబు జుట్టి
త్ర్యంబకా కారంబు- డంబుగాఁ ఫాలార్ధ
తలమున కస్తూరి- తిలక మలఁది
వ్యాఘ్రి చర్మాంబరు- వాల్లభ్యమున బోలి
మువ్వన్నె గింటెంబు- మొలను జుట్టి
యా శివిషా భూషు-నా కారమో యన
నొక మోము రుది రక్క-లురమునంటి

గీ॥ కృత్తి వాసుని గతి మేన- లత్తు కలఁది
కేలపటి కంపు సరమును- గీలు కొలిపి
శైవరాజి మహాయోగి-చందమునను
ధరణి విభు పుత్రి యొక మునీ-శ్వరుని బోలి. 220

కం॥ మెడనుండి యడుగు దనుకను
గడి దపు జేగురు జిరాను-గట్టు చొక కయిన్
జడము సొరకాయఁ గైకొని
జడల మెకం బెక్కి-రింత-సరస కరుగుచున్. 221

చ॥ అనుచు విరాళిఁ గుంది నిమి- షార్ధము వత్సరమట్టు లెంచు-చో
కనుగవ మోడ్చి క్రింద రయఁ-గా, స్తన లేపన గంధ సారమున్
గనలి, చిదుర్పలై దెసలు-గ్రమ్మిన నోర్వఁగ లేక వేదనన్
గినియుచు వెక్కి-వెక్కి- కల-గీతి రవంబుల నేడ్చె బోరునన్ 214

కం॥ ఆ రావము మధు కరనిక
రారా వమ వల్లకీ సు-ధారావంబా
యేరా వంబని నిజసఖు
లారా మను నరయు చుండి-రారావమునన్ 215

కం॥ ఈ రమ్ముల నవసుమనో
వారమ్ముల మధుర సైక-వారమ్ముల నా
మారమ్ముల గల తోటలు
మారమ్ముల చెలియ నెమకి- మానిని గనకన్. 216

సీ॥ పెను క్రొమ్ముడి కొకించు-కెన గాని నెమ్మల
కేకలు పాలైతి-వో కుమారి!
చిరు చూపుల కొకింత- వెరుగొందు మగుతుది
యమ్ముల వమ్మైతి-వా కుమారి!
గొనబు పల్కుల తోడ- నెన గాని కోయిల
చీకువాలుల మున్గి-తో కుమారి!
తగు నెన్నడల కింత-నొ గిలెడి యంచల
వాకల పాలైతి-వా కుమారి!

గీ॥ పాటలకు నోడు తేటుల- గాటునకును
హజ్జలకు డిందు తలిరాకు-టమ్ములకును
జిడి ముడిని బొంది యియ్యెడ- నడిగి నావో?
కంట బడ వేమి మాకు వా-ల్గంటి నీవు. 217

గీ॥ నీకు తోడగు తెమ్మెర- నిన్ను గూర్చి
గాము పాఘుడ్డ గ్రమింగ గాం-గాంచు చెపుడు
నాకుఁ జేకూర్పమో గణ-నాథ జనని
యంచు తహ తహ వాడమి చ-లించు నంత.

చ॥ మరుని లకోరి యేటులకు- మండెడు జాబిలి యెండ వేడికిన్
పురి పులుగెల్లు సోకులకు- మూడుగహజ్జల ఘుర్వ్యాగాణకున్
బరువ పుఁగెంపు కన్పులుగు-పల్కుల కొక్కటి రమ్యమై చెవ
చొరబడి సోకి తూరగను-గ్రుక్కి చెమర్చివడం కెగోలయున్

కం॥ ఉరి దూరవోవు వడువున
పరువిడు వేల్లితని కుంజ- పాదప వనికిన్
చరియ, నెద, నాటు కొనుగతి
నరుగున్నవ కేతకీ సు-మావళి కడకున్.

కం॥ ఉరికి పడు కమ్మ కేతకి
విరి రేకులు గాలి నెగిరి-వే యెద నంటన్
మరుఁడేయు ములికలో యన
వెరవరి నట్టిట్టు బారు- వేడి యగుచున్

సీ॥ అలరు విల్తుని చాకు- లక్కున కరకర
కోయగాఁ జొచ్చెను-గో యుచుండె
రేయెండ సోకుల- కాయంబు కుతకుత
నుడుకు గావించెను-నుడుకు చుండె
సొకుడు పులుగుల-కూకలు కసకస
తూరెను జెవులలో-దూరుచుండె
వలిగాలి తాకులు- తలనంటి వడవడ
వడకు గావించెను- వడకుచుండె

గీ॥ చూపులను జూచి డెందంబు- చూరగొన్న
నామనోహరు రూపంబు- దీమువోలి
కన్నులకు గట్టి నట్టుల-గానుపించె
నేమి నేయుదు దిక్కు ము-క్కేది నాకు॥

కం॥ కమ్మ విలుకాని చెలిమికి
తమ్ముల నమ్ములుగ నమ్మ-దాయివి యదుగుం
దమ్ముల మని మమ్మెంచెదె
కొమ్మల పాలింటి మారి-కో కవిదారీ! 205

కం॥ కలకాల మొక్క తీరుగ
వెలుగొందిన చంపజూడ-వే జగ మెల్లన్
నెల నెలను చిక్కి స్రుక్కెడు
వలను గదా చెలులు బ్రతుకు-వారైరి శశీ! 206

గీ॥ వత్సరంబున కొక్కక- పర్వమందు
రాహు దంష్ట్రాంకురైక సా-రాష్ట్రికంబు
ధరణ మొందెదు నిను విష-ధరుఁడ నాక
నమృత కరు డనుట యన్యాయ-మంబుజారి 207

సీ॥ పదియారు తునియల-ప్రాల్మాలు మేనితో
తమ్ములనేచు పా-తకము తోడ
మిత్రుని నర్ధించు- మేని వెల్గుల తోడ
నేకేట పెనుబాము-కాటుతోడ
నారునాలు నాలుగా- నొందు దుర్బుద్ధితో
కవ జక్క వల విప్పు- కమరు తోడ
నిశలందు బర్వెట్టు-నీరసా కృతి తోడ
తెక్కలి కారుల- తిట్ల తోడ

గీ॥ నొంచు రెండు దినంబులం- దోడలు లేక
సిగ్గువడి కుంది తనువు న-శించిపోయి
మానవైతివి యబలల- మాడ్చుబుద్ధి
చెల్లెలిలు గాల్చుగజ ముచ్చ-చేవపుచ్చ 208

గీ॥ తల్లి దండ్రుల నేచు ని-ర్దయునియబల
లందు దయఁజూపు మనుటహేయంబు గాదె
అమ్మ చెవి ద్రెంపు పాపి! పి-న్నమ్మ చెవుల
కిడునె ప్రోవులు ననునట్టు- విక్షుచాప! 201

సీ॥ తల్లి దండ్రుల చాటు- తనయనలంచుట
మంచియా మించియా- పంచబాణ!
పాణౌ కృతింగాని- పణతుల నేచుట
న్యాయమా శ్రేయమా- కాయజాత!
నవ యౌవ నాంగుల- సవల నొందించుట
శౌర్యమా క్రౌర్యమా- ధైర్యహీన!
నారీజనావనా ధీరాత్ములఁ గలంప
నీతి యాఖ్యాతియా-గాతనాత్మ!

గీ॥ హేతు శూన్యాభిఘాతివి- పాతకుఁడవు
వైషమేషవ విరహిణీ-శోషణుఁడవు
తగునె యబలల గారింపఁ- దలఁపు చూలి
కేలు తీపైన వొడరుమా- శూలితోడ 202

గీ॥ మంట మాడిన మేనును- తుంట విల్లు
జంట ముక్కాలి గొనము చే-నంట గలదు
చిలుకలను బట్టి యబలలఁ-జెనకుచుందు
వెంచ మగత నమాయిది- కొంచగాడ. 203

కం॥ అని కసలు గోరుచుట్టున
పెనురోకటి పోటు రీతి- వెన్నెలతేఁడున్
గనకన లాడెడు కిత్తున
కెన యగు వెలుగులను నింప-నింతి కడంకన్. 204

కం॥ అని బుజ్జగించి చెలియలు
మనసిజ తాపోపశమన- మార్గము కొఱకై
వనలుం జిగురులు గొని రా
జనులో చెలినే సెమరుఁడు-చాల్పు లకోరిల్ 197

కం॥ ఆయమ్ములు బిగి కంచెల
దూయుచు మెయినాటు చెదను- తూరి వెనుక మేన్
గాయమ్మడు వెట్టి బాయం
గా, యమ్మడు కెత్తి రేగ-కామిని వనటన్ 198

కం॥ విషమాస్త్రధారి వనుచున్
ఝష కేతన విరహ జనుల-జంపక నేచన్
వృషమామరి భేషజమా
వృష భాంకుని నేచ రాదె? వేరమ్మడు గన్. 199

సీ॥ నీముడి యూలమ్మ-సీటులో బడి(బోను
బలగమ్ములడవుల- పాలుగాను
ఆల్లి (త్రాడిరు ఫుట్టు- వైనల్లబడి పోసు
సడగడు బందిలో- నడిగిపోను
తూపులంటిన గంది- రూపులు చెడిపోను
పిల్లుగానుగఁ బడి-సుళ్ళిపోను
అమ్మసిల్కడ లేసి-దై మాటు వడిపోను
మామ మేనపు డప్పు- మాసిపోను

గీ॥ మోరిమిడి దోసకారి నీ-కుగ్గుపాలు
పోసి పెంచిన దాననే- పొందిబేసి
కంటి వేలుపుతోఁ బోరి- మంటపాలు
జెంది మాసియు మాబోంట్ల- జెనక దేల? 200

సీ॥ తలపు ముమ్మర మాట-వలుద క్రొమ్ముడి సోగ
నెరులు జానుగు లంట-నిగుడ లేదు
చిన్నారి పొన్నారి- చిరునవ్వు మొలకలు
పలుగొనల్గప్పు నే-ర్పడగ లేదు
నును దేనియల జిల్కు- గొనబు వాతెఱ దొండ
పండింత పరువంబు- బడయ లేదు
చెంతల గ్రమ్మి కం- చెలమించి చాచులు
మొక్కు కేలెడ జేయు-నుక్కు లేదు
గీ॥ మీరు చన్గవ నారింత- తూరలేదు
మెంచ నీరెన్ని దేడులు- మించలేదు
మేనున గిలాసములో కింత- మీరలేదు
గోల నీకెంత వలవంత- జాలు కొనియె॥ 19

కం॥ ఎమ్మెగ లాడని చెలి నీ
వమ్మానిసి తని వలపు-లాము గొలుపగా
నిమ్మడి ముమ్మడి గ్రమ్మిన
వమ్మాయిట నిల్వగూడ-దామని యాటన్. 19

సీ॥ నీ పాజ్జలను బోల-నేరని లేమావి
చిగురాకుల మ్మారు- చిలుకలమ్మ
నీ యెల్గు సరిబాడ- నేరని కోయిలల్
గమ్మ విల్తుని బల-గమ్ములమ్మ
నీ ముంగురుల కప్పు- నెరియని తేటులా
తలపు చూలికి యల్లె- త్రాడుకొమ్మ
నీ కన్ను వెలిసాటి- నేరని గండు మీ
నలరు విల్తుని యడి-యాలమమ్మ
గీ॥ నీ ప్రతీ కంబులకు లోగి-నెగడ నట్టి
తలిరు కోయిల తేటు మీన్-దన్ను వేడ
నవి యెగ్గొని నిన్నే చె- నలయు విప్ప
డెమ్మి నీయెడ నుండ రా-దమ్మ నీకు॥ 196

కం॥ పెన్నిధిఁ గనుగొను పేదల
చెన్నున వారొకరి నొకరు- చేరఁ బిలుచుచో
గన్ని యదరికిం జనగా
నన్నెలతయు వారిగని న-తాననయై నన్ 188

కం॥ వారలలో నెన్నిక యొక
వారిజ దళ నేత్రరాజ- వర పుత్రికతో
మేరా యిది యొక తీరా
పేరా దొరకన్ని యలకుఁ- బ్రేముడి వేరా ? 189

ఉ॥ ఇంతటి దానవైతి వని-యేము తలంపకనే మరిట్లనీ
కెంతటి ధైర్యమమ్మ మును-పెట్టే పరీ వృథ కన్యలైన నీ
యంతటి సాహసంబున మ-హా వని కొంటిగ నేగు. దెంచిరే
వింత పెరంగనుం గొనియు-వేదురు బొందుట కాంత కొప్పునే 190

ఉ॥ నీ సరి వారలున్నివిన- నిన్నొక యించుక పాటి సేతురే
వాసి దొరంగి పూరుషుల-పై వలపుల్ జవరాండ్ర కొప్పునే
మోసముజెంది ప్రేముడి ని మున్ని యొకానొక లాతి వానిపై
నాసలఁ జెంది రాజకుల- మారడి వెట్టితి వేమి సేయుమన్ 191

కం॥ ఒక దినమొక్క- నిమేషము
ముకుర ప్రతి బింబమైన- పురుషుంగని నీ
వ కటా ! యున్మాదిని వలె
సకలైశ్వర్యములపై వి-షాదము దగునే. 192

చ॥ నృపకుల మండలేశ్వరుఁడు- నీ జలకుండు విపక్ష వాహినీ
ద్విపహయ జైత్ర విక్రమ వి-వేకులు పూర్వజులుత్త మాన్వయీ
నిపుణయనుంగుఁ దల్లి బహు- నేర్పరు లీవరవుల్లు, నీవు నుం
ద్రిపురహరార్ధగాత్రి గణ-నీయవు నైయిటుఁ జేయుటొప్పునే 193

సీ॥ అఖిల జగన్మోహ-నా కారుఁడే తేర
కన్నులనిండ నేఁ- గాంచనైతి
జగదేక విఖ్యాత- చారిత్రుఁడిట నిల్వ
నాపాదమస్తకం-బరయనైతి
వర వర్ణినీ మనో-హరమూర్తి బొడసూప
నని మేష భావంబు- నందనైతి
ఫలిత కల్పక మహో- పాదోరుహంబబ్బ
నిష్టంబు దెల్ప నూ-హింపనైతి
గీ॥ అకట తరిమించె భయమున-న్నను సరించె
చెలియలరు దెంచెఁ బ్రేముడిఁ- జెనటి గాంచె
లాతియని డెంద మలయించె- లజ్జ మించె
శీత నగజాత యికనేమి- సేయుదాన॥ 185

సీ॥ ప్రథమావలో కన-ప్రాప్తి నా తనుమూర్తి
కన్నుల మిరుమిట్లు- గ్రమ్మ కొనియె
నట ద్వితీయావృత్తి- నాలో కనముఁజేయ
డెందంబు జల్లున- డిందు వడియె
దగ తృతీయంబున- దర్శనం బొనరింప
నవయవంబుల శ్రమం- బలమి కొసయె
కాంక్ష చతుర్థిని- గనుగొన్న యంతలో
చైతన్యముడిగిని- శ్చేష్ట నొందె
గీ॥ యొలమి నరచూపు లందున- యింతయయ్యొ
నింపు కన్నుల కొలికల- నిండఁ జూడ
మేనితోఁ బొత్తును సురులు- మానునేము
యనుచు వల వంత నక్కాంత-యడరు నంత॥ 186

కం॥ ఇష్ట నఖులెల్ల సతిన
న్వేష్టింపుచున చోటున చోటు-వివరించి ననిన్
దృష్టంలు వరపిన నొకయు
తఁట్లిష్ట నికుంజమున మెలగు- నింతింగనుచున్ 187

వారికి అముద్రితమైన శివాజీ చరిత్ర దొరకడం, అది అసంపూర్ణంగా ఉండిపోవడం, తమవంశ వర్ణనాదులుట్టం కించబడడం, చూడడం జరిగింది అది పూర్తిగా రచిస్తే, శబ్దవృత్తులూ, అర్థవృత్తులూ ప్రతిష్ఠచేసి, మహత్తర కావ్యంగా నిర్మిస్తే, పూర్వీకులకు మనః పరితృప్తి కలిగించడ మౌతుందని మానాన్నగారు భావించేరు.

మాతండ్రిగారి బావమరదులు శ్రీ బాలాంత్రపు సూర్యనారాయణ గారు. వారు కడుంగడు. చతురులు. సాహిత్య సంస్కారులు. చదువరులు. కవితా విలాసచతుర్ముఖులు. వారే నా తండ్రిగారికి కవితా గురువులు. నిజంగా మానాన్నగారు, పోతనవలె సహజ కవిత్వపాండిత్య రేఖా ధురంధరులని చెపితే, తప్పులేదు. అయినా. వారిబావగారి చేయూతకూడ ఉండడం జరిగింది. వారిప్రోత్సాహ, ప్రోద్బలాలతో నాన్నగారు ఛత్రపతి శివాజీచరిత్ర కోంకారమాచరించేరు. శ్రీకారం చుట్టేరుగాని శివాజీచరిత్ర మూలగ్రంథంలభించక పోవడంతో, క్రిందుమీదు లైనారు అప్పుడు చారిత్రిక. విమర్శనా కుంభసంభవులైన శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారు వచనంలో రచియించిన శివాజీ చరిత్ర లభించడం, అదే మూలగ్రంథంగా తీసుకొని రచన సాగించడం జరిగింది. అదివేగంగా కొనసాగలేదు. పగటివేళ గ్రామాధికార కార్యజంజాటాలు, కవిత్వాన్ని సాగనిచ్చేవికావు. అర్థరాత్రి దాటిన తదనంతరం, ఆముదపు దీపజ్యోతిలో ఒకచిన్నముక్క పెన్సిలు, చిత్తుకాగితాలు తీసికొని యేవేవో పద్యాలు గిలుకుతూండేవారు మసిబొగ్గుతో ఏకుడ్యాలమీదనో ఛందస్సుందరము లైన పద్యాలను స్థాపించేవారు. అక్కడక్కడ వారివిధంగా వ్రాసి విసిరిన, కాగితపు తునకలనేరి, కుడ్యసాహిత్యాన్ని సంగ్రహించి నేను జాగ్రత్తచేస్తూ, నాన్నగారిని రచనకు ప్రోత్సహిస్తూండేవాడిని. చిత్తుని తీసి, కడిగి, శుభ్రంచేసి, వారికి చూపిస్తే, వారుబ్రహ్మానంద భరితులయ్యే వారు. ఈసమస్తమైనంవారు చూచేవారుకాబోలు. అందుకే

" నాకొమరుఁడు రామారా వీకథ రచియింప నన్ను హెచ్చరికింపన్ జేకొంటి"

గీ॥ నివి నికుంజములను దూరి- యేగి చిహ్న
లివియుమణిపాలు కాసీమ-నేగు జాడ
లివియె యరుగుచు ననుజూచు-నెమ్మొలను చు
నెంచి యటనటఁ జరియించె- మించు బోడి 179

ఉ॥ నాయెడఁ బ్రేమకల్గు నర-నాథుని ధూర్త భుజిష్య లంపగా
నేయెడ కేగెనో యరుగు-చెంత మనోవ్యథ పాలు చెందెనో
యీ యెడ నన్నుఁజూడ మది-నెట్టివగన్ వదనంబు ద్రిప్పెనో
వేయిక నేల నాకొఱకు-వేఁడి యై తను తాప మందెనో! 180

ఉ॥ కాయజుబారి కగ్గమయి-కానల దారులుదప్పి యేగుచో
నాయెడఁగల్గు కూర్మిఁనర-నాయకుఁడీయెడ కేగు దేరగా
నాయితపాటు జెంది యిది- న్యాయము గాదని మళ్ళిపోయెనో
హా! యెటులైననే నబల-నౌటను నయ్యెడ కెట్టులే గెదన్. 181

కం॥ నన బోండ్లు దన్ను బంపిన
జన నొల్లక జని, యతండు,-జనుచోఁ జనుచో
ననుజూచెడి తమిచే నా
నన బోడుల బిలుచు మిషను- నన్నుం జూచెన్ 182

ఉ॥ ఏమని పల్కుదాన మను-జేంద్రుఁడు మోహనమూర్తి యాటనా
ప్రేమను నాత్మృణంబును న-భీష్టముగా గ్రహియించి యుంటనే
కాముని యేటులందనువు- గ్రాగి, కృశించితి నానిమిత్తమై
యా మహనీయుఁడెంత యిడు-మంది కృశించి కరంగు చుండెనో 183

మ॥ సకలాంగంబుల మంజులంబను శిలిన్-సంధించి నాప్రేమయన్
శకులంబున్ గ్రహియింపరం చులకమా- సంజిక్కునక్లైతి నే
న కటా! లిప్స పరిత్యజించుటను నా-కై చింత లేదింక నా
మకరాంక ప్రతి మూర్తి వేదనకుఁ బ-ల్మారేను చింతించెదన్ 184

మ॥ అరవిందంబున మోము శోకమున గం-ఠం బ్రామ పత్రంబుచే
నురువక్షోజము మల్లికాకళికచే- నూరుస్థలి న్మోచకాం
బురుహాజిహ్మగ మంగ సంధుల నహం-పూర్వమ్ జయాఢ్యంమనా
స్థిర మంత్రంబులు జల్కి మారుఁడల యో-షిన్మూర్తి నోనేయగాన్ 175

తే॥ అల శిరీష ప్రసూన మం-జుల శరీరి
గాన నక్కాంత కంతుని-ఖగ చయముల
హృత్ క్షతంబయి విరహాగ్ని-వేడి వెడల
వివశయై పాన్పునంబడి- వేసరగుచు॥ 176

కం॥ ఏకతముప వని కేగన్
సైకత రంభా ఫలాశ-సంకేతములన్
గేకీనట నామోదిత
కోకిల గానములు మది దీ-గుల్పర పంగన్ 177

కం॥ వడి నడచు నిలుచు దెసలం
గొడఁ గను విట్టూర్పు వెట్టుఁ-బోగులు చునులుకున్
జెడగుం జేత లొసర్చుచుఁ
జిడి ముడి పడు మిన్ను జూచు-చేడియ భీతిన్ 178

సీ॥ ఇవి మహో రాజేంద్రుఁ-డీక్షితోఁ జనుదెంచు
హజ్జల జాడ లం-చట్టె చూచు
నివి భూమి భృన్మౌళి-యేణంబు గికురించు
మంజు కుంజములని-మమత నొందు
నిది పూర్ణ చంద్రాస్యుఁ-డ దరిన మృగమును
బట్టిన చోటని-భ్రాంతి మీరు
నిది మనోహరమూర్తి-నింతి పిండని పిన
తెరువని గడుదూర-మరుగ పోవు

ఉ॥ చేరిమిఁ బెంపునా మదిని-బీరము వోయిన దేమిసేతు? సం
గార గళం తికాఘృతవి-కారముగా, మదియుంగ రంగ, గ
స్నీరు, చిమర్పులుం బయట-నెక్కొని మొక్కటచుంయి చుంయి మం
చూరకసారై నింకెటుల-నోర్చెదఁ దీర్చెద్దఁ గంతు లేడిమిన్ 171

ఉ॥ ఆరట మొందె డెందము వి-హారము లెక్కసమయ్యె, శీర్షమున్
భారముఁ జెందెఁగన్గొనలు-పాటలతోఁ జిన లంకరించె నా
చారము లేక యయ్యెనిక-జాలును నెయ్యము మేనితోడ నీ
కీరము లేలనా కని వి-కీర్ణ శిఖా పరిస వచ్యుతోత్తమై. 172

కం॥ పంజర బద్ధ శుకంబుల
కుం, జెఱుకు లోసంగి, సారె-కుం గన్నీ
రం, జల బోట బోట జారుగన్
ముం జేతికిఁ బిలిచి మోము-మూర్కొనునెడలన్ 173

సీ॥ కెంపు రా రవల మే-లొంపు కెంజిగి నింపు
తలిరాకు గింజెంబు-తలను జుట్టి
చందు రా రవల ప-సందు నిగ్గుల చొక్క
పెలదమ్మి జిలుకత్తు-నెదను దొడిగి
యామునో వాంఛ్రడ సు-గ్గాడు డా కాలంది
పక్కియ మేలి ర-వాల నెక్కి
ఉదిరి గంటల సులి వాక్కట రొద వెట్టి
చెఱకు సింగిణి నొక్క- చేతఁ బట్టి

గీ॥ వెనుక ముంగల నడుగులు- వెట్టి పొంచి
మించి, మేన్వంచి, యల్లె ద్రమో- యించి కాంచి
కుంచె కోలల నైదింటి-సంచి నెంచి
మించు బోడియ యెదనించె-.బంచ శరుఁడు 174

సీ॥ శార్దూల వక్త్రోద్ధ- సారంగ పృథుకంబు
విడిపిష నా కేల- వేడుకయ్యె
వేడుక బెంచునా- లేడి పిల్లేటికి
।౬। దుర్గ మాటవులకు- నిర్గమించె
నిర్గమించిన యంత-నృప మహీ మండలా
ఖండలుఁడద్దాని- గాంచనేల
కాంచెబో జవమున- మించియీ యారామ
వృక్షోచ్ఛ్రయిని దాని-నేలఁ బట్టె

తే॥ బట్టినంతనె యది యేల-బిట్టు నార్చె
నార్చెబో జాలి నేనేల-న చోటు చూడ
జూడనతఁడేల నా కన్ను-జాడఁబడియె
।౭। బడిన మాత్రన నాకిట్టి-యిడు మదేల?

శా॥ ఆహా! యేమిటి మాయయో తెలివి రా-దా, విశ్వవిశ్వంభరా
బాహా జన్మ శరీరసౌష్ఠవ, తటి-ద్బా మంజుల భ్రాంతి సత్
మోహాస్వాంతనొనర్చి యీప్సిత తృణం-బున్ శంబరావర్త్మ
ల్లోహాహా చుట్టుఁ బరి భ్రమించెని కనే-యూహాం దరించేరెదన్ 1(

కం॥ ఏన స్వైరను గానన్
భూనాయకు ప్రేమనెట్లు-పొందెదు దానన్
దీనికి నైరు దాగిలిన్
ధ్యానించెదనన్న తిరము-దప్పెన్మదియున్

కం॥ నాయీడు బోడు వారలు
నాయీఁగన్ వెఱ్ఱి గాంచి-నం- దేకిసలున్
వేయి విధంబులఁ జేయరె
హా! యీశ్వరి! తాళనెట్టు-తా. నాకిటుపై॥

గీ॥ తలపుచూలేను తీరులా-తలిరు బోడి
వదన తను పాణి దశన ని-ర్వర్ణ నోప
మాన బంధుత్వమున కస్తి-దాని మాని
చూచు మాత్రాన నాయెద నేచ దొడఁగె॥ 161

కం॥ అతఁడీగతిఁ జింతింపుచు
మితి మీరు విరాళిఁ జెంది-మే తెలియక చిం
తిత కార్య సఫలమునకై
హత కాయజు వేఁడుచున్న-నచ్చట చెలియున్. 162

శా॥ ఆ రాజేంద్రుఁడు రమ్యహర్మ్యమును బా-యంబోవు నాడాదిగా
నారామామణి కాయ సౌష్ఠవము పై-నాసింప కన్నోది స
త్కార వార్తము బల్కులున్వినక సం-గీత ప్రశం సల్మహా
భారం బైశ్రుతులంగుళుల్ జొనిపివి-భ్రాంతిన్ ధరన్ జూచుచున్ 163

గీ॥ బహు విధా పూపములు నిగ్గు-పాయసములు
తేనియల నూరులద్వాలు- తే మనమ్ము
లేక లామిష శాకంబు-లిగురు బోడు
లోసగ నొల్లక విసువున- నోకళించు. 164

కం॥ నైపథ్యాసూయంబును
నైపథ్యాన్నంబు రీతి-నశనము దినుటా
నైపథ్యము దప్పిన జా
నైపథ్యముఁ జెప్ప నొల్ల-దయ్యోఁ జిలుకకున్ 165

గీ॥ కన్నులర మోడ్చు హాయసి- కలవరింపు
చులుకు, బెగ్గిలు, తేడబడు-ను బుసుదెల్పు
హేయమంది వయస్యలఁ-బాయు చరుగు
నే కతంబునఁ జరియించు-చిట్టు లెంచు. 166

కం॥ ఆయమ్ములు ఖానువజీ
రాయమ్ములు సోడుముట్టి నంతయతండున్
గాయమ్ముల పెనునెత్తురు
గాయమ్మై, తేరు మీదఁ- గ్రక్కున నొరుగన్. 263

సీ॥ ముస్తబల్లియు దౌలతు- మొహ బదాది
ఖాను లొక్కట పింగళు-గదియునంత
నాప్రతాపుడు హంబీరు-డల్ల శాంతు
డక్కనను పోరి మువ్వుర- నురల నేయ॥ 264

కం॥ ఆయవన తికము మీరుచు
పాయంబున ఖాన్వజీర్లు పదుగురు పారం
దాయుచు నెరసరి నులివుల్
గూయుచు నెదిరించె నుసుటు-కోలు మసంగన్. 265

కం॥ మున్నీట చోఁ బజొచ్చిన
చెన్నున నరుదెంచి పంట-చేడియ వేల్పున్
నెన్నొసల నక్కు- కణతలఁ
గ్రొన్నెత్తురు వరదలు రులు-కోలల నింపన్. 266

కం॥ జడలమెక మేనుగుం గను
పడువునఁ బెనుగినుక గదుర పారుఁడుదుటుసన్
గడిదవ్వఁ దీరుల పగతుర
నెడదలు జింపుచును దలలు-వేడ్డైర ద్రుంచెన్ 267

కం॥ ఆపదుగురు జము ప్రోలికిఁ
జూపులుని గుడింపఁ దక్కు- జోదులుమున్నా
కేవు రవాలను బారుని
దూపుల జడిగుండు నింపె దొలిమబ్బు గతిన్ 268

క॥ మునువెనుక కెలన మార్తురు
మునుకొని గొనియం బాకింత-మోపిడులోనన్
జినుకుగు మిరీతిఁ దూపులఁ
జెనుకుచు సిడమెల్లి దునిమి-సిలుగొనరింపన్ 269

చ॥ కినుకవదల్చిపారఁడిరు-క్రేవలఁ గ్రమ్మిన నెక్కటెండ్రపై
కొని నుదురుల్ గళాసములు-కూకటి పట్టులు చెక్కులక్కులన్
బెనగొన వాలుతూపులను-జేర్చిగొనంబుల విండ్ల నత్తెముల్
దునియ లొనర్చి గద్దువలు-దూటొనరించి గలంచి మించినన్ 270

క॥ దానం గనలుచుఁదురకలు
సేనుంగులు గట్టిపట్టి యెకిరింతపయిన్
బూనిన వడువున నమ్ముల
వానల నలయింప పంట-పైదలి వేల్పున్ 271

క॥ అడుగుల జానుగులం జిరు
దొడల గళాసముల మూపు-తూపుం బొదలన్
నొడబంటి మించి యలుగుల
జడి పుక్కిటి బంటిగాఁగ-జయ్యన ముంచెన్ 272

క॥ పెరనంటియున్న యూవల
మరలించు నెలుంగురీతి మలిపియుఁబారుం
డరజాబిల్లి లకోరుల
తురకదళా పెద్దలుదుటు తూర్పెత్తింపన్ 273

గీ॥ నొచ్చి తురకలు గంటుని-ప్పచ్చపైన
నీల్గు మిగిలిన యెక్కటీం-డ్రీరసమున
బ్రతుకులందాస రోసిడ-బ్బాటుగాను
గంటుదళవాయి నరిమురిగా, నలంచి 274

గీ॥ వామగండ స్థలాంగుళీ పర్వములను
కాలకాకార చిహ్నము-ల్గలిగి నట్టు
చిత్రితంబులు గాన నీ-చెలువ మరయ
నొక్క రూపంబు నిక్కంబ-యొకరెయొకరు. 390

కం॥ అంతఃపుర చారుచర
త్కాంతలుగావించు నూడి-గంబుల గొనకం
గాంతారాంతరముల నే
కాంతంబున దిరుగుటకును గారణ మేమో! 391

కం॥ నాసంకల్పము వ్యర్థం
బై నురిగెన్ ఛామపుష్పి-తారామమునం
దా సద్దుడి చూచిన మూ
పాన గొలిపె నన్నుఁ బెండ్లి-యాడు నటంచున్ 392

కం॥ అకటా! యీశ్వరి దయనే
నొకటి దలంచిన మఱియును-నొక్కటి యయ్యెన్
ముకురానన కలలో ధన
మకృతజ్ఞత దానిఁ దలఁప-నది యేలనినన్ 393

కం॥ అని చింతించెడు లోనన్
జననాథ తనూజ యచటి-సంగతులెల్లన్
మనముం దనియఁగ కాత్యా
యని గేహము సొచ్చి యచట-నట్టటు తిరుగన్ 394

గీ॥ ఏటికి యోగి జూమియ-లెఱుఁగఁ జెప్ప
మనిన యిట్టులఁ జెప్పెన-య్యతివ వినుఁడి
యుప వనంబున మిము బాసి-యొంటిఁ దిరుగ
సత్రిగాలువంగ వచ్చు మ-స్కరిని వేడి॥ 395

కం॥ ఆలస్యమేల మాకుం
గాలీ ప్రాజలకు నేగ-గా వలె నిపుడే
వేళాతి క్రమమాయెను
చాలింపు వృథాభి లాష-సంభాషణముల్ 384

కం॥ కొలఁది దినంబులలో మీ
యిలమెట్టెడు వాఁడఁ గాన-నీయెడ నన్నుం
త్తల పెట్టకుమయ! చను మీ
నిలయంబున కనుచు జోగి-వెనరుణఁ బల్కెన్ 385

ఉ॥ సామి హసాదటంచు నృప-సత్త్రముఁ దవ్వని కేగి, యేగుచో
కామజి తాగ్రమూర్తి యల-కాయము గన్గొన మళ్లి వచ్చుచున్
బేర్మమము మాట మాధర ప-విత్రను సేయు-డి మానెపంబుగా
నామము నీయుని స్మరల-సడ్డె గనుంగొని యేగులోగుచున్ 386

మ॥ ఘనగాంధర్వము మండిలీగతుల నే-గం దృష్టి మానీందుర్నిం
గను నొక్కప్పుడు రేచితంబుల, సువీక్షంజేయు చుక్కంత, స
మ్మనుజేందుర్ందు సహాస్రమార్గములను-స్మత్త భ్రమన్మార్గమం
దనువర్తింపఁగ నేగు, నిల్చు, వెతనం-దంబోవుఁ బ్రాల్మాలుచున్

చ॥ అలయుచుఁ గొంతదవ్వరిగి-యచ్చొ టనున్నురమంచు నిల్చుచున్
గలఁగుచు, వెన్కజూచి, మునిఁ-గానక నుర్కుచు మందగామియై
వెలవెలఁ బోవుచో నరుగ-విస్మృతులైన చమూపతుల్ కదుల్
నిలయముఁ జేరి యూడి-నేరక విస్కృతి జెందియున్నెడల్ 388

చ॥ కుసుమ పరాగ సంఘటిత-కోమల శయ్యను మేనువాల్చి యా
కసమునఁ జూడ్కి నిల్పి, లిపి-కాంచవివిర్మిత యోగి రూపును
స్ననము కురంగ రక్షుణి శు-భాంగము జూచిన నొక్కతీరునన్
బొసగిన దంచు నబ్బురము-పొంది విమర్శన శాంతముర్గనన్ 389

కం॥ తొలిజన్మ కర్మ ఫలమున
గలుగుఁ ధర్మార్థ మోక్ష-కామ్యార్థంబుల్
తెలియంగ లేని దానిని
తెలియంగా బహువిధముల-దెలియుదురార్యుల్. 378

కం॥ చిత్తము కపి తుల్యం బా
తత్తరపడకుండ నిలుప-దారణయోగం
బుత్తములు యోగ మార్గం
బత్తి చలింపకను పరుని-నారాధించున్ 379

కం॥ దారా పుత్రులతో సం
సారముఁ జేయుచును బుద్ధి-చలనము గానకా
త్మారాముని సేవించెడు
సారమకల్ రాజయోగ-సాధ్యులు నృపతీ! 380

గీ॥ రాజయోగంబు పడయ, దు-ర్లభము గాన
దుర్లభంబంచు బుద్ధిమంతులు గ్రహించి
జనపదంబుల నిలువక-జ్ఞాత వాసు
లై, యజ్ఞ్రసంబు నీశ్వరు-నాత్మ వేదు॥ 381

గీ॥ నామవృత్తంబు వినఁ గోరి-నారు మీరు
నాని నగుటను నాచర్య-మౌరెఁ గాన
యెవరివాఁడనో, తలిదండ్రు-లెవ్వరైరో
తెలియ పరుపంగ నాకేమి-తెలియదయ్య॥ 382

కం॥ ననునేను దెలియ జాలను
జననీ, జనకాను జన్మ సచివాప్త సుహృ
జ్జన బాంధ వార్యులెవ్వా
రని తెల్పెనఁ దెలియఁ జాల-నట్టెడును నృపా! 383

# మనవి మాట

నేననుకుంటాను. ఈ ఛత్రపతి శివాజీ చరిత్ర ఒక మహాకావ్యమని మహాకావ్యమంటే ఏమిటో. దాని లక్షణాలెట్టివో దాని స్వరూప స్వభావాలెలాంటివో. అన్నీ నాకు అందుబాటులో లేని విషయాలు. అయినా నా అంతఃకరణ మాత్రం ఇది మహాకావ్యమని నన్ను పదేపదే ప్రేరేపిస్తున్నది. దీనిని వ్రాసినవారు నా పితృపాదులు. అంటే శ్రీ బవిరెపల్లి రామమూర్తి. రామమూర్తి అయినా. వారిని బంధువులు. మిత్రులు. గ్రామీణ ప్రజానీకం అందరు చిన రామమూర్తి పంతులుగారని వ్యవహరించేవారు. నిజం చెప్పవలె సివస్తే వారు సరస్వతీమూర్తి. నిత్యపరమ శివారాధనాత్యంత రిరం సాధకులు. ఆబాల్య ప్రవర్ధిత రమణీయ శబ్దార్థ విస్ఫురత్కవితా భావనాపాటవ సంయుక్తులు. నిత్యనైమిత్తిక కృత్య వహారాల్లో కూడ. "శివ, శంభో" అనే శివజపాన్ని చేస్తున్న దైవారాధకులు.

మాది విశాఖ జిల్లాలో రామతీర్థాలు దగ్గరఉన్న 'గుషిణి' గ్రామం అక్కడ మా నాన్నగారు గ్రామాధికారిగా, న్యాయపరిష్కార కర్తగా, గొప్ప సలహాదారుగా, వ్యవహర్తగా, అధ్యాత్మచింతనతో గౌరవంగా జీవితాన్ని గడపినవారు. తన జీవితవిధానాన్ని క్రమశిక్షణలో ఉంచుకుంటూ, నియమ నిష్ఠాగరిష్ఠులై, తనుతరిస్తూ, ఇతరులను, తననడవడిక వల్ల తరింపజేస్తూ, గుషిణి గ్రామాన్ని పునీతం చేసేవారు. ఘుషిణి అంటే, ఘుసృణధాన్య క్షేత్రాలు అక్కడ విరివిగా ఉండినవట. వీరి మాన్యాల్లో ఘుసృణధాన్యాలు పండేడివట ఘుసృణధాన్యాలంటే ఎఱ్ఱనిధాన్యాలు. అందువల్ల ఆగ్రామానికి ఘుసృణి గ్రామం అన్న పేరు వచ్చి కాలాంతరంలో అదే "గుషిణి" అయి, స్థిరనామాన్ని పొందింది. అంటారు పెద్దలు.

శ్రీ మా జనకులు. రాజరాజేశ్వరీ మంత్రోపాసకులు. సరస్వతీ చరణ మంజీర మంజుల మధునినాదములను శ్రుతిమనోహరంగా వినిన పుణ్యమూర్తులు. వారు తనబాల్యంలో విజయనగరం సంస్థానంలో రివిన్యూ ఇన్స్పెక్టరు ఉద్యోగం పదేళ్లపాటు సమర్థవంతంగాచేసి, తుదకు గుషిణిలో స్థిరపడినారు. ఒకనాడు పూర్వీకులు తనకై యేమైనా మిగిల్చి ఉంటారనే ఆకాంక్షతో, చిరంతన భాండాగారాన్ని గవేషణ చేస్తూంటే

కం॥ బంగారు నీరునింపిన
సంగతిగా యవయవముల-సొరుంగలనీ
యంగమ్ము రుచుల గనిబా
యంగా, మనసొప్పకుండె నయ్యా! మాకున్ 372

గీ॥ అడవిఁ గాచిన వెన్నెల యట్లు మీర
లింత లేఁబ్రాయమందున-నిల్లు విడిచి
కావికుబుసంబు లాతాము-కక్షపాల
లంటి యడవులఁ దిరుగుచు-నుంటిరేల 373

కం॥ పాణౌ కృతులందుండిన
బ్రాణ ప్రతి బింబమైన-పణివయు నకటా!
బ్రాణాశన రహితయునై
క్షీణాంగియునగుట వలన-క్షేమమె మీకున్. 374

కం॥ సర్గ పరంపర మీ పం
సర్గము మాకంటు కెట్లు స్వాంతము నందున్
నిర్గమము చేయఁ జాలదు
దుర్గదమో తెలియరాదు-చోషి మహాత్మా! 375

కం॥ అని పలికెడు భామీంద్రుం
గను రెప్పల నెగిచి నింగి-గన్గొని నృపతీ!
తనుదాను తెలియ నేరని
యను మానికి వృత్తి చెప్ప-నలవడు నెటులో॥ 376

కం॥ తలిదండ్రు లెందరైరొకొ
యిలపైఁ బుట్టువులు తనకు-నెన్నియొ గలవో?
తెలియంగ లేము దానిం
దెలుపుట కేనెంత వాఁడ-దెల్లము గానన్. 377

కం॥ ఈరెన్ని దేండ్ల వయసున్
మీరని లేఁచార్యయమునన మీకాధ్యాత్మా
చారము లెట్టుల నేర్చిరి?
కారణ మెయ్యదియు పారి-కాంక్షులగుటకున్. 366

మ॥ నృపమూర్ధన్యకు మారు చిహ్నములుగా-న్పించున్ భవచ్ఛ్రీయుష్మో
ల్లపనంబందు మహాత్ములే ధరణి పా-లక్షోణియందుద్భవిం
చిపవిత్రింబొనరించి రన్వయమునే-శీలుర్ మీ మతండ్రుల్ గుడు
ద్వీపమేమస్కరి గూనతీయదగిసం-దెల్లంబుగావింపుఁడీ. 367

మ॥ పరతత్వంబతి శీఘ్రకాలమున సం-ప్రాప్తంబుగా దెట్టి మ
స్కరికిం దుర్లభమట్టి విద్యను వయః-కాలంబునం బూర్వమై
కృపణిన్నేర్చిరి యద్భుతంబుగను సం-గ్రామంబునన్ జానకీ
వరులాకార జితాత్మ జాతులు విక్ర-మ్యాఖ్యల్ సదామీరిలన్ 368

కం॥ కరుణాంభోనిధి తావక
చరణాంబుజ సేవ మాకు-నమకూర్చుటచే
దురితములు తొలఁగు శుభములు
నిరవొందుంగాన జరుపు-డీప్సితముదయన్ 369

సీ॥ మహిత మత్స్యాందికా మిళ-న్మాండములను
పొందు రేక్షుర సంబాన-వాలు మనువు
మించి జిహ్వకు రుచులు జ-నించుచుండు
తావకాంగ సుసౌష్ఠవ-దర్శనమున. 370

చ॥ స్థవిరపలాశజీర్ణ ఫల-శాక మృణాల వరాట కందముల్
లవజలముల్ గ్రహించుటను-లావుదొరంగి విశీర్ణ కేశులై
దివలును రాత్రి గూర్కనక-సట్టిక యాత్మ పరాత్పరైక్యమై
నవయు త్వదంగముంగనిన నానదొలంగును బాసియేగగన్ 371

కం॥ రాజవర ! రిపులు నన్ని
యాజిం బట్టికొని పోవ-నంత, తమసముల్
గాజుంగ్రిమ్మిన మెరుపున
నీజాడం బట్టి నార-లీయెడఁ జేరన్ 360

కం॥ ఒకరి మొగమొకరు గానని
ప్రకటతమిస్రమున బెళుకు-రాగుట్ట జగిన్
నికటుం బందలి గుహాగని
తికమక నట నిలువ వాస-తిండ్రిం జైసన్॥ 361

కం॥ అచ్చోటను నిలువ జాలక
పొచ్చాగు చంచలల జగిని-యే మలగుహాలో
జొచ్చి నిలువ నొకవ్రతి తా
జెచ్చెర జని యవన జంటు-జీలిచి చంపెన్. 362

కం॥ ఆలమున దవులు నన్నవ
లీలం బట్టికొని తురక-లేగుచు నొకచో
నేలను దింపిన నన్గని
జాలిని నే వచ్చిమాని-చంద్రుఁడు వల్కెన్ 363

గీ॥ కర్మలొనరింప దైవంబు-కర్తగాఁడు
కర్మవశమున భవమృతు-ల్గలుగుచుండు
కర్మలొనరింపఁగాఁడాను-కర్తగాని
కర్మతప్పించుకొనుట దుర్ఘటముగాదె. 364

కం॥ మీరు మహాత్ములు సత్యా
చారులు శుభచరితులమృత-సంగ్రహశీలుర్
కారుణ్యాత్ములు మిమ్మొక
కోరిక కోరదను దాచి-కొనక నుమువుఁడీ! 365

కం॥ ఆపాద మస్తకంబుల
చూపుల నిడి కలన మున్ను-జూచిన యతఁడే
యీపారి కాంక్షి యనుచుఁ
భూపాలుఁడు తనదు కోర్కె-మునికిం దెలుపన్ 354

వచనము : విని యుద్ధంబున నిన్నంటి తినను బుద్ధి మానిన

కం॥ అని పలుకఁ గోవ తపసిం
గని, మీరయ భవాని పాద-కమలములను నిశం
బును గొల్చు వారలని మీ
తను వంటిన మోక్షముం గోరఁ-దలఁచితి స్వామి 355

కం॥ ఉపహార మంత నొంద క
నుపకృతిఁ గావించు నట్టి-యోగులు మీకే
నుపకృతిఁ జేయం జాలక
నపకృతి నొనరింపఁ దలఁచి-తయ్యా మహాత్మా 356

గీ॥ తప్పుగలదేని దండించు-తావ కాంఘ్రి
కమల కేసర దళ కశా-ఘాతములను
మచ్చిరో మహ్యమం దొన్న-మశ్నివాయ
యనుచు మొక్కి-శివార్పణం బనుచు జోగి॥ 357

కం॥ మించిన భక్తులు మీరి
క్కాంచన గిరిచాపు కామ-కాయంబున కం
చెంచెదను భావి శుభో
దంచితముగ గలుగు పూరు-షాగ్రిణి యనుచున్ 358

కం॥ ఫాలస్థల మధ్యంబున
కేలుందగ మోడ్చి మాని-కేసరి మీరా
యాలంబున పగ వారల
నేలాగున గెలిచి వచ్చి-రిమ్మెడ కనినన్ 359

మ॥ అమితానంద రసాబ్ధి మగ్నుఁడయిది-వ్యాకృతి ప్రభావాఢ్యుఁడై
భ్రమణాంతఃకరణుండునై, వివశుఁడై,-ప్రాల్మాలి నిశ్చేష్టుఁడై
క్రమితాశ్లేషణ తత్పరత్వమున దోః-కాండంబులన్ జాపసం
యమికై శౌరమ సంభవంబనుచు దే-హాశ్లేష నుంకించుచున్ 348

చ॥ అడవులఁ బర్ణశాలల మ-హాగమ కుంజ గుహాంతరంబులన్
జెడిముడి నొంది కాయము కృ-శించి పరాత్పరు నేకతంబులో
బొడగను పారికాంక్షితనువున్ స్పృశియింపఁ దలంప నక్కటా?
పుడమిపెబూ! సుమారమునఁ-బోవుము, డాసినఁ బాపమబ్బెడున్ 349

గీ॥ కలన సామ్మ్యముఁ గొని మీర-ల లయునపుడు
దుగ్ధ ప్రేరేపణముననే-దో సమనక
తనువు స్పృశియించి మందుల జొనిపినాఁడ!
ప్రియహాసిని గాపాడ-వ్రతము చెడకు 350

కం॥ అనిపలుకు గోవత పసిం
గనిరాయలు మీర లెంతొ-ఘనత మెరయఁగాఁ
గనికరము తోడ నన్నా
యనిఁ బ్రోచిన మిమ్ము బ్రోవ నైతి లటంచున్ 351

మ॥ వనటం బొంది కృతఘ్నతన్ దమకునే-వంకన్ సుహృల్లాభమే
నొనఁ గూర్పం దగనైతి నంచు దిలస-ద్వ్యాప్తి వేధింప మీ
తనువెచ్చో దరిసింతునోయని వె-తన్ దైవార నిచ్చోనుమా
యనుకంపం దమగబ్బె ముచ్చటగన-త్యానందముం బొందుచున్

కం॥ కందర్ప రూప జితుఁడౌ
సుందర విగ్రహుని మోము-సొబగుంగని యా
నంద పరవశుండై నృప
నందనుఁడ స్వప్నలోచ-న ప్రభలొలుకన్ 353

కం॥ అయ్యెడ యావన సేనల
వెయ్యార్యరుల గూలనేసి-వెన్నంటి దేసల్
గుయ్యెడి బాకాలూదుచుఁ
జయ్యన శివరాజుఁ గాంచి సామీ! వినుఁడీ॥ 342

కం॥ చెంచెత యొక్కతె పొలమున
మంచె పయిన్నిలిచి చెంతే-మలఁ గనుఁ గొనఁగా
పొంచి యొక కంచె నంటిన
పంచాస్య ద్వీపిఁగాంచి-భయ విహ్వలయై॥ 343

కం॥ ఊరంబుల తరు వల్లీ
వారంబులఁ దూరితూఁ-వడివడి మమ్మున్
జేరి, యిటుఁ జెప్పె, మరి, యా
జేరువనుండినవి నాల్గు-శిథిల శవంబుల్ 344

కం॥ అని విన్నవించ రాయుఁడు
మనమున సంతసము వెనుక-మూత్సర్య బున్
బెనుగొన డాలును, గుంతము
ఘన కౌక్షేయంబుఁ బట్టి-కడు సంభ్రమమునన్ 345

కం॥ కృత హస్తులను కెలంకుల
వతులై, నడువంగ, శివ వ-నాయుజ మందు
ద్ధతి నారోహకుఁడై, ప
ర్వత సంధి దుర్ధర్ష బంధు-రంబులనేగన్ 346

ఉ॥ అయెడ కమ్మనోవు నిల-యంపు నికుంజము కంచ పుచ్ఛమున్
వాయువ వాసమున్ బొడుపు-వాలు మొకంబును గాంచి రాయుఁడున్
డాయఁగ నేగి, పేర్మిమని వవ్వుచు నద్దరి కేగినంత లేఁ
బ్రాయపు మాని మించువలె-బర్వత కందరమందుఁ దోఁపఁగన్ 347

కం॥ గుమికూడి వార లుద్ధత
తుములంబున నతనిఁ బట్టి-త్రోడ్కొనిచను నా
నిముసంబున నే పైకొని
నె మకినఁ గనబడఁడ దెంత-నింద్యుఁడ నైతిన్ 336

కం॥ వాని ధనుః పాండిత్యము
వాని కృపాణ ప్రశస్తి-వాని విలాసా
జ్ఞాన నరుచిరా కర్షణ
లేనిసువు తపస్వి కబ్బ-నీ యిలలోనన్ 337

తే॥ ఈనిరాబారి సింగాని-దే కులంబొ
వీని నెమ్మోము సొబగును-వీనులంటు
వాలు గన్నులు కెంపు వ-ల్వారుసఁ జూడ
నుత్తమ క్షాత్రజుండను-నూహ లెసఁగు॥ 338

గీ॥ అడవి కాపరి నిసువుల-నచ్చటచట
నెందరిని జూడఁగా లేదె-యేను మున్ను
అందు నెవ్వానిపైన నా-యాస గలదె
యితఁడు, నే, తొల్లి పుట్టువ- నేకమేమొ! 339

కం॥ కాకున్న నింత ప్రేమం
బేకారణమునను గల్గె-నీతని యెడలన్
మాకనుచు నింక నీపై
నేకరణిన్వానిఁ గాంతు-నెట్టు లరయుదున్ 340

కం॥ నను రక్షింపఁగ నాతఁడు
జనుదెంచి, విపత్తు తతిని-జా నేసి, మహా
జిని దాఁ జిక్కిన నేనా
ఘున నిన్ రక్షింపలేని-కట్టడి నైతిన్ 341

కం॥ మించి తురుష్క వ్రాతము
గాంచిన దన కెట్టి కీడు- కల్గునో యని లో
నెంచి మృత వ్యాఘ్రము నొక
కంచెను నిలువంగ నుంచి-కడలం జూడన్ 330

కం॥ శేరాయి వెనుక రాజై
దారను పుత్రికులు దన్ను-దర్శించు కడన్
జేరంగ రాక యుండను
తూరుపు దెస వేగుచుక్క-తోరంబయ్యెన్ 331

కం॥ మందేహాకర మకుటము
లం, దలరిన, శోణమణుల-నాదిత్యుడు రు
క్ఛందా శుగముల తోలిపల
యంగన్ బోగిడిన రీతి-నరుణుఁడు తోచెన్ 332

కం॥ గిరి శిఖరంబుల నుత్కట
తరుపర్ణంబులను సస్య-తతి నెల్లెడలన్
కరిగిన పుత్తడి నీరున్
విరియించిన పగిది దోచె నీరెండ ధరన్ 333

మ॥ మకుటాగ్రస్మిత రత్న రోచులుడులన్-మూకా పక్ష్యేదన
ప్రకటాంచద్గరు దాని లచ్ఛటలకూ-పార ప దుర్గముల్
బెకలింపన్ ద్విష దుత్తమాంగములను-ర్వీచక్ర తాళస్థితుల్
బ్రికటించవన్ శివరాజు సైన్యములతో-బ్రత్యర్థులం బోలఁగన్ 334

కం॥ నను సాంపరాయ తుండును
మును కొని యావనులు సొమ్ము-వోనేయంగా
జనుదెంచి యొక్క మస్కరి
తనయుం డడ్డంబు సొచ్చి-తలగించు నెడన్ 335

గీ॥ చురియఁ గొని కేలు నోటిలో-జొనిపి లాగి
మిగులు కేలున కుడిప్రక్క-న గలఁ బొడువఁ
గాండ్రు వెట్టుచు నిలకడఁ గాళ్లదన్ని
గీకలిడి కొంచు నుసురులు- గెడపు నంత 326

గీ॥ అనల ఋణా, పిత్రు, శత్రు శే-షాళి నిడుట
కూడదను యుక్తి నాజోగి కూన కొంత
యెఱుగువాఁడౌట మిగిలిన- యిఱువ జీర్ణ
యొమ్ము నడుములు చురియలు- గ్రిమ్ము మడిపె॥ 327

వ॥ అయ్యవసరంబున 328

సీ॥ తొలిగట్టు కొన మీదఁ- దొలికిన యెఱగలి
ఛాయలతో మున్ను- సరస మూడి
మడి కాసు గుబ్బలి- నెడనెడ విరిసిన
పులుపూల గుములు- కలియఁ బ్రాకి
పుడమి జేండ్ల న్నులు- పొందొనర్చిన బొండు
మల్లి పూగుత్తుల మలఁగి పెనఁగి

గీ॥ చండ కిరణ ప్రకాశితో-ద్దండ దీప్తి
పాండుర ప్రభ తంతోప- తండమగుచు
పుండరీక భవాండముల్- నిండి నిండి
గండు మీరెను రేయెండ మెండుగాను॥ 328

కం॥ ఆ వెన్నెల నిగనిగలను
గోప జడ ల్దారి దెసల గుట్టలఁ జూడన్
యోహను లల్లాహా యని
త్రోవలు గానకను బాకు- రొదలన్వించున్ 329

సీ॥ కన్నువాల్దొర రాణి-పెన్నెఱుల్ సడలింప
తూర్పెత్తు కప్పు మే-ల్త్రాగలఁ దెగడి
తొలుకారు మబ్బుల- కలరిన తెలిగన్ను
పులుగుల పురుల సొం-పులను మీటి
దాసానిపూఁ దేనిఁ-ద్రావగాఁ బైకొను
నిర్తిగ కాల్చాలు-లేవు మించి
చొక్కంపుఁ దలిరుల-మెక్కి గ్రక్కున దేన్చు
గెంపు కన్నుబులుగుల-సొంపు మీరి

గీ॥ రెండు త్రావుళ్ళ నేరెడు- బండి గేరి
దేవల మిను మన్న మిసిమిసి-పసల మసలి
కసరి గొసరి పిసాళాల- యసముఁ బోలి
కారుచీకటి జగమెల్ల -గప్పి కొనిన॥

సీ॥ కంట వ్రేలిడి నిలిచిన-గానరాని
కటిక చీకటి గ్రమ్మిన- ఘాన్య జీర్ణ
ముస్కరి కుమారకుని బట్టి- మళ్లి దారి
కనుగొనగ లేక యొక మిట్ట- కొనకు నెక్క

కం॥ అందలి శుభ్రశిలా తత
బృందంబుల దీప్తిగాను- పించిన యొకబల్
కందరము చెంత నిలువఁగ
గ్రిందు కొనెన్ జడియు మిగుల . గామపుతోడన్

కం॥ చలి వాన నడలి వారా
బిల మార్గము వట్ట నొక్క-బెబ్బులి చేవన్
మలకల నిర్వ్వారఁ జంపిన
కలగక నందడవి కాపు-గ్రక్కున దానిన్.



శ్రీ శివాజీ చరిత్ర సత్కృతికి కర్త
సరసకవితా వినోద సత్చ్చక్రవర్తి
శాస్త్ర కావ్యార్థ మార్గసంచార శీలి
అర్థి మందార బంధుమిత్రాదరుండు
బలిజపల్లి రామమూర్తి సత్ప్రభువరుండు

గీ॥ హేళి నిభ కాంతిని మరాట- మేలు వాఁడు
తల్లిదండ్రుల కెడమయి- తల్లడిల్లు
నడవికాపరి నరి కట్టి- యరుగుచున్న
చెనటి పగతురఁబట్టి శా-సించు వాఁడు 316

కం॥ నావిష్ణుః పృథివీ పతి
నావచనంబులను జగతి- ననదలఁబ్రోవన్
భూవిభుఁడు గాక యెవ్వరు
దేవా! రక్షించు వేగ- దీనజనాళిన్

కం॥ అనరొందు దీన జనముల
ననయము రక్షింప కాంచ-నాంగద చయముల్
ముని జేత గట్టు దాతలు
నను రక్షణ జేయవలె న-నాథనుగావన్ 318

గీ॥ కలను సొమ్మని గొని రాయ- లలయునట్టి
సమయమున దుర్గప్రేర-ణమున యేను
భీషణాంబకముల వారిఁ-భీచమణచు
నట్టి ఫలితము వెంటనే కట్టి కుశి పె॥ 319

కం॥ అనిపల్కు దీన వాక్కులు
విని శివరాయుండు వాత-వేగస్ఫురణన్
జనుదెంచి యవన వీరుల
సునిశిత మార్గణము లంది- గ్రుక్కించు నెడన్ 320

కం॥ పతగ వ్రాతము నీడల
నతిరయముఁజేరు సెలల- యమృతంబులురో
హిత రుచులం గ్రాలంగా
పతంగుఁడ పరగిరి శిఖరి-పై నెలు గొందున్ 321

గతి, దెబ్బలం జేయుచు, నెఱికలుఱక, కఱకుటమ్ము కొఱకొఱంజూరక
నేయుచు, నరదంబుల, హత్తుల కత్తులాణంబుల సత్తువలిగుఱొత్తి
నెత్తియలం దుత్తుమురుగా, గత్తివాయమ్ముల నొత్తుచు, నెత్తురు
వఱ్ఱులం బరపుచుఁ జీకాకు గావించు నెడ. 312

కం॥ కారాకుల పెను గుట్టల
కారగ్గి దొరంగి పొనుగు-గాల్చిన రీతిన్
వేరం పుటుడ్డ పసుపుల
నీరుం గావించి పగర-నెమకెడిలోనన్. 313

గీ॥ రూపుమాయక మిగులు తు-రుష్క చెయము
లేవగొని చేతఁ జిక్కిన- యెక్కటీని
జిక్క నీయక నీ జోగి- చెనకె మనలఁ
గాన వీనిని బట్టుట- మానవలదు'' 314

కం॥ అని యూహించి బిరానను
మునుకొని యాతనిని బట్టి- మూపులనిడి. కొం
చనురక్తి బాఱ జోగియు
పన రొందుచు భీత చిత్తుఁ డై యిట్లనియెన్ 315

సీ॥ పుడమి వేల్పుల దేవ- పూజలకడ్డంబు
జగమున లేకుండ-జరుపువాఁడు
చతురంఘ్రులను వృష- చ్ఛాయలుర్విఁ జరింప
సభ్యరీతి రంబులే-కరయు వాఁడు
వయసు పూఁబోడుల- జయసింత పోకుండ.
సర్వాసర్వం సహాన్- సాకు వాఁడు
అరమూలు గెప్పల- నరుకులాటలు లేక
భూత హితంబుగా-బోచు వాఁడు

ఉ॥ మేలి కడాని గంటలను - మిక్కిలి గల్గిన గోవు సింగిణిన్
గేలను బట్టి యల్లనొక - కేలను జానుగ నంటలాగి బ
ల్గోలలు వానలం గురిసి - కోలు మసంగి దణాల పంచ బా
గాళ మొనర్చి తీర్పరుల - గాలుని బోరిలికి నంపి చెచ్చెరన్ 310

సీ॥ చూపులంటిన వారు - రూపులు మాయగా
తూపులకో పుల - యేపుఁజూపి
యెదురు గారులచాలు నుదురు లానుచుఁ దోఁక
లదరి తిన్నగఁ జేయు - నమ్మ లేసి
యడి యాలముల పొద్దు - నడగండ్ల నీడల
కిడు గొల్లె నల బోల - నెగురఁగొట్టి
తొడలేక బండిదొల్దుము వారి చెమటార్చ
సీవురంబులు మింటఁ - జెల గఁద్రుంచి

తే॥ బదరి గుదులుగ తేజులఁ - జిదిమి యెదురు
చెదరి మొక్కట్ల గదియుచు - విదలకించి
బొదివి పౌజుల గదరుచు - నుదిల పరచి
బెదురు నదురొందకని బువి - చదుకొనర్చి. 311

వచనము :- మఱియు నమ్మగల మగండును మకంబడు పిడుగు తెఱంగున, నొక్కపరి నెక్కట్ల పయిం గవయుచు, బెక్కుగతుల నక్కులు, డొక్కలు, ముక్కులు, జెక్కులుం జెక్కుచు, వెన్నెమ్ముకలం గ్రన్ననం దుమ్మొనర్చుచు, నడుగులుం, దొడలు, పిరుందులు, బొమ్ములుం గద్దువులుం దెగనేయుచు, నెల్లెల నడియాలంబుల సీవురంబుల సింగిణుల నత్తలంబులం బత్తళికలం దుత్తుమురు గావింపుచు హమ్మ తేజీలనక నుడ్డ తెగ యొడ్డువలం జిడ్డు కడలిం దరిగట్టుడ్డాడ నొడ్డగిలు మడ్డి తరగలం బతె గలంచుచు, చినుకు తఱించెను గ్రమాకులతో వియ్యంబు నందెద మని బలియు పొను గెండినం గవియు నెఱగలి కరువలి బాసటం బెరిగి, కేర్లిల్లరికి, తాళ్ల మారేళ్ల, నీళ్లంగలుపు

కం॥ ఉసకొట్టు చుట్టు పుర్వుల
పసగల తీరులను జోగి పాపని బొమ్మన్
గసిదీర నేసి కణతల
విస మంటిన కోలనేసి-వెరపొనరింపన్ 304

మ॥ పులిలోఁబొందక జోగి సింగ మెద బెం-పున్ జేవయున్మీరగా
క్షయిజారమ్ములు నాల్గిటన్ బగతు బిం-కం బింకంగా నేయుడున్
చెయిదిం దప్పిడ నంతఁదాఁ దెలిసి బ ల్చిల్లుల్ వడిం జోగిపై
నెయిదింగప్పి, తటాలునం గలిసి పు-క్కింటన్మెయిన్నించినన్ 305

గీ॥ కొన్నిమై గాడి వేగమ-వెన్ను వెడలి
మన్ను తూరిన జోగి న-మశ్శివాయ
యనుచు సొమ్మను గూన రాయుఁ-డపుడు తెలిసి
యెవ్వఁడీ గోవతపసి యం దెదఁ దలంచి॥ 306

కం॥ మున్నెచ్చటనో యొకపరి
గన్నాఁడను నిట్టి రూపు-గాని, యితండీ
గొన్నెత్తురేట మునుగుచు
నన్నుంగావంగ కార-ణం బదియేమో! 307

ఉ॥ ఇంతటి ప్రేమ నాయెడల-నేటికిఁ గల్గెనో వీనికంచు లో
నెంతయుఁ బ్రచ్చుచింత పసి-యీడున నేటికి జోగియయ్యెనా
వంతను బాపమంచు మల-పట్టి పటాలుగ నిట్టి రూపులో
చెంతను బోరె నంచుబుకు-జెంది మరుల్గొను నంతలోపలన్ 308

గీ॥ ఖానులోక కొండడా జోగి-కమ్మవిల్లు
బట్టికొంపోవ నుంకించి-బదరు నంత
బానటకు వచ్చు నాతనిఁ-బట్టు శ్చెరిఁగి
మునుకొనక యుండుట న్యాయ-మని కడంగి॥ 309

కం॥ దట్టంబగు రుది రక్కల
నెట్టము సిగనొప్ప కొలిమి-నెగడుచు నంజల్
ముట్టికొను కావిజేవురు
మట్టిక మరంటి జోగి-మన్నీఁ డొకఁడున్ 300

ఉ॥ బెట్టగుజట్టు పుర్వువలె-బీరము గ్రక్కు- మెఱుంగువాలు జే
పట్టు కడింది యత్తలము-వాడి లకోరులు విల్లు దాల్చుచున్
గట్టుపకొనుఁడై పగర-గన్గొని కన్నుల నిప్పులుర్లగా
నట్టె తుటుమ్ము జొచ్చియువ-మారుచు పొద్దును బోలివెల్గుచున్ 301

సీ॥ బలుగాలి వనఁటుతో-పులు గూలు పగిదిగా
నరదముల్ మనియల- యట్లొనర్చి
జేజేల దొరవాలు-చేఁ గూలు మలలట్లు
రెండు తాౢపుడులను- జెండివైచి
తెరువుగాపరి యిట్టి- తెగలు ద్రుంచెడు రీతి
బాబాల తుటుములఁ-బడలు వరచి
మెఱగలి కారాకు-లేర్చెడు చందాన
మొక్కట్లు తల పుట్టె-లెగర నఱికి

గీ॥ మారిమునగొని మొడలుల-మాడ్చురీతి
నుడ్డ తెగచేరుపులను మా-రొడ్డ కుడిచి
పదరి కేరుచు గిరికొని-పగవజీరు
నాము నింకించి శివరాయు-నండ నిలువ॥ 302

గీ॥ అబ్బురంబంది ఖానుఁడ-య్యెడవి కొవు
నట్టెగన్గొని బొమముడి-వెట్టు కొనుచు
పొగవరువడ వేళ నడిజాము-ప్రొద్దురీతి
మంటలురి యంగ నాజోగి-దంటనాంచె॥ 303

గీ॥ మిత్తి కాయమ్ములను రొమ్ము-నత్తిమొత్తి
కడిఁది సిలుగులు కణతల-కడల నేసి
బెడఁగు సరముల నొడలెల్ల-నడక జేసి
మించి ఖానుఁడు కాయు న-లంచు నంత

గీ॥ ఏనుగులువాజు లరదంబు-లెక్కటీంద్రు
వేనవేలు పరాలుగా-వెనుక గ్రమ్మ
మించి యాతండు రాయల-మేన వాడి
చిలుకులడరించె నూపిరి-చెలగ కుండ॥

శా॥ కాలుంగేలు గదల్పనీక పగతుల్-గాటింపఁగాఁ గుందుచున్
డాలుంగేలను బట్టుచున్న వెనువెం-టన్ నుగ్గునూచంబుగా
నేలంగల్పిన నొచ్చి డెందమున నెం-తే వంతల గ్రుందులోఁ
గోలల్ వానలు మెండుగాఁ బరపిచి-క్కుల్వెట్టగా రాయలున్

శా॥ మున్నెక్కట్టులతోడ మిక్కుటమునం-బోరేను గావింపనే
కన్నాకుల్గిరి కొన్నునెల్లిదముగా-గంటూడ్చి మాయింపనే
యెన్నండిట్టి బెడంగు చిక్కగనలే-డే నీమురంబందునన్
బన్నంబొందెదనేమొ సామి! నెలతా-ల్పా! యంచు,లోఁ,గుందులో

కం॥ పుడమి చెలినుండి వెలువడు
కడుదురు లన్నిఁంచునట్టి-గాటపుఁ జిలుకుల్
కడతల నక్కున పగతుకు
వడిస్రాట్కఁగ, తేరిమీఁదఁ-బడి సొమ్మగొనన్

కం॥ తెరువుంగా షరియేను [illegible]
దూరిలోఁ జిక్కకొనియుండె-నొప్పర కింపన్
దిగ్భడదని వడివాఁడో
[illegible]వడిఁ బట్టికొన నెంచు చున్నట్టి యెడన్

కం॥ అంతం గినియుచు ఖానూ-
డెంతయు బీరంబు గదుర-నెన్నియొ తేరుల్
పంతమున రాయునోడలిసు
మంతయుఁ గనుపడక నించె-నబ్బుర మొదవన్ 290

గీ॥ అమ్ము వెట్టుగ ఫౌజుల-నదరు ఖాను
దిటమున కొంకింత నిలువక-దెసల బారు
వెరవరులఁ గాంచి చిడిముడి-విసుగుఁ జెంది
క్రొత్త తేరెక్కి చివ్వను-గోరి తేఁడు 291

కం॥ జానుగ దనుకను గొనయము
పూనికగా లాగి తురక-పోటరి మేనన్
మూనూర్లు తేర్లు నింపిన
పేనులు గుయివెట్ట సోలి-వేగమ వాఁడున్ 292

కం॥ ఎక్కిడిన విల్లుఁ దునియుచు
నెక్కిడులో గొనముఁ దెంచి-యెల్లియు సిడమున్
గ్రక్కున నిల్పైఁ గూలిచి
పెక్కమ్ములు నొడలునాటి-బీరం బొలుకన్ 293

సీ॥ కలుకంతు తిగకంటి-కలుకు మంటలఁ బోలు
తూపుల నెమ్మికల్-దూలనేసి
కప్పుత్రా చెక్కి-గాటు కోరల దీటు
గిట్ట లుక్కర సోడు-ముట్టనేసి
గుబ్బలి మొంగలి-కొనల కీడగు చున్న
మురువు లకోరీలు-మోమునాటి
కడనాటి మబ్బుల-వెడలు పెన్పిడుగులఁ
బోలు నారసములు-మూపులంటి

కం॥ అట్టియెడ శైవరాయఁడు
బిట్టదరి తురుష్కసేని-బీరమ్మొంకన్
గట్టిల కోరలు ఱొమ్మున
పుట్టను నిడుపాములు సొచ్చు-పోలిక నింపన్ 286

ఉ॥ అక్కలగాడి యాశరము-లవ్వలి మేనున విచ్చిపారుచో
నిక్కి విసమ్ము తాలుపుల-నేఁకొలంకున మున్గనయ్యెడన్
చిక్కక తేని బత్తళిక జేరి మిడుంగురు లొప్ప గ్రక్కుచున్
రెక్కల త్రాచులట్లరిము-లిన్ బగతీర్పరి నొవ్వజేయుచున్ 287

ఉ॥ మిక్కిలి కోపమూని పగ-మేటరి నూరుపదారు తూపులన్
జుక్కలు మేన గన్పడెను-చొప్పున యల నేయనాతఁడున్
జొక్కి తురుష్కునిన్ నుదుట-జొన్పె పదారును నూరుకోలల
ట్లక్కజమై పెనంగునెడ-నాము ధలిర్చి శివాజియుక్కునన్ 288

సీ॥ పిడుగుల కెనయైన-బెడిదంపుఁదూపుల
ఘుండిప్రోద్ఘోరమేను చెండి చెండి
విసముఁ గ్రక్కెడు కంటి-నిక్కుల్లమించిన
చిలుకలు ఱొమ్మెల్లఁ-జీరి చీరి
నెలసరి గోళ్లతో-నీక్షైన యలుగుల
గుంపుల చేసోడు-చింపిచింపి
మిత్తి వాతికినేన-మించిన తీరుల
నుసురులపట్టెల్ల నొంచి యొంచి

గీ॥ యెల్లిసిన మొక్కకేలచే-దుల్లనేసి
తేరినడిపెడు వానినెత్తినిబగిల్చి
సింగిణిని ద్రెంపి వాజులఁ-గ్రుంగఁజేసి
కంచు మించుగఁ బోరెనె-క్కట్లు చెలగ॥ 289

కం॥ పన్నిదముల్వైచి చూచిన
కన్నాకుల యొడలు వ్రేలు-కడజొనుపంగా
చిన్నయొడలేనిగాయము
లెన్నియొ గన్పడి యొనప్పు డిరుతెగలందున్ 280

కం॥ అయ్యెడ పేల్తై రాయుని
జయ్యలు యావనుల చేవ-జెరుపంగనియున్
గుయ్యిడి పత్తేఖానుఁడు
చయ్యన పగ మొనలనంప-జడిముంపంగాన్ 281

కం॥ మోర్గో ప్రతాపశాంతుల
సూరెలగల దిమ్మవెల్ల-ద్రుక్కించుచు కా
ర్పాభగుల మేనుల మిక్కిలి
జీరిదగా పెద్దతికము చేవంజెక్కెన్ 282

కం॥ వెన్నియ్యకొనక మువ్వురు
కన్నాకుల యొద్దలు మిగుల-కలుగులు వెనుకై
యున్న పదాతులు గన్పడు
చున్నట్టుల బోరిపోరి-యొడలున్మరవన్ 283

కం॥ మువ్వన్నె మేకము గన్గొను
చివ్వగు లట్టుల మరాట-చేరువబారన్
దవ్వున నుండిన శివరా
జువ్వెత్తున వచ్చిపగగి-నుక్కర గవియన్ 284

కం నింగిన్ ముట్టెను వసువున
బొంగెడు నీర్వామి కలము-మునిగెడితరితో
డింగిగను మానిసుల గతి
నంగదలం బాసె రాయుఁ-డరుదేవారల్

కం॥ ఒకదణీ నడగడులను మఱి
యొక వెరవరి యెల్లియల్లె-నొకపోటరివి
ల్లొకదొర బత్తళికను నిం
కొకలావరి యొకడు పోడు నుచ్చిఁగుల్పన్ 275

ఉ॥ విల్లుసిడంబు మేనుతల-వ్రీలిన బాపఁడు నొచ్చిఁగ్రక్కునన్
గల్లుల తిప్పపై జడమె-కంబిల లేళ్లకు, మూకుకై నడిన్
గొల్లున గెంతివాలు జళి-పింపుచు తిప్పన దిమ్మతూరుచో
ద్రుళ్లుచు గెంతుచున్ బగర-దూలగ వేయగ బొర్లెమొండెముల్ 276

శా॥ కాలుంగేలును డొక్కలక్కలునుజం-కల్ మూపులున్ బుఱ్ఱలున్
నేలందొర్ల కళాసముల్ దునియగా-నెత్రుంజడుల్ వఱ్ఱమో
కాళుల్ సోములముంచె నెమ్మలి సుకల్-గత్తుల్ కటార్లత్తళాల్
మీాలై సీవురు లంచలై కొలకునె-మ్మిన్ బోరుమన్నొప్పినన్ 277

సీ॥ బలుకావఁ జెనుగాలి-నలి గూలుచందాన
సడియాటు ములచాలు-లీలనుగూలె
పంజడీ గుట్టలు-పెగిలి రాల్కప్పరాల్
గతి రెంజుద్రొవ్వుచుల్-గలనస్గిలై
సువ్వె మున్నీటల-లొడ్డంటి గూరిన
ట్లుసురుల మసియమ్యె-పసరవాలు
మూరి మసంగిన తీరుగా బోదలో
మొనసిడింకలు వేయు-మనసరీండ్లు

గీ॥ నైమరాటులు యూవను లాముమీారి
హర! మహాదేవ! యక్బర-ల్లా !హూ! యనుచు
పారి కలియుచు, నిల్చుచు-తూరిపడుచు
సిరువెగలు పోరెగొంకు జం-కింత లేక 278

గీ॥ పోరు మిక్కుటమై నల్ల నీరుపాఱి
నిలువుమించిన యొక్కట్లు-చలముమీారి
యత్తలాలూతగా నిక్కు-చలల మునిగి
యాదులాడుచు పగతుర-నెగిరె పొడువ. 279

గీ॥ లిమ్నమహాదేవి ఘనవేణి యింకువదన
మధికచపలాంగ, మరుణాంబు జాంఘిుగ్రయుగము
నక్షులను కాంచియీయమనము తవిడవ
నభిలషింపదు మనమంచునాతడలరి॥

ఈపద్యము అమ్మవారిఅందమును ఆవిష్కరించుచున్నది జగత్కళ్యాణి సౌందర్యలహరీ సందర్శనము చేసిన ఈమహనీయుడు ఎంత ధన్యుడు! శివాజి తనయులను జేరబిలచి, చేయు హితోపదేశము, ఒక రాజనీతి సారసంగ్రహముగా కన్పట్టును. ప్రభువులు పాలనమెట్లు చేయువలయునో, ఏ, ఏ, ప్రమాదములకు పాల్పడరాదో విపులముగ వాఖ్యానించెను. శివాజి రాజనీతి రహస్య నేతృత్వమునకు ఇది నిదర్శనము

శంభాజి అవినయ ప్రవర్తనమునకు అతని వలకేలుతొలగింపుడని ధర్మప్రభువైన తండ్రి శివాజి ఆదేశించెను. రాజనీతి అసిధారవంటిది. దాని పదనుకు శత్రువైననూ పుత్రుడైననూ ఒక్కటే అంత నిష్ఠురముగ ధర్మమును పరిపాలించినవాడే, ఆదర్శప్రభువు అగును. శివాజి ఆక్రోవకు చెందిన మణిపూస, తల్లి సోయరాభాయి రాజదండనము విని తల్లడిల్లుచు శివాజితో మొరపెట్టుకొనును. ఒకవంక పుత్రుడు మరొకవంక కన్నామె కనికరముకొరకు వాత్సల్యముతో అర్థించుచున్నైమోడ్పు, ధర్మమునకు దయ యెక్కడ? శివాజి ధర్మాభిమానమట్టిది. ఈసన్నివేశమును పరమ రమణీయముగ చిత్రించినారు. కొడుకు శంభాజి తుమ్మకుల కొల్వున కేగెను శివాజి ధర్మసంస్థాపనార్థముదయించిన మహావీరుడాయెను. ఈ చర్య అతనికి ప్రక్కలో బల్లెమాయెను. కొడుకును గురించి ఎన్నెన్ని కలలుకన్నాడు. శివాజి పరితాపమునకు అవధిలేదు.

ఉ॥ నా తనయుండు శేషనగనాథ కిరీటమణీ ధగద్ధగ
ద్యోతిత పాదపద్మ యుగబ్ధోద్ధతుడై బహుళాద్వారాప్తినా
శేతహిమాచలాంతర విశేష సుంధరినేలు నంచునే
బ్రీతిజెలంగనీ వధమవృత్తికి బాల్పడితేల? పుత్రకా!

గీ॥ జోగి వేసంబు సమకూర్చి-యోగనిష్ఠ
దగ్గి కడనుండ తురకలు-దొడరె రాయు
నది గనుంగొని యనిసీల్గు-నతని చేతి
కత్తి విల్లమ్ములను బట్టి-కలనఁ జొచ్చె॥ 396

గీ॥ అధిపునకు బాసయాట య-నాది గాఁగ
జరుగు వృత్తాంతమెల్ల ని-జంబు చెప్ప
నబ్బురం బొంది తమచర్య-లన్ని చెలికి
విన్నవించి పురంబున-వేడ్కఁ జేరి॥ 397

కం॥ పౌరుషమున గిటివాచును
కారుణ్యమునందు శివవు-కామిను లంపుక
ధీరాధీరవు నిన్నొక
తారుణ్యాంగన వటంచుఁ-దలఁపందగునే॥ 398

సీ॥ ఘోర సంగరముల-వీరాధి వీరుల
కంఠ నాళంబులు-క్కఁ-అను నతికి
అష్టదిగ్జయ రమో-త్కృష్టాధి నాథుల
యుత్తమాంగములఁ దు-త్తుమురొనర్చి
సర్వసర్వంసహా-ధూర్వహో దగుర్విల
గండ పెండెరములు-చెండి వైచి
దుర్వహదోర్వీనాథ-దోర్దండ ఖండిత
భూమి భృద్వకుల రూ-పులను మాపి

గీ॥ అశనిదారిత వక్షస్థ లాధ్యహృత్తు
లచ్చు బిసమాత్రి మట్టులూ-టాడఁ జేయు
శైవరాయుని హృదయ మ-శ్వత్థ పత్రి
మట్టులల్లన నూటాడ-నట్లొనర్చి
తకట నీరెన్నిదేండ్ల పా-యంబునందె. 399

వ॥ ఇట్లు సఖి వారము రాకుమారి నూరార్చుచుండ॥

## —: సోయరా శివాజీల వివాహము :—

అంతటఁ బంచబాణుని శితాశుగ ఘట్టిత హృత్కవాటుఁడై
చింతనమాక్రమింప శివజీ యొకనాఁడు ప్రయాణ బుద్ధియు
త్క్రాంత తురంగ మెక్కుచు జవంబున నేగె, ఖురాగ్రధూళిదు
ర్ధాంత, నితాంత, కాంత, కకుబంత, మహాంతము లాక్రమింపఁగా

శా॥ శంకా తంక విహీనుఁడై నృపతి యశ్వాంతంబుఁ దాటించి, న
ల్వంకల్ జూచుచు దుర్గమాటవుల శైలవ్రాతముల్ దాటి శా
ర్వాంకుండై, తమితోడనేగి రమణీయాధ్వంబునన్ జూచె శ్రీ
పంకేజాత నివాసినీ తులిత సౌభాగ్య ప్రభా తాపసిన్॥ 401

గీ॥ దారినేగెడు నా జడదారి పడుచు
గాంచి, హర్షించి, జవము తగ్గించి, మించి
వారువంబును డిగి యామె వంక కరిగి
పల్కె శివరాజు నిర్మల భాషణముల. 402

గీ॥ నీవు నారణ్యమందు నీదినిండు ప్రాయ
మతివ! యెట్లుండ గలవిట నలుకు లేక
యీ మహారాష్ట్ర సామ్రాజ్య మేలునట్టి
యీ, శివాజి వాక్యావళి నెల్ల వినుము. 403

చ॥ అను శివరాజు పల్కులకు నాయమ యచ్చెరువంది, యాత్మసం
భావిత, నితాంత, రాగ, విల, సద్రుచిరానన కాంతి రేఖ ల
వ్వని, వెలిగింప, మత్స్యముల వంటి కనుల్ విశదంబుగాచు, సి
గ్గున నటియింప, నాననము గొంచెము నెత్తుచుఁ జూచె నాతనిన్.

మ॥ జగదేకోజ్జ్వల దివ్యలక్షణ లసత్సౌందర్య లావణ్యయున్
దగ వీక్షించి శివప్రభుండు కడు మోదం బందినీ వేటి శ్రీ
మ్నాసంకీర్ణ మహాభయంకర వనోర్వీసీమ యందొంటరి నుం
డగఁ గాంక్షించితి. తోడు లేక, గతి తోడన్, జెప్పుమా సుందరీ!

మ॥ అట్టి నిశీథినీ సమయ-మందున శైవవరుండు రోహిండఁ
ముట్టడి సేయఁ దద్విభుఁ డ-మోఘ పరాక్రమ మొప్పఁ బోరగా
బెట్టిదమయ్యె నారణము-భీతిలె శైవబలంబులంత, న
మ్మట్టడి జొచ్చిరాయుఁడు స-ముద్ధతి శాత శరాళినించగన్ 102

కం॥ రోహిండ నాథుని బలసం
దోహమునొచ్చియును దోడు-తోడనె వారల్
వ్యూహములుగట్టి శివవరు
దేహము వేరేదు పంది-తీరొనరింపన్ 103

ఉ॥ కోపము రూపమోయన న-కుంఠిత విక్రమ సాహసంబులఁ
జూపుచు రాయుఁడబ్బలముఁ-జూర్ణము జేయఁగ రోహిడేశుఁడున్
జాపముద్రించి వేగమగ-జంబును డీకొలుపంగఁ దుండమున్
జాపి, యనేకపంబు శివ సాధిని, దభ్యముల వధింపఁగ 104

కం॥ ధృతియె సహాయ్యముగా న
య్యతి రథ వర్యుండు బెదర-కౌడు గరచుచు
ద్ధతి భూమికి లంఘింపఁగ
నతిరయమున శత్రువీరు-లతని గవియుచుఁ 105

గీ॥ ఒంటిజిక్కె వీని-నుక్కణగింతము
కదిసి, యేసి, పొడిచి,-కట్టుఁడంచు
నొక్కమొగిని వార-లురికి కోలలనింప
నొడలి మరువు మసిసి-పుడమి దూకె 106

కం॥ సెలయేళ్లు పఱచు నద్రిం
వల పెట్టెను నొడలి నెత్రు దద్దయు జారన్
బులి కొదమ వోలె వాఁడు మ్మని
బలు గుదియం ద్రిప్ప వగ-బారగ కోలఁ 107

వచనము : మఱియును 96

కం॥ కారాగారమునం గల
వారల దారాత్మజాత-వర్గము నెల్లన్
సాంతత రోహాయనము, ల
పాంబుగ నొసగి, వలయు-పట్టులకంపెన్. 97

కం॥ ఈగతి జావళి సీమలు
దాగి జిబిజి వడక గొనుచు-దరి రోహిడమున్
వేగమ్ముగ్గైకొన నెంచియు
నేగన్నొకనాడు శైవ-నృపుఁడట కిటులన్ 98

లయగ్రాహి :
తోరమగు నీడల న-నారతము నేనకిడు
తీరయిన డెక్కాముల-బారులగు తేరుల్
దేరులరు గంగ తమ-భారముల శేషఫణ
వారమల యంచు పస-దారులగునేన్గుల్
వారణములేగ పొడి-దేరు బలు ధూళులన
పారముగ రేచు పద-ధారగలమావుల్
వారువములంజలిడ-దీర నటు కాలుగమి
పేరెములువార బలు-సూరతతు లేగన్

గీ॥ తన మహాతపమున కెఱ్ఱ-దనముదోప
సైన్యఘటిత ధూళి నలమె ను-సత్వరముగ
తనదు వంశజుఁడి కనేలఁ-దానటంచు
నకి, నస్తగతి వడసె భా-స్వంతుఁడంత. 100

శా॥ బాలార్క ప్రభనొప్పి పారసి యిరుల్-వార్ధక్యమందాతనిన్
గోలెంజేయఁ దలంచి, మిన్నలమనా-ఘృష్టి శుభాను ప్రభన్
దేలంతారలు శశాంకుఁ డీప్సితుఁగొని, యు-న్మేషంబునన్ వజ్రిప్రం
బోలన్ మిన్నకనానెనోయనఁగ సం-కూరించెఁదారల్ దివిన్ 101

సీ॥ తేరు తొక్కట జాసి-దారులు దప్పిన
చోటులు వడగింగి వాటములుగ
పలుగొమ్ముల మెకంబు-లలిగి డీకొని జిమ్మ
తావులం గప్పక-పొగ్రిపులనఁగ
వాజుల నలిరేగి-తేజులౌ చుండిన
నేల తెలారులఁ బోలియుండ
కాల్వీర మొత్తంబు-కై దువుల్నెరపిన
పుడమి తోపులు గూలు-పోల్కి దనర

గీ॥ నీరు గెలంకుల జెట్టి కొం-డెగ్గిమ్మిలేక
పిక్క బలములు సూపిన-యిక్కలు గన
పండుటాకులు పెనుగాలి పగిది నొప్ప
కయ్యమొనరించి రొక్కంత-కాలమచట॥ 91

ఉ॥ ఆమెడ చంద్రిరాయ సచి-వాగ్రణి హిమ్మతురాయఁడుగ్రుఁడై
డాయ శివాజిసైన్యము క-టారులనొంచి, యలంచి, గెల్వ, నా
ర్థాయునిబుత్రు లిర్వురు దు-రంబునఁ జిక్కగ,బట్టి,వారి యా
దాయము, నాలుబిడ్డలను దారణకోటకునంపి, భూపుఁడున్ 92

గీ॥ జావళీప్రాంత సీమలు-సావతరము
నాసొటాయము దుర్గముల్-వశముజేసె.
కొను శివాజీకి నటబహు-కోశమబ్బ
దాన తద్దుర్గ సంస్కృతి-దనర జేసె. 93

94

వచనము :- అంత

కం॥ తారణ పట్టణ కారా
గారంబున నుండి నృపుసి గాంచ విజా
పూరునకు లేఖలంపిన
నారసి, శివవరుఁడు వారి-నంతకుఁ జేర్చెన్. 95

శా॥ ప్రాణాపాయము గల్గెనంచు నృపతుల్-బల్మారు ఘోషింప త
త్త్రాణానీకినులుగ్రాచు శర సం-ధానంబులన్ జేయ ను
గ్రాణంబందును మున్నుదారిడిన కం-ఖాణంబులం దెక్కి వా
రేణం బుల్వాలె శైవసైన్యవనిలో-కెంతేవడిం బోవగన్ 87

కం॥ వెన్నంటి చంద్రరాయల
గన్నాకులు దవులుచున్న-గాల్వురు మొత్తం
బున్నిగిడి తోడువడి మా
రొ్కన్నన్ శివరాయబలము-కోయని కవియన్ 88

కం॥ అయ్యుభయ సైనికోత్తము
లయ్యెడ నించుకయిన నెదురు-నదురులు లేకన్
గుయ్యిడకన్ రొదసేయక
కయ్యంబు నొనర్పఁ గడగఁ-గా నిరుగడలన్ 89

సీ॥ పిరికి కండ యొకింత-వెదకిన మెయిలేని
గయ్యాళి కొదమసిం-గంబులనఁగ,
చండి తనంబుమై-మొండి వెంట్రుకలేని
వడిగల గాడ్పు త-త్తడు లనంగ
బక్కయే యొడలందు-నొక్కింతయును లేక
దిట్టలై నడయాడు-మిట్టలనఁ గ
బరువాన నెద్దేని-విరుగు నంగము లేని
దిటమైన గురివేల్పు-తేరులనఁ గ

గీ॥ కాల్వురును వాజులేనుగు-గములుఁ దేరు
లిరుగెలంకుల దళముల-నెదిరి పోర
పట్టపగలయ్యు చీకటి-ముట్టికొనిన
చివ్వజేసిరి చికిలి డాల్-దివ్వటీల॥ 90

కం॥ సంధా గోత్రి కులీనుల
బాంధవ్యం బబ్బుననుచు-భట, సప్తిభ
స్కంధావార మనీషా 81
బంధురుఁడై వచ్చె శైవ-వర్యుఁడు గానన్.

కం॥ మా వాక్కులలీ కములని
శైవ విభుండెంచ కుంఠ-సంభ్రమ మొదవన్
వే వడిఁ జని యాతని నం 82
భావించుఁడీ యన్న నతఁడు-'వల్లె' యటంచున్

గీ॥ గౌరవమ్మున మున్నొన్ని-కానుకలంపి
తమ్ముఁడగు సూర్యరావును-దగు బలంబు
లండఁజనుదేర నేగి మ-హా బళంబు 83
ప్రాంతమునఁ గాంచెఁబట కుటీ-రములఁ బెక్కు

గీ॥ ఆ సుచేలాలయంబుల-కనతి దూర
మందు శివరాజు బలములు- నధివసింపఁ
గాంచి రఘుభల్లుఁడు, సభాజి యంచితోక్తి 84
చంద్రరాయుని కిట్లనె-ఁజతుర మతిని॥

కం॥ ఇందు వసించిన మా నృప
సంగముఁ జే తెంచునని చె-చటి హితముననా
నందింపఁ జేసి తద్భటు 85
లందర దూరస్థలంబు-లందుంచి వేసన్

కం॥ ఆలో నతిరమ్యంబగు
కేళీ భవనములు వారి-కిం జూపుచు హృ
ద్యాలాపంబుల దేలెడి 86
కాలంబున దారు వారె గడ తేర్పింపన్

మ॥ సమరంబొప్పదు వీనితోడ పటు వి-స్తారంబు సైన్యంబు ను
ద్యమమున్మిక్కిలి మేటి సాహసుఁడు మి-థ్యాస్నేహ తంత్రంబు కృ
తిమయుద్ధంబులనారి తేరిన బలా-ధిక్యుండు నై యుంట సా
మమునుం దానము సున్న భేదమున జం-పన్వచ్చు నిద్దుష్టునిన్ 75

మ॥ అనియూహించి రఘోబలుండనెడు బా-ల్యస్నేహితుంజీరి, మం
తనముంజెప్పి, సబాజి యన్ఘనుని వెం-టంబంప, వారిర్వురున్
జని, యజ్జావళి చంద్రరాయుఁగని, రా-జా! నీసుతన్ శైవరా
యునికిం గూర్పఁగ వచ్చినారమని మా-యోపాయులై బల్కినన్

చ॥ అనవరతంబు రాజభవ-నాంతరముల్గను గొంచు సాధు వ
ర్తనములు చూపుచో నట ప-రస్పర వేరములుంట గాంచి శై
వ నృపతి యీప్సితంబు జరు-పం దరివేచియునొక్క-చారునిన్
గనుగొని యమ్మహీశునకు-గౌరవలేఖను బంపె నిట్టులన్. 77

ఉ॥ మీరు మహాబళేశ్వర స-మీప వనంబులలో, నసీకినుల్
జేరిచి, గుప్త వృత్తిగ వ-సించిన జేయ గ లట్టికార్యసం
బారము జేయువారమని-వ్రాయ శివాజియు నట్లొనర్ప న
వ్వీరులు చంద్రరాయుగని-వెల్లమొగంబులు దోపనిట్లనెన్ 78

ఉ॥ తావక కన్యకం దమకుఁ-దప్పక గూర్చెద మన్నయా స న
భ్భావరుఁడంపె మమ్మిటకు-మద్దియనాతని బెండ్లి సేయగా
దేవర వారియిష్టమును-దేలదు పెండిలి కియ్య కొందు రం
చా, వసుధీశుఁడుబ్బుచు మ-హా బళ భూముల నుండెఁ గావునన్

గీ॥ ఉ విద నొసగన నొసగక-యున్న మేము
తావ కాంఘ్రికుశేశయ-సేవ విడిచి
బోవలే కియ్యెడను నున్న-బూమియలకు
నౌచితంబగు మాయుక్తి-నవధరింపు॥ 80

గీ॥ ఇట్లు చింతించు శివరాయు-నెదను గలిగె
చింతమరి యొక్కటది శాజి-వంత నొంది
కన్నడము జేరు నప్పుడు-కనకగిరిని
బ్రిబలయుద్ధంబు జరుగ శం-భాజి నందు॥ 69

గీ॥ కల్లరిఁ డగు నబ్దుల-ఖానుఁడతని
సాహసంబున కబ్రింబు-సంజ్వరంబు
బొడమి పగమూక జొరబడ-పుకు గొలుపుచు
తాను శత్రుల గూడియు-ద్ధమునఁ జంపె॥ 70

కం॥ ఆవర్తమానమున్విని
శైవ వరుండెట్లు వీరిఁ-జంపుమననుచున్.
భావి విచారణఁ జేయుచు
యావన తూలంబు గాల్ప-నగ్ని వెదకుచున్. 71

కం॥ జనకుని బంధ విమోచన
వినునప్పటి నుండి శైవ వీరుని రౌద్రిం
బినుమడియై బీజపురిం
ద్రుని భూములఁ దిరుగఁ జొచ్చె-రూపరఁ జేయన్. 72

మ॥ తన దుర్గంబులచెంత జావళియనా-స్థానీయమున్ జంద్రరా
వను రాజన్యుఁడు బీజపూర్విభుని సే-నాధ్యక్షుఁడై యేలి, యా
వన తంత్రింబుల కాత్మమిత్రుఁడగుటన్-వానిన్ స్వపక్షంబు ర
మ్మన, రా,నొల్లక మారుతంత్రిము దలం-పన్ రాయఁడత్యుద్ధతిన్

గీ॥ వజ్రిమును దొల్వ వజ్రిమే-వలన యగును
గజము చెలరేగ గజము చేఁ-గట్ట వలయు
గొంటు గలవాని గొంటు చేఁ-గూల్ప వలయు
గాన మాయావి మాయచేఁ-గలఁచె దనిన॥ 74

గీ॥ ఇటుమహారాష్ట్ర బీజపు-రీందుప్రోకరి
నొకరు లోలోన సమయించు-నూహలొప్ప
కన్నడంబున దోపిడి-గాంచుప్రేగి
ప్రబలమగు నల్లరులు జేయఁ-బారు లెల్ల. 63

చ॥ అలజడి నొంది యవ్విధము-నాదిలషావిన. విన్నవింప న
య్యిలపతి లేమిచేఁ గలిగె-నీవిధియంచు। దలంచి శాజి న
న్నెలవునకంప నియ్యకొని-నెయ్యమునంబను పంగనాతఁడు
మ్మలికము నొందుచుంజిని కు-మారునికిట్లని లేక బంపినన్ 64

శా॥ కూప్రాచారుఁడు భాజిఘోరుఁడెద సం-కోచింపక న్నన్ను నిం
పారన్భుత్త్రికి బిల్వ భోజనము సే-యం బట్టికట్టించి దా
కారాగారమునందు వెట్టి యవన-క్ష్మాపాలునిం జేర్చి నా
డారాజాధము మాంసఖండములు గృ-ధ్రాహారముం జేయుమీ!

కం॥ నీయసి పుత్రింగనినన్
బాయక నిల్చును నుసురు ను-పాయన మొసఁగున్
నాయసిపుత్రికఁ గనినన్
రోయును ముదికంప టంచు-రూఢిగ నతఁడున్ 66

ఉ॥ కావున నస్మదీయకుల-గౌరవముంచిన వాఁడ వేని సం
భావిత శౌర్య! నన్ను నవ-మాన మొనర్చిన నింద్య దేహమున్
మావుల డెక్కలం దొలుత-మట్టగ జేసి తదీయ చర్మమా
రావమొనర్ప, దుందుభీ క-రంబుగ మూయగఁ జేయుఁ బుత్రికా!

గీ॥ అనుచు బదియేను నూఱుల-యెనుబది యగు
శాలివాహన శకమున-నోలి జాబు
పంప శివరాయు డది గని-బాజిఘోరు
నెట్టులైనను బగదీర్ప-నిచ్చనుండె॥ 68

సీ॥ సారిదశ్యుండాక నీవరకు యోగ్యంబైన
సంశమించుక నెంచ వాకుమార
జలధివేష్టిత మహీతలయంబు నెలంగ
వాంథ బోదోలితి వాకుమార
దశమించుచుండిన తల్లిదండ్రులనార్త్రి
పాజ్ఞేయ నెంచితి వాకుమార
పాలనాని నంతడు లాలబాసలొనర్చి
అలిపైరోసితి వాకుమార

గీ॥ గురుల యుపదేశముల గంగ గూలద్రోచి
తండ్రి చెప్పిన బుద్ధులు తగపటుంచు
నీచులను గొల్చిబ్రతుకుట నీకుమంచి
రాకుమారునికిది నీతి రాకుమార

ఈ వేదనలో నిగమశర్మ అక్క తొంగిచూచినట్లున్నది.

మ॥ అడుగుందమ్ముల వ్రాలి జంఘులన నాయాసంబుగా బ్రాకినుం
దొడలంటన్ గమకించి జాఱుచు పిఱుందుల్జుట్టి పాలిండ్లను
ధ్యడీగన్నక్యముగామి, ముంగురులనుయ్యాలూగుచు న్జాటివే
బడియెగ్గ్రిక్కఱు చన్నుదోయి ప్రథమావస్థన్వరా లోకముల్

ఈ పద్యములో వరాలోకములను వర్ణించు సందర్భములో
"యత్నాదూరుంముగం వ్యతీత్య సుచిరం భ్రాన్త్యాని తంబస్థలే"
అన్న శ్రీహర్షుని శ్లోకములోకోత్తరముగ అనువదింపబడినది.

శివాజి చరిత్రము సర్వాంగ సుందరమగు రచన. రచనమంతయూ ఒక తేనె వాలుకవలె సాగినది. వీరశృంగార రసములు, గంగా యమునల వలె సంగమించినవి. సంస్కృతాంధ్ర కవీశ్వర సూక్తి ప్రాగల్భ్యము. సంవిధాన చాతుర్యము. ఛంద సౌందర్యము, బహుశాస్త్రపరిచయము. ఔచిత్య విచారము. ధ్వని. రసాలంకార. విద్యావైశిష్ట్యము ఈ సర్వ లక్షణములు. సమపాళములలో కలసి ఈ కృతికి ఆకృతి కల్పించినవి.

**కవిరాజ విరాజితము :—**

తనయునియుక్తిని ధన్యత గాంచెను-దండ్రియుటంచు మహీజనముల్
వినుతి యొనర్పఁగ విశ్రుతిభాషల-బెంపు వహించితి, నే, జగతిన్
ఘనుఁడగు నగ్బరు గాదిలి మన్నని-గౌరవముంగొన గంటిని నే
డనిబహుభంగుల-నాయమ నెంచుచు-నాత్మము దంబున నున్న ఎడన్

**కనకలత :—**

శహాజి చెఱవిడిచి యవనుఁడు-సఖుని గతి సిరితము దా
సహరహము గొన నృపుఁ-డని కతని బిలువ డతఁడు షా
జహాను గలసి పురముగొని-జయము తన కరిది యం
చహితులిరువురొకరి నొకరు-ననికి బిలువ కొదిగినన్. 58

తే॥ ఇటుల శివరాయ బీజ పురీంద్రులొకట
జన్యములు మాని నాల్గువ-త్సరము లూర
కుండి రంతఃకలహములు-మండి మండి
నివురు గప్పినలో వెల్గు-నిప్పులట్లు॥ 59

ఉ॥ వేరము జూపకే మదిని-వేయి తెరంగుల శైవరాయునిఁ
చోరవిధంబుచే నయిన జూర్ణముచేయఁ దలంచి బీజపూర్
కూరమరాటులన్ యవన-కోటిని బంపగ వారు దూరదృక్
శూరుఁడునౌ శివాజి యుటీ-జొక్కిరి మారటయుక్తి చెప్పకన్ 60

శా॥ మాయోపాయములెన్నియో గఱచిన-న్మానుల్ బలెన్ మ్లేచ్ఛరా
డ్దాయల్గొందరు శైవరాయలను బొ-ట్టనిట్ట జేయంగ నే
డాయంబోయి తదీయ యుక్తియను మం-టన్వేల్పతంగంబుల
ట్లాయుర్భాగ్య విహీనులై చెడిరి జా-యాపుత్రి దూరంబుగన్ 61

మ॥ సహవాసంబున దోషమున్ గుణమువ-శ్యంబబ్బు నార్నెల్లలో
సహవాసంబున వారు వీరగు దురన్-సామ్యంబుగా శైవరా
జహితున్నిత్యము దన్ను జేయు బలు మా-యల్ మల్పువాఁడౌట న
య్యహిత వ్రాతము నొంచుచుండెఁ బటు మా-యాజాల విఖ్యాతిచే

హల్లకము :-

షాజిహాక్ శాసనంబున్-సాదరంబొప్పలించున్
బీజపూర్నాథుఁడంతే-బ్రీతిచే శాజిరాజున్
రాజసంబొప్ప, గా-రా గృహోద్య ద్విముక్త
భ్రాజిగాఁ జేసి భీతిన్-బట్న మందుంచెనంతన్ 52

తోదకము:-

తనయుని చేరను-దక్షిణ మందున్
వినయము తోడను-పేడె తురుష్కుం
డనియొక లేఖను-నయ్యయు బంపన్
బనుపడి దూతయు-భక్తి నొసంగెన్ 53

వచనము :-

అయ్యవసరంబున దిల్లీశ్వరుకడకరిగిన చారుండతఁ డిచ్చు నుత్త
రంబు గొనివచ్చి యిచ్చిన 54

తరళ :-

ఇరు తెరంగుల భద్రలేఖల-నిర్వురొక్కటఁ దెచ్చినన్
పరమహర్షము నొంది వారికి-చారి తోషకమిచ్చి, యా
సరణిఁ దెల్పఁగ నంతిపురికిని-జయ్యనంజతి దార, నా
దరణ మొప్పఁగఁ గాంచి పల్కె-ముదంబు ప్రేముడి మీరగన్ 55

మహాస్రగ్ధర :-

కులమెంతే ఖ్యాతి చెందెన్-గుణయశ మొదవెన్
గోత్రి ముద్ఘంబు నయ్యెన్
బలవత్ప్రత్యర్థి రాజ-ప్రతతి వినతమై
పార్థనల్మ్రొక్కుఁ జేసెన్
దలకొందెన్ బీజపూరున్-దరగతి మతిచే
దాంతుఁడై షాజి సుల్తాన్
వెలయించెన్మన్మ ఘోటీ-వితతి విభుసిగా
విశ్వసంస్తుత్య వృత్తిన్ 56

గీ॥ రాజమాన్య మహారాజ-రాజపూజ్య
శ్రీ శివాజి మహాభ్రాజి జిత విరాజి
మాకు సామంతు లాదుర-న్మాట మీరు
వ్రాయుటకు మేము నుత్సాహ-వార్ధిఁ దేలి. 47

సుగంధి:-

దిల్లి రాజ్యమున్మరాట-దేశముఁ హితంబుగా
నెల్లినుండి యుండనెంచి-యేము మీకు నైదువే
ల్బల్లిదంపు వాజి సేన-బంపినార మంది మా
కెల్ల కార్య రక్షణంబు-నెంచి చేయఁగా వలెన్ 48

సుగంధి :-

మీరు మేము నేకమైన-మేదినీశు లెల్లరున్
వేరమాత్మవీడి పన్ను-వేగమిచ్చు గాననో
ధీరవర్య! మమ్ముఁ గూడ-దృష్టి దక్షిణా వనిన్
మీరలేలనియ్య కొంటి-మేదినీశ! నమ్ముఁడీ! 49

పంచచామరము :-

విజాపురాధినాథు నిప్డు-వీఁడు శాజినంచు మా
వజీరు చేతబంప శాజి-వాఁరు వీడు నంతనా
హుజూరునందు పార్శ్వపీఠ-మొంది జేతు దాసన
వ్విజాపురీశుఁ డొప్పఁ డేని-వే బజావు చేసెదన్ 50

తోదకము :-

దయ దళు కొత్తగ-దక్షణ మందున్
ద్వయమగు లేఖల-వ్రాసి శివాజీ
ప్రియభటు నొక్కటి-బీజపు రేదుర్
దయితున కొక్కటి-దానవుఁ డంపెన్. 51

సీ॥ శ్రీమన్మహాధరి త్రినాధ! నిర్వక్ర
విక్రము! షాజహాన్ చక్రవర్తి
గారికిని మరాట వీర జంగష్లేరు
రాజాధిరాజ శి-వాజి వేక్ర-
వ్రాయు గౌరవలేఖ, మీాయపార దయాస
మగ్రిత మహారాష్ట్ర-మహిని మేము
గైకొన బీజపూర్-ఖా న్వరాగ్రిణి తన
సామంతుని గఁగోర-సమ్మతింప

గీ॥ కున్న మాతండ్రి శహజిని-నొంటిఁ బట్టి
చెఱను బెట్టించె నిందునే-జేయఁదగిన
తెలుగు మీాసమ్ము ఖంబునఁ-దెలిపి విదపఁ
జేయగాఁదగు దాని నేః-జేయువాఁడ॥ 43

కం॥ అని వినయ పూర్వకంబగు
మనవినిఁ బంపింప నతఁడు-మన్నన మీాఁదన్
విని తన డెందములో ని
ట్లని యూహించె నివృడీ మ-హారాయునితో 44

మ॥ హితముం బొందిన దక్షిణంబు దిశభూ మీాశాళివంచింపగా
మితవీర్యంబును జాలు గాదని సనే-మీథ్యోక్తిచే నేని నీ
ప్సిత మీాటక్కరి బొంచి మీారునెడ లం-జింతించు టొక్కండెయా
ప్రతిపక్షు క్షయమందు కస్తియగు నీ-శక్తిన్ హితం బొప్పఁగన్.

కం॥ అనియూహించి తురుష్క
వని విభుఁ డీక్షులను లేఖ-వ్రాయుమనిన న
మ్మన సరయుచు నొక లేఖకుఁ
డినుమడి నమగక లిఖించె-నిట్టులటంచున్. 46

ఉ॥ భీజపురీంద్రునిం గలన-బీచమణంచఁ దలంచుచున్న యా
షాజి మహీశుతోఁ నిపుడు-సఖ్యపు మాటల లేఖనంప న
వ్యాజ మనస్కుఁడై యతఁడు- వత్సల తండమ చెల్మి గోరునీ
రాజితసంధి నేదుల ధ-రాపతి భీతిలి శాజి నిచ్చెడున్ 37

గీ॥ తండ్రి యాపత్స ముద్రింబు-దరికి జేరు
నంత దనుఁను నోర్చియ-నంతరంబు
పూన్కి నెరవేర్పగాఁ దగు పురుష వర్య!
కానసిది కార్యసాధన-మైనఁ గోనుఁడు. 38

వచనము :- అని విన్నవించిన 39

శా॥ జాయా రత్నము పల్కు వాక్యములకున్-స్వాంతంబుకం జల్లియో
స్త్రీయా! యిట్టి హితంబు నెవ్వరుప దే-శింపన్ సమర్థుల్ సుధా
ప్రాయం బై భవదీయ వాక్యము శ్రుతి-శ్రావ్యంబునై మంత్రమై
శ్రేయంబై, మహనీయమై, మనుధరి-త్రిం, గీర్తినొందించెడున్ 40

గీ॥ రాజ తంత్ర శిఖామణి రాయులంచు
రసనునా చంద్రతారాకా-ర్కముగ నన్ను
నెన్నుకొన జేసి నట్టు లీ-పన్ను గడను
పట్టి డిల్లీశుతోఁ జెల్మి-పడయు వాఁడ 41

కం॥ అని లేఖకారు నొక్కని
గని డిల్లీపతికి మనము-గౌరవ లేఖన్
బనుప వలె నన్న చిత్తం
బని యతఁడు లిఖించె నిట్టు-లధిపతి చెప్పన్. 42

కం॥ తనమేలు ముందు నడచెడు
దినములలో నెట్టిఁడైన-దిట్టఁడై యగు దు
ర్దినముల శక్తి ధృతి చెడకే
మనుజుఁడు వర్తించు నతఁడు-మహనీయుఁడగున్ 31

గీ॥ అంగలార్పుల నైకంపు-టజ్జ లందు
విసుగ కిటు యీవియే యీవి-పెక్కురులు
గ్రమ్మనే గొంటుచేనైనఁ-జిమ్మ నుదుటు
నుదుటుగా కుత్తు యప్పటి-యుదుటు యుదుటె 32

కం॥ ఆపద చేకురి నప్పుడు
కాపురుషుఁడు ధైర్యము విడి-కలతనలంగున్
జూ, పలతి, కాలు గాలిన
వాపోవుచు గెంతు పిల్లి-వడువున నాథా! 33

కం॥ మేలొందిన కీడొందిన
దేలిక పడకుండ పూనిక-దిట్టఁడు బరువున్
బాలింట్ల వర్ణిన వేధ కు
దాళుచు బాలునకు బాలు-తల్లి యిడుగతిన్ 34

కం॥ తాఁ జరుపఁబూను పనికిన్
వ్యాజము రాద్రోయ నెంచు-నల్పుఁడు భీతిన్
దేజము గల్గిన వారలు
వేజరుపక దల్లడిల్లి-విడువరు ధాత్రిన్ 35

గీ॥ జనకు రక్షణ రాజ్యసం-స్థాపనంబు
తమకు సమమాట నీరెండుఁ-దప్పకుండ
సాధనం బెద్ది గలిగిన-జరుపుఁడనుచు
హస్తములు మోడ్చి పలికె న-య్యతివ యిట్లు. 36

కం॥ ఏనూహించిన కార్యము
నైననొన్మన వలె కాక-నతి ప్రాజ్ఞ్యుండున్
దాన ఘనుండో జనకుని
మానంబునకైననా స-మానఁగ వలయున్ 25

కం॥ ఈరెండు పనులు గాకన్
మీరొండు తెరంగు గని ని-వేదింపుఁడనన్
వారొండు తెరగు గానక
ధారణి సుల్తాను కొసగి-తండ్రి మనుమనెన్ 26

వచనము :- ఇట్లు మంత్రులు వలికిన

కం॥ చింతా క్రాంతుండై దన
యంతిపురంబునకుఁ బోవ-నావార్త సయీ
కాంత విని పల్కె-నధిపా!
చింతించిన పనులు రెండు-చేయగ వలయున్ 27

కం॥ ధీరోదాత్త గభీరులు
కారుణికులు శౌర్యధైర్య-గాంభీర్యవచో
దారులు పటిజ ద్వీరులు
శూరులునౌ మీరు చింత-జొప్పడుటరుదా॥ 28

కం॥ హీన బలుండమతోడ స
మానబలుం జెనకు టొక్క-మసన్నదమె మహో
సేనాధికుఁడగు రిపునె
ట్లైనన్ లోగొసిన శూరుఁ-డుందమడు నాన్గిన్ 29

కం॥ తలఁపున నిడు కార్యమునం
గల ఫలితము జూచి విడువ-గావలె నడుమం
బొలగుట యది భీరుత్వము
ఫలితముగని విడుచు టొప్పు-ప్రాజ్ఞునకు ధరన్ 30

కం॥ తోరణ దుర్గము గట్టిన
వారించితి దానినింత-వదలక వాఁడున్
దారుణము లెన్ని జేసిన
నోరోక చేమూనికొనుచు-నుడువుటుడిగితి 19

గీ॥ అట్టి కొమరుండునేఁ జెప్పి-నట్టు వినెడి
యాతఁడని నన్ను బంధింప న్యాయమగునె ?
పొలము కుందేలు మేసిన-పొరుగుపల్లి
చెవులు గోయించిరను వార్త-చెల్లెనిచట. 20

గీ॥ నిక్క-మారసి నన్ను దం-డింపుఁడనుచు
వేడు కొలదిసి పాదుషా-వేడిఁజూపి
నీకుమారుండు గావించు-నీచములకు
గర్త్రవీ వౌట నీవె శి-క్షకు దగుదువు. 21

మ॥ అనుచుం జీకటి పుట్టినిల్లు క్రిమి కీ-టాఖేట కాంతారముఁ
దనుకుల్వోటైడు మత్కు-ణాద్యహిత సం-దేహైక కుడ్యంబవా
తనితాంతంబవి భావసూదయ మసా-ధ్యంబచ్ఛలం బవ్యయం
బనత పాళివృతమైన బందిగృహ మం-దావాస మేర్పర్చగన్. 22

చ॥ కొలది దినంబులం గొడుకు-కుత్సిత చేష్టలడంగ నుత్తరం
బులు లిఖయించి మత్కృపను-బొందెడునట్లు ఘటింపవేని నీ
నెలవుకొరంత ద్వారమున-నింపెద మట్టినటంచు భీకరో
క్తులు వచింయించుచున్ మిగుల-కోపము జూపుచు నేగ నింటికిఁ

కం॥ ఈవర్తమాన మంతయుఁ
దాఁవిని శివరాజు మదిని-దల్లడ పడుచున్
ధీవర్యులఁగని వింటిరె
నావిధియిఁక నెట్లు జరుపు-నాయముననుచుఁ 24

కం॥ ఆయస శృంఖలములకై
దోయిని దవిలించి శహజి-దోడ్కొని సుభటుల్
డాయుచు వంగి సలాములు
జేయుచు సుల్తాను దరినిఁ-జేర్చిన తండున్. 13

ఉ॥ చిన్నటి నాటినుండి పగ-సింగములన్ జెరఁగొన్న పోటరిన్
గన్నులు మూసి సంగడితె-నంబున బట్టిన బాజి యుక్తికిన్
మిన్నులు ముట్ట సంతసిలి-మ్లేచ్ఛవిభుండు, నృపాల! యోరి!నీ
చిన్ని కుమారుతోఁ గలసి-జిత్తులు సేయఁదలంచితే యనన్. 14

కం॥ దీనాన నంబుతో సు
ల్తానుం గని కేల నొక స-లాముం జేయన్
గానేరక కరయుగ్మము
తో నట్లుం జేసి పలుకు-తొట్రు పడంగన్ 15

గీ॥ తావ కాజ్ఞ లోకించుక-తప్ప కేను
వర్తిలుచు నుండఁ గొండెంపుఁ-బలుకులకును
కర్ణముల నొడ్డి నన్నిట్లు-కఠిన పరుపఁ
దమకు నా యంబుగాదని-తలఁచు లేడి. 16

గీ॥ శైశవము నందె నాయాజ్ఞ నరకు గొనమి
వెడలఁ ద్రోచితినది మొదల్-చెడుగు చెలిమి
బడసి టాటోకునై నాదు-బంధువులను
జిక్కులను నలంచె వాఁడు నా-చేత రాఁడు 17

కం॥ తనతల్లి చెవులు ద్రెంపిన
చెనటి, సవతితల్లి చెవులు-శృంగారింపన్
మనసౌనె పితృద్రోహికి
ఘనమె నృప ద్రోహ మెన్న-గనుము మహీశా॥ 18

కం॥ వీఁ డొనరించెడు దుడుకులు
జూడంగా. తండ్రిగూడ-సూనుని తోడన్
గూడుకొనువాఁడు గావున
నేడా తనిబట్టి బంది-నిల్పగ వలయున్. 7

గీ॥ తండ్రిచెరఁ జిక్కె-నని వాఁడు-తలఁకి మనల
నాశ్రయింపఁగ నేతెంచు;-నంతవానిఁ
బట్టి బంధింప వచ్చు ని-ప్పగిది కాక
చివ్వఁ జేసిన నలజడి-చేటు మూడు. 8

గీ॥ కన్నడమ్మున రణదులా-ఖాను శహజి
వీడి వచ్చినదాది య-వ్వీట నతని
కధిక గౌరవ మాధి ప-త్యంబు కలిమిఁ
హితముచేనా తనిని బట్ట-నెంచి మఱియు. 9

గీ॥ ఇచట శివరాజుతోఁ బోర-నించుకైనఁ
దలఁపు సేయక శహజిని-దండనంబు
జేయ నలజడి లేకుండ-చేరి శివజి
చిక్కు-నను కొనుచటువలెఁ-జేయఁగోరి. 10

గీ॥ శహజి నృపు చెంతనున్న, దే-శ, ముఖి, బాజి
ఘోరపురె యనువానిని-గూఢ ముగను
శహజి బంధించి, పంప మేల్-జాబు వేగ
వ్రాయనాతండు నొకనాడు-బంధురీతి 11

కం॥ విందారగింప నినకులు
నిం,దన తావునకుఁ బిలిచి-నేరుపు మీరన్
బందీ కృతుఁ జేసి, మహా
నందంబున బిజపురము-నకుఁ బంపింపన్ 12

పాండిత్య ప్రతిభా ప్రభావములతో, వెలుగొందిన ఈరసవత్ కావ్యమును, దేశమున కందించిన శ్రీ రామమూర్తి కవి. బహుధా ప్రశంస్యులు. అచ్చమగు ఆవేదన యున్నది. పొరపొచ్చులు లేని ఈశ్వరభక్తి యున్నది. భక్తిభావముతో ఈశ్వరార్పణముగ, కావించు కృతికి, శక్తి యుక్తులు కొఱవడునా? శాశ్వతత్వము కొఱవడునా? ఆనందబ్రహ్మము నుపాశించిన వారికి రసానంద మరచేతి కైవల్యము.

శ్రీచరణులయందలి భక్తి భావములతో కావ్య గుణమును కొంత మీముందుంచుటకు ప్రయత్నించితిని. సమర్థముగ పరామర్శించుటకు నాకున్న అధికారము ఎంతటిది? పూజ్యులు శ్రీ రామారావుగారి ఆజ్ఞ కాదనలేక, ఈపనికి పూనుకొంటిని. సహృదయులు నాసాహసమును మన్నింతురుగాక.

కావ్యానందరసికులకు-ఒక క్రొత్తకానుక ఆంధ్ర శారదకు ఒక అమూల్య ఆభరణము.

జయంతితే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః

ఇట్లు
సుధీ విధేయుడు,
మానాప్రగడ. శేషశాయి.
అధ్యక్షులు.
ప్రభుత్వ సంస్కృత కళాశాల. విజయనగరం

# ఛత్రపతి శ్రీ శివాజీ చరిత్ర

## చతుర్థ ఆశ్వాసము

కం॥ 
గౌరీ కుచ కుంకుమ
రాగాంకిత వక్ష! తురగ-రాజ మహోక్షా!
వాగీశ వినుత! కృతకథ
రాగారస భోత్తమాంగ-హార భుజంగా! 1

వచనము :- పదంపడి 2

గీ॥ అవధరింపుము! యత్తిణి-యవనుల పని
సాగిలంబడి, యల్లాను-సంస్మరించి
మహమదును వేడి, టోగ్లాకు-మంచి పొగడి
యేసు కేంద్రుని పదముల-యెదుట నిలచి॥ 3

మ॥ కృప యొక్కించుక మీకులేమి యవనో-ద్రేకంబు చల్లారెఁ, జో
క్కపు హిందూసతులొంటి నెల్లెడల మె-ల్గంగల్గె నేఁ డక్కటా!
త్రిపయూఁ జెప్పఁగ నాలనంజుకులు వ-ర్గంబయ్యెనే రచ్చలం
దుపయోగింపఁ ఖాన్పరా మరిక శై-వోర్వీశునాజ్ఞా ప్రభన్ 4

ఉ॥ తారణ ముఖ్య దుర్గములు-దాసిపుడెన్నిటి నాక్రమించి త
చ్ఛారుల, నాలుబిడ్డలను-చోద్యముద్రుంచి ధనంబు దోచి, యా
ధారులఁగాచి, నీమసర-దారుల, ధీరుల నీరు జేయుచు
న్నారు, మరాటులంచు సతు-వంబుల వారలు నీరునించగ 5

రోసము పుట్ట నయ్యెడ తు-రుష్కులు పౌరులు ప్రోవులై యుప
న్యాసము సల్పుచుండ విను-చాదిలషాధిపుఁడు గ్రమూర్తియై
మీసలు చుట్టుచుఁ బెనచి-మీదొకయించుక చూచిచూచి, యీ
రాసుతు నొక్కపెట్టుగ సు-వంబున బట్టు బసాధ్యమంచెదన్ 6

# గద్య

ఇది శ్రీమద్భవానీ వరప్రసాదాసాదిత స్వతంత్ర మహారాష్ట్ర
రాజ్యసంస్థాపన ఛత్రపతి బిరుదాంచిత, యవన గం
డరగండ కథాకుతూహల, చంద్రశేఖర కరుణా కటా
క్ష లబ్ధచతుర్విధ కవితా విలోల, ఆర్వేలవంశ ప
విత్ర, గౌతమగోత్ర, బలిజపల్లి కుల కల శా
బ్ధి కల్హార కళత్ర, అయ్యనామాత్య
పుత్ర, నిరంతరపరచింతిత, కవి
తా వినోద బిరుదవిస్ఫూర్తి
రామమూర్తి విరచిత,
శివాజీ చరిత్రంబు
నందు తృతీయా
శ్వాసము స
మాప్తము స
మాప్త
ము.

గీ॥ పోయరా, తల్లిదండ్రులీ-శుభ వివాహ
వార్తవిని శూరవరుఁడు శి-వాజి తమకు
నల్లుఁ డౌటకు గర్వించి-హర్ష మెసఁగ
మించి, యేతెంచి, పెండ్లి గా-వించి రెలమి॥ 417

కం॥ ద్విరద, రథ, ఘోటకవ్రజ
వరభట, పరిచారి కాది-బహు కాంచన సుం
దరతర వస్తువ్రాతం
బరుసంబున నిచ్చియంపి-రల్లుం గూతున్॥ 418

గీ॥ ఈవిధంబున శివరాయఁ-డీప్సితార్థ
సిద్ధిఁ బొందుచు, దుందుభి-శ్రీస్వనంబు
లమరులే నచ్చి మ్రోగింప-నలరువాన
గురియఁగా వచ్చె, సతిఁ గూడి పురమునకును॥ 419

స్రగ్విణి

కం॥ నాగ చర్మాంబరా-నాగ రాట్కంధరా!
యోగి హృన్మందిరా-యోగధా రంధరా!
ఆగమారాధితా-నైగమానందితా
శ్రీగుహా నందితా-శ్రీగణేశార్చితా! 420

కం॥ పక్షౌఘీ రామనుత! హా
ర్యక్ష పరాక్రమ! విపక్ష-హరణాధ్యక్షా!
సాక్షా ద్వ్యాఖ్యార్థా మర
న్మృక్షా! మోక్షాప వర్గ-విబుధాధ్యక్షా! 421

కం॥ ఇది యయ్యా! మా చరితము
కదలుండిటుపైని మాకు-గన్పడకుండీ
ముదితల ననుగ్రహింపుఁడు
పదివేల జోహార్లు మీకు-వదలుఁడు మమ్మున్ 411

చ॥ అని చెలికత్తెలాడెడు ర-సాన్విత వాక్యము లాలకించి సంచి
జనిత మనః ప్రహర్షమున-సాధు చరిత్రుడు శ్రీశివాజి య
త్యనుపమరాగ రంజిత ము-ఖాంబుజ సుందరుఁ డౌచు ముగ్ధ మో
హనశుభ వీక్షణంబులవ-నాంతర సీమల లంకరింపుచున్. 412

సీ॥ సోయరా రాకుమారియా! సుదతి యీమె
యెంతసుదినమ్ము, వింత వసంతమయ్యె,
స్వాగతము మీదు సఖికి మ-త్స్వాగతమ్ము
శ్రీమహారాష్ట్రపతి శివా-జీని నేను. 413

శా॥ ఆమాటల్విని నెచ్చెలుల్ పరమ హ ర్షావేశ విభ్రాంతలై
ప్రేమాంభోధి నిమగ్నయైన సఖియన్ వీక్షించి యూహించుచున్
ఆమాటల్విడనాడి "మీరు శివరా-ట్సామ్రాజ్ఞి ప్రభావాఢ్యలౌ
స్వామీ! స్వాగత మంచు పల్కిరి మహా-సంతోషముప్పొంగగన్

కం॥ విద్యోతి తానురాగం
బాద్యంతంబాత్మ గాథ-నంతనుడువుచున్
ఖద్యోతననిభ శివుడున్
హృద్యంబుగ జూచె సుంద-రీమణిఁ గాంక్షన్. 415

మ॥ శివరాయండు మనోగతాశయ తతి-శ్రీజెప్పి, యా,సోయరా
నవపాణిన్ గ్రహియించి, రాగసుషమా-నందంబుతోఁ దద్వనీ
స్థ్రవనీ యద్భుత సీమలం దిరిగి శ-శ్వద్భక్తి, కాత్యాయనీ
భవనాగ్రంబునఁ బెండ్లియాడెను సఖీ-వారంబు హర్షింపగన్ 416

గీ॥ ఇంతలో నేగుదెంచిరి-ప్రాంత వనిని
సంచరించెడి సఖులెల్ల- సరభసగతి
చెలిని, నవమన్మథుని వంటి-శివుని జూచి
పలికి రానంద పూర్ణ సంభాషణముల॥ 406

శా॥ ఆర్యా! మున్నొకమారు మిమ్ము మృగయా-యానున్
దగం జూచి, యౌ
దార్యం బొప్పగఁ బల్కరించితిమి, మా-తారుణ్యసారం
గమున్
గాంభీర్యస్ఫూర్తిని బట్టఁ బోవు క్రియలన్-ఖండించుచున్,
నేడహో!
ఘోరోక్తుల్ పచరించి, మా సఖియ చెం-తన్, జేరుచు
న్నారలే! 407

కం॥ ఏమీ! మీ, చోరవరి తన!
మేమీ! మీ, చోర తనం పు-టేర్పాటుపనుల్!
గామువలె పట్టి నారలు
సామీ! దండములు, వదలి చయ్యనఁ జనుఁడీ! 408

ఉ॥ అంతటి ముద్దుగుమ్మ మక-రాంక శుభోజ్జ్వల దివ్యభవ్య శు
ద్ధాంత మనోహరాంగి, మహి-తాన్వయ గౌరవ మెంచకుండ న
త్యంతము, నా శివాజి మహి-తాఖ్యజపించుచు వేగ వచ్చె శు
ద్ధాంతము నుండి యొంటిగ ని-తాంత మహాంత తపస్వివేషియై 409

ఉ॥ భూజన మాననీయ ఘన-భవ్యతపః ఫలజాత సోయరా
రాజకుమారి ఛద్మపరి-రంజిత వేషముఁ దాల్చి వచ్చి య
య్యాజి శివాజిఁ గాంచి, ముని-యై, నయముల్ దగఁ జెప్పి,మానసాం
భోజమునందు నిల్పి, జప-ముల్ పొసరించు-శివాజి నెంచుచున్ 410

కం॥ అది గని రోహిడ నాథుం
డాదవిన కోపంబుగాృల నొకబాణముచే
జిదురుపులు జేసె రాయుని
గుదియను మరి యెడఁద రెండు-కోలలనాటెన్. 108

ఆ.వె. చేత గుదియ దెగినఁ-జేడ్పడు శివరాయుఁ
డొడిసిపట్టు మూక లొకట గదిసి
రొదలొనర్ప నతఁడు-రోసంబు సత్తియు
నెదను దలఁచి కత్తి-నెత్తి త్రిప్పి. 109

కం॥ కదళీ వన సంతతులన్
బాదిలిన కరిమాడ్కి గవిసి-భుజములు సిరముల్
విదలించి రోహిడేంద్రుని
మదమాతంగంబు కరము-మహిఁబడ నఱికెన్ 110

కం॥ తుండంబు నేల బడగను
శుండాలము జిర్రు మనుచు-చుట్టుందిరుగన్
ఖండించె నంఘ్రులా లోఁ
జెండెను సారథి శిరంబు-శివరాయుండున్ 111

వచనము : అయ్యవసరంబున 112

కం॥ కరితో నిల నొరిగినపతి
కరములు చరణములు శిరము-ఖండింప, బలం
బిరుదెసల బార పోనీ
క, రయంబున దిృప్ప వారి-గడు మించుధృతిన్ 113

గీ॥ అంత శివసైన్యములు గ్రమ్మ-నద్భుతముగ
బోరి రిరుగడ మొనగాండ్రు-బురి కొలుపఁగ
విచ్చుకత్తుల చవిగొను-మచ్చు దెలియ
కుండ సిరములు నట్టల నుండి రాల॥ 114

క॥ ఆలో శివసైన్యంబులు
మేలుం గెలొంద తమరు-మృత్యుముఖము నం
దూలంగని రోహిడ పడ
వాలగు భాజి పత్రిభుండు-పరవశుఁడైనన్ 115

కం॥ ఆమంత్రివరు నహీన
స్వామిహితంబునకు మెచ్చి-శైవ వరుండు.
ద్ధామా మాత్యునిగాఁ ద
త్సీమను నాతనిని యుంచి-సిరి వెలయించెన్ 116

ఉ॥ జావళిసీమలీగతి వి-జాపురి నుండి గ్రహించి, కృష్ణనా
శైవలినీ తటిన్ బహువి-శాల తరంబగు నౌబళోర్వి ను
గ్రావరణంబునౌ నొక మ-హా నిగమంబు సృజింపగా మహీ
దేవుఁడు పింగళాన్వయుఁడు దిర్మలపంతునకాన తీయఁగన్ 117

వ॥ అమ్మహీసురాన్వయుండు 118

కం॥ శాత్రవ నిర్భేద్యంబై
మిత్రి శ్వాయాసమును ని-మేషము దీర్పన్
పాత్రస్థలమని వినతా
పుత్రుండట నిలువ సాల-మున్ రచియించెన్ 119

గీ॥ దాని వైశాల్య మున్నత-దార్ఢ్యము లిల
గలుగు దుర్గంబులను లేమి-గని ప్రతాప
గడ యనుచు నాఖ్యనిడి దాని-గావ తిర్మ
లార్యునట నిల్పి యాధిప-త్యం బొసంగె॥ 120

వ॥ అంత 121

సీ॥ ఇట్లు పదియేను నూరుల-యెను బదైమ
శాలివాహన శక వర్ష-సంజ్ఞ నందు
తిరుమలార్యుండు నటనట-కరములంది
శైవరాయుని కృప నందె-సంతతంబు. 122

గీ॥ పరమపద సౌధవిహరణం-బెనయు మేటి
యోగమనియెడి నిశ్రేణి-నోరఁ జేసి
కౌరవాదిక హేతువౌ-రాజ్యపదవి
గోరునే యోగి జనమాన్య!-గురువరేణ్య? 249

శా॥ రాజా! రాష్ట్రకృతంబఘంబనెడి యా-ర్యప్రోక్తముల్వించు నే
యోజన్ మాకుపదేశమిచ్చితిరి, యా, యోగంబు స్వచ్ఛాత్రమీ
రాజాపత్యము గాదటంచు మది నిర్దాక్షిణ్యముం బూని యీ
వ్యాజాబ్ధింబడ ద్రోవ జూపితి గురు-స్వామీ! కృపాదృష్టివై। 259

కం॥ అనిపల్కఁ యోగిరాజుం
గని పారుండి తనిబుద్ధి-గట్టెక్కఁ నికన్
జనపదముఁ జేప్పకుండిన
మునపటివలె జగము లిడుమ-మునుగునటంచున్ 251

కం॥ తలపోసి పార్థివేంద్రా!
కలగుకుమా దీని మించు-ఘనయోగంబున్
తెలిపెద దానింగొని నీ
వలఘుక్రియ మోక్షపదవి-నందెదవనుచున్. 252

సీ॥ సాధు గో భూసుర-సంరక్షణార్థమై
క్షతజంబు వెచ్చించు క్షత్రియుండు
ధర్మసంస్థాపనా-ర్థము దుర్మతుల నొంచి
వసుధ సంరక్షించు-పార్థివుండు
విజ్ఞానబోధకై-విత్తంబునార్జించి
వ్యయముఁ గావించెడు-నవని విభుఁడు
క్షామేతిబాధల జనులు పీడలనొంద
కత్యంత మరసెడు-నధిపనరుఁడు

సీ॥ దుష్టవృత్తుల జోరసిరి-దూరమైన
కష్టములు పెక్కు రీతులు-గా నొనర్చి
ప్రజలనోచి యధర్మంబు-పాలువడగ
క్రూరతలు నిండవానలు-గురియకుండు॥ 245

సీ॥ వృష్టిలేమిని తృణసస్య-వృద్ధిగామి
సాధుగోభూమిసురలని-శంబుపీడ
దవిలి కలుషంబు నాల్గు పా-దముల నణచి
ధర్మదేవత సరికట్టఁ-దలఁచుగాన॥ 246

మ॥ రిపు విధ్వంస మొనర్ప బొమ్మ, మహితో-ర్వీకాంత గైకొమ్ము, కీ
ర్తిపురంధ్రీ ఘననూపురార్భటులచే-దిజ్నాగ గండభ్రమ
ద్భ్రమరేందిందిర నాదనిర్దళనశక్తిం గొమ్ము విజ్ఞానులన్
గృపచేబ్రోచి జగమ్ములిమ్ముగను రక్షింపంగ లేలెమ్మనన్. 247

మ॥ వినిరాజేంద్రుఁడు పల్కె-సాధువర! యీవిశ్వంబులో మానవుల్
జననంబందుచు, నీల్గుచున్, మరలనా-చందంబుగా, నుండుటల్
గని, యావంతయునొల్లదాత్మ, యిహసౌ-ఖ్యంబందుగానన్ జనా
ర్దను నవ్యక్తననంతు నీశ్వరు నజ-స్రంబేను సేవించెదన్. 248

సీ॥ అనవరతంబు బ్ర-హ్మానందములనొందు
యోగికి హితమె స్వా-రోబ్రగ మహిమ
నతము మానసిక పూ-జాసక్తచిత్తుని
దృప్తిఁజేయునె బహి-ర్దేవ పూజ
నిరతంబులో జూపు-మరగిన సాధుని
కింపుఁజేయునె ప్రపం-చే క్షణంబు
అత్యంతమవ్యయు-నాసతో వేడిన
భవ్యుండు గొల్చునే-పంచజనుని.

శా॥ ఆసాధూత్తము బోధనాంశముల మా-హాత్మ్యంబు దానెట్టిదో
యాసల్పుట్టవులేశముం జలధియు-క్తాఖర్వసంపద్దరి
త్రీసంక్రందన భోగమబ్బిన మహా-ద్రిస్తుత్యచామీకరా
వాసంబుం లభియించినన్ సురపురా-వాసంబు చేకూరినన్ 241

గీ॥ అట్టిసాధూత్తముని బోధ-నలరి నృపతి
యైహికామోదమొసఁగు రా-జ్యంబు విడువ
నిచ్చఁజూప నరాజక-మెచ్చునన్న 242
బుద్ధిలోఁదోఁచి యబ్బుధ-పుంగవుండు॥

చ॥ సమరతలంబునన్దనుజ-సంహరుఁడా పురుహూతపుత్రు
త్తమువికలంబునొంద బరతత్వమహత్వము బోధశేసియు
న్నమిత ధనుష్కు-జేయుగతి నవ్యమహీవిభవాభిలాష భూ
రమణునకుద్భవింపఁగ క-రంబుగనేకముంబోధఁజేయుచున్. 243

మ॥ కులధర్మంబు పరిత్యజింపక సదా-క్షాత్రత్వముంగల్గియున్
బలభిన్ముఖ్యులు బొందనేరని పర బ్రహ్మైక్యముంబొందరే
దలపోయంగ నిషాదమాంసిక తులా-ధారాదులొండొండు నీ
యిలలోఁ. గాన- స్వకీయకర్మములపై-హేయంబధర్మంబగున్ 244

సీ॥ ఉత్తమ క్షత్రియు-లుర్వి యేలకయున్న
ప్రజలు స్వతంత్రులై-రాజ్యకాంక్షఁ
బడసి, యన్యోన్యాను-బంధముల్వీడుచు
నంతఃకలహాలు-నధికమగుచు
హీనజాతుల నాశ్రయించెడు స్వక్షేత్ర
భాగార్హతలు వారిఁ-బడయనిచ్చి
బలుతునకలుగ భూమి భాగించి యేలుచు
జెనటులఁజెల్మిచేఁ-జేవదఱిగి

# కవితా హేల

సురభిమాస వికాసవనీ పుంస్కోకిల కషాయకంఠ కాకలీ కల స్వనము ఛత్రపతిశివాజీ చరిత్రము. విరాజద్రాజీవరాజీహేవాకము మహారాష్ట్ర వీర శిఖామణి శివాజీచరిత్రము. గోత్రభిత్కోదండ కోటీ హేలాహేరాళము శివాజీ రాజచరిత్రము. అనిదంపూర్వ శబ్దార్థచమత్కారబంధురము శివాజీగ్రంథము. రంజత్సుకుమార మధురశయ్యా సౌభాగ్యయోగ్యము శ్రీ శివాజీ ప్రబంధము. రమ్యభావరససామగ్రీ సమగ్రమై శిల్పశోభాభిరామమైన, సంచరత్సరస్వతీ చరణమంజుల మంజీర రవాపూర్ణ శబ్దవనీకదంబమైనది పృథుల శివాజీ మహాకావ్యము.

ఏతత్కావ్యప్రణేత నన్నయ, తిక్కన, పోతన శ్రీనాథాది మహాకవి శ్రేణిలోనికిఁ జొరబడనివాఁడైనను, వారియడుగుజాడల ననుసరించినవాఁడు. కుండలములు శ్రుతులకు వ్రేలాడకున్నను, మహారాజ విద్వద్రాజ సభాంతరాళాలలోఁ జరించలేకపోయినను. సాహితీ కవితా శాస్త్ర విద్వత్పరీక్షాధికారి కాలేకపోయినను తత్సకల కవితాతత్త్వమే ధనస్సంపన్న లక్షణలక్షితుఁడు. సరస్వతీమూర్తి. అసిధారారూప, కవితా సాధన. ననర్గళముగఁ జేసినవాఁడు. అతఁడెవఁడా, యను మీయుత్కంఠ కానకట్టకట్టుటకు నేనెవఁడను? అతఁడే, ఆతఁడే శ్రీ బలిజపల్లి రామమూర్తి కవి. చినరామమూర్తియను నామముకూడ లోకవ్యవహారము. పురాణములుపఠించి, శాస్త్రమువలోడనముచేసి, బంధురప్రబంధసింధువునాపోశనముబట్టి జాతీయపునుడులు, నుడికారముల యొయ్యారంపు నడకలలోని మెత్తనిక్రొంగ్రొత్తసింగారము లభ్యసించి. పలుకులవెలందియొక్క అపరంజి మేని నిగనిగలవెలుగుల హొయలు చక్షూరమ్యముగ వీక్షించి యొక విలక్షణభావనా చైతన్యముతో. చరిత్రగ్రంథమున కొంకృతి చేసిన సర్వతంత్రస్వతంత్ర కవితాబ్జయోని బలిజపల్లి రామమూర్తియనినఁ జాలదేమో!

విస్మృత విస్తృత పురాతనాంధ్ర కళింగ సామ్రాజ్యములో, విశాఖమండలమందు, రామతీర్థమున కత్యంత సమీపముననున్న, గుమిడి,

గీ॥ నాటఁగోలె మరాటుల-నాడు,తపసి
దనెడు గురుతుగ కావిసె-ల్లా సిడంబు
లెత్తి, భగవాన్వతాకనా-నెల్లదిశల
జయ విటంకితస్తంభ ఖ్యాళి జాలుకొలిపె॥ 237

సీ॥ అష్టకష్టములొంది యార్జించునార్జన
తృణముగా నొసఁగిన-నృపవరుండు
నలతి కాలంబున నవ్యక్తమహిమంబు
బోధించి యొప్పిన-బోధకుండు
తృణకాష్ఠజలముల దేజరిల్లిన దేశ
ముపదేశికునకిచ్చు నుర్వీవరుఁడు
భోగాస్పదంబైన బుడమి శిష్యుఁడొసంగఁ
దిరిగి యర్పించిన ధీవరుండు

గీ॥ ధర్మసంస్థాపనార్థమి-ద్ధరణియేలు
టఖిల భోగంబులకు గాద-టన్న ప్రభువు
దుష్టశిక్షకుఁబురికొల్పు శిష్టవరుఁడు
శిష్యుఁడుపదేశికుండునై చెలఁగిరపుడు. 238

శా॥ అన్యోన్యంబిటులమ్మహామహులవి-ద్యాతూలదావాగ్నియున్
ధన్యత్వంబున కాస్పదంబునగు సా-తారాద్రి శృంగంబులన్
మాన్యంబౌ సరళాఖ్య కూటము నగ-మ్యా,బ్రహ్మసాయుజ్య సా
జన్యజ్ఞాన, ముముక్షుమార్గములజ-స్రంబాత్మలంబొందగన్. 239

గీ॥ యోగ్యుఁడైన విప్ర-యోగి దేశికుఁడైన
మొదలు నృపతియతిని-వదలకుండె
భద్రదంతికపళిత-భక్షణమరఁగిన
సింగమలఁతి మెకముఁ-జేరనట్లు॥ 240

మ॥ కళలున్నాదము బిందులెయ్యెడనునైక్యంబొందునప్పట్టునన్
జలజాప్తానల చంద్రచంచలుల భా-స్వచ్ఛాయలన్ మించుచున్
మలినంబొందని దివ్యతేజమును భ్రూ-మధ్యంబునన్వెల్గుటన్
తెలియంజాలిన యోగులాత్మ ననుర-క్తింజీవునింగల్పెదుర్. 231

కం॥ పంచేంద్రియములు మనముం
బంచినగతి నాజ్ఞనిలుచు భవ్యుండుమదిన్
సంచిత ప్రారబ్ధంబని
కాంచుచుజీవైశ్వరైక్య కాంక్షఁజరించున్ 232

కం॥ ఏచూపు తాను జూచిన
లో చూపు చలించకుండ లోగలవెలుగున్
గోచరముగాఁ జూచెడి
యా చూపే రాజయోగ మమనస్కంబుర్. 233

కం॥ జ్ఞానానంద మయుండ
జ్ఞానుని చందమున విషయ సంపద గొనుచున్
మానసమునందు నొల్లక
యానందము సోడుముట్టి యలరు మహీశా॥ 234

కం॥ కలకలుషంబులలోనం
గలుపుగొనుచు దాను శుద్ధి గానున్న నదీ
జలమువలె విషయసుఖములు
చెలఁగుచు మదిలోన వాటిఁ-జెనకున్ యోగుల్ 235

గీ॥ ఇట్లు బోధించిన మరాట నృపతి యతని
కఖిల దేశంబు గురుదక్షి-ణార్ధమొసఁగ
నతఁడు తన కేల నీరాజ్య-మనుచు తిరిగి
యతని కర్పించి తనమారు-నధిపుఁజేయ॥ 236

కం॥ కలిగియు భోగములం బ్రియమి
దెలిసియుం బరహింస కోరు సతిం గోరుటయున్
ఫలకాంక్షం జేయు తపములు
కలవాఁడు ముముక్షు వెప్పుడుం గాడు మహాత్మా. 227

కం॥ సత్యము బలికెడు జిహ్వక
సత్యము రుచిగానియట్టి చాడ్పున నిత్యా
నిత్య వివేకముం దెలిసిన
సత్యర్థుండిహము నాసనందఁడుసుమ్మా! 228

సీ॥ అనిశంబు నేమర కాత్మనీశ్వరు వేడ
భక్తియోగంబని పలుకవచ్చు
తనకునప్రియమైన దాని, దా, నొరులకు
సంఘటింపమి సర్వ సమతయగును
కృతకర్మములను సర్వేశ్వరార్పితముగా
నుబ్బి సేయుట సాధుసూక్తి సుమ్మి
దారసుతాది సంసారమై తనుదాను
తెలియుట యోగంబు తెలియుటగును

గీ॥ పెరలు దానను దలపుల మరచి జగము
తాను దానుజగంబుగాం దలంచి జీవ
మీశ్వరుండొకటిగాం జేయు టెరిగికొనిన
రాజయోగంబు దెలియుట రాజవర్య! 229

కం॥ క్రిమికీటక సంఘంబులు
తిమిరంబున సంభవించి దివ్యమహాగ్నిన్
సమయుటగను చజ్ఞానులు
భ్రమజెందుదేహవంజ సముతిసమనుచున్. 230

శా॥ సంకల్పాంకుర మూలముల్ దెరికి, దు-స్సాంగత్యముల్ మాని, హృ
త్పంకేజంబున నిత్యమీశ్వర పద-ధ్యానంబునుం జేసి, ని
శ్శంకన్ యోగసుదృక్చకోరములభ్రూ-సంధిన్ శరచ్చంద్రశో
భాంకూరామృత ధారగ్రోలుటయె యో-గానందము శ్రీశ్వరా! 221

శా॥ ఏ కర్మంబులొనర్చినన్ ఫలము స-ర్వేశార్పణం జేయుచున్
దా, కర్తృత్వము నొందకే సుఖములన్-గాంక్షింప కీక్షించు న
య్యాకారంబుల నెల్ల నీశ్వరు మహా-వ్యక్తంబుగా నెంచుచున్
లోక త్రాణముగోరు సజ్జనులు సా-లోక్యాదులం బొందెదున్. 222

సీ॥ శాంబరీ జాలకుడు నాసి కంబుమీద
కట్టెనిడి బొంగరము తుది-నట్టె త్రిప్ప
తతి నిరత్యాను బహు వినో-దములు సలిపి
గురుతు మనువని గతి యోగి-పరుని గాంచు. 223

సీ॥ దారువులలోన ననలంబు-దాగియుండి
మథనమున గాని పొడమని-మాడ్కి దేహి
దేహమందున బ్రహ్మంబు-తేజరిలుచు
యోగదృష్టిని గాని చూ-పొందదధిప! 224

సీ॥ అంత్యవేళ పరాత్పరు-నాత్మ వేడి
యమలతర భక్తి చిత్తంబు బొమలనడుమ
నిలిపి ధారణావృత్తిచే దొలగుప్రాణి
బ్రహ్మసాయుజ్య సంప్రాప్తి బడయు నధిప!

కం॥ విను ప్రణవ మిళాపింగళు
లనయము మేళన మొనర్చు నభ్యాసంబున్
గాని చూపులో వెలుంగును 226
గను యోగికి నొందగల్గు కైవల్యంబుల్.

కం॥ సంతోష జలధిమగ్న
స్వాంతుండై యమ్మహాను భావుండు నృప వ
ర్యాంతఃకరణ మృణాల ల
తాంతముదళుకొత్తనిట్టు లానతియిచ్చెన్. 215

కం॥ భవ మరణ వర్జితంబును
భువిదిగనినట్టి సౌఖ్య పూరితమును వే
ద, విదులకు దుర్లభంబగు
నవిరళమను యోగనాక నదియాదనగున్. 216

కం॥ యోగములనేకములునై
రాగిల్లునునందుగొన్ని రమణీయముగా
భోగంబులు కర్మపరి
త్యాగంబులు దూరదుర్లభాభ్యాసంబుల్. 217

గీ॥ గిరులలోన హిమాద్రిని ఝరులలోన
నజ్రినదుల భాగీరథి వలెను నొప్పి
యోగములమేటియైరాజ యోగములకు
జీనిచే ముక్తిమార్గంబు గానవచ్చు। 218

కం॥ దారాపుత్రులు సంసా
సార మహార్ణవమునీద సత్సంగత్వం
బౌరాజ యోగమను తరి
చేపోషించబడేదు పదము జేరగవచ్చున్. 219

మ॥ ప్రకటాంచత్సుఖదుఃఖ భోగవితతీ రాగస్థితి ద్వంద్వముల్
సకలైశ్వర్యము బద్ధవృద్ధులును నీ శ్లాఘ్యస్నేహభావంబులున్
నికటారాత్పరపీడలుండవిలి యెంతే రాజయోగంబునన్
విమలస్వాంతుండుగాక గేస్తుతనహృద్వ్యాధిన్ బరుంగాంచెడిన్. 220

సీ॥ వర్ణాశ్రమాచార మర్ణవంబునఁ గూలె
నత్యల్పవృష్టులే యవని గురిసె
సస్యముల్ కీటక సంఘంబుతో నిండె
వంధ్యలై నెచికీ వ్రజములుండె
గ్రామముల్ భార్గవ రామహృద్యములయ్యె
నేఁటేట కఱవులు కోటులయ్యె
ప్రజలంబరీషతప్తములైన వడ్డొరి
బలిమిచెరల్ పెక్కు భంగులయ్యె

గీ॥ లోకమెల్లెను నల్లకల్లోలమయ్యె
నవని నధిపులు దుర్జను లగుటవలన
నట్టివారల శిక్షించు మార్యమూర్తి 211
చారుకీర్తి మహారాష్ట్ర చక్రవర్తి।

చ॥ అను వచనంబులన్వినుచు నంగము వొంగి, స్వరాజ్యసిద్ధికై
యినుమడిఁ బ్రేమఁ బెంచి తన హృద్గతిధర్మమునందు నిల్పి, య,
వ్వనమున పర్ణసంచయపు వాటిక, యిదొ నొకో, కాదొ, యంచునా 212
తనిగన. నుత్తరంబొకటి తత్క్షణమంపఁగ, నమ్మహాత్ముఁడున్.

కం॥ పొడ చూపన్ నృపవరుండును
గడు భక్తిన్ మ్రొక్కి, వినయ గౌరవముల, ని
స్మడి వేడి రెండుచేతులు 213
పుడిసిలిలెట్టుచును వినయమున నిట్లనియెన్

గీ॥ రాజయోగ మహారాజ! రాజతేజ!
సాంప్రతిక తామసోగ్రసంసారజలధి
మగ్నజనుల నుద్ధరించు నీ మంబ దెద్ది? 214
నాకెఱింగింపుఁడనుచు దీనతను వేడె।

శా॥ లోకేశాచ్యుత శాంభవీ రమణపో-లోమీశ దిక్పాలకా
నీకంబుల్ బుధ, శుక్ర, భౌమ, గురులున్ బృద్వ్యాది భూతంబులున్
రాకారాజ దివాకరాదులు సహో-రాత్రుల్స్వచ్ఛక్తికిన్
శ్రీ కళ్యాణము లిచ్చుగాక యని యా-శీర్వాదముం జేసెదన్ 207

కం॥ యుక్తా యుక్త విచారా
దిక్తట గూఢ ప్రసంగ-దృగ్వ్యాపారా!
వ్యక్తమహితాత్మ విద్యా
త్యక్తైహిక సౌఖ్యసార-ధర్మాచారా! 208

సీ॥ భయద శుండా దండ-బాహార్గళంబుల
నారీ సమాకర్ష-ణముల జరిపి
సౌదామనీధామ-చంద్రహాసంబుల
సరచూపు గ్రేప్పల-నరుక నురికె
దావానలాంకార-తారకాగ్రంబుల
సాధు సంతతుల వం-చనము జేసి
ప్రళయాబ్ధి గంభీర-ఘోషా రవార్భటి
సుకృతజిజ్ఞాసుల-సోలజేసి

గీ॥ అనవరత మద్యపాన మ-త్తాత్ములగుచు
దుష్టులు సాధు జనముల-దొడరి పీడ
పెట్టుచున్నారు తొలగింప-వే, రయము
చారుకీర్తి మహారాష్ట్ర-చక్రవర్తి 209

శా॥ ధర్మక్షేత్రము లార్య తీర్థములు వే-దాధ్యాపనా శాస్త్రప
ట్టాన్మేల్దానము పిత్రుకాధ్వర తపో-గార్హస్థ్య ముఖ్యాగ్నులున్
సర్మాస్థంబును గ్రమంగ బ్రాహ్మణము కం-డూలమ్ములంజెందెధీ
వర్మా! నీ పరిపాలనంబునవె గా-దా! సౌఖ్య సంసిద్ధులున్ 210

గీ॥ నీ జితేంద్రియ మహిమ స-న్నిభము గాంచు
సంబుఫల పత్రివాయు భ-క్షాళి నొక్క-
డహితనారీ స్వభావ-నార్యమూర్తి
చారుకీర్తి మహారాష్ట్ర-చక్రవర్తి 203

సీ॥ హాయిగా నెదల పై-హస్తంబు లిడుకొని
ప్రజలు నిద్రింతురే ప్రభువు కలిమి
సహ రహంబును గుండె-లవియక నెమ్మది
వడియుండె మనుజులే-ప్రభువు కలిమి
చ్యుత మానసులు గాక-సుందరీ జనములు
స్వచ్ఛమై మెలగిరే-స్వామి కలిమి
నాలు బిడ్డలు బాసి-రనువంత యావంత
నడలరు జనములే-యధిపు కలిమి

గీ॥ సమత సత్వం బహింస వి జ్ఞాన సుకృతు
లఖిల జనులకు గఱపు నె-య్యమున నెవ్వ
డమ్మహాత్ముండ వీవె స-త్యాఢ్య శౌర్య!
చారుకీర్తి మహారాష్ట్ర-చక్రవర్తి॥ 204

చ॥ అనవరతంబ సంఖ్యజను-లాపదలం దొలగింప గాంతురే
జనపతి రాజ్యమందు, ద్విజ-సంతతు లిష్ట విశిష్ట కర్మల
న్మనియెదరే నరేంద్రుడన స-మానభుజాగ్రనిసర్గశాసి మ
ర్జనహరణంబు చేసతడు శాశ్వత కీర్తి వహించు [illegible] 205

మ॥ భయదా సర్గళ తర్జ నోగ్ర బలవ-ద్వ[illegible]
ర్జయనిస్త్రింశ చటచ్ఛటార్భటుల-[illegible]
చయమయ్యెన్ సురభూసురాలయ [illegible]
జయలక్ష్మీనట [illegible]

మ॥ శివ భూనాథుఁ డొనర్చు నూతనమహీ-స్వీకారమున్నించున
య్యవలంబం బభివృద్ధి జేయుటకు నిం-పౌ కాలమిాక్షింపన
య్యవ నీశుండె మృగవ్యదంభమున వ-న్యశ్రేణికి న్వచ్చి య
య్యవ నీజచ్ఛద పంక్తిపై గనియెచి-త్తామోదక శ్లోకముల్ 199

శా॥ ఆ వృత్తంబుల గాంచి శైవ విభుఁ డ-త్యానందముంబొంది, యే
ధీవర్యుం డివి వ్రాసె; నాతఁ డిపు డే-దేశంబునందుండు; నా
కా, విజ్ఞాన నిధాను దర్శనము చే-యం గూర్చునో కూర్చఁడో
దైవంబంచు దలంచి, యాత్మనతని-ధ్యానంబు గావింపఁగన్ 200

కం॥ ఆ రామ భక్తుఁ డచ్చోటి
యారణ్యములందె యుండి-యాతని చిత్తం
బారయఁ దలంచి యచ్చటి
వేరడవిం దాగి విభు న-భీష్టము గనియున్ 201

మ॥ పరమానందమునొందుచున్నతఁడియుం దా-వ్రాసెన్, నృపా! నీయశో
భరముల్ద్రోల్చి జగంబు వెల్వడెడి లి-ప్సన్ వెల్గునా ధర్మని
ర్ఝరపాదంబులు నాల్గుతో నడచు ధీ-రం జేసి మన్నించి, ది
క్తరుణీ హస్తసుగంధలిప్త ఘన సౌం-దర్యాంగిఁ గావింపుమా! 202

సీ॥ నీ ధైర్యమున కీడు-పాథోధి రానోపు
తరుగని జల సముత్కరము కలన
నీవిక్రమము సాటి-నిర్ఘాత మననోపు
తన కృత్యమున నష్ట-ధరణి లేమి
నీదానమును బోలు-కానంబినీ రాజి
సముపత్తి నింపుటన్-సకల ధరణి
నీ ధర్మమతి కెన-వేద విజ్ఞానులు
న్నాత్మవత్సర్వ భూ-తాప్తి మనుట

కం॥ తనయొద్ద కతనిగొని రా
బనిచెన్ స్నేహితులు వారు-వసు భూషణ వా
హనములఁ గైకొని జని యా
తని కర్పించుచు శివాజి-తలఁపుఁ దెలుపఁగన్. 193

శా॥ ఆసాధూత్తముఁడీ యుపాయనములే-లా? చిత్తమత్యంతము
ల్లాసంబొందుననర్ఘ రత్ననిభ కే-లాసాక్షమాలా రుచి
వ్యాసం గాంగుళ దండ కుండిక యమా-ద్యష్టాంగ యోగాశ్రమా
వాసాభ్యాసులకంచునయ్యుపధలన్-వారింగొనం జేయుచున్ 194

ఉ॥ కంటక పూర్ణమార్గమ మ-గణ్య శిలావృత పత్రశాలమం
దొంటివశించి, లభ్యమగు నొక్క ఫలంబునఁ దృప్తినొందు, నా
వంటి విరాగికిన్ దమ రు-పాయన మిచ్చిన లాభమించు కే
నంటను రాజ! దేశికుఁడ-నొట్లకు నేఁ దగనంచు వెండియున్ 195

కం॥ గోదావరీ తటంబున
శ్రీదాశన్ శాంభవి పు-రిం జననంబై
వేదాంత నిధియనందగు
భూదేవుఁడు రామదాస-పుంగవుఁ డొప్పెన్. 196

కం॥ పంచా దశాబ్ద సువయో
దంచత్ప్రాభవుఁడు మోక్ష-మందతనిన్ సే
వించి మనో భీష్టము గొను
మంచొక యుత్తర మొసంగ-నది గని నృపుఁడున్. 197

కం॥ మేనం బులకాం కూరవి
తానము జనియించి రామ-దాసుని గొలువం
దానిశ్చయించి యెల్లెడ
వానిన్వెదకుచు మెలంగు-వత్సువున నతఁడున్. 198

జేయడం గ్రంథం పూర్తి అయ్యేసరికి చదువరి మనస్సు ఒకమహోన్నత స్థాయిని అందుకునేటట్టు చెయ్యడం మంచికావ్యం తాలూకు లక్షణాలు ఈలక్షణాలన్నిటికీ, యీగ్రంథం ఒకనిలువుటద్దంవంటిది. జనకుండుత్కట విద్య యున్‌అనే మత్తేభంకన్యావరయశే రూపంఅనే శ్లోకాన్ని స్ఫురింప జేస్తుంది "తావకాగమనం కుతస్త్వార్యమొదలైన చరణాలుగలసీసం కవిగారికి సంస్కృతంతోగల పరిచయాన్ని వ్యక్తంచేస్తుంది – గన్నేరు పూజా యగన్నట్టు నీర్కావి వలువలుమొదలైన చరణాలుగల సీసం వైది కోత్తముల రూపురేఖవిలాసాల్ని ముండితకేశముల్‌గలిగి" అనే ఉత్పలం మల్ల వీరుల సంరంభాన్ని చక్కగా చిత్రించేయి – "పర్జన్యాంతరి రమ్మ దమ్ములు నభోభాగమ్మునన్ నిండుచో" అనేపద్యం అహమ్మదుఖానుపైకి శివాజీ యుద్ధానికి వెళ్లేసందర్భంలో కవిగారుచెప్పేరు. ఈపద్యం భీభత్సభ యానక రసాలకు ఆటపట్టు-పూలమాలలో దారంమాదిరిగా వీరరసం కావ్యం అంతటిలోను రమ్యంగా వ్యక్తం అవుతూనేవుంది

అష్టమాశ్వాసంలో, శంభో! భక్తసంరక్షకా! "అనే మకుటంగల పద్యాలు కవిగారి శివభక్తి తత్పరతను వ్యక్తంచేస్తాయి. శంభుశబ్దం ఉకారాంతమైనప్పటికీ సంస్కృతంలో, సంబోధన ప్రథమావిభక్తిలో శంభో" అనివుండిగనక, సంస్కృత సమాసాంతర్గతమైన శంభోభక్తసంర క్షకా! అనేప్రయోగం సంస్కృతంలో "శంభోతవారాధనం" అనే ప్రయోగంలాగే పండిత సమ్మతమే అవుతుంది – "షష్టాశ్వాసం" అనాలిగాని షష్టమాశ్వాసం అన్నప్రయోగం సాధువేనాఅని కొందరు శంకించవచ్చును-కాని భాషా శాస్త్రంలో Anology అనే సిద్ధాంతం వుంది. దానిప్రకారం పంచమ, నవమశబ్దాలలాగే షష్టమకూడా సాధు శబ్దమేఅవుతుంది.

వేలకుపైబడ్డ పద్యాలతో నడచిన మహాప్రబంధంయిది. ప్రాచీన సాహిత్యంతో బాగా పరిచయమున్నవారికి మాత్రం మేయిది సుబోధకంగా

గీ॥ దుష్ట శిక్షణకై మహా-త్ములను ధరణి
నవతరింపఁగఁ జేయున-వ్యక్తమయుఁడు
ధర్మమూర్తి మదీయ చి-త్తమున నెపుడు
వెలిగి నన్నుఁ గృతార్థు గా-వింపవలయు॥ 187

శా॥ తిర్యగ్జాతుల కిద్ధరం గలవె స-త్కీర్తి ప్రతాపంబులా
దార్య ప్రాభవముల్ మనుష్యులకుఁ బొం-దన్ శక్యమౌ గాక స
త్కార్యంబుల్ ఘటియించి మానవుఁడు ప్ర-ఖ్యాతిం గొనం డేని నా
తిర్యగ్జాతికి వీనికించుక యునే దీ భేద మూహింపఁగన్. 188

కం॥ నానాజంగమముల మే
ల్మానవ జన్మంబు నందు-మగవాఁడ వలన్
మానవపతి యటుమీఁదను
జ్ఞానులు, జ్ఞానులకు జన్మ-జరుగక యుండున్ 189

కం॥ పుట్టిన పుట్టువులకు మరి
గిట్టుట సిద్ధంబటన్న-కీ తెరిఁగియుఁ దా
రిట్టిది యిట్టిది యని కన
నట్టి మహానంద పదవి-నలరుట కొరకై 190

కం॥ సాధన మెద్దియు దానిం
బోధన నొందుటకుపాయ-ముల నూహింపన్
వేదజ్ఞానము దీనికి
నాధారం బార్యసేవ-నలవడు నదియున్ 191

మ॥ అని యూహింపుచు ముక్తిమార్గమును మా-యామేఘ వాతంబు సా
మ్యనిరూఢేంధన వహ్నియైనను నహిం-సావ్యక్త విజ్ఞాన మా
ర్గ నిదానాధికుఁడై, నిరంతరము తు-కారాము గీతంబులన్
విని వైరాగ్యమునొంది యాఘునుని సే-వింపంగ నూహింపుచున్.

ఉ॥ పీటను బెంచు జాగిలము-వేమరు మత్తగజంబుతోడ, నా
ఖేటములాడుచో నడుమ-కిక్కిస మొందెడు చెల్మిచేత నా
ర్భాటపుఁ గేళికింగడగు భాతి గనంబడు రాసుతుండు మా
పోటరులున్ పదేపదిని-పోరసలంచుట టంచుఁ బల్కుచున్. 181

ఉ॥ నీకడ కంటె సన్నకయి-నేడొకయించుక నిల్చెఁగాని టా
టోకులెమూక తస్కర కు-టుంబికుఁ డౌనల శైవరాయుఁడున్
గాకులపాలు జెందఁడె; న-ఖార గులాము సలాము చేతిబల్
బాకుబడే బజావులస-పాని సుతుండి సుమంతే తుస్కలై 182

ఉ॥ జావను నీదు నాల్కకొన-చప్పడొకించుకయుక్ బడేవజీ
ర్దావినునంతలో కబడ-దార్వహవా బఖరామరాట రా
డ్బ్రేవుల రేయరేయిల బ-డెం బడెనంచు దలంపుమంచు దా
బ్రేవులు జాఁగా బలికి-బేటికి బంపగ నాజ్ఞ వేడగన్ 183

గీ॥ బీజపుర నాథుఁడు మరాట-విభుని మీద
కబ్దుల తురుష్కుని జేయ-నంపునన్న
వార్తలటనట శివమహీ-వరుఁడు వినుచు
దివ్యకిరవగు యత్నముల్-సేయుచుండె! 184

గీ॥ కలుష భూయిష్ఠమై భూమి-యలుకు జెంద
ధర్మసంస్థాపనముఁ జేయఁ-దలఁచువాని
చెనటి పగతురు గలపర-క్షింపకున్నె
విశ్వరక్షకుఁడైన స-ర్వేశ్వరుండు. 185

కం॥ పరధన వనితా హరణా
చరణుల హరియింప గడగు-జన నమ్మలకున్
దురమునఁ దోడ్పడు వేల్పు
దురితాత్మ హరింప నాకుఁ-దోడ్పడ కున్నే! 186

మ॥ గురునాజ్ఞల్ని రసించి సైకము తురు-ష్కులోఁ బరగాఁ గూల్చి, గూ
వ్రణంబుల్ దృఢపర్చి తానొక నృప-స్వామింబలెన్ జిహ్వామున్
గరువంబున్ప్రఖ్యాయించి, విత్తమున సం-ఖ్యం గూర్చుచున్నాఁడికన్
గణంజూపితివేని బీజపుర మా-కం బెట్టు సేమోయనన్. 175

ఉ॥ బీజపురేశ్వరుండతని-బీగములెల్ల వజీరులొక్కటై
తేజమునొందు చున్మసము-తీవ్రముఁ జూపక యున్ననీపయిన్
వ్యాజముఁనొంది గుండుటల-వశ్యము జేకురుసంచు బల్కుచున్
వాజులసేన గూర్చఁగని-వల్కెను నబ్దులఖానుఁ డిట్టులన్. 176

కం॥ ఎలుకంబట్టగఁ గొండను
దొలిపించి తిరన్నయుక్తి-దోచును దొరా
తులువ పయిదాడి వెడలుట
సెలవైనం గట్టెదతని-చేతులు పెడకున్. 177

కం॥ మున్నీ నీచుని యన్నను
గన్నులలో దుమ్ముకొట్టి-కడ తేర్చిన నా
పన్నుగడ దాట నుమటం
గన్నులు నూఱున్న వశము-గాదని మఱియున్. 178

కం॥ నీకన్ను లెఱ్ఱ వడినను
లోకం బట్టుడికినట్లు-లోలోఁ గసలున్
ఏకుచెడు నెల్ల నృపులు
ప్రేకను జూపినను జగము-తేకువ తప్పున్. 179

శా॥ సిద్దోద్దండము విల్లుగైకొనిన గాం-డీశికముంజెందు, నీ
భూదేవేంద్రు లరణ్యముల్వెదుక బో-వున్, బదున్మలాంతాంతముల్
పాదాంశంబులరీతిగాఁ దలఁచు న-శ్వశ్రేణి జంఘాలతన్
న్యాదఁ బున్బొడమూపు సైనికులు జ-న్యంబింక నీకేటికిన్. 18

శా॥ ఆదుర్గంబుల చెంత జింజిరధరా-స్యత్నుండు పత్తేవి
డాదిన్మూర్తిని జామునింగొలువ న-య్యాధీశుఁడుంగుప్రంకగా
నాదిల్లాధిప, షాజహానులహమ జ్యాపంచి యేలంగ, న
య్యేదుల్లానుని దిక్కసిద్దియను ప-త్తేఖానుఁడుం జేరుడున్. 169

శా॥ పత్తేఖానుఁడు నావసైన్యములచేఁ-బ్రఖ్యాతి నొందంగ, న
మ్మత్తానేకపముం జయింపఁ దన, శా-మస్సింగముంబంప, బ
ల్పత్తిం బత్తులఁ దోడుకొంచతఁడు బో-వం, దానినొక్కింత,యా
పత్తేఖానుగ్రహించి శైవబలముం-బ్రాల్మాలగాఁ జేసినన్. 170

ఆ.వె. ఓలమాస గొనిన-యుర్విసుపర్వుని
దళము దొరతనంబుఁ-దొలఁగఁ జేసి
పింగళాన్వయునికిఁ-బేష్వాపదంబిచ్చి
జింజిరాను గెల్వ-శీఘ్రమంప॥ 171

ఉ॥ పింగళ తిర్మలార్యుఁ డతి భీషణుఁడై రఘునాథ భల్లుఁడన్
సంగడి వెంటఁడా, నమిత-సైన్యముతోడను జింజి రేవుపై
కంగిసనేగ బీజపురి-ఖానులు వించది యేదు లేశుతో
దొంగిలె శైవరాజు మన-దుర్గములేఁ బదియంచు, వెండియున్ 172

కం॥ మునుముత్సు తుటుము గూరిచి
కొని, దారులుగాచి, నీదు-కోశము దోచెన్
వినుఁ డెక్కువ యింకొక్కటి
మనచేఁగిడి వడ్డ తుటుము మన్ననఁ గొనియెన్. 173

కం॥ టాటోటులాడి తనదగు
కూటములంబంపి యలతి-కోటలనెల్లన్
దాటాతూటంబుగ నా
ర్భాటము నొనరించుచున్న-వాఁడట వింటే॥ 174

ఆ॥వె॥ అయ్యతెవు లొకింత నణఁగ-నాతనిఁ బట్టి
జెరనుబెట్టి పుడమి-సిరిని బొందె
నింట గెలిచి రచ్చ-నంటుడి జయమన్న
యాలపనమున కిదె యర్థ మనుచు. 161

కం॥ మాతాపుత్రి విరోధం
బాతతముగ హేమమనెడి-యార్యోక్తుల ప
ఖ్యాతి వడకుండ నీగతి
నాతఁడు కాపాడె నామ్ర-గాంకార్హముగాన్. 162

గీ॥ అంత నిచ్చట శైవరా-యాధి పతియు
దాను జెప్పిన రీతిగాం-ధర్వ సమితి
గాని, యాబాజిసోనుని-గాని పంప
కుండె, ధీశాలియాట నా-దండి మగఁడు. 163

వచనము : అంత విజాపురంబున నొక్కనాడు. 164

కం॥ ఏదుల ఖానుఁడు దిల్లీ
పాదుషహా తోడఁజెల్మి బడసితినని బ
లోన్మదమున విడిచె గుజ్జపు
జోదుల దశ శతము వార-సూనూపరులై. 165

వచనము : శివాజింగాంచిన 166

కం॥ ఆయవన సమితి బాయం
ద్రోయక తన బలములోఁ గు-తూహల మొప్పన్
డాయంగ నుంచి రఘుబల్
రాయుని బతిఁ జేసె నాద-శంబున కెల్లన్. 167

కం॥ వారల యనుమతి కొందఱఁ
జేరిచి కొంకణము నంప-శీఘ్రమవార
వ్వారిధిఁ దరిగల కోటల
వారితముగ శైవరాయ-వశమునఁ జేర్చెన్. 168

కం॥ ఆరాయబారి వేగమె
యారంగ మహీశుఁ గాంచి-యతి వినయమునన్
దారాజు మారుగా నయ
మారగ విన్నప మొనర్చె-నాసమయమునన్. 155

ఆ॥వె॥ ఎల్లమన్న జేని-నెక్కుడు రుజ ముంచి
యుసురు నిల్వదనెడు-నుబును దెలిసి
చెంత దానులేమి-చెందురా సిరిజ్యేష్ఠుఁ
డనెడి చింతలతని-నలమటింప. 156

సీ॥ ఈనృపాధము జిత్తుల-కిసుము చేయ
నజ్జకాదిది రాజకా-ర్యాంతరాయ
మొదవు గావున హిత మిప్పు-డొప్పిదమని
యెంచి, యారాయబారితో-నిట్లు బలికె॥ 157

ఉ॥ మాయెడ మీకుఁ గల్గు నన-మానమహత్తరమైన భక్తికిన్
వేయిమడుంగులుబ్బి మును-వేరములెన్నక చౌతుపన్న నా
దాయమునొంద భాజనిటఁ-దప్పక పంపిన నొప్పికొందు మం
చాయధిపుండు బల్కవిని-యాతఁడు నేగగనంత నిచ్చటన్. 158

సీ॥ నెమ్మిగద్దియదౌర బువి-నిల్వనపుడు
చెంతలేకున్న సిరి, యన్న-జెందుచున్న
చింతనెద గల్గి యారంగ-జేబుబీజ
పురవరుని తోడ సంధికిఁ-బొసగి కొనియె. 159

సీ। కోటి రూకలు నతఁడియ్య-కొనుచు వేగ
దిల్లికిని నేగి పెద్దన్న-దెగ నణంప
చిన్నయన్నయుఁ దనకది-సిద్ధమనుచు
బార గద్దియనెక్కె యా-బాలి శుండు. 160

కం॥ ఇరు దెరగు తురక దొరలం
దురమున నరికట్టి వలల-దోయగ సమయం
బరయుచుఁ దగు సన్నాహము
దిరపరచుచునుండు నపుడు-దీర్ఘముగాఁగన్. 149

కం॥ పురి పులుగు గద్దె నెక్కెడు
దొరపట్టి విజాపురంబు-దూళిగలుపు నం
చురవడి బీజపురిందుప్రిం
దరి నొసగుచు సంధి జేయు-నని తెలియంగన్ 150

ఆ॥వె॥ బీజపూరు దొరలు-బీడించి రారాజు
దానొనర్చు దుడుకు తనము లెంచి
యనికి వచ్చెనేని నా-యాసమగు నని
శైవరాయుఁ డిట్లు-సంధిఁ జేసె॥ 151

ఉ॥ మీ విహితంబు మాకుఁగడు-మేలని బుద్ధిఁ దలంచి గుఱ్ఱపుం
బోత్రిపులు గొన్నికూర్చితిమి-పోటరులన్ బలు సంఖ్యఁజేర్చితిన్
దేవ యుత్తరాశకరు-దెంచిన వెంటనె వారిఁబంపెదే
గావలి యియ్యెడన్నిలిచి-కార్యముతెల్లను నిర్వహించెదన్ 152

శా॥ ఢిల్లీ దేశమున న్మరాటులకు నా-దింగల్లు చౌతన్కరం
బుల్లాసంబున మీరలీయవలె వే-రొండా విజాపూరులో
నిల్లా మల్లుల చేత కొంకణము బల్-హింసల్ బడెం గాన, నా
కిల్లాలేను గ్రహించి మీరలను రా-గిల్లం బ్రివర్తించెదన్ 153

శా॥ మీసామంతుఁడ నన్న మాత్రమున భూ-మింగల్గు రాజోత్తముల్
త్రాసంబొందిరుము భజించు యశముం-దారొంది, మత్పూర్వపుం
దోసంబుల్ దలపెట్టకుండుఁడివి ని-ర్దోషోక్తులొనంచుప
న్యాసం బిచ్చెడు నేర్పరి స్వహితుఁ గృ-ష్ణాజీని బంపింపఁగన్ 154

గీ॥ ఇట్లు పోరంగ బీజ పు-రీంద్రునకు ను
బాల్యమహాట వజీరు దా-బాపబుద్ధి
రాజ విద్రోహియైయు యవు-రంగ జేబు
గలసి నను తక్కు- వారలు-గ్రముగఁ బెనఁగ. 143

ఉ॥ ఏదులఖాను మొగలుల-నేక దినంబులు బోరుసంచు నా
మోదము నొంది జున్నరను-మొగలసీమను గొల్లవెట్ట న
మ్మేదిని శైవరాయునకు-మేల్కొహరీ లొక మూడు లక్షలున్
సాది సమేత పంచ శత-సైంధవముల్ చొరకంగ వేడుకన్ 144

కం॥ పూనా మార్గముగాఁ, దన
సేనలచే, రాయగడకుఁ-జేరిచి, నహమ
స్తానీయముఁ జొర నచ్చో
నేనుంగులు నాల్గు హయము-లేణ్నూ రొదవన్ 145

కం॥ చేకూరునంత మొగల
భూకాంతుని ధరణిలోన-పూర్వము గారా
పోకలు సలిపి స్వతంత్రపు
రాకొమరుని పాటిగాదు-రా నిలుపంగన్. 146

కం॥ అది మొదలు శైవరాయఁడు
కదనమునకు సర్వమైన-కంఖాణంబుల్
బొందలింప నాటనుండియు
నొదవె మరాటాశ్వములను-నున్నత కీర్తుల్ 147

శా॥ ఆయశ్వంబుల కెల్ల ముఖ్యుఁడగు నే-తామాత్య సర్ణోబతన్
శ్రేయోదోగ్యగమునిచ్చి మంత్రి పదమున్-సేనాపతిత్వంబు పీ
ష్వాయుదోగ్యగము శామరాయునకు ని-చ్చం గూర్చి సైన్యంబునన్
వేయింటొక్కొక నాయకున్నిలిపి పృ-థ్వీజాని యత్యుద్ధతిన్ 148

క॥ వారిరువురు బీజపురిం
గోరినధనమున్న దన్న-కోరిక తోడన్
వేరమున కరుగ నేమల
భూరమణుని సేన లెదిరి-పోరి కురుకగన్. 136

క॥ మొగలాయి సైన్యంబులు
దగురీతి నెదుర్కొ-నంగ-దద్దయు నపుడా
దుగ తెగలు గలయ దూళులు
నెగురంగ నొండొరులం దెలియ-రించుకయైనన్. 137

వ॥ అప్పుడు 138

శా॥ తేరుల్ తేరులు, నేన్గులేనుగులు, స-ప్తి వ్రాతమున్ సప్తులున్
ధీరుల్ ధీరులు, డాసి, కుంతఘన ని-స్త్రింశంబుల స్త్రమ్ముల వి
స్ఫారాస్త్ర క్షతి ధారలన్ ధర మహా-ర్ద్రింబై, తదుద్యద్వ్రజో
వారంబుల్ హాయి ప లక్ష్యయుతులై-వారొండొరుల్ మీరుచున్ 139

మ॥ వహవా! మీరీతి, విస్సిరో యిదెనిను-న్వంచింతు నం పొక్కుడున్
శహరే! యప్జ్డె, ప రాకునొందితివె నా-జాను పరిహారంబు ము
న్న హామద్వీటి మసీదు నందనుచు బా-హాబాహి నొప్పించుచో
బహదూర్ఖానుని యేటులోని రుచి నీ-పల్మోయదం చొక్కుడున్ 140

శా॥ ఓరీ! మా మొగలాయిపోటు చవి నీ-యూటూరు చిర్నాల్కకుం
జేరన్వచ్చిన మెచ్చుకొందు విదుగో! చిన్నప్పుడయ్యగ్గు బొం
గరం గల్పినం, గాక రాకు పసరా-హా! గ్రక్కెదం చొక్కుడో
రోరీ! రజ్జులు గావునా పలుకు లో-హూ! రొక్కునం చొక్కుడున్

శా॥ తారున్ దండ్రులు, తాతలున్, గలనమున్-ధైర్యంబులన్ జూపుటల్
బేరుం బెంపు నుతింపుచున్, గవియుచున్ బెల్లేయుచున్, డాయునున్
జేరన్వచ్చుచు, నొండొరు న్మిగులుచున్-జేజ్వాటులం బొందుచున్
బోరం జొచ్చిరి రెండువాగుల దళం-బుల్ బోటరుల్ మెచ్చగన్

ఉ॥ అంత విజాపురాది లష-హా, యిట నీల్గిన, వానిబట్టి య
చ్చింత నొకింతయుం దెలియ-జేయక గద్దెను గూరుచుండె నం
చెంతయుఁదప్పు వట్టియల-యేదులఖాను నణంపనేగె, దు
శ్చింతత, మొగలేశ్వరుఁడ-శేషవరూధినితోడ నుద్ధతిన్, 130

ఉ॥ అసమయంబునన్ శివధ-రాధిపుఁడించుక యుక్తి షాజహా
రాసుతుపేర బీజపుర-రాయుని నొంచుట మద్ధితంబు, మీ
దోసపు వహ్ని కీలల గ-రుట్టిమి తండము వారలంచుఁ దా
వ్రాసి, భవత్కృపం బడయఁ-బాత్రుఁడ నేనని మాతనంపగన్

క॥ ఆవిన యొక్తులు మగలా
యీ, విభుఁడు విని, యకుటిల స-హృదయుండై సం
భావించు పగిది నెన్నుచు
భావిహితం బాత్మఁగోరు-పగిది నొడువుచున్ 132

క॥ దారస్మదీయ హితము
గోరితి రది మామతంబు-కూరిమి యేమున్,
మీరు, ముఖాముఖీ గాఁదగుఁ
గారణములు గలవటంచు-గమ్మను బంపెన్. 133

క॥ ఇట్టి కుయుక్తుల చేతం
బట్టు వడక యొకరి నొకరు-బలుగొంటులు దా
రెట్టెట్టైనం దోగాను
నట్టి యుపాయములు వెగకి-యలమట లొందన్ 134

క॥ అంత విజాపురి కోటన్
గ్రొంతలు గావింప నరుగు-రారాజనకున్
సంతసము గలుగ గోల్కొల
మంత్రి సహాయంబు వచ్చి-సూత్రులు గలిగెన్ 135

కలాపం" మొదలైన ఘట్టాలను కల్పించినా, అవిచరిత్రకు భంజకాలుగా లేరు. శ్రీగడియారం వారి శివభారతం కంటె పూర్వమే ఉద్భవించినా ముద్రణభాగ్యాన్ని పొందడంలో కొంతఆలస్యానికి గురియైన రచనయిది

ప్రబంధానికి కావలసిన సూర్యోదయాది అష్టాదశవర్ణనలు, యీ ప్రబంధంలో కమనీయంగాను రమణీయంగాను పొందుపరుపబడ్డాయి.

"కుందమ్ముల బృందమ్ముల
కుం,దమ్ములె యిందువదనకుందశనమ్ముల్
కెందమ్ముల యందమ్ముల
కందమ్ములు సుందరాంగియడుగుందమ్ముల్"

సుందరాంగి అడుగుదమ్ములను వర్ణించినకందం యెంత సొంపుగా నడిచిందో చూడండి వనవిహార సందర్భంలో చెప్పిన "అతని కాంత సౌరభలకాంతములెల్ల" అనేపద్యం శ్రవణపేయంగావుంది. మత్తేభగర్భ కంధ సీసం, చక్రబంధం, నాగబంధం, వంటిబంధ కవిత్వస్ఫోరకములైన పద్యాలు, భవానీదండకం మొదలైనరచనలు యీకవియొక్క రచనా ప్రౌఢిమనుచదువరులకు ఎరుకపరుస్తాయి, ఈప్రబంధంలో వసుచరిత్రలోని పోకడలుయెన్నోచోట్ల పరిస్ఫుటంగా గోచరమౌతాయి.

కావ్యాత్మరసం. శృంగారరసంగాని, వీరరసంగాని అంగిరసంగా వుంటుంది కావ్యానికి. ఈ శివాజీ చరిత్రకు వీర రసంఅంగిరసంగాను, శృంగార రసంఅంగ రసంగాను, యథార్థంగా పోషింపబడ్డాయి—దక్షిణా దిగ్విజయ యాత్ర మొదలైన ఘట్టాలలో యీరసావిర్భావం ప్రస్ఫుటంగా గోచరమౌతుంది-శివాజీ తానాజీ మొదలైన పాత్రలను పోషించడంలో యీకవిగారు ఔచిత్యాన్ని ఘనంగా పాటించేరు. ఏనాడో జరిగిన సంఘటనలను మన మనోనేత్రాలముందు ప్రస్ఫుటంగా గోచరమయ్యే ట్లు చెయ్యడం, హృదయం, పులకరించేటట్టు పద్యధారను స్రవింప



బలిజపల్లి రామమూర్తి.

ఆ॥వె॥ చక్రవర్తి యైన-షాజహానుని చెల్మి
పరిబల మాట నతని-రాజ్య వనము,
శైవరాయసైన్య-శౌర్యాగ్ని పెరుగదు
వేసు బాడమ కగము పెరుగ నట్లు. 123

ఉ॥ ఆయెడ మాటమాత్రమున-కాశ్రితులైయల దక్షిణంబునన్
రాయులు షాజహానుని బ-రస్పర మేరికి, వారు సిష్టమా
నాయెడఁగొల్చి యొక్కయెడ నారడి చూపి మెలంగు సజ్జనా
రాయులనోంచి పన్ను లను-శక్తిగొనన్మదినెంచి షాజహాన్ 124

గీ॥ తన తృతీయాత్మజుఁడు శౌర్య-ధైర్య ధుర్యుఁ
డఖిల రిపు వీరహంత కుం డనఁ బ్రసిద్ధి
నలరు నౌరంగ జేబున-యామ్యదిశను
బంపె సేనాపతిగ జేసి-భవ్యమతిని॥ 125

వ॥ అవ్వీర వర్యుండును 126

కం॥ ఖడకీ యను గ్రామంబున
విడిదల నేర్పరచి తనదు-పేరిట దానిన్
నుడువంగ జేసి, యహమదు
పుడమి గల సీమలెల్ల బొందు పరచగన్. 127

ఉ॥ ఆతఁడె దక్షిణస్థిత మ-హా మహిమున్వురు రాజులేలు, నం
దాత తమానిజా పురము-నాదిలషావతి గోలకొండ ని
ష్ణాత, యమాత్యుఁడౌ కుతుబ-శాహి,మరాటము శైవరాజు సం
క్రీతిగ నేల, వీరివెతఁ బెట్టఁ దలంచెను మోగలేంద్రుతో. 128

గీ॥ గోలకొండ వజీరు తా-కుతుబ శాహి
మొదఁ దనకుఁ గల్గు గంబు నొ-క్కింతఁ దెల్ప
నదియె తఱియంచు మగల్దాయు-లసికి నేగఁ
గూడ నరినెట్టి హితమొందె-గుతుబు శాహి॥ 129

గీ॥ పరవఘూరత్నములమాతృ-భావయుక్తి
దలప:గూళల శాసించు-ధరణివిభుఁడు
సకల జనులకు జ్ఞానంబు-సంఘటించి
విష్ణునపరావతారమై-వెలుఁగుచుండు. 253

సీ॥ ఎల్లమానవులను నిడుమల బడకుండఁ
దల్లిపిల్లలరీతిఁ-దనియఁ జేసి
సోమరి శుంఠల సుకృతవర్తనులుగా
నయభయంబులజూపి వ్యాయమరయ
పలుకీతులనుబాటు పడుచు జాతిద్వేష
మణచి కులాచార-మరసి విధులఁ
దప్పక నడిపించి - ధర్మచింతనలెల్ల
వారికిఁగఱపి కృ-పా సమృద్ధి

గీ॥ సాధు జీవులఁదమయట్లు-సంతరించు
భూవునకునుండు నరచేత మోక్షపదవి
యోగసాధనమేటికా-యుత్తమునకు
రాజయోగమ్మ సుమ్మిది - రాజవర్య! 254

గీ॥ ఇట్టి యోగంబుఁబూని రా - జేంద్ర! తొల్లి
రామ, మాంధాతృ, ఖట్వాంగ,-రంతిదేవ,
పృథు, భగీరథ, శిబ్యంబ - రీష గయులు
ముక్తికాంతా పరిష్వంగ - యుక్తులైరి. 255

మ అ యుఁగాక, నృపాల! నీ కొలఁదియూ హాశాలి, హా! యుల్పన
న్లొదుగింబాడియె, కావిగోచి-డి యీా-యోగంబుననోక్షక సం
పదగాకొంచాక తోవిలేదెమును భూ- పాలుర్ ప్రజాపాలనన్
పపమాధికృత జేసి మోక్షపదవిన్- సాధింపలేదే భువిన్. 256

సీ॥ సకల చరాచర-జంతుజాల సమేత
సర్వంసహాకు వ్రేఁగ-సత్యవాది
నిఖిల న్యాయాన్యాయ - నిశ్చయుండగుయము
పరిశీలనల లావు-పక్షపాతి
అఖిల జగత్కర్మ-కధికసాక్ష్యంబైన
కర్మసాక్షికి లావు-దుర్మదాంధుఁ
డ గణిత జనకల్మ-షాపహారమొనర్చు
గంగకులావు దు-స్సంగుఁడిలను

గీ॥ సర్వసర్వం సహాభార ధూ-ర్వహులగు
శేష, కిటి, కూర్మ, దిగ్గజ-శ్రేష్ఠములకు
భారమైతోఁచుఁబరకాంతఁ-బలిమిఁబట్టు
హీనచిత్తుండు వినవయ్య!- మానవేంద్ర? 257

ఉ॥ తావక బాహుదండమున - దారుణిభారముఁబూనెదేని, యీ
దైవగిరోఘులంతకుని - వర్ణనమొందెదరంతసంత భూ
దేవికి భారముందొలఁగు - దివ్యనికాయము మోదమందు, నీ
కావల, మోక్షమార్గము క-రాగ్రతలామలకంబుసుమ్మనన్. 258

కం॥ ముకుళితకరకమలుండై
నికటస్థలి గురినికాంచి - నెనరుంచి మహా
త్మ కటాక్షించవె నిన్నద
నకుటిలతల భక్తిఁగొలుతు - నని వేఁడుకతో॥ 259

కం॥ సాష్టాంగ నమస్కృతు లా
శిష్టునకుంజేసి యతని - సెలవున పురికు
తృష్టతఁజని మంత్రులు పరి
వేష్టింపఁగ,ఁగొలువుఁదీర్ప - వేగరు లెడుటన్. 260

గీ॥ కఱకు కత్తుల నొండొరు - నఱకు కొనుచుఁ
బోరుటకు గాని నామెత - బుత్త్రిగామి
తెలిసి యాయమ్మ, కొడుకును - గలనకంపె
మహిత సత్కీర్తి, తా, వీర - మాత యగుట. 355

సీ॥ పృథ్వీ మహారాజు - వెన్ను లాటకు నోడి
గోరీ యొనర్చిన - క్రూరవృత్తి
భీమసింగంబు దో - ర్వీర్యంబునకుఁ జాల
కల్లా యుదీన్ జేయు - కల్ల చెలిమి
రాయచూరున కృష్ణ - రాయ దాడికి నోడి
యేదులఖాన్జేయు - హీన చర్య
అళియరా మమహీశు - నాదృతిఁ బెంపొంది
యిభరా మొనర్చిన - వృజిన వృత్తి.

గీ॥ మఱియు జయపాలుఁడాదియౌ - మనుజ వరుల
చెలిమి గావించి, యవనులు - జేయు చెనటు
లబ్బుల తురుష్కుతో సంధి - కరుగు నప్పు
డాత్మకును దట్టి శివ మహీ - శాధిపుండు॥ 356

శా॥ మాయోపాయము లెన్నియో గఱచి, మున్-మల్కాళి దన్జిక్కులన్
ద్రోయంగా సమకట్టఁ, దప్పిన నసాధ్యుండౌటచే నమ్మహా
రాయుండాయన లోహకంకట శిర-స్త్రాణంబులం దాల్చి, కౌ
క్షేయంబున్ ఛురికంబు, లోఁ గలుగు నం-గీ, పాగయున్బెట్టుచున్

-: అఫజుల్ ఖాన్ వధ :-

ఉ॥ [illegible]కసబా కృతిం దనరు-తీక్ష్ణనఖంబులు, వ్రేళ్ల సందునన్
గోపనఁ జేసి, రచ్చకడ-కుం బయనంబయి, రాక చెప్పఁగా,
[illegible]కినవారు నయ్యవను-నొద్దకుఁ బంప, నతండు, కృత్రిమా
[illegible]పితమైన హార్దమునఁ-దత్సభ చెంతకునేగ, నెంచుచున్. 358

శా॥ పాదాబ్జంబుల వ్రాలు నాత్మజునికిఁ బల్దీవనల్నించి స
మ్మోదం బొంద, శరీరమున్నిమిరి, బా-బూ! యిమ్మహాపాపి, దు
ర్మార్గుండై భవదగ్రజున్ నికృతి సం - గ్రామంబులోఁ జంపె, నా
డాదిన్ పీడున శింపఁ గోరి సతమే - నార్యాసతిన్వేడగన్. 351

గీ॥ మొన్న తుల్జా మహాదేవి - బన్న మొంది
యస్మదీయంబునౌ ప్రార్థ - నాలయమున
దేవితో పీని నల్ల ను - ద్రావితినని
చెప్పినట్టుల కలవచ్చె - నప్ప! నాకు॥ 352

కం॥ బలహీనుఁ డయ్యెనిపుడీ
కలుషాత్ముఁడు పీని దొాఁశరి, - ఖండించుటకున్
దలపెట్టిన నీ కయ్యుమ
యలఘు బలం బొసఁగు గాక! యనుచున్మఱియున్. 353

సీ॥ సాధు గోహంతకు - సమయింప నెంచిన
నృపతి రక్షించు స - ర్వేశ్వరుండు
పరకాంతలను బట్టు - పాపాత్ముఁ బొరి గొను
ధరణీశుఁ గృపఁ జూడు - ధైర్యలక్ష్మి
సత్యంబు దూఱు దు - ర్జనుఁ జంపనరిగెడు
ప్రభువుతోఁ గలియు ధ - ర్మంబుమూర్తి
ప్రజల కల్మిహరించు - వృజినాత్ము దండించు
జనవంద్యుఁ బురికొల్పు - సాహసంబు

గీ॥ సకల జన కంటకుని ద్రుంపఁ - జనెడు తేని
కాయురారోగ్య మొసగు న - య్యష్టమూర్తి
యనుచు దీవింప పులకాంకి తాంగుఁడగుచు
నృపతి ఖానుని దరికేగ - నిశ్చయించె। 354

మ॥ అనినన్ సంతసమంది భూవిభుఁడు భిల్లాధీశ! నీవెంతకై
నను, సామర్థ్యుఁడ వెన్న నించుకయు గా - నం బోయి రమ్మన్న చో
ననలంబుం దరిక్రొల్పి, వచ్చిన జగ - త్ప్రాణ్ప్రాకున్మించెదం
చనుభాగంబునఁ గౌగిలించి మఱి ని - ద్రావస్థలం, బొందగన్. 347

కం॥ ప్రాతిగల నిద్రి దీరిన
మేతకుఁ బో, పెంచువారు - మేల్కని తమపై
మూతలు తీయఁగ, కుక్కో
కూతలు కోళ్లపుడు గూసె - గూళ్లం బెలుచున్. 348

సీ॥ తెరువల వెంబడి - నరిగెడు పాంథుల
డెందంబులో భీతి - కుందు పడగ
నిరవుల వెడలి, రేఁ - దిరిగెడు మెకములు
బోరున టెంకులఁ - జేరు కొనగ
శయనించు తఱి నూహఁ - జరిపిన పనులెల్ల
మానవుల్ నెరవేర్పఁ - బూనుకొనఁగ
నాకటి పెల్లున - నరచుచు పక్కియ
కూనలొకించుక - గూళ్లనురక

గీ॥ నత్తలానల రే, మగ - లలజడులను
క్రొత్త కోడంద్ర నిద్దుర - మత్తులేచు
తత్తరంబున జార్రైవట - లొత్తుకొనగ
నరుణరుచి తూర్పుదెసనెల్ల - నావరించె॥ 349

ఉ॥ ఖానునితోడ సంధి గొను - ఘస్రము నయ్యది యాట వేకువన్
స్నానముఁ జేసి. సన్నుత పి - నాకిన్యుఁడై, ద్విజుకోటి కెకుఁడా
దానములిచ్చి, భక్తిఁ దన - తల్లిపదంబుల వ్రాలి, యంబ!నా
పూనిన కార్యముం జయము - బొందగ దీవనలీయ వేయనన్

మ॥ మెకముల్ ప్రాకుచునైన నెక్కుట కసా - ధ్యంబద్ర్యగ్రోచరం
బౌక పాషాణ మశేష నిత్యర్ఝర జా - తోగ్ర శైవాలముల్
ముకరాకారము యోజనోన్నత మహా - మూర్ధంబునౌశైలమం
దకలంకా వరణా ధ్వపార్శ్వముల పీ - రానీకినుల్నిల్పుచున్. 341

మ॥ బిరుదుల్పొందిన యోధులన్ మహితులన్-బీష్వా మొదల్మంత్రులన్
బరభూ ముఖ్యులఁ గాంచి మీరలిక శం - భాజిన్ జిజాబాయినా
సరణింగొల్చి, మదీప్సితంబగు స్వరా - జ్యస్థాపనం జేయుఁడీ!
యురుజన్యంబున గెల్పు, నోటమియు, మా - కో, వారికో, కావునన్

ఉ॥ మాకుల దైవతంబగు సు - మానతి కారుణి కాగ్ర దృష్టిచే
నీ, కలహంబు గెల్వ మది - నెంచితి, దీనజయంబుగల్గు నా
కాకరణిం బొసంగ కభి - నూతి జయించిన దైన్యమొందక
వ్యాకుల చిత్తులై యరుల - నాఁడి వెట్టుఁడటంచుఁ బల్కుచుఁ.

ఉ॥ మావళి కాగ్రగణ్యు నస - మాన బలాధికు, సిద్ధ తేజు నా
ర్తావన రత్నకంకణ ర - వాన్విత దక్షిణ బాహు దండునిన్
ప్రావృడ వారిదోగ్ర శర - వర్ష నిమగ్న విపక్ష వక్షు, నా
నావిధయుద్ధ నైపుణు వ - నాజి సుతాగ్రజుఁ గాంచి యిట్లనెన్. 344

కం॥ మున్న ప్రభునాథుఁ గెల్వం
జన్న సుమిత్రాత్మజునికి - సామీరి వలెన్
సన్నుత విక్రమ! నీ వీ
బన్నంబున మాకుఁ దోడు - పడమన నతేఁడున్. 345

కం॥ కరములోడ్చి హసాదిదె
నరవర! నీ యాన శిరము - సందిమ నన్నున్
బెరవలెఁ బల్కుట నాయమె
వరమొసగిద వేని, నేన - వధియింతు రిపున్. 146

చ॥ యవన వరుండు సంధికొఱ-కై యిట వచ్చును నెల్లిగాన, నా
భవనముక్రింద చిత్రిత స-భన్, రచియించి నెడందత్రోవలన్
దవశిఖి, లే, రవులొక్క-లిపి-దారుణమా నొక క్రొత్త మార్గమున్
గవివలె సంఘటించి, యట-గంధగజంబులు పెక్కు-లుంచియున్

గీ॥ జావళీప్రాంతమునఁ గొంత-సైన్యమిడగ
తగు బలముతోడ శత్రులీ-తావుఁ జేరు
నంతకయమున్న తిరుమల పంతు వాయి
పురికమిత సైన్యములతోడ-నరిగి, పిదప॥ 336

కం॥ మా యగ్నిగోళ పంచక
మీ యెడ నినదం బొనర్ప-నెఱిఁగి కొనుచు మీ
రాయెడ యవన బలంబుల
నే యన్వాలె మారి మసఁగె-నియ్యెడ ననఁగున్. 337

కం॥ కాతర రిపు సంఘాతుఁడు
నేతాజి వరుండు దన, య-నీకిని తోడన్
దా, తూర్పు మలల నుండి మ
దాతత శృంగ నినదంబు-లాలించి వెసన్ 338

కం॥ తురక దొరతోడ నియ్యెడ
కరుదెంచిన యవన తుటుము- ననలము దూదిన్
జొర బడిన యట్లు వేవే
బొరి గనగా వలె నటంచు-బోధ గొలుపుచున్. 339

కం॥ తరుచరుల బోలు మావళి
వరులందరు కోటదాగ్రి- వల్మీక గుహాం
తర గండశైల కుంజాం
తరములలో డాగి, రిపుల - దండింపుమనెన్. 340

శా॥ కైలాటంబునఁ దన్ను మించిన ఘనుల్-గా రెవ్వ రన్బుద్ధి చే
లో. లో, సంతసమంది పాఱుఁదెస-నాలోకించి, యిప్పాటుకై
యాలోచింపఁగనేల, మాకతనిపై-నాహ్లాదమా. శాజి రా
డ్పాలంబుంగను కారణంబున, ధరా-బర్హిర్ముఖ గ్రామణీ! 329

మ॥ అనుచున్, సెకపు నవ్వు నవ్వి, నృపుఁడా-హా! యింత శీతుండె మ
ద్ఘన వీర్యార్భటి వించు, లో, వెఱచెనే,-గానిమ్మికన్ బుద్ధిగా.
మనుమంచు న్వచియించె గాని తనలో మంత్రిజ్ఞుఁడా పక్షమున్
జనియున్నాఁడను సంశయంబతని లే-శంబైనఁజర్చింపమిన్ 330

గీ॥ ఒరుల బడదోఁత్రియఁ దవ్విన-నోదమందు
దాను పడనున్న వాఁడని-తలఁపఁడాత్మ
కాలమానన్న పనాటన-గ్గదును బుద్ధి
పెడతలకు నెక్కినన్నట్లు-విధికలంప॥ 331

కం॥ నమ్మిన వారిం జెరపుట
లిమ్మహిలోఁ బాపమనుచు-నెఱిఁగియు విప్రుం
డమ్మల కడు దేవళముల
న మ్మెయి చెనటులనొనర్ప-సలుకవాడమదే॥ 332

గీ॥ నిత్య మొక్కని నైనను-నెత్తి కొట్టి
దండధరు బారి బడు గృహ-దహను శిరము
భిన్న మొనరింపఁగా, దుడ్డు-బెట్టె చిగురు
లన్న సామెతచేఁ బారుఁ-డట్లు తలంచె॥ 333

గీ॥ ఎల్లి యాతని యిక్కకు-నేము వత్తు
మనుచు, గృష్ణాజి భాస్కరు నంప, నాతఁ
డేలికను గాంచి, యా విధ-మెఱుక పఱుప
మంత్రులను బిల్చి, శివరాజు-మంతనమున॥ 334

కం॥ మీ వక్షములో నిమిడెడు
నా వామనమూర్తి యేడ-నాహవ మెచటన్
లావు గల బొబ్బ మెకమును
గా వరమా నిట్ట్రిపోతు-గతియే చూడన్. 223

గీ॥ నరివ చెంచులతోడ క-న్నాతలాడి
పెనగులాటలఁ దనకన్న-పెద్ద లెవ్వ
రని తలంచెడి బీరంబు లారిపోయె
దాపకో దగ్రి వీరమా-ర్తాండు వలస॥ 324

కం॥ నూతం దిరిగెడు. గప్పకు
నాత తమగు చెరువు సంద్రి మగునట్లతఁడున్
దా, తలఁచు తలఁపు, నీ, వి
ఖ్యాతి న్వీనునంత నుండి-యణగెం గానన్. 325

కం॥ అభయ మొసంగెద మనుచును
సభయుండగు నతనికడకుఁ-జనినంతనె దా
ర భసం బొప్పుచుఁ దప్పక
ని భ సన్నుత సత్వ! నీను-నెదుటకు వచ్చున్. 326

గీ॥ తాను రమ్మన్న తావునఁ-దమరు తొల్త
నే గగా, నమ్మి, యతఁడు నీ-యిక్క కెల్లి
వచ్చు, వచ్చిన, పై, మన-వాంఛ పొసగు,
గాన, మనమట్లు చేయక గాదు తలఁపు। 327

ఉ॥ ఎల్లిపర్తితాప దుర్గమున-కించుక దూరములోని చోటునన్
నెల్లడి యిక్కకున్, నృపతి, వేఁ-జనుదెంచును దొల్త, నిట్టుగా
కల్లను సంఘజేయ, వెన-కన్, మన తావున కాతఁడుబ్బి, రా,
గొల్లలుగా కొనందగును-గోర్కెలటంచు వచింప, ఖానుఁడున్ 328

# ఆకాంక్ష

ఈశతాబ్దపు తొలిరోజులలో వెలసిన చరిత్రాత్మకమైన ప్రబంధం శివాజి చరిత్ర-విస్మృత కళింగాంధ్ర కవులకోవకు చెందిన ప్రముఖులలో శ్రీబనిజపల్లి చినరామమూర్తి పంతులుగారొకరు ఏవిధంగా పరిశీలించిన ప్పటికీ, ఉత్తరాంధ్రవాఙ్మయంలో ధృవతారలాగ మెరిసిపోయే విశిష్టమైన రచనయిది. చంద్రశేఖర కరుణా కటాక్షలబ్ధమైన యీకవితాకుమారిని వీరుకల దౌతాచలధాముని పాదపద్మములకు సమర్పించి తమజీవితాన్ని ధన్యత మంచేసుకున్నారు. ప్రౌఢవయః పరిపాక జనితమైన ధీశక్తినంత టినీ ధారపోసి, యెన్నోసంవత్సరాలు కృషిచేసి అనల్పమైన శిల్ప చాతుర్యంతో యీరచనను రూపొందించేరు-విజయనగర మహారాజుల చేతపరిపోషితమైన విద్యాసదస్సు-భారతీ తీర్థలో దీనినిపండితప్రకాండు లకు వినిపించి"కవితావినోద"అనే బిరుదపట్టాన్ని పొందేరు. వైరిహర రంహ సింహాద్రినార సింహ" అనేమకుటంగల శతకాన్ని వ్రాసిన గోకులపాటి కూర్మనాథకవి వీరిబంధుకోటిలోవాడు-

గంజాంజిల్లాలో దీగ్రాసి అనేగ్రామందరినిగల పద్యాలతోకూడిన శిలాశాసనంవల్ల, క్రీ॥ శ॥ 997వ సంవత్సరంలోనే కళింగాంధ్రదేశంలో కూడా తెలుగు పద్య కవిత్వంవుందని స్పష్టమౌతుంది-ఈప్రాంతాలలో 17. 18 శతాబ్దాలలో, అనేకమంది మహారాజ కవులు, కవిరాజులు, మను చరిత్రవంటి ప్రబంధాలను ఆదర్శాలుగా పెట్టుకుని యెన్నో మహా ప్రబంధాలను రచించేరు. పూసపాటి తిమ్మభూపాలుని కృష్ణవిజయము, పెనుమళ్లసోమనాథామాత్యుని సీమంతినీ కల్యాణము అడిదము సూరకవిరచించిన కవిజనరంజనముమొదలైనవాటిని మచ్చుతునకలుగా మాత్రమేయిక్కడ ఉటంకిస్తున్నాను.

ఈఉత్తరాంధ్రదేశంలో వెలిసిన ప్రబంధాలన్నిటికంటెయీ శివాజీ చరిత్ర విశిష్టమైనదీ, ప్రకృష్టమైనదీ అనిచెప్పవలసివుంది. ఈప్రాంతంలో వెలసిన ఏకైకచరిత్రాత్మకమైన ప్రబంధంయిది-చరిత్రాత్మకములైన వివరాలను తెలియజేయడంలో ప్రామాణికుడని చెప్పుకోదగిన శ్రీకొమ రాజులక్ష్మణరావుగారు రచించిన శివాజీ చరిత్ర యీప్రబంధానికి ఆధారం కల్పనా చమత్కృతికోసంయీ కవి "శివాజీవేట" "ప్రేమ

పొందు గావింప నోడఁబడు-పోల్కి నృపతి
బ్రాహ్మణునివెంటఁదన రాయ-బారియైన
పంతు కృష్ణాజి భాస్కరు-బంప వార
లిరువురును ఖానుఁ గన వాయి-పురికరిగిరి. 317

కం॥ అరనవ్వు మోవినొలుకఁ గ,
మురువుగ నొడలందు మిగుల-బుల్కలువొడ మం
బరిపంథి జిక్కె ననుగతి
నరిగెందత్తాజి మున్ను-నష్టులు కడకున్. 318

కం॥ తన యీప్సితంబు గట్టి
క్కు, నటంచాత్మఁదలఁచుచు మి-గుల సంతసమం
ది, నృపోత్తముఁడే తెరగో
యను, ఖానున కనియె పాఱుఁ-డతి వినయమునన్. 319

కం॥ మలకాధిప! నీ యుక్తులు
దెలుపంగా, నృపతి బీతు-దీరివెన నినున్
గలసికొని తన యభీప్సిత
ములు మనవి యొనర్ప నాజ్ఞ-ముందుగ వేడెన్. 320

కం॥ అని మఱియుఁ గొన్నిమాటలు
వినయంబుగఁ జెవిని జెప్పి,-వీరవరేణ్యా!
విను మింకొక్కటి నిక్కము
ఘనబలుఁడవు నీ వటంచు-కాశ్యపి వరుఁడున్. 321

కం॥ తలకొంది విహ్వలుండై
పలు తెరఁగులఁజూచె మీ కృ-పంబడయ, గఁదా
నలఁతి బలుండౌటను ని
వ్వలనికి, రా, వెఱచి, మిగుల-వడకంజొచ్చెన్. 322

శా॥ సాలగ్రామము పేటి ముట్టకుండుమా, సంధ్యా పవిత్రార్ఘ్యస
త్కీలాలంబుల నంటరాకుండు, గుడా - కేశ ప్రహారాశ్మమా
జోలిం బోకుండటంచు వారుణీ నదీ - శుద్ధాంబువుల్ జల్లగా
లాలామూత్ర పురీషముల్విడిచి మ - ల్కాల్ ప్రేలుటాలించియున్.

సీ॥ శాంతమూర్తులు ద్విజులన్న - చదువు మిమ్ము
జెంచెదనుటకు సందేహ - మొందవలదు
మిన్ను పైఁ బడ నున్నను - మీరలజ్జ
గనక దలపెట్టరది యెంత - కార్యమైన॥ 314

వ॥ కావున నుత్తమ ద్విజులం దిట్టి మాహాత్మ్యంబు లనేకంబులు గానవచ్చు. ధర్మవర్తనమెల్ల వారికిఁగఱపుచు, ధర్మనిష్ఠనవలంబించుచు, వేదాధ్యయనంబు గావించు సద్బ్రాహ్మణులయాశీర్వాదంబులం గాదె తొల్లింటి నృపాలవర్గం బనర్గళ బాహార్గళ మండలాగ్రింబుల వైరి వర్గంబులం దెగటార్పం గలిగె మీరట్లను గ్రహించి, దేవ, భూదేవ, గో, యువ,యువతీ జనారిష్టుండగు నీ దుష్ట యావను నుద్దేశం బించుక తెల్లంబుగావించిన హీవరీయను సంవసథంబును పసథనంబులగు వసతులనేకంబును, నిత్యంబు దమ రర్చించు దేవతా నివేదంబునకొసంగెదనని, వినయ పూర్వకంబుగాఁ బలికిన, నకౌటిల్యాత్ముండగు, నవ్విప్రుం డప్పుడమిజేనికి నఖ్ఖాను నుద్దేశంబు వెల్లడించి. నిన్నొంటిగా, దన తావునకుం దెచ్చినఁ బట్టి, కట్టెదనని, యూహించు, నప్పాపాత్ము నొంటిగా, నీతావున కీవల నిల్పెద, నావల, నీ, వలచేతి బాకు మెఱయ, నావు వెఱచిం జేవగల బ్రేవు లీవలంబడ, నావు రావుకు మనజీవనంబులు బోవం, దెగనేయుమని, పలికి, యొరు లెరుంగక, యేకత్రోవలా రవలం బించి, యారాత్రి సుఖ నిద్రలం జరెపి, 315

కం॥ మఱునా డరుణోదయమున
[illegible] గలిసి, సంధి-ధర్మంబులు దా
మొఱలెల్ల వినఁగ నోడువుచుఁ,
[illegible] ఖాను గవయు-దినమిదియనుచున్. 316

మ॥ అని పల్మారనుతింప, దుర్గ, కరుణా - యత్తైక చిత్తంబుతో
దనునావేశము బొంది, సైనికులకు - త్సాహంబు రెట్టింప, ని
ట్లనియెన్, బుత్రక! నీదుశత్రువు కృతాం - తావాసమున్ జేరునా
యనుకంపన్ జయమీవుగాంచెదవుప్ర - త్యాదేశముల్ రావనన్

శా॥ ఆ వాక్యంబులు కర్ణయుగ్మమున క - త్యానందముం జేయ, న
చ్చో, వీరుల్, శివునుద్ధతిం బొగడ తే - జో మూర్తియై, పార్థివుం
డావేశన్, బరరాయబారిఁగని తా - నాలోచనల్సేయ. మున్
దేవి సంస్తుతిఁ జేయుచచ్చుటికి నెం - తేఁ బ్రీతి నేతేరగన్. 308

గీ॥ మున్ను విడిదల నేర్పఱ్చు - చున్నయపుడె
రాయబారికి సైనిక - వ్రాతమునకు
నించుకంతయు నవు గా - వించుక తన
మంతనముఁ జేయఁ దగియె - నా మందిరంబు॥ 309

గీ॥ ఆగృహంబున కేతెంచు - నవని పతికి
నెదురుగా వచ్చి భూసురుం - డేకతముగ
సంతతా భాషణంబులు - జరుపునప్డు
వినయముగఁ బల్కె నిట్టులు - ర్నాధవుండు॥ 310

మ॥ ధరణీ వేవతలెల్ల మానవులచే - తం, బూజ్యులవిప్రులా
దరణన్ సేవయొనర్ప, గైకొను నమ - ర్త్యవ్రాతమున్ గోవులుఁ
సుర, గో, భూసుర హింస నుగ్రులు తురు - ష్కుల్ గావునన్వారి సం
హారణంబున్ దలపెట్టు భూపునకు, సా - హాయ్యంబు గారే ద్విజుల్

గీ॥ మొన్నవాయీ మహాక్షేత్ర - మునని తండు
నీదు దరిఁ జేయు దుశ్చర్య - నాదు చెవిని
విన్నమాత్రినె నెక్కుడు - వెగటు పుట్టె
గన్నులారంగఁ గన, మొాప్చ - ఘనులు మీారు. 312

గీ॥ తనదు సత్వంబు నెదిరికిఁ - దనకు నెదిరి
సత్వమించుక తెలియని - సమయమందు
సంధి గావింప మేలగు - స్వామి, మీర
లనిననా, రాయబారికి - ట్లనియె నతఁడు 301

గీ॥ తావకోక్తులు నిక్కంబు - ధరణి' దేవ!
నాకు ఖానుని సందర్శ - నంబు గూర్చ
భారము వహించు కర్తలు - మీరు గాన
నెల్లినుడివెద నామాట - లెల్ల మీకు। 302

తే॥గీ॥ అనుచు విడిదికి నాతని- ననిపి పిదప
బహు తెఱంగుల నుల్వాలు - బంపి మఱియు
ఖాద్యవస్తువులధికంబు - గా, నొసంగి
పురికి నేతెంచె నారాత్రి - భూవిభుండు॥ 303

కం॥ తన ముఖ్యహితుల మంత్రుల
ఘన వీరులనెల్ల వెంట - గైకొని మనమీ
చెనటిపగ నేచ కాత్యా
యని వేడెద మనుచు చనియె - నానందముతో 304

మ॥ ఘన రక్తాంబరధారియై యలికవ - క్షః పార్శ్వ దోర్దండలే
పన కాశ్మీరజచూర్ణుఁడై, దొలి యుమాప్రాప్తైకనిస్త్రింశమున్
దనయంకంబున నుంచి, శోణసుమర - క్తప్రాక్షతల్ దోయిటం
గొని, యోంకారపురస్సరంబుగ నుతుల్ - గొండాడి పూజింపుచున్

శా॥ ఏరీతిం దొలగింతు నీయిడుమునే - నెవ్వారిఁ బ్రార్థింతు నీ
వైరిం సంహరణంబుఁ జేయు తెఱఁగే - వంకన్, గ్రహింతు? భవా
నీ, రుద్రాణి, మహేశ్వరీ, యభవురా - ణీ, పార్వతీ, చండికా,
గౌరీ, హైమవతీ, మదీయ నికృతిన్ - గారింపవే, శాంభవీ! 306

ఉ॥ ఖానుని రాయబారి తనుఁ - గన్గొనఁ బొందు పురిన్వసించుచున్
దానతనిం గనంజని హి - తంబున నంజలిఁ జేర్చి, మ్రొక్కి, స
న్మానమునంది యున్నయెడ - మల్కని మారుగ బల్కె ఖానుఁడో
మానవనాథ! నీగురుఁడు, - మాకు హితుండు నుతుండు నౌటచే

కం॥ మీ యెడ వైరం బించుక
నాయెదలేదా ఖురాను - నాయా నలికన్
దాయగతి నీకు నే మే
లీయెడ నొనరింతు నేడు - లీశ్వరు చెంతన్. 296

కం॥ మీయానకు వేశంబును
మాన్సూసలకు గడుసైన - మల లడవులుబల్
లోయలు మొదలగు నేలలు
పాయముగాఁ గొనియె మీకు - పాయన మొసగన్ 297

గీ॥ అనుచు నేదుల ఖానుతో - నతఁడు చెప్పి
మీరు లేలెడి దుర్గముల్ - మీకొసంగఁ
జేసెదనటంచు నాతోడఁ - జెప్పి పంపెఁ
గాన నాతనితో మీరు - గలియ వలయు" 298

కం॥ బలవంతుఁ డహితుఁ డైన౧
దొలుతన్మార్కొనక నుండ - దొరకొనహితనూ
కలనం బురి కొను వెనుకను
తలకుడుగును నీసు, పట్టు - దల, యధికంచా" 299

కం॥ పిడికిలి విడువక ముడిచిన
యెడ నేమో యందు గలుగ - నెంచునుదా నా
పిడికిలి విడిచినఁ దెలియుచు
చిడిముడి పడకుండు నళుకు - సెందదు మదికిన్ 300

ఆ।వె। ఏటియొడ్డు తుంగ - వాటంబుగా నాతఁ
డధిక శత్రువెదురు - నపుడు లొంగి
హీనుఁడైన పగతు - నెదిరించి లోఁగొను
పోల్కి సంధిఁజేయఁ - బుద్ధిఁదలఁచి॥ 287

కం॥ చతురోపాయంబుల స
న్నుతిఁగొను కృష్ణాజియను న-నుంగుంగని మీా
రతి వినయంబున ఖానుని
హితునింగావింప సంధి-కేగి యతనితో. 288

వ॥ ఇవ్విధంబున నంబ్రశంసింప పలము. 289

మ॥ తిలపన్ బీజపురీ నృపాలక తను-త్రాణంబులున్ భీషణో
జ్వల కారిస్య శితాశ్మ నిర్మిత కన-ద్వప్రార రాగాగ్రళం
బుల దుర్గహార్ధ్వ దయాంతరానిల మహా-భోగుల్ భవద్బాహువుల్
కలనన్నిల్చి యెదుర్కొ-నన్వశమె నిన్-ఖాన్వర్య! మా బోంట్లకున్

మ॥ అదిగాకన్గమరస్మదీయహితులై - యాదిల్షహా రచ్చలో
సదయుల్ పూర్వము నొప్పజెప్పిననను మీా-సన్మానుగా జేయుమన్
మదితో మిమ్ముఁగనుంగొనన్ బయన మై-న నిర్మరలేవచ్చి నా
రెదురయ్యెన్ దనుగోరు తీర్థమను న-ట్లిచ్చోటికిన్ ఖాన్వరా! 291

వ॥ అని మరియును. 292

కం॥ మీాకప్పనంబునొసగని
రా కొమరుఁ కోటలన్ ని-రాఘాటముగా
నాకర్షించితి గావున
నే కప్పములిత్తు మీాక- లిపి పొందవలెన్. 293

కం॥ అని యిట్లు జంబుకోక్తులు
వినయంబుగఁజెప్పి పంపి-వేగమ తానున్
గనుమల తెరువుల బయళుల
పెను ముండ్లుంగలుగు మండ-పిండు నిలుపుచున్. 294

గీ॥ తన బలంబున మేలేరి - మును బ్రతాప
గడను ముష్టడి యొనరింపఁ-గాను బంపి
యలతి బలములు జూవళి- యందు నిలిపి
మున్ను తనకట యుద్యోగ - మున్నకతన॥ 281

చ॥ అసయము సంచరించుటను. నయ్యెడ,మెల్కలు చిక్కులోయలున్
బెనగొను తీవజొంపములు - బిద్దములౌ పెను గల్లు గంతలున్
నినుగనునొంటి, రాముల ల-లెల్వడు జాలుల నాచుగుంపులన్
గని మనువాఁడుగాన ప్రిధ నంబొనరింపభయంబునొందుచున్ 282

కం॥ దత్తాజీ గోవిందను
నుత్తమ భూసురుని గాంచి - యుర్వీసుర! బల్
జిత్తులు నచ్చటి త్రోవలు
బత్తుల సడపంగ దుర్గ - భంబదిగానన్. 283

చ॥ కలహమొనర్చి రాజసుతుఁ - గట్టనశక్యము, కాన చెల్మినా
వలఁబడఁద్రోచి, మీద, మన-వాంఛితముల్గొన, మేలు, గాన క
ల్లలు తమరెన్నియో నుడివి.-లాభముమైత్రియటంచు.జెప్పి, యి
వ్వలనికి, వానిఁదోడుకొని-వచ్చిన గొంటునబట్టి కట్టెదన్. 284

గీ॥ అనుచు బోధించి దత్తాజి - నటకుఁబంప
నాతఁడరుదెంచి, పాప్పురి-యండనుండి
తాను వచ్చినవార్త భూ-ధవున కెఱుకఁ
జేయ నొక దూతనంపంగఁ-జెప్పెవాఁడు॥ 285

శా॥ ఆర్తల్విని భూవిభుండు దనము-ఖ్యామాత్యులంజూచి, యీ
దేవహోత్రికిఁనెదిర్చి; గెల్వ, మన కెం-తే, దుర్గభంబందుచే
నీ వంకన హింతమంది డగ్గఱిన యీ-యిక్కట్టు వ్రాఁదోలి, మున్
లావుల్గూరిచి, వీరలన్గమిచి, గె-ల్వన్ వచ్చునంచెంచుచున్. 286

కం॥ ఖేయంబు సలిల పూర్ణము
చేయించి శతఘ్నికలను - శీఘ్రిమ బాఱుల్
వేయించి కోటపైని ఖ
ణా యింపఁగ వలయు రిపుగ-ణంబులు బెగడన్. 268

కం॥ కాలుగమి వేరు వేరుగ
నోలిన్మన్నించి కాన్క-లొసఁగఁగ వలయున్
చేలిక శత్రువులైనన్
జాల ప్రయత్నంబు మేలు-జన్యంబునకున్. 269

శా॥ అన్యోన్యంబిటు మంత్రిపుంగవులు దూ-రాలోచనల్ సెప్పఁగా
జన్యంబొప్పదు వీడు బేరజము దౌ-ర్జన్యాఢ్య సత్వుండు సా
మాన్యద్వేషుని భంగినెంచి, యభిసం పాతంబు గావించినన్
సైన్యంబెల్ల గృశించునంచు మదిలో-సందేహముంబొందుచున్ 270

గీ॥ సమరమొనరింప మేటి య-త్నము లొనర్చి
తుటుము లెడనెడఁబరులకుఁ-దోపకుండ
నిలిపి ధైర్యంబుచే గెల్వఁ-దలఁచి యుండు
సంతనటనబ్దుల తురుష్కుఁ-డతి రయమున. 271

ఆ॥వె॥ పదునేలకాల్బ్వ-రేబది నూఱులు
గుఱ్ఱపుం దళంబు-గొప్పలైన
నాయసాండములును - నరువది యూఱును
శతగజంబు లుష్ట్ర-శతముఁగొంచు॥ 272

కం॥ పదియేను నూర్ల పిదవన్
పదియొక్కటినైన శాలి-వాహన శకమున్
గదిసిన భాద్రపదంబున
కదనమ్మున కరిగె నతఁడే-కాయెకి నడకన్. 273

కం॥ నిలువఁగఁ గారణమేమని
పలుకంగా, సామి! నీదు - పట్నమునకు న
బ్దుల ఖాను దాడి వచ్చుటఁ
దెలిసియుఁ జెప్పంగ వచ్చి - తిమి? మేమన్నన్. 261

మ॥ అప్పుడాఖానుని దాడివేవిని మరా టాధీశుఁడారాడ్ఘడన్.
విపినోద్ధత్యములేమి నిల్వక మహీ-భృత్కూట దుర్భేద్యమై
రిపువిధ్వంసమునౌ ప్రతాపగడ స-ద్ధిన్వచ్చి యా, జింజరా
ధిపతిన్ గెల్వఁగనేగు పింగళధరి - తీ దేవుచిన్‌బిల్చుచున్, 262

శా॥ ధీరోదాత్తుల సైన్యనాయకుల మంత్రి శ్రేష్ఠులఁ గాంచి బ
ల్వీరుండబ్దులఖానుఁడాలమునకున్ - వేంచేయుచున్నాఁడిఁకన్
మీరత్యంతము ధీరులై పగులఁ గాం దీసకులన్ జేయఁగా
దూరాలోచనచేసి చెప్పుఁడనినన్ - దోడ్తోన వారందఱున్. 263

కం॥ మంత్రిలమని మాతోడను
మంత్రాలోచన మొనర్చి - మన్నించితి, రా
ద్త్రంత్రము-ఁ నొడువ నీదరి
జంత్రపు బొమ్మలముగాదె - జననాథవరా! 264

వ॥ అయినను దామడిగితిరి కావున మాకుందోచినది విన్నవించెదము! 265

చ॥ తొలుదొలుతం భవానికిని - తూహలముప్పతిలంగఁ బూజలన్
సలుపుచు సాలభిత్తి కడు - సారమొనర్చి తృణంబు, కట్టియల్
సలిలము ఖాద్యవస్తువుల - సంఖ్యలు గూర్చి సహస్రమొంటుగా
దళములు వేరువేరనతి-ధార్ఢ్యముగా వివరించి పిమ్మటన్. 266

కం॥ ధరణీధర వివరంబుల
తరుకోటర గుల్మనీల - తా కుహరములన్
బరిచయము గలుగు మావళి
వారలను దగు సైన్య సమితి - తో నిల్పవలెన్. 267

గీ॥ పంచ శత సైంధములతో-బయలు దేరఁ
గాంచి భూసుర వర్యుఁ డా ఖానుతోడఁ
దత్తరంబునఁ బల్కె,-నుదాత్త శౌర్య!
మీరలిట్లేగ భయముచే-బారు, నృపతి॥ 359

గీ॥ దిట్ట యతఁడని, యెంచి, తా-గుట్టు నీకుఁ
దెలియ దక్కట! వీరికి వాఁ-డలఘు శౌర్య!
దవ్వు కొండలును నుపని-తలప వలదు
కాన, నీవొంటిఁ జనకున్న-గార్యము చెడు. 360

గీ॥ అనిన సంతసమంది య-య్యవన వరుఁడు
నొంటిగా నేగి, చేచేత-నంటు నపుడు
కౌగిలింతలలోఁ బట్టి-కట్ట నెంచె
గాని తన, యన్గు టక్కరిఁ-గాన నతఁడు॥ 361

గీ॥ సంధి తలమున కర్ధయో-జనమునందు
బలములను నిల్పి, శిబిక పై-బయలు దేరి
వెంట నొక బంటుతో సభా-మంటపమున
కరిగి, యట, రాయఁడుండమి-నళుకునొంది 362

363

వ॥ సేవకునంగనుంగొని

శా॥ ఏరా! రాయఁడు, రాని కారణ మదే-మీ, యేమెడన్వచ్చు వాఁ
డౌరా! యంచుఁ దపించు, లోన, గుహలో-హర్యక్ష శార్దూలముల్
సారంగాళి, హరింపఁ గోరు క్రియ, కాం-క్షన్వచ్చెఁ దానాజిలో
నారాజేంద్రుఁడు వారిఁగాంచి మదిన-య్యబ్దుల్ దురుక్షేంద్రుఁడున్

కం॥ కాలుని చందంబున మేన్
గ్రాలుచు, గటినంటి రెండు-ఖడ్గములిలపై
గ్రేలాడు వాఁడు భటుఁ డే
వాలుంగై లేని యనద-వసుధే శుఁడగున్. 365

వుడకల దొర్లినట్లుండును. మఱుముద్రిణమున నయ్యవి సరిజేసికొనుట సమ్యక్పద్ధతి క్వార్థకేకార సంధులుచేయుట, దుష్టసమాసములు కూర్చుట, మున్నగు నవి యచ్చటచ్చట కనబడును అవిరసమాధుర్యమున కడ్డు తగలనివి కావ్యనష్టం తవ్వములే "ఏకోహిదోషో గుణసన్నిపాతే, నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అనికాళిదాససూక్తికదా!

ఇంతటి కవితారసపూర్ణరసాల ఫలమునందించి, తత్ప్రశస్తిని వాకొనుడన్న నేనేమి చెప్పగలవాఁడను! తద్రసవాహినిలో నొకపర్యక్క కొదిగి మునిగి తేలుటనాపని. ఇంతటి యభిమానమును నాపైబ్రసరింప జేసిన శ్రీ బలిజపల్లి రామమూర్తిగారికెంతయు కృతజ్ఞుఁడను.

ఈగ్రంథము బృహద్గ్రంథము. హస్తభూషణముగా మిగులుట కంటె, విశ్వవిద్యాలయములలో చదువరుల కరకమలములందుండుట సముచితము. పాఠ్యగ్రంథముగా, పుస్తకభాండాగారములందు పరిశోధన గ్రంథముగా నుండుటకూడ మంచిదనవచ్చును. ఆంధ్రమహాశయులంద రిద్దానినాదరించి, తమతమసారస్వతాభిమానములనువెల్లడించుకొనగలరని ఆశించుచున్నాను

శా॥ ఔచిత్యప్రతిభా సమగ్రము రసో
ద్యత్సాహితీ రాజిత
ప్రాచీనాంధ్రమహా కవిత్వమెఘుధా
రాయుక్త ముత్కృష్ట శ
య్యా, చాతుర్య చకచ్చ కచ్చకిత ది
వ్యాలంకృతీ సత్కథా
ప్రాచుర్యంబు శివాజి కావ్య మురుక
ల్పత్మాజమై వెల్గుతన్.

విజయనగరము. }
2-4-79 }

వినీతుఁడు
భరద్వాజ విపశ్చిత్తు.

కం॥ ఆ వృత్తాంతము చారులు
భూవిభున కెఱుంగఁజేయఁ - జూడచూపంగా
మీావచ్చిన పని యెయ్యది
వేవేఁదెల్పుఁడన నిట్లు - వివరించెఁదగన్. 274

కం॥ అపజుల్లానుండిప్పుడు
విపులానీకినులతోడ - విచ్చేయుచుఁదాఁ
గృపయించుక బొడమక తు
ల్జ పురాలయమందు నాలఁ - జంపెంచెక్కల్. 275

కం॥ గొల్లఁగొని ప్రజలనెల్లం
దల్లడమొనరించి వయసు - తలిరుంబోండ్లన్
బల్లిదులై చెరఁగొని నా
డెల్లి నిటకువచ్చుఁగాన - నెఱుఁగుము-సామీా! 276

వ॥ మఱియును. 277

కం॥ వాయీాకడ దేవళమున
హేయములగు పనులొనర్చి - కృపలేకచటన్
బోయగతిని నావులనొక
చేయింగోయించె భీతి - విరహితుఁడగుచున్. 278

కం॥ అను వచనంబులు వినుచున్
జన విభుఁడీ దుష్టయవను - సాధించి జగం
బునకు పక్కృతిఁజేయుట మే
లని యాలోచింపంగ ఖాను డతి వేగమునన్. 279

శా॥ పూనామార్గము బట్టి యేగి, యొకతా - వుంజేర, నకోట్కోటలో
భూనాథుండు వసింప వీల్వడమి మున్ - బోయెన్ బ్రితాపావ్వాయ
స్థానీయంబున కన్న, వేగరుల వార్తల్ దక్షిణం బచ్చుటన్
పేనులోనేకగసైన్యయుక్తుఁడగుచున్ - వే వచ్చి వాయీాపురిన్. 280

ఇది మహాకావ్యమనుట కిందలి యష్టాదశవర్ణనలే సాక్ష్యములు. అవసరమని తోచిన ప్రతిఘట్టము నభిరుచితో వర్ణించి పఠితలగుండెలలో నమృతము జిలికించిన యితని ని 'కవి' యనుటచాలదేమో? ఇట్టి వీగ్రంథమునకు వన్నెలు చిన్నెలు గూర్చినవి.

శివాజీ రామదాసుల సంభాషణాఘట్టము, పవిత్రశబ్దమయమై, యర్థవంతమై, మనయాత్మలలో చెరగని దేశభక్తిని, పెద్దలయెడననురక్తిని, గలిగించును

శివాజీ తన, యిలవేల్పైన పరమేశ్వరుని శంభోభక్త సంరక్షకా, యన్నమకుటముతో నవరస భరితముగా, వినయ విధేయ సరసముగా, భక్తిభావమధురముగా ప్రార్థించెను. అది సర్వకావ్య శిరస్సగిత నవరత్న ఖచిత కిరీటమనవచ్చును.

ప్రత్యేకముగా నీమహాకావ్యము నందు ట్లంకింపఁదగినవి యలంకారములు. సమయోచితముగ నీమహాకవియెన్నెన్ని యలంకారములు వాడినాడో! శబ్దాలంకారముల యొరవడులు, చిత్రాలంకారముల పరవడులు, శబ్దచిత్రములు, అచ్చతెనుగు నుడికారము లీమహాకవి యనుభవించినట్టి తరులనుభవించలేదేమో యనిపించును. వీటికన్నింటికిందెందైన నెన్నైన యుదాహరణ లీయవచ్చును. ఈతనికి పద్యమురచియించుటన్న, నల్లేరుపైబండినడకవంటిది. ఎత్తుబడిలో, నడిపించుటలో, ముగించుటలో తనదైన యొకప్రత్యేక ముద్రవైచుకొని రొమ్ముువిరుచుకొని సాహిత్యరంగమున గర్వముగా నిలబడగలుగు మేటికవి.

ఇంతటి మహనీయగ్రంధము మరొకటిలేదు. ఇంతటి కావ్యపసన్నతా గుణముగలది నూటికొక్కటియైన దొరకునో దొరకదో! మన సుకృతపరిపాక విశేషమహాత్మ్యమువలన నియ్యది లభించుటయు, ముద్రణనందుటయు జరిగినది. అయినను ప్రథమముద్రణమందే ముద్రారాక్షసములు పెక్కులుండుట పున్నమిపై అమావాస్యదాడివెడలినట్లయినది. పలుసారులు పలువురెంతశ్రమకోర్చి సరిచెచేసినను అనలునులుండిపోయినవి. పాఠకులకవి యిబ్బందిఁగలుగఁజేయును. మధురసములో

ఈమిన్న ముక్కంటి సామేనిదైయున్న
నడుగుదమ్ముల బత్తి నలరిగొలుతు
నీనాతి లుకజీ మహీజాని సుతయైన
గన్న తల్లియటంచు గౌగిలింతు
నీలేమ శహజి రాచూలియైయుండిన
సహజాతయుని మద సంతసింతు
నీయింతి, నేగన్న యెలనాగయైయున్న
నంకమందిడి ముద్దులాడుచుందు

నీవిలాసాంగి వీరిలో నెవరుగామి
బలుకరించుటకింతయొప్పదు మనంబు
తెలియకేరీతి భాషింతు దీనితోడ
పరవనితగాన నేమని పలుకరింతు.

ఈపద్యమంతయు, మర్యాదాపూర్వకమైన యనురాగములతో తొణికిస లాడుచున్నది.

ఈ గ్రంధము వివిధ వివిధ మనస్తత్వసంపన్నులైన పాత్రలను మనకు పరిచయ మొనరించును. అందు శివాజీ పాత్రమగ్రస్థానమునందు కొనును. శివాజీ గుణశీలములను బ్రదర్శించు ఘట్టములెన్నియేని గలవు. అన్నియు కావ్యోత్కర్ష కారకములే.

శివాజీ సర్వతంత్రస్వతంత్రభావనా పరిష్కృతుడైన ధీరోదాత్త నాయకుడు, శృంగారమునందెంత సరసుడో వీరమునందంత యౌద్ధత్య విస్ఫూర్జిత మహాసత్వమయావేశముగలవాడు. సూయిా, సోయరా వివాహములందది తేటతెల్లము. అనేక దుర్గములను వశముచేసికొని, అబ్జుల్ ఖానుని హతమార్చి, ఢిల్లీనుండి తప్పించుకొని, కరకుతురకలతో పోరాటమును సాగించివచ్చు పట్టులలో నతనిలోని వీరావేశము కట్టలు త్రెంచుకొనును ఈరసములనంతయు దాత్తముగ చూపించిన కవిస్తుత్యుడు

మనకు విజయము రాదు. కనుకమైత్రిమేలు. విజయమెందుకు రాదు అన్నచో, నా శివాజి, ఉరుసత్వుడు. మనకు లేదు. మహెూపాయములు గలిగి సమగ్రసేనా సహాయసంపదతో మిన్నంటి, శౌర్యరసముతోబాటు ధైర్యముకవచమైయుండగా, పార్వతీప్రసాదలబ్ధ విజయ వీర ఖడ్గము ను ధరించిన దోర్బలాఢ్యుడు. అందలి లక్షణములేవియు మనకులేవు. ఈ భావమును మనకన్నులయెదుట నద్దములో ప్రతి బింబమురీతిగాచూపుట- సరస్వతీచరణ సేవాజీవులైన కవులకుసాధ్యము.

ఈ శిల్పమును పరిశీలింపుడు. కాళ్లువచ్చి, గునగునసడిచి, మనలనెట్లు పలుకరించునో!

"ఉక్కెక్కు వెడదఱొమ్మును
బిక్కటిలంబెరుగు దండబిగువును నొగఘుం
గ్రుక్కెడు మోముమెఱుంగును
బిక్కల కేలందుకతన బిరుదుమగండున్

ఈ చిన్నకందమెంత బిగువుగలిగిన పోటరిని ముందుంచినదో తలంచిన విభ్రమముకలుగును

మహాకావ్యములకు మెరుగులుతీర్చునది, ఔచిత్య మనుకావ్యగుణము. అలంకారికులీ గుణమునకు పెద్దపీటవేసిరి. ఔచిత్యములేని, అనౌచిత్య ప్రదర్శనముచేయు కావ్యముకావ్యముకాదనిరి. కావున కవీశులెల్ల రీవిషయమున జాగరూకతనహించిరి.

శివాజీకి, సౌందర్యఖనియైనయొక యువతిని బహుమతిగా, నీయ, పరభామలను మాతృదేవతలుగా తలంచు శివాజీ, తనయంతరాత్మను ప్రదర్శించు సందర్భము కావ్యలోక సమ్మోహనమనదగును. అక్కడ సందర్భోచితీ శోభ లెట్లుజాలువారినవో!

"రిపువిధ్వంస మొనర్పఁబోము్మ; మహితో
ర్వీకాంతఁ గైకొము్మ; కీ
ర్తి పురంధ్రీఘన నూపురార్భటులచే
దిఙ్నాగ గండభ్రమ
ద్విపులేందిందిర నాద నిర్జాణిల శ
క్తింగోము్మ; విజ్ఞానులన్
గృపచేఁబోచి, జగము్మలిము్మ గనుర
క్షింపంగ లేలెము్మగిన్"

భక్తరామదాసు మహారాష్ట్రస్వరాజ్య సంస్థాపనాఖిలశక్తి మంతుఁడైన శివాజీకి కర్తవ్యనిష్ఠనుపదేశించు సందర్భములోనిది. ఒకవంక సర్వసంగపరిత్యాగియైన సమర్థరామదాసు విశ్వశ్రేయః కాంక్షియై, తగిన నాయకునికొఱకన్వేషించగా, శివాజీలభించినాఁడు. వాని జీవితపులోతులలోనికి జొచ్చి, వాని యలవాటులను గండూషించ గలిగిన రామదాసట్టి సన్నివేశమును విడుచునా? కనుక చిన్న చిన్న శబ్దాలంకారములుగలిగిన క్రియలనుపయోగించి పద్యమును జిగేలుమని పించెను. ఇది పాత్రల పవిత్రితలోనిమిడి, మరుగుపడిన, కవీశ్వరుని వాక్యశిల్పనైపుణ్యము. పద్యమందలి వాక్యములన్నియు, నర్థవంతములే. ఇది అనన్యసాధ్య కవితాచాలనము.

సజీవమైన శబ్దార్థ సంయోజనతో మనకు తెలిసినదానినే సాక్షాత్క రింపజేసికొనుట శిల్పమనవచ్చును. అది పరువమునకు మురువునకు అద్దముపట్టినట్లుండవలెను.

"ఉరుసత్వుండు సమగ్రసైన్యుడునుమా
యోపాయగాంభీర్య శౌ
ర్యరసాఢ్యుం డతిధైర్యమూర్తి పరభా
మాభీష్ట శూన్యుండు, దు
ర్భరదంభోళి విదారణోగ్రగిరిజా
పాణిప్రైక కాంక్షేయదో
ర్ధరుఁడీతండగుటన్ జయంబరుదు; మి
త్రత్వంబు మేలంచొగిన్"

మహాకవియైనవాఁడు తనగ్రంథమంతు పద, వాక్య, రచనా భావశిల్పప్రశస్తిని పొందుపరచి, సంపూర్ణకథా కౌశలమును వెలార్చుచుండును. ఒకప్పుడొక చిన్నపదమే, తత్సర్వపద్యరచనా నైపుణ్యమునకు వన్నెయు, వాసియునిచ్చును. ఆపదశిల్పము తెలిసి కవి, వాడినచో నాపద్యచ్ఛందమునకెక్కడలేని, యెనలేని, సౌందర్యము కలుగును

"ఎట్టకేలకుఁబతిఁ జూడ నింపుమిగులఁ
బోడసుజీజకు, నే రా లు పొడగనంగ
మించెనీర్ష్యయు, సతులకు నెంచరాని
కోపమొదవదె సవతి యాటోపమెన్న"

ఈ పద్యముచాల చిన్నది. దీనిలోని భావమనంతసాగర గాంభీర్యమును కొలిచివేయును.

శివాజీ తల్లిజిజీబాయి. తనభర్త చిరకాలమునకు, తన్నురావలసినదని యాహ్వానించెను. పతిసందర్శనకామెహృదయమురకలెత్తుచుండగా పయనమైనది. ఆయిల్లు నిజమునకు తనదే, తనే, మహారాణి ఇట్టికోరికలుత్పన్నములగుచుండగా, గృహప్రవేశముచేసినది చేసి అక్కడ చూచినదేమి? జీవితకాలమంతయు, తనయౌవనచైత్రమునకు పోటీగా నిలిచిన యొకానొక సవతిని. అనగా ఏరాలును. ఆమెహృదయగతభావనావర్ణచ్ఛాయల నింక నూహింపుకొనుఁడు, ఇంత యూహాస్పదమైనదేది? దీనిలోని, 'ఏరాలు' అన్నచిన్నపదము. దానిమూలముగ పద్యమంతయు నధికతర సుందరకావ్య భంగిమమైనది ఇదియేగాక యీ శివాజీచరిత్రలోని పద్యసంతతులెన్నియో మనలనుక్కిరిబిక్కిరి చేయును. పదములనుపయోగించుటలో గడుసుదనము చూపగలుగు మేటికవియిట్టిపదశిల్పములను బొదుగుచు, నలంకారములను సృష్టించుచు సందర్భశుద్ధిని గనబరచుచుండును.

మరియొక పద్యముగమనించినసందులో కాతిశాయియైన వాక్ శిల్పము కనబడును. ఆశిల్పము వినీలజలధరాంతరి రమ్మదమై కాంతులీనుచుండును. అది మహాకవికి మాత్రమే సాధ్యమగును.

కావ్యగుణములు కావ్యములో నిండుగా, మెండుగా నుండుట సమ్యక్కృద్ధతి. అలంకారముల వసరోచితముగ నుపయోగించుట ప్రశస్త పథము. అట్లే, చ్యుతసంస్కారాది దోషములు పరిహరింపబడుటయు ప్రధాన కావ్యాంశమేయగును. పద్యశయ్యా సంస్కారము ప్రసన్న కథా కవితార్థయుక్తము ప్రత్యక్షర రమ్యత్వముతో నానందమున ముంచవలయును. ఇట్టిలక్షణములతో నిండినది గ్రంథము. ఇది వ్యంగ్యవైభవ సర్వస్వము.

మహా కృతులలో రసమునకున్న స్థానమత్యుత్తమము రసస్థాయిత్వముకావ్యమున కాయువుపట్టు. శృంగారహాస్య కరుణములు, రౌద్ర వీర భయానకములు. భీభత్సాద్భుత శాంతము లనెడిరసములలో క్రమముగ, "రతి, హాస, శోకములు, క్రోధోత్సాహ భయములు, జగుప్సా విస్మయ శమములు స్థాయిత్వమునందినవి. ఇందువీర రసము ప్రధానము. ఉత్సాహము స్థాయీభావము. అంగ రసములు ప్రధాన రసభంజకములు కాకుండ ప్రధాన రసపోషకములై యనేకములుండనగును. ఇందుశృంగార రసఘట్టములోకింత తగ్గినట్టు కన్పట్టినను శివాజీ విహారవర్ణనలో నత్యంత ప్రశస్తముగ వర్ణింపబడుట గమనార్హము

కైశిక్యాది వృత్తులు, వైదర్భ్యాదిరీతులు, ద్రాక్షాదిపాకములు కావ్యగ్రథన కత్యంతావశ్యకములు. కోకొల్లలుగ బహుముఖములుగ కావ్యగుణములిందు లబ్ధములు

## కావ్య శిల్పము.

లోకోత్తర కవితా కల్పనా భావనామధుమయ శబ్దశక్తి సంయుక్తము కావ్యము. మహర్షికల్పుఁడైన కవిగాని తాదృశ మహా కావ్య గ్రథనకు సృష్టికర్త కాలేఁడు. అది కవికి, కమనీయకీర్తిని, సమర్థార్థమును. వ్యవహార వేతృత్వమును, శివేతరక్షతమును, కాంతాసమ్మితత్వమును గలుగజేసి, యఖండానంద జన్యమగును. ఇదికావ్య ప్రయోజనము.

"పురవర్ణనము, బ్రాహ్మణవర్ణన, వివాహవర్ణన పుత్రప్రసవాద్యభి వర్ణనము. వనవిహారవర్ణన యుద్ధవర్ణన, సూర్యచంద్ర, తిమిరాది వర్ణన, మృగయావర్ణన, ఋతువర్ణనాదికములతో సుయాత్రలూగించుచు నీమహాకావ్యము క్షీరకంధి తరంగరంగత్సుష మాభోగమునను భవమునకుఁ దెచ్చి విడచును, క్లిష్టాతిక్లిష్ట రచనాచమత్కార చతుర్విధ కవితారహస్యములిందాయా, సందర్భములలో సదభ్ర విభ్రమములై యిందుదాగియున్నవి మత్తేభకంద గర్భసీసములలో గర్భకవిత్వములు, చక్రబంధ, నాగబంధ, ఛురికాబంధాదులలో బంధకవిత్వము. ఈకృతికి, సౌందర్యరేఖాకృతి.

కావ్యమున కథానాయకుఁడు మహాకులీనతౌజ్జ్వల్యాద్యనేక గుణగణ చైతన్యవంతుఁడై యుండవలెననుట కీగ్రంథమంతయునుదాహృతమే. మహారాష్ట్ర క్షత్రియవంశమునందపురూపముగ జన్మించిన శివాజీ "శివాంశ, ముగలవాడని

"శంభుసంస్తుతి సంభవచరితుడైనవాడు గావున బిలిచె శివాజి యనుచు.

అను పద్యము బైటపెట్టుచున్నది. ఔజ్జ్వల్యమనునదియొక కావ్యగుణము. ఔజ్జ్వల్యమనగా, "రూపసంపన్నదేహత్వ, మనుట శివాజీ భవానీ ఖడ్గధారణ ఘట్టమునందు, శస్త్రాస్త్ర మల్లయుద్ధాద్యభ్యాసమునందు, సోయరా, సాయీ బాయీలవివాహ సందర్భరుచిరరుచిర మోహన రూపవర్ణనలందాతని రూపసంపన్న దేహత్వమభివర్ణితము. మహాభాగ్య గుణమొకటి ప్రతిభాసించుట ముఖ్యము. మహాభాగ్యమన విశ్వంభరాధిపత్యమే. ఈతని యౌదార్యగుణమున కవధిలేదు

ధీరోదాత్తనాయకుడు, శృంగారవీర రసోల్బణ మహితమైన కావ్యమునకు వన్నెదెచ్చును. ధీరోదాత్తలక్షణలక్షితుఁడైన శివాజీ యీమహత్కథాభాగమునకు నాయకమణి, ఏతాదృశ మహాగ్రంథమునందీదృశ నాయకానుగుణ లక్షణముల ప్రయత్నసిద్ధములై యతికి కొనిపోయినవి.

"భయదానర్గళ తర్జనోగ్రబలవద్బాహార్గళాదభ్రదు
ర్జయ నిస్త్రింశ చటచ్ఛటార్భట రటజ్జాలోత్కట ధ్వంస సం
చయమయ్యెన్, సురభూసురాలఁయు గవీసంఘంబులన్ గావవే
జయలక్ష్మీ నటుదగ్రదోర్బలుఁడవై, శాసింపుమాదుష్టులన్"

ఇది రసోచితారభటీ వాగ్వ్యాపార కవితాచ్ఛందముర వడులతోఁ, బరవడులతో సాగిపోయినది. శిల్పరచనా మాధుర్యము రోమాంచముఁ గల్గించినది. సంస్కృత జటిలసమాసభూయిష్ఠమియ్యదికాగా, నియ్యది యచ్చతెనుఁగు పలుకుబడులలోని యొయ్యారపు సింగారము బంగారము మనకందించును

"కలికంటి తెగకంటి-కలికి మంటలఁ బోలు
తూపుల నెమ్మొకల్ దూలనేసి
కప్పుతాఁబెక్కటి-గాటు కోరలఁడీటు
గిట్టలుగక్కర, సోకుమొట్టజేసి
గుబ్బలి యొరగలి కొనల కీడగుచున్
మురుపులకోరీలు మోమునాటి
కడనాటి మబ్బుల వెడలు పెన్బిడుగుల
బోలు నారసముల మూపుఁగంటి

తే. గీ. మిత్తికాయంబులను రొమ్మునత్తిమొత్తి
కడిది సిలుగులు కణతల కడలనేసి
బెడగు సరములనోడలెల్ల వడకజేసి
మింటిఖానుడు రాయునల్ంచనంత"

అచ్చతెనుఁగులోని బింకము పొంకము. కొంకక, యొక్కింతగా, నిది, చూపించుచున్నది. ఈదృశ పద్యసంతతులిందనంతములై యాశిరశ్చరణాంతమతిలోక వైభవముగ పుష్పించిమించిన వనలతలజాళువా పసిండి రీతులను వెలికి తీయుచున్నవి.

"నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయ వర్ణన, మని నిర్ణయింపబడిన యష్టాదశవర్ణనలిందుయాదృచ్ఛికముగఁబొందుపరుపబడుట కావ్యోత్కృష్టతకు కారణము.

అని తానాజి వీరవిహారము. శివాజి దుఃఖము ఎంతపట్టిచ్చు నట్లుగా పలికించినాడు. శివాజి శ్రీశైలమల్లికార్జునేశ్వరుని దర్శించును, జగత్కల్యాణి భ్రమరాంబను సేవించును.

మ॥ కరుణాసార మపాంగయుగ్మమున జిల్కన్ మందహాసంబునుం
దరవక్త్రంబున పార్వణేందుకళ లందర్కింప నార్తావనా
దరణస్వాంతకు శేశయంబుదలు క్రొత్తస్లోకముల్ప్రోమని
పురుభూకామణి కంబునెన్నెదను శంభో వక్త్ర సంరక్షకా॥

మ॥ మతిలోనిన్ను సహస్రకుంభజల సన్మాన్యాభిషేకంబులున్
ధృతవృంతార్జున కుట్మలద్వక మహాదుత్తారబిల్వారుణా
క్షతదూర్వాంకుర కర్ణికారసరసీ జాతంబుల న్భోద్ధతా
ద్భుతపూజల్ దమిజెయువాడ శివశంభో భక్త సంరక్షకా॥

(అష్టమాశ్వాసంలో 119 మొదలు 127 వరకు 9 పద్యములు) శ్రీ రామమూర్తి గారు చంద్రశేఖర కరుణాకటాక్ష లబ్ధ చతుర్విధకవితా విలోలుడాయె స్వామియొసంగిన అక్షరజ్ఞానము, కవితావిభూతి స్వామికి అర్పణము సేయవలయునుగదా! అప్పుడుగదా కైతకు చరితార్థము. ఈశ్వరార్పణ బుద్ధితో కవిత్వమును పంపించిన కవీశ్వరు డాయన

సీ॥ పాప్రవృథానే హాసంరంభణా భ్రముగాంచ
గాఢాంధకారంబు గలుగదిట్లు
కార్తీకచంద్రమఃకాంతి పూరము జూడ
జలదరింపదు మేనుబలు మరిట్లు
చారుసౌదామినీ శతస హస్రముగాన
దిగ్భ్రమంబడయవు దృక్కులిట్లు
అవ్యక్తరాగరక్తాశ్మ సంఘముగాన
భ్రాంతినొందదు మనఃపద్మమిట్టు॥

తప్పించుకొనెను. శివాజీ తనప్రియాత్మజునికొరకై పరివరివిధములుగ పలవరించి భార్యతో నాలోచించెను. శివాజీ రాజదర్బారు చేసెను. అందు సమస్తరాజ బంధువులు, సేనానులు, ప్రజావళుల నైకవిధములుగ సంస్తుతులాచరించిరి

## కావ్యబహిరంతస్స్వరూపము

కాంతాసమ్మితము కావ్యము. ఉత్తమశ్లోక చరిత్రవర్ణన మద్దాని పరమప్రయోజనము. లోకోత్తర గుణోత్తర మహాపురుషవర్ణనముగల కావ్యములోఁ గవి, లవముగా, లేశముగాఁ గవితాస్థాయిని బ్రదర్శించిన నదివిద్వత్కర్ణావతంస మగునని యాలంకారికమతము కావున కావ్యకథానాయకుఁడనవద్యహృద్య గుణవిద్యాచాతుర్య చరిత్రుఁడై యవభాసింపవలెను.

"కవే రల్పాపి వాగ్వృత్తిః విద్వత్కర్ణావతంసతి.
నాయకోయది వర్ణ్యేత లోకోత్తర గుణోత్తరః
అని నవరస రసిక కవితా సుత్రాముడైన భోజరాజు.

లోకోత్తర గుణోత్తర పుణ్యశ్లోక చరిత్రము, ఏ, కావ్యము నందుండదో, తత్కావ్యము పరిత్యాజ్యమనియు, అట్టి కావ్యాలాపములను వర్జించవలసినదనియు నాలంకారికులు హెచ్చరించినారు. పురాతన భారత భాగవత రామాయణ మహాకావ్య శాశ్వతస్థితి కీయాలంకారిక వచనమే శిరోధార్యమైన హేతువు. ఇట్లు ఆలంకారికులు కావ్యలక్షణములలో మరికొంత పరిణామమును బరిణితినిగూడ సాధింపఁగలిగినారు.

విస్ఫురన్మంజుల ప్రసాదోజస్సుషమ మార్దవము, ప్రసన్నాత్కుర రమ్యత్వము. రసభావ శబ్దానుగుణ మహార్థస్ఫురణము కలిగి కావ్యమురరీకృతమగుట లెస్స, కనుకనే "వాక్యంరసాత్మకం కావ్య" మ్మని సాహిత్యదర్పణము, "చమత్కార జనక భావనా విషయ, అర్థప్రతిపాదక శబ్దః కావ్య" మ్మని రసగంగాధరము వాకొనుట సహృదయ సమ్మతము.

వీర శివాజీచరిత్ర మఖిలాలంకారిక నిర్వచన మహాకావ్యలక్ష్య మనఁదగియున్నది.

## అష్టమాశ్వాసము

మొగలాయీలు శివాజీ యెద్ధత్యము సహించక, తద్రాజ్యములోని కొన్ని పల్లెల నాక్రమించగా, పింగళమంత్రివారి నణచివేసెను పౌండ పురిని ముట్టడించెను, అనంతరము శాలాజీ వర్ధన, ముకుంద, భూషణ, వరుణ, శైవదాస దుర్గములనభినవముగ నిర్మించెను. అనంతరము శివాజి దక్షిణ దిగ్విజయ యాత్రకై ప్రయాణ సన్నాహముగావించి గోల్కొండను ముట్టడించెను. తంజావూరుతోబాటు కడప కర్నూలు నగరములను లోఁగొనెను. పిమ్మట సకలదైవాధి దైవతుగు శ్రీశైలమల్లికార్జున స్వామిని దర్శించి 'శంభో భక్తసంరక్షకా' యనుమకుటముతో స్తుతించెను, ఉత్తమోత్తమదండకముతో భవానినిబ్రార్థించెను. గండకత్తెర శిక్షకు ద్యుక్తుఁడుకాగా, భవానీ పీరోచిత సంభాషణచేసి, యూరార్చెనది. తిరుపతి కేగి, దైవదర్శనమాచరించెను. పిమ్మట శాంతాజీతో రణమొనరించి, షర్ఖానుతో సంగరముచేసి, 'శివాజీ విద్ధుడె' 'శివా' యనెను, ఖానుడు, జయము, రా ఖల అసహనము

## నవమాశ్వాసము

దక్షిణమున శివాజీ తంజాపురిని ముట్టడించెను. అక్కడ తన సోదరుడు రాజ్యమునకై తనతో వివాదము సలుపగా, నతని కర్ధరాజ్యము నిచ్చెను, కోలాదుర్గమును, బాలావూరు, బెంగులూరులను గెల్చెను. మాదన్న శివాజిని సత్కరించెను. దౌలతాబాదు, ఛాత్నగడములను పైకి దండెత్తి, రాఘడమునకు సురక్షితముగ చేరి, శివాజి సుతద్వయమునకు హితోపదేశము చేసి, తన్నుతిరస్కరించిన శంభాజీని శిక్షించెను, సోయరా వచ్చి, కుమారుని శిక్షింపవలదనెను.

## దశమాశ్వాసము

శివాజీ తన కుమారుని శిక్షించచుండగా నాసమయమునకు గురువైన సమర్ధరామదాసు వచ్చి శివాజీకి బహువిధములుగ బోధలు చేసెను, అంతట శివాజీ శంభాజీని సింహగడమునకు బంపెను. శంభాజీ

చమత్కారముగఁ దప్పించుకొనెను. మార్గమున శత్రువర్గముల బారి నుండి తొలగుచు, ననేక నిష్ఠుర కష్టపరంపరలలో దోగి, చివరకు రాయ్ఘడమునకు వచ్చెను. శంభాజీ శత్రువులతో జేయి కలుపుటకు విచారించి శివరాయలు రాజ్యవిధానముల నత్యంతసమర్థతతో నమలుపరచెను

## సప్తమాశ్వాసము

శివాజీ శర్వాణిని బూజించి కొలువుకూటమును జేరెను. సామంత రాజులు కానుకలను సమర్పించిరి. శివాజీ యుద్ధసైనికులను బహురీతులలో సంతృప్తిగా, సత్కరించెను సేనాధిపతులను బహూకరించెను. విజయ దశమిమహోత్సవముల నత్యంతవైభవముతో సాగించి జమ్మినరికెను. కలితంపములకు బహుమతులనిచ్చెను. ప్రజాహృదయ జలజాతములకు దయభాస్కరుడై వికసించెను. ఇట్లిది సాగుచుండగా, ఢిల్లీరాజున్యాఁ డొకకంట శివాజీ యభ్యుదయమును గనిపెట్టుచు క్రింది యుద్యోగస్థులకు వార్తలు బంపి, వానిసంగతులు తెలిసికొనసాగెను. శివాజీ స్తబ్ధతతో నుండలేదు. సింహగడమును వశమొనర్చుకొనుటకై యాలోచించి, తానాజీ, సూర్యాజీ ప్రభృతుల నుక్కుముక్కలవంటి.మావళీవీరయోధుల నురికించెను. తానాజీ సింహగడమును పాయముతో ముట్టడించి, జయించి, తాను వీరమరణమునందెను. సూర్యాజీ సింహగడము నాక్రమించి ప్రభువునకు సమర్పించెను. శివాజీ తానాగురించి బహుధా విలపించెను. తరువాత పురందర దుర్గమును జయించి, మాహులీ దుర్గమును లోఁగొనెను. కరనాళాపురము, కళ్యాణపురప్రాంతములలో నధికారము స్థాపించి సురథమును బట్టుకొనెను ఔరంగాబాదులో రణకోలాహలమును దీవ్రముచేసెను.

సర్వతంత్ర స్వతంత్రముగ నిన్నియుముగించి, గురువుల దీవనల నంది, శివాజీ పట్టాభిషేక సన్నాహములు గావించెను. సర్వలోక సమ్మోహముగా పట్టాభిషిక్తుఁడయ్యెను. ఈదృశ సమస్త వైభోగములను చక్షురుత్సవముగా దిలకించి, జిజీబాయి సంతృప్తిగా, జీవనము చాలించుకొనెను. జననీ మరణమునకు శివాజీ శోకసంతప్తుఁడయ్యెను.

కట్టుదలఁచి కృష్ణచెంత తన మహాసేననుంచెను దీనిని కర్ణాటకరాజేంద్రులు పన్నికట్టియల్లరులను సాగించిరి. వాడీశుఁడింతలోవచ్చి శివరాయల నెదుర్కొని నిలచెను. శివాజీ విజయము సాధించుటయేగాక, సర్ణవిజయ, జయాది బహువర్గములు, నౌకాతీరములు జయించి, అద్వితీయప్రచండ మార్తాండ బింబమువలె, తేజోరాశియై, యితరులు తెరిపారిజూచుటకైన వీలులేనివాడై, నిరంకుశుఁడయ్యెను. పోర్చుగల్లునధిగమించెను. మరల నేమల్ఖాను 'శహజీ' ని బిలిచి, నీపుత్రుఁడు శివాజీని శిక్షింపుమని యాజ్ఞాపింపఁగా, నామాటనతఁడు మన్నించఁడనెను. అయినను తంజాపుర మునకేగి, శహాజీ, పూనాకువచ్చి 'బేజూరు' గుడిలో శివాజీని కలిసెను, కొడుకు తండ్రికి, విధేయుడై నమస్కరించెను. గౌరవముగఁబంపెను. అంతతో శివాజి తనపట్టువదలేదు. మహమ్మదీయ ప్రభువైన 'ఔరంగ జేబు' ను జిక్కుపరచెను. శైస్తఖాను నోడించెను. అహమదౌరంగాబాదుల మీద, ఢిల్లీబహుమనీనుల పైనదాడిచేసి, కష్టములుగలిగించెను. యుద్ధము మెండయ్యెను. ఔరంగజేబు శివాజీలకు సంధికాగా, ఔరంగజేబు శివాజీని రావలసినదని ఆహ్వానించెను

## షష్ఠాశ్వాసము

సర్వ సహచర సంబంధ బంధువర్గములతో దీర్ఘచర్చలు సలిపి, శివాజి ఢిల్లీ కరుగుటకు నిశ్చయించి, బయలుదేరెను. మధ్యేమార్గమున ననేక దానధర్మములాచరించెను. నర్మదానదినుత్తరించి, రేవా తరంగిణిని దాటి. సోమేశ్వరుని భక్తిశ్రద్ధాపూర్వకముగ దర్శించి, మధురకేతెంచెను, అక్కడ దశావతారములను స్తుతించి బృందావనమునకరిగెను. సర్వసుందర రమణీయమైన ఆగ్రాకరిగి, యద్దాని నభికర్ణించెను, మొగల్ రాజకోటను కనులార, వేడుకతోఁజూచెను. ఏతాదృశ యాత్రాకార్యక్రమములను పూర్తిచేసికొనుచు శివాజీ రాజస్థానమున కరుగగా, నౌరంగజేబీతనిన వమానపరచగా, శివాజీ క్రోధమూర్ఛితుడయ్యెను, గౌరవమునకుబదుల గౌరవముపొందవలసివచ్చెను. దుర్భరావమానాను భవానంతరము శివాజీ నిర్బంధింపఁబడెను. ఆనిర్బంధమునుండి విముక్తుఁడగుటకు శివాజి బహు విధోపాయముల నత్యంత రహస్యముగా నాచరించి, చివరకత్యంత

మహారాష్ట్ర పట్టణాధిపతి 'నరసాపజి' యను మహారాజ పుత్రియగు, సోయరాబాయియుండెను. ఆమె యచ్చటికి భవానీ సేవకైవచ్చెను పులి బారినుండి తప్పివచ్చిన లేడిని వారు సంరక్షించుచుండగా, నా లేడికి శివాజీవలన యపాయము కలిగినది. ఇట్టి విశాలసమయ సందర్భములలో సోయరా శివాజీల ప్రియ సమావేశముజరిగినది. క్రమముగానది పరిణయమువరకు బెరుగగా, శివాజీ యామెను పరిణయమయ్యెను, ఆమెతల్లిదండ్రులల్లునకు వివిధ గౌరవ సంభారములొసంగి సత్కరించి పంపిరి.

## చతుర్థాశ్వాసము

శివాజీ వీరవిక్రమ విహారములను నూతన దుర్గనిర్మాణమును, వివిధ దుర్గమ దుర్గసమాక్రమణాదులను వినియు. వీక్షించియు, సహించలేక తురుష్కవీరులు తమప్రభువైన యేదుల్ ఖాను చెంతకరిగి వివిధ భంగులుగా శివాజీ దుష్టచేష్టల నభివర్ణించి, కోపముగల్గించిరి. దాని కుపాయము చేసి ఖాను శివాజీ తండ్రియైన, షహాజీని, బంధించి, యావార్త శివాజీకి పంపెను షహాజీ, ఖానుతో, దనపుత్రుడు, తనకు వినడని యెంత మొరపెట్టినను ఖానాలకించలేదు. తుదకు శివాజీ తనసహచర వర్గముతో, భార్యతో సమాలోచన మాచరించి, గౌరవనీయుడు, వందనీయుడైన తండ్రిని విడిపించెను బాజీఘోరుని హింసించి, జావళీసీమలను, రోహిడు దుర్గములను వశపరచుకొనెను అత్యంతశక్తిమంతుడు, కుటిలోపాయధురీణుడు, కుహనామైత్రీ హృదయుడైన, అబ్జుల్ ఖానుని, మాయోపాయముచే వధించి శత్రువర్గహృదయ భేదకుడయ్యెను. తన యావేశమునంతతో విడువక నిశాలగడముపై దుమికి చాకచక్యమున నద్దానిని నాక్రమించుకొనెను.

## పంచమాశ్వాసము

శివాజీ స్వరాజ్య సంపాదనలో నచంచలదీక్షా మహత్వశక్తి సంపన్నుడు. తక్షణమే బీజాపురమును ముట్టడించెను. మహమ్మద్‌ఖాను నెదిరించెను దుష్ప్రవేశములైన కతిపయ దుర్గములను జయించెను. అటు నేదుల్‌ఖాన్ సహ్యాద్రిచెంతనున్న కొన్ని దుర్గములను, 'రాంగణా' విశాల

పల్లీయుల శబరుల పక్కణముల కొకనాడు శివాజి యరుగగా, నతనిపై బయదకృద్ధా పరిసంయుక్త శార్దూలమొకటి పైబడగా, క్రూర కరవాలమున నద్దాని చతుష్పాదముం నొకేమారు ఖండించి విజయము సాధించెను. దానికా శబరవీరులత్యాశ్చర్య సంభ్రమభ్రాంతచేతస్కులై, యతనిని దమ ప్రభువుగా, నెన్నుకొనిరి మావళీనాధులెల్లను వశవర్తులైరి తానాజీ, సూర్యాజీ, జగదేక వీరవర్గ సర్వస్వము భృత్యాతి భృత్యమనస్కమై శివాజిని సేవించెను వారి యనంతభక్తి విశ్వాస వీరపరాక్రమస్థైర్యసాహసాది సహకారములవలన మొదట శివాజి తోరణ దుర్గమును జయించి 'గాఢ్ఘడ' మను నూతనదుర్గమును నిర్మించి స్వతంత్రుడై బహు జనరంజకముగ రాజ్యపాలనగావించెను. ఏతాదృశ విజయవార్తా పరంపరను కర్ణకఠోరముగ నాలకించిన తురుష్కప్రభువైన 'యేదుల్ ఖాన్' శివాజీకి కుటిలవార్తలనంపెను. ఆవార్తలను శివాజి యత్కించిన్మాత్రముగనైన గణించలేదు. ఇంతలో తనకత్యంతాప్తుడైన దాదాజి కొండదేవుడస్తమించగా, శుభాపరిదీనుడైన శివాజి క్రమముగ పూనాపట్టణమున కధినాధుడై, సర్వతంత్ర స్వతంత్ర స్వరాజ్యసంస్థాపనము కనితర సాధ్యమైనమహాదీక్ష వహించెను. పురందర, లోహగడాది దుర్గముల నాక్రమించి, ముల్లాన్ఖానుని ముప్పుతిప్పలుబెట్టి, టాజిబీబీయను త్రిలోక సౌందర్యవతి యువతిని తన యనుభవమునకు బహూకరించగా. నతడందులకు పరివరి విధముల నంతరుద్విగ్నుడై, కన్నకుమార్తెవలె నామెనుజూచి, బహువిధ సంభారములతో, నామెను పుట్టింటికి మహాదరమున బంపెను పిమ్మటబీజాపూరు సాత్పురా దుర్గములకు జైత్రయాత్రచేసి, విజయుడైవచ్చెను కతిపయదినములతిక్రమింపగా, ప్రియభార్యతో వనవిహారమున కరిగి, విశేషములను దిలకించియు, వివరించియు సుఖముగా విహరించెను. కొన్నినాళ్లకు శివాజీకి పుత్రోదయమయ్యెను.

## తృతీయాశ్వాసము

ఒకనాడు శివాజీ మృగయా విహారమునకు దుర్గమనిపిన భూముల కరుగి సుందర కురంగమును వెంటుదరిమి, దానింబట్ట నుంకించెను, అది చిక్కకుండ, సమున్నతకుడ్యముపై నెగిరి యంతర్ధానమందెను. అక్కడ

షాజీఅను తనూజుని బడసెను ఆ పితాపుత్రులు మిత్రుఁడైన 'లుకజీ' యింటి కరిగిరి. సంభాషణ చాతుర్య సందర్భమున 'మాలోజి. 'లుకజీని జూచి 'నీ పుత్రిక' జిజీబాయిని, దనకు గోడలిగాఁ జేసికొందునని వచించి యారీతిగనే చేసెను. జిజీశాజీలకు ద్వాహమత్యంత వైభవముగ జరిగెను. కొంతకాలమునకా నూతనదంపతులకు శివాజీ మహారాజుద్భవించెను. కారణాంతరములవలన 'జిజీబాయి షాజీల కంతర్విరోధములు గలుగగా, శాజీ, జిజీ శివాజీలను విడచి కాలక్రమమున, తుకాబాయిని పెండ్లాడి దేశాంతరమున సుఖముండెను. ఇట్లు పదేండ్లైన పిమ్మట షాజీ, జననీ తనూ జాతులనుపునః తనవద్దకు రప్పించుకొని, గౌరవించెను

సుయీబాయీ శివాజీల వివాహము జగన్మంగళముగా జరిగినది. శివాజీ సమస్తరాజవిద్య లభ్యసింప దొడఁగెను. గోబ్రాహ్మణ దీనజన సంరక్షణము శివాజీ ధ్యేయము. ఒకనాడీ పితాపుత్రు, 'లాదిల్షాహా' దర్శనమున కరిగిరి. శివాజీ ఆ మహమ్మదీయ ప్రభువునకు నమస్కరించక, యాసనము నధివసించియుండగా, జూచి, యాదిల్షాహా కుపితుండయ్యెను. మంత్రి యాతని నుపశమింప జేసెను. శివాజీ తనకిచ్చిన నూతన వస్త్రములను, దీనజనులకు దానముచేసెను. తండ్రియైన షాజీ కుమారుని నడవడిని దిలకించి, పన్నులు వసూలుచేసి పంపవలసినదని కుమారుని, తల్లియైన జిజీనిపూనా నగరమున కనిపి, వారికి దోడుగా, దాదోజీ కొండదేవుని సహాయమిచ్చెను. తానుమాత్రము ద్రవిడకర్ణాటక దేశములపై దండెత్తనేగెను.

## ద్వితీయాశ్వాసము

శివాజీ పూనాకరిగి, యనితరసాధ్యములైన బహుశస్త్రాస్త్ర మల్లయుద్ధనియుద్ధ విద్యామార్గిక దశల నభ్యసించి, మించెను, జాతివజ్రమును పరమతీక్ష్ణలోహములో మిళితము చేసి, నిశితనిస్త్రింశమునొక దానిని భవానీమాత తనకనుగ్రహించినట్లు స్వప్నముగాంచి, పిమ్మట, బారువాలోహమునందు, వజ్రరజమును గలిపి, క్రూరభుజంగ విషమున బలుమార్లుముంచి హస్తద్వైర్ఘ్యము పొడవున మూడంగుళముల వెడల్పైన నిశాతహేతిని నిర్మించి, దానికి భవానీ ఖడ్గమని పేరుఁబెట్టి, భవానీ మాతాజ్ఞగా తాదద్దానిని ధరించెను.

ఇది శివాజీ చరిత్రము. అది శివభారతము. రచనలో నాద్యమిది. బహిర్గత కృతులలో నాద్యమది. వీరరసమున మధురాక్షరరమ్యతలో నీతఁడు నన్నయ్యకాగా, అనల్పకల్పనా చమత్కృతీ శిల్పములో నతఁడు తిక్కన. అచ్చతెనుఁగులోఁ బన్నరచనా శిల్పమును బ్రదర్శించుటలో నీతడు సిద్ధహస్తుఁడైనచో, వ్యంగ్యమర్యాదా పాటవ ప్రదర్శనము ననతఁడు చేయి తిరిగినవాఁడు. ఒకరు మూర్తికవి. వేరొకరు చేమకూర కవి ఒకరు కంకంటివారు. మరియొకరు పింగళివారు. శ్రీనాథ పోతన కవీశులొక్కరు. శంభుదాస సోమన్న లింకొక్కరు. ఈచందముగ వీరి శివాజీ చరిత్ర గ్రంథములు రెండు రెండైన, వైయక్తిక మేరుకుధర చారుతర శిఖరములై సాహిత్యజగత్తును ప్రభావిత మొనరించుచున్న వనుటలో నాతిశయమున్నది.

# కథా ప్రారంభవం

## ప్రథమాశ్వాసము

అయోధ్యానగరాధినేత శ్రీరామునకు కుశలవులను తనయులుద్భవించిరి. లవుని వంగసమనేక రాజపుత్రసంతతులతో నభ్యుదయము నందెను. బప్పరాయ శిశోదయ రాజని కురుంబములా యన్వవాయము నకు వంన్నెఁదెచ్చినవి. చిత్తూరు దుర్గాధిపతి భీమసింగు పద్మినీదేవిని పరిణయమాడి, రామసింగు, బాగుసింగను దారకద్వయమును గాంచెను. రామసింగు రాజ్యభారము వహించగా, బాగుసింగు నర్మదానదీ తటముల కరిగి, అచ్చట అవీమోహన తనయునకు బాసటగా నిలిచి, 'బోమ్స్లు' బిరుదు వహించి, దేవలాములో గౌరీదేవినుపాసించెను.

ఇట్లుండగా, 'మాలోజి' నిజాంసాహీకి మంత్రియై పలురకములైన కప్పముల నర్పించి, 'శివనేరు' చాకణముల కధినాధుఁడై, బీజపురోద్యోగియైన 'వెంకోజి' యొక్కసోదరి 'దీప' యనుసుందరీమణీ పాణిగ్రహణమునంది, 'శహరీప' అనుపీరు ననుగ్రహమున, శహాజీ 'లేక' గడములనాక్రమించగా, ఖాను, రాణులవిక్రమ ప్రవాహమున కానకట్టు

ననంత కాలగర్భమున నవసిపోకుండ నాంధ్రసాహితీ జ్యోతిర్మయ లోకములలో శాశ్వతముగ, సవిలాసముగఁ జరించఁగలుగు నట్లొనర్చిన కృతిప్రణేతృప్రియ తనూజులు, సప్తశత్యధిక ప్రాయోవిశిష్టులు శ్రీ బలిజపల్లి రామారావుపంతులుగారు బహుధాప్రశంసనీయులు. ఇష్ట దేవతా ప్రార్థనలతో, షష్ఠ్యంతములతో, వర్ణనలతో, యుద్ధఘట్టములతో, శృంగారవీర రౌద్రాదికములతో ప్రత్యగ్రచమత్క్రియా పరిభాషణములతో, ప్రార్థనలతో, దండకములతో, పట్టాభిషేక విశేషములతో, ప్రసన్నకథా సంవిధానములతో సహస్రత్రయాధిక పద్యసంతులతో పరిపూర్ణ విస్తృతపాదః పతినధఃకరించిన యీ మహా సత్కృతి యంతయు వీరికి హృద్గతమైపోయినది. అది యాధారముగఁగైకొని విద్వచ్ఛిరోమణులు. పద్యపాదములు లోపించిన పట్టులలో పూరించి, యతిప్రాసలను సవరణజేసి, పదలోపములను సరిచేసి, నిర్దుష్టప్రతినొకదానిని తయారు చేయగలిగినారు. ఈవిషయములో నధికపరిశ్రమజేసిన గురువులు కీ॥ శే॥ శ్రీఆకెళ్ల అరుణాచల శాస్త్రివిద్వద్వంద్యులు. వారేగాక, శ్రీమహితులైన పెనుమళ్ల సాంబశివరావు, బాపిరాజుగార్లశ్రమ యిచ్చట ప్రత్యేకముగ నుట్టంకించవలసియున్నది. వీరందరి మూర్తులలోవచ్చినపరిశుద్ధ సంకల్ప దీక్షా బలముతో గోచరించు శ్రీ బలిజపల్లిరామారావుగారు పితృపాదుల వాత్సల్యసుధాజాహ్నవీతరంగిణినిదోగినారు. వీరేఛత్రపతిశివాజీ చరిత్ర మహాత్కావ్య స్వరూపులు. గ్రంథమునందొకప్పుడు దోషములుండిన నుండవచ్చునేమోగానివీరికి, హృద్గతగ్రంథమున మాత్రము దోషములుండ వనిఘంటాపథముగ వాకొనవచ్చును. వీయరీముద్రితగ్రంథమున కనేక ప్రతులు వ్రాయుసి, వ్రాయించియు, పరిష్కరించియు, శుద్ధప్రతులను కూర్చియు, వాటినిశతాధిక సంఖ్యా పూర్వక పఠనమొనరించియు, విద్వాంసులకుఁ జూపించియు సర్వతోముఖముగఁ గూలంకషముగఁ బరిశోధించియు దీక్షా పూర్వకమహత్తర భక్తిశ్రద్ధల, నగపరచి, చివరకీ రూపముగ వెలువరింపగలిగినారు. ఇంతకృషికి వీరి తండ్రిగారు విచలితులై "నాకొమరుఁడు రామారావీ కథరచియింప నన్ను హెచ్చరికింపన్, జేకొంటి" ననినూత్రి ప్రాయముగ గుమారునాశీర్వదించినారు. పితాపుత్రుల సుమహత్తరాభ్యుదయ శ్రేయస్సాశయ బలమే యీకృతి.

దయుఁడు కవితాగురువువై, శివాజీచరిత్ర మహోత్తమకావ్య రచనకు కారకుఁడు ప్రేరకుఁడు నయ్యెను.

పురాతనకవితాసాహిత్య పాండిత్యమార్మిక విజ్ఞానఖనులై, సారస్వత విధేయులైన తనపితృపితామహుల అసంపూర్ణ శివాజీవచన చరిత్ర కవనమును దిలకించి, పులకిత సర్వాంతఃకరణుఁడైన యీ మహాకవి, శ్రీ కొమరారాజు లక్ష్మణరాయ శివాజీ వచనవైశద్య చరిత్రగ్రంథము. తనరచనకాధారగ్రంథముగ నెన్నుకొని, పదియూశ్వాసములుగల మేదుర ప్రబంధ సింధురమువంటి యుత్తాలోత్తాల మహాకావ్యమును నవరస స్ఫోరక చతుర్విధ కవితారీతీ రోచస్సుతో నిండిన పద్యములతోఁ బ్రబంధించి, యటు పితృపితామహాది బంధునికాయమునకు, నిటుపటుతర పద్యసాహిత్య సురుచిర రోచిర్వీచీ విలసనముల ననంతకాలమునుండి యెఱుంగక, సంప్రదాయ సారస్వతపుటెడారిలో, బలుచని జలధారల నన్వేషించి, విఫలులైన కవితాపిపాసువులకు శ్రుతిఃశ్రోతవ్యమనునట్టి, సర్వకవితా లక్షణ సంయుక్తమైన కావ్యరసధుని నఖండముగఁ బ్రవహింపఁజేసి చిరస్మరణీయుఁడైనాడు. ఇట్టి కవులు పుట్టనే పుట్టరు. పుట్టిన, నేయొకరో, యిరువురో పుట్టుదురు. అట్టివారు, తమ జన్మచరితార్థము నొనరించుకొని, యితరులు చరితార్థులగునటుల, 'నభూతో, నభవిష్యతి' గా, సద్గ్రంథమును రచియించి, యుగయుగాల కవులకాదర్శప్రాయు లగుదురు. తాదృశపరమోదాత్త సత్కవిత్వరచనావ్యాసంగధీవిలసితుఁడైన, యీ మహాకవికి బిరుదులేల? వ్యాసవాల్మీక్యాదులకున్న బిరుదులేమి? అయిననిది గతానుగతికమైన లోకముగదా॥ బిరుదములేరనున వయశస్సున కాస్కారమీయక, యీనాటివరకును జీవించుచు, నఖండసారస్వతమును సృజించుచున్న విజయనగరభారతీ తీర్థసారస్వత విద్వత్సంస్థ, కవితా పరమేశ్వరీ వాత్సల్యరసము పట్టింపితుఁడైన యీ మహాకవికి, 'కవితా వినోద' బిరుదమునిచ్చి, తన్నుఁదా, సత్కరించుకొనినది.

ఉజ్జ్వలత్సంప్రదాయ పురాసాహిత్య కవితా సరస్వతీ విపంచీ మధురనిర్హ్రాదరూపమైన యేతాదృశ మహాకావ్యము శిథిలముకాకుండ, సంధిబంధములు సడలకుండ, అంధతమో లోకముల నటుమటించకుండ,

ఉ॥ మేలికడాని దీనినుమేనిజగా జిగిరాదలంచి బల్
చీలికలయ్యె సత్పుటము చెంది మరుత్ప్రభవాప్తి గొరిపె
న్గీలలమధ్య తప్తమయి. సిరొకయింతయునింత యయ్యెగం
సాలికయిన్ విరూపుగొని సారముతగ్గి కృశించెనెంచగన్॥

సోయరామైజిగిని, జిగేలుమనిపించునటుల కన్నులకు కట్టించు పద్యమిది. బంగారము ఆమె మేనికాంతితో సరిగాదలచి పడ్డఅవస్థలు చెప్పుటకు వీలుకానంత వికారమందినది.

సీ॥ కయ్యంబు పొసగినగ్రిక్కున తానాజి
యనుపిల్పు నేటితో నంతమయ్యె
పగదాడిదాక నిర్భయము మాకను బల్కు
లరయగా నాల్కకుబరువుఁ యెయ్యె
నాభేటముల ముందుగా ఖడ్గమునుబట్టి
యిటకురండను బల్కులింకిపోయె
దురములో జిక్కినదోడుగా నేనుంటి
ననుయుక్తు లికనుండి యంతరించె.

గీ॥ నకట! హర్యక్షశార్దూల హాస్తిఖడ్గ
శరభచమరీ మృగాళినుద్ధురతబట్టి
మంతనపుకాంతల లరంగ మల్లకేళి
జెలగు టికనుండి మాకు వర్జింపనయ్యె॥

సింహగడముగెల్చి తానాజి వీరమరణము చెందును. తానాజి పేరు మోసిన యోధుడు. శివాజికి ప్రాణము సింహగడము దక్కినది. సింహము చన్నది, శివాజి అన్న ఈమాటలు గుండెలను కోయును.

క॥ తనయుని పెండిలికన్నను
మనుజేంద్రుని వాంఛదీర్పమన్ననయుని, ము
క్కుననూపిరి గలునంతకు
నని పగతుర జెండిజెండి యతగితె దివికిన్॥

యను జనపదము వీరున్న సుజనపథము. ఘుసృణ వర్ణధాన్యరాశీ విలాస విలసితక్షేత్ర సంచయము లిందుండుటచేతఁ గాబోలీ గ్రామమునకు 'గుషిణి' యను స్థిరనామమేర్పడినది. వాణీ వికసన్నయన పంకేజ మధుపులైన ఆరువేలనియోగి విద్వత్కవితాన్వవాయ సంతానములీతని జనిస్థానములు. విజయనగర మాన్యరాజన్య విశాలసంస్థానాదాయ శాఖాధికారిగా యువదశలో నుద్యోగమాచరించి, తుదకదిమాని, గుషిణిగ్రామాధికారిగా నధికారము చేఁబట్టి, అనంతసంసార సముద్రమును బారలుసాచి యీదుచు నుత్తరించగలిగిన సాహసి ఆరీతినే యపార కవితాకూపారగాంభీర్యమును తుదముట్ట గొలువగలిగిన మహామంథానమహీధరము. స్వగ్రామమునే గాక, పరిసరజనపదములను గూడ సంచరించుచు, పలుతగువులుదీర్చుచు, గ్రామకక్షలను బరిష్కరించుచు, విరామమే తెలియని వివిధకార్యములలోఁ బాల్గొనుచు, నియమ నిష్ఠలతో నహర్నిశలుగడిపి, యే యర్ధరాత్రముననో, యే యపరరాత్రముననో మేల్కాంచి, దొరికిన లేఖినిని బట్టి యల్పాల్పకశ్మల ఖండపత్రములలోనో, యేభిత్తికాపరంపరల యందో, శివాజీ చరిత్రాంశములను ఛందస్సుందరములైన, వాగర్థ విన్యాస పద్యసంతతులలో నిమిడ్చి వాటికనంత గౌరవము నాపాదించి నిట్టూర్చెడు వాఁడు. శివో౽హమ్, శివో౽హమ్మనుచు, నిరంతర శివనామ స్మరణ నిర్మలీనాంతఃకరణుఁడై, ముణుకులుదిగని నినూత్నమైన యంగవస్త్రము కట్టి, ఆకృతిలో నల్పాల్పమైన రాగిచెంబుఁబట్టి వెలుగులను వెదజల్లు వదనము, కరుణా రసార్ద్ర సంపూరిత విశాలచక్షుర్ద్వయము, వేదశిఖారాశిని ముడివేసిన పరమపావన శిఖసనాతన బ్రాహ్మణాచార సంస్కృతీ సంప్రదాయములను జాటిచెప్పుచుండ, నపరాహ్ణమున కింటికిజేరి అతిథ్యభ్యాగతులున్నచో వారితోఁగూడ నమృతమస్తు అనెడివాఁడు. అద్వితీయ కవితావిలాస చతుర కవిచతురాననులు తనగ్రామమునకే తెంచినపుడు, బహుముఖములుగ వారి నాదరించి, వారిలోని తార్కిక శక్తిని అవగాహన మొనర్చుకొనుచు. వారలకొక వార్షికమేర్పరచినయర్థి జనమందారము. ప్రాక్తన జన్మ విద్యాపరిఫుల్లమైన యీతని హృదయ చైతన్యక్షేత్రమును దున్ని కవితా బీజములను జల్లి, యవి ప్రవర్ధమానములగునట్లు చూచిన కులపతివంటి వాఁడైన యీతని బావమరది, బాలాంత్రపు సూర్యనారాయణ మహో

వుంటుంది-దీనిని విశ్వవిద్యాలయాలలో M A తెలుగుపరీక్షకు చదివే విద్యార్థులకు సాహిత్యంలోగల చరిత్రాత్మక విషయాలను పరిశోధన చేసే P Hd.విద్యార్థులకు, ఆంధ్ర, వేంకటేశ్వర, ఉస్మానియా విశ్వ విద్యాలయాధికారులు పాఠ్యగ్రంథంగా నిర్ణయించి యీకావ్యరత్నానికి యథార్థమైన ప్రోత్సాహాన్ని యివ్వగలరనేదేనా ఆకాంక్ష

స్వస్తి

మఠంవీధి

కస్బా

విజయనగరం-2.

కాళయుక్తి-సంక్రాంతి,

"సాహిత్య కోవిద"

కొప్రివ్విడి రామం

బి. ఏ బి యల్. బి యిడి.

ఉపాధ్యక్షులు కౌముదీపరిషత్తు

# అభినందనము

ఉ॥ శారదచంద్రికా ధవళచారు సుధాంశు సమానకీర్తివి
స్తారుఁడు. శత్రుభూ భుజవిదారుఁడు. రౌద్ర రసావతారవి
స్ఫారుఁడు, ధీరవర్యుఁడు శివాజి తదీయ చరిత్ర తెల్గులో
సౌరధునీ తరంగరభ సప్రతిమాన విశేష వాక్సుధా
ధారలఁ జిల్కపల్కుల విధమ్మున వీనుల కింపునింపువి
స్తారమనోజ్ఞ వాక్యముల, సౌరభముల్ వెదజల్లు మల్లికా
మారుత మట్లు, పక్వమగు మామిడిపండు విధాన, భూర్యలం
కారవు శోభలున్, ధ్వనులు గ్రాలఁగ, సద్రచనా చమత్క్రియా
సారగుణాతిరేక విలసత్కమనీయ ప్రసాద మాధురీ
స్ఫార రసానుభావ గుణపాక సమంచిత వృత్తరీతి, వా
గ్భారమునందునన్ దెలుఁగు భారతమట్లుఁ, తీపితేనెలున్
గారఁగ, కావ్యరీతులకుఁ గల్పకమేయనఁ బూర్వపుణ్యసం
స్కారము తోరమై చెలఁగ, కస్తురితావులఁ జిమ్ము భంగి, శృం
గారసువీరముల్ వెలయఁగా విహరించు శివాజి నామరా
డ్వీర చరిత్ర మాంధ్రమున వీనులవిందొనరించునట్లు వా
ణీరమణీ కటాక్ష సరణిన్ బురుణించిన కైత, నౌచితి
స్ఫారముగాఁగ శ్రీ బలిజపల్లి కులేందుఁడు రామమూర్తి భా
షారభటిన్ రచించె కవులందరు బొచ్చెములేక మెచ్చఁగన్.

ఇట్లు
భాషాజీవి
'మధురకవిరత్న' మూలా పేరన్న శాస్త్రి

విజయనగరము
26-1-1979

తే॥ "మాజిజాబాయి శహజి కు-మారులకును
ప్రాయముల, రూపముల, నభి-ప్రాయములను
ప్రాసునుంచిన పీసంబు-వాసిఁగనమి
పెండ్లిఁగావింపనెల్లరుఁ-బ్రియముఁగొనరె" 85

కం॥ అని పలికి జిజాబాయిం
గని, తల్లీ! యితని పెండ్లి-గావింతుమ నీ
కని, నవ్వులాట నడిగిన
ననురాగత్రపలచేన-తానసమైనన్ 86

వ॥ అంత మాలోజి యిట్లనియె 87

ఉ॥ బందుగులెల్లరున్ వినఁగఁ-బల్కిన యీ మధురంపు సూక్తికిన్
సందియమందనేల? నీకుఁ-జక్కని వియ్యము మాకునబ్బెఁ దా
రెందును నాడి తప్పని మ-హీశులు యాదవులన్నమాట! వీ
రందరెఱింగినట్టి దది;-యన్యవిథంబుననౌనె భూవరా! 88

కం॥ అను పలుకులు విని జాధవుఁ
డనఘా! తగు మగని పెండ్లి-యాడక కన్నెల్
మనియెదరె పుట్టినిండ్లను
జనసామాన్యంబు దీనిఁ-జదువగ నేలా ? 89

కం॥ అటులొండొరుఁ బలుకంగాఁ
దటుకునఁ జలి దాయ, త్రాడు-దాలువు దెస కే
గుటఁ గని కొల్వు విడిచి యా
దట, సంజపనుల్. జరిపి, పిదప జాదవుఁడున్. 90

కం॥ విందునకుఁ బిల్వనినకులుఁ
డుం, దనతనయునకు 'జిజ'ఁ గు-టుంబిని జేయన్
బొందైన గుడుతునగా,
సంధియమా! దాని, కనఁగ,-సాపడి వారల్ 91

తే॥ సర్మదనుమించు సహామదు-నగర దేశ
మరచి బ్రోచిన ధైర్య ర-త్నాకరుండు
రంగ పంచమి పండుగ. రాఁ గరంబు
కొలువు సింగారమై గద్దిఁ-గూరుచుండ 79

కం॥ మాలోజీ శహాజీల్దమ
యేలిక దర్శించి పిదప-హితుఁడౌ లుకజీ
భూలలనేశుం గనుఁగొన
మేలగు రథమెక్కి యుదుటు-మించి చనంగన్ 80

కం॥ వచ్చిన మాలోజిం గని
చెచ్చెర నెదురేగి లుకజి-క్షేమమరయుచున్
విచ్చేయుండన వారలు
నచ్చటి మణిపీఠములను-నాశీనులు, గాన్ 81

శా॥ ఆ రాజేంద్రుననుంగు పుత్రి బుధ పూ-జాసక్తనైమ్మిత్రి వి
ద్యారామామణి నృత్తరంగ మృదు జి-హ్వా వృత్తి వైచిత్రి, రా
కా రాజ ప్రతిమాన సుందర శుభా-కారాస్యవిస్ఫూర్తి స
చ్చారిత్రోత్తమభవ్యమూర్తి రమ, జీ-జాబాయి యేతెంచినన్ 82

తే॥ సవ్యహస్తంబుచే నాత్మ-జాతనపుడు
పార్శ్వపీఠస్థఁ గావించి-ఫాలమందు
విడినకురులను సరిఁజేసి-విరులుఁదురిమి
మురువు సూపించె నత్యంత-ముదముతోడ 83

చ॥ ఎదురుగ రత్నపీఠమున-నింపులు గుల్కెడు 'శాజిఁ' గాంచియ
మ్మదిత, యపాంగదృఙ్నికర-ముల్- దుదితెప్పల నప్పళించు న
భ్యుదయముఁజూచి, హృత్కమల-మున్ వికసింపనతండు లజ్జనో
ముదమునఁదన్ముఖాబ్జమధు-పూరము దృగ్భ్రమరాళి గ్రోలఁగన్ 84

కం॥ సుతునింగోరెదు నాపెకుఁ
గతిపయ దినములకు సుతుఁడు-గలిగిన వారా
సుతునకు 'శహజీ' యను పే
ర తులోత్సాహమున నిడిరి-యార్యానుమతిన్ 75

కం॥ నెలబాలు పగిది బాలుఁడు
తల తలమని యవ యవములఁ-దార్కొను జిగిచేఁ
బులుగడిగిన ముత్తెమువలెఁ
గళలొందఁగ శైశవంబు-గళితంబయ్యెన్ 76

తే॥ మరుని సౌందర్యమును దేవ-గురుని బుద్ధి
నరుని శరలాఘవంబును-హరుని బలిమి
కలిమి రోకేని, నీవిని-గల్ప తరువు
యువదశను "శాజి" మరిపించె-నుర్వీజనుల 77

తే॥ అట్టి కొమరునితోఁ గూడి-యప్పుడపుడు
మూర్తినైజాముసాహి మె-ప్పులను బొంద
'నహమదు'పురమ్మునకు నేగి యచట నున్న
పాళెగాండ్ర నెయ్యమ్మును-బడసెనతఁడు. 78

సీ॥ యదువంశ సంభవుం-డైన వజ్రునకు ధ
ర్మాత్మజు వలన సం-ప్రాప్తమైన
పురవరంబుగు దేవ- గిరి నేలు యదుజుల
బలిమి నల్లాయుద్దీన్-బారఁద్రోలఁ
దద్వంశజుండు జా-దవ- లుకజీ రాయఁ
డహమదు పురిదొర - యాదరమున
'మాలికాఫరు'ఁ గూడి-మగలాయిల జయించి
సింధ ఖేద విదర్భ-సీమలేలి

తే॥ శత్రు హృదయాంతరమ్ముల-శరముఁబోలె
వెలుగ, నాతఁడు "బోమ్సల"-బిరుదునంది
రక్తపాతంబుఁగాంచి, వి-రాగి యగుచు
'దేవలా' మనుపురి నుమా-దేవిఁ గొలిచె 69

కం॥ ఆ మనుజవరకులాంబుధి
సోముఁడు 'మాలోజి' ఘనయ-శోధూర్వహుఁడై
'ప్రేమ' నహమ్మదు నగరీ
భూమీశు 'నిజాముసాహి'—ముఖ్యసచివుఁడై 70

కం॥ ఉరుసైన్యంబులతో నరి
ధరణీశులనాజి గెలిచి-తగు కర 'మహమ
త్పుర మూర్తి నిజాంశహ' భూ
వరనకు నర్పింపగౌర-వంబున నతఁడున్ 71

కం॥ 'శివనేరు' 'చాకణము'లను
నవిరళ నిగమ ద్వయంబు-నాతని కొసఁగన్
దివమున కింద్రునివలె న
య్యవనికి 'మాలోజి' రాయుఁ-డధిపతి యయ్యెన్ 72

కం॥ రాజన్యుఁడైన పిమ్మట
బీజపురోద్యోగియైన-'వెంకోజి' మహా
భ్రాజ, సహజాత దీపా
రాజీవాననను, దగు పు-రంధ్రి గఁ గొనిమెన్ 73

కం॥ దీపా బాయి జగంబున
దీపా భా, యనఁగనొప్పి-దివిషత్సతినాఁ
నేపారుఁ బుత్రుఁ బడయమిఁ
బ్రోపుగ "శహరీ ఫు" పీరు-మ్రొక్కె సుతునకై 74

సీ॥ తనయాజ్ఞ రాజ పు-త్ర స్థానమందెల్ల
ప్రజలను మరుమాటఁ-బలుకనీక
తన ధర్మనిరతి భూ-తలనాథ ధర్మంబు
లించుకైనను దల-లెత్త నీక
తన సత్యవర్తన తనతోడి ఱేడులఁ
గలనైన సన్నృతముల్-బలుకనీక
తన జన త్రాణ ప-ద్ధతి గాక వెరొండు
మార్గముల్ ప్రజలను-మరుగనీక

తే॥ వాలుచేఁగాక న్యాయ-ప్ర-వర్తనమున
ధరణిఁ బాలించెనైక మ-త్యమున విమత
ధారుణీశులు లేరు, చి-త్తూరు ననఁగ
భేదితాంఘ్రి కలి విపంగు-భీమసింగు 63

కం॥ ఆ రాజేంద్రుని వలనన్
దారాగ్రణి శుభచరిత్ర-ధార్మిక విద్యా
పారీణ పద్మినీ సతి
దారితె శత్రుల నిరువుర-తనయులఁగనియెన్ 64

వ॥ అందు — 65

తే॥ రామసింగగ్రజుండ యి-రాజ్యమేల
బాగుసింగట్టి యువరాజ-పదవి నొల్ల
కడవిమృగముల వేటల-కరుగు మిషను
దారతోఁ గూడి నర్మదా-తటముఁ జేరె 66

అంత కతిపయ దివసంబులకు — 67

కం॥ ఆలీమోహాన తనయుఁడు
బాలుండౌటను ద దీయ-వసుధా భరమున్
దాలిచి కుత్సిత శత్రు నృ
పాలుర 'బాక్సింగు' కాన-పాలొనరించెన్ 68

# కథా ప్రారంభము

సీ॥ ఒంటి తేరులసామి వింతజన్నము పంట
రాచపాఱుని నోము గాచు దంట
వెలిగుండు దొర విల్లు విరచిన యెకి మీఁడు
చాలు పేరన్నవ-నేలువాఁడు
వేయిచేతులతేని-నేయుపాఱుని సూడు
నయ్యయానతి కాన-కరుగువాఁడు
కడలికడ్డుగ గట్టు-గట్టిన మన్నీడు
నెఱచి మేపరిగుంపు-నరకు మగఁడు

తే॥ చాలు కుత్తుక రక్కసి-జంపి వాని
తమ్మునెకిమీఁడుగాఁ జేయు-నెమ్మికాఁడు
ప్రాలు చయోధ్యయను పెను-ప్రోలు నేలు
రాముఁడుర్వీ జనౌ ఘా భి-రాముఁడగుచు. 59

కం॥ ఆ రామవిభుఁడు సీతా
నారీమణి వలనఁగాంచె-నందనుల మహా
శూరులఁ గుశలవులను సుకు
మారుల జితశైలజా కు-మారులనందున్ 60

తే॥ లవుని వంశంబునందు సం-భవములైన
నృపసుతా పత్యతతులలో వృద్ధిఁబొందె
బప్పరాయ శిశోదయ-పార్థివ తతి
దత్క్రమంబుల ఖనుల ర-త్నముల పగిది 61

వ॥ అందు — 62

కం॥ కేలా నలకీలా వృత
హేలా హల మూలసారసా-హారునకున్
ప్రాలేయా చలకన్యా
లీలాలోలునకు భూతి-లిప్తాంగునకున్ 52

కం॥ అంభోజ సంభవస్తుతి
గాంభీర్యవచో విలాస-గౌరవునకు సో
జ్జృంభిత కుంభీంద్రాచల
దంభోళి సదృక్షునకు వి-దళితారునకున్ 53

కం॥ శైల సుతా భీల రతా
ఖేలను తాదరణ చణ సుకృత వేమునకున్
వ్యాలీహిత భూమునకున్
శ్రీ లలిత విలాసమృదుల చిర-భామునకున్ 54

కం॥ కందర్ప జనక హితునకు
సుందర మందస్మితాది శోభాస్యునకున్
బృందారక సందోహ
స్పందనుత యశోవిలాస-భవ్యాత్మునకున్ 55

కం॥ గీర్వాణప్రభు దత్త సు
పర్వాధిక వైభవునకు-పరిపంథి సమి
ద్గర్వాంధ పద్మహితునకు
సర్వేశునకఖినవాత్మ-సౌఖ్యోన్నతికిన్ 56

కం॥ కేలాన శిలోచ్చయ కృత
లీలాస దనునకు కుండ-లీ భూషణుకున్
బాలేందుధరున కగజా
హేలాలోలునకు హార-హీరాభునకున్ 57

వ॥ సమర్పితంబుగా నా యొనర్పంబూనిన 'శివాజీ రాజ చరిత్రంబు' నకుం గథాక్రమంబెట్టి దనిన:- 58

ఇంతలో ఆముప్పుల కుప్పరానేవచ్చినది ఆమెకుమునుయెన్న గండస్థలీ పరిలిప్త చందనా గరువీచీ గంధము దెసల పూయుచూ వీచినదటు పెద్దన్నగార్కి ఎంత ఒద్దికగా పట్టుకొనివచ్చిరి. ఈసన్ని వేసమును ఒక్క సారి ఆలకింపుమని

సీ॥ స్వర్ణరంభాతరు ప్రస్ఫురద్బర్హినా
 వీపున గోర్మిమ్ముడి వేర్గిలుదాని
రహియమునానదీల హరుల శోభనా
 రమణీయ దీర్ఘ కేశములదాని
ఇందీవరచ్ఛదానందంబు లౌనన
 కాటుక కన్నుల నీటుదాని
శుచిపక్ష మధ్యను శుభాంశు చిహ్ననా
 మృగనాభి తిలకింబుమేలుదాని

గీ॥ చందనాగరుకర్పూర సరళచూర్ణ
లిప్తగండక వాసనాలీఢ మలయ
పవనునెల్లెడ వెదజల్లు ప్రౌఢిదాని
కని వినని దానినొక కన్య గాంచి ఈమ॥

సౌయరాసౌందర్య వర్ణనము, ఒకరసపర్భిభంధము ఒక కవివ్యుత్పన్నడా, కాదా, పురాణకావ్యనాటకేతి హాసముల పొలిమేరలు, ఎరుంగునా అనల్ప కల్పన చాతుర్యమున్నదాలేదా? ప్రతిభవెన్నెలవలె కావ్యమును పరివేషింపినదా! ఈసర్వ విషయములూ ఒకసన్ని వేశమును వర్ణించుటలో ఇమిడియున్నది. శ్రీరామమూర్తిగారి సంస్కారము బహువిచిత్రమైనది. పరిష్కృతమైనవాణి. విలక్షణమైన బాణి. ఏపూర్వపుణ్యమో పండి ఇట్లుగా పరిణమించినది. తనదారిని తనుపోవుచుండును. ఆయాసన్ని వేశములలో రససిద్ధులైన కవీశ్వరులు, ప్రసన్నులై, వెన్నుదట్టి వెళ్లుచుందురు. ఇంతకుమించి ఏమికావలయును?

తేగీ॥ వారిలో నయ్యనార్యుఁడ పార లౌక్య
సాంప్రగాయంబులను ధర-సన్నుతి గనె
మహిత కీర్తి ధురంధరా-మాత్య వర్య
వర్గము భజింపవెలసె న-పార మహిమ.

సీ॥ అర్థార్థి జనములు యాచింప వచ్చిన
వదనంబు ముడువక-వదరక, ని
గ్రీష్మతీక్ష్ణాతప ఖిన్నులౌ పాంథుల
స్రక్చందనాదులఁ జల్లబర
దుర్భిక్షముల నార్తిఁ-దొడరిన బీదల
నరయుచునిండ్ల కో-గిరములఁ
భజ్య కూపారామ-పాంధ సత్రంబులు
సమరసస్థలములఁ జక్కఁగ

తే॥ సతతమేకాదశీందువా-సరము లుపవ
సించుచధ్యాత్మ తత్త్వ స-చ్చిత్సుఖాబ్ధి
పారవశ్యమహానంద-భరితుఁడగుచు
నవని నయ్యనమంత్రి వి ఖ్యాతి వెలయు

మ॥ అతఁడత్యుత్తమ కీర్తనీయయగు జో-గామాత్య బుచ్చాంబికా
సుతనన్నాంబను బెండ్లియై, గనియెఁదే-జోరాశి తారాబ్జ, వి
శ్రుతకీర్తిప్రతిభా ధురంధరచరి త్రుండౌ శివాజీ కథన్
హితవృత్తిన్ రచియించు నన్ను, సుగుణిన్
శ్రీ రామమూర్త్యాహ్వయున్

శా॥ నా తోఁబుట్టువ పాపమాంబపతియు-న్నాధూల సద్గోత్ర వి
ఖ్యాతుండున్ బహుళాంధ్రలక్షణ సల-క్ష్యామూల జిహ్వాగ్రవి
ద్యాతస్విప్రియునృత్త, రంగసుభగుం-డౌ సూర్యనారాయణుం
డేతగ్గ్రంథము వే, రచింత నను నెం-తేప్రీతి బోధించినన్

శా॥ తమ్మారాయని గెల్వ నిచ్చఁగొను సీ-తారామ రాజేంద్రు సై
న్యమ్ముం దార్కొనుచాపి, యవ్విభున-కత్యంతంబు మిత్రత్వమున్
నెమ్మిం గూర్చి రిపువ్రజంబులను నెం-తే భీతిలం జేయుచున్
దమ్మాధీశు హితంబునన్ ఘుసృణ ధా-న్య క్షేత్రముల్ వొందగాన్ 35

తే॥ అమ్మహాత్ముఁడు కమలాంబ-యనెడి నతివ
వలన వీరన, గంగన-వరులఁ గనియెఁ
బుణ్యచరితుల సాధుసం పూజ హితుల
మాతృ పితృ భక్తియుతుల, స-మ్మాన్య ఘనుల. 36

వ॥ అందు —— 37

ఉ॥ వీరనమంత్రి ధీరతర-విశ్రుతిఁ గొట్టిక లూళ్లు గుత్తకున్
గూరిచి, యాచకావళికిఁ-గోర్కెలొసంగుచు, నిత్యమీశు, నిం
పార భజించుచున్, బుధులు-హర్షమునొందఁగఁ గూచిమంచిలో
సూరయమంత్రి పుత్రియగు-సుబ్బమఁబెండిలియాడె వేడుకన్ 38

కం॥ ఆ వీరన సుబ్బమలకు
శ్రీ విశ్రుతులయ్యనార్య-మృత్యుంజయులు
ర్వీ వేధాత్మజులురు దీ
నా వనులుదయించిరంబు-జాప్తారులనన్. 39

కం॥ అందగ్రజుఁ డయ్యన భూ
మందారుం డర్థులకును-మాన్యుఁడు సభలన్
కుంద శరదిందు నందన
చందన నిభయశుఁడు యోగ-సామ్రాజ్యంఢున్. 40

తే॥ అయ్యనార్యుఁడు దా మేన-మాంబయందు
పేరనార్యుని, వీరన-విబుధుఁ గనియె
పేరనార్యుఁడు కామాంబఁ-బెండ్లి యాడి
అయ్యనను, లత్సనను, ముత్త-నాఖ్యులఁ గనె 41

తే॥ అతని సుత పంచకంబు నం-దగ్ర జన్ముఁ
డయ్యెన యుఁ జంపావతి-యనెడి దివ్య
పుణ్యనది డాయు పెనుమల పొంతనొప్పుఁ
దమ్మ వల్లభసింగుల-ధరణియందు. 30

తే॥ దమ్మ భూపాల చిహ్న మౌ-దమర సింగి
గ్రాలు మృత్స్నాలమున మంత్రి-గా మెలంగి
శ్యామలాంబా వన ప్రాగ్వ శాల భూమి
నవ్య దుర్గంబు నిర్మించె-భవ్యుఁడతఁడు. 31

కం॥ వల్లభరాయ వినిర్మిత
వల్లా పురి నంబి కేసు-వప్రము చెంతన్
హల్లక సారస యుతమౌ
సల్లలిత తటాకమును, బ సను ద్రవ్వించెన్. 32

సీ॥ బాంధవులతిథులు-ప్రత్యూషమున నించు
నర్ఘ్య ప్రదాన కు-ల్యాలి చేత
నిత్యదేవార్చ నోత్కృష్ట కృష్ణా గరు
బహుళ సౌ గంధ్య ధూ-పములచేత
శ్రుతి శత వ్యాపృతి-స్మృతి పురాణే తిహా
స, ప్రబంధాతి ఘో-షముల చేత
నిత్యనైపద్యాతి-నిరతకాత్యాయనీ
భాషేంది రాంఘ్రి స-పర్యచేత

తే॥ బ్రహ్మ విద్యా విధానధా-రణలచేతఁ
బుత్ర మిత్ర కళత్ర సం-స్ఫూర్తి చేత
సకల వేదాంత, తార్కిక,-సభల చేత
నయ్యనా మాత్యు గృహమెప్పు-డలరు చుండు. 33

కం॥ ఆ మంత్రివర శిఖామణి
కామిత మందారుఁ డర్థి-గణముల కగుమన్
భూమీశ కార్యనిర్వహ
త్యామోదంబున మెలంగు-ననవరతంబున్. 34

తే॥ అది మహారాష్ట్ర మైనను-నమ్మహాత్ముఁ
డమ్మహారాష్ట్ర వర్ణంబు-లభ్యసించి
యాంధ్రభాషను ద్విపద వ్రా-యందలంచి
తనదు వంశమ్ము దేవతా-స్తవము వ్రాసె. 24

ఉ॥ అంపటఁ బ్రాచ్యదేశ విజ-యార్థముఁబోవు 'బుసీ' పరాసి, త
త్ప్రాంతము తెల్లు గావున, ద్వి-భాషినినారయ,ఁ బ్రాంశువైశ్యులీ
పంతులఁజూపఁ దోగుకొని-ప్రాగ్దిశనేగుచుఁగోటిలింగ భూ
క్రాంతవటాలయంబులను-రాజమహేంద్ర పురీ వరంబునన్. 25

కం॥ ఉన్నంతఁ దూర్పు ఱేఁడులు,
మన్నెపుటెకి మీాండ్లు చిఱుత-మలల యొడయులున్
బన్నులనిచ్చుచుఁ దమ తమ
మన్నులకుఁ గవుళ్లగొనుచు-మరలెడి సంతన్. 26

మ॥ తన గాంధర్వఖురాగ్ర నిర్దళిత ధూ-తక్షోద మాశా వధూ
కన దుత్తుంగకు చాగ్ర చందనమిళ-త్కాశ్మీర లేపంబుగాఁ,
దన నాథుం గననేగు గౌతమికి ర-క్త క్షౌమ చేలంబుగా
నను వుంజేయుచు వచ్చె, నా విజయరా-మానేకపం బుద్ధతిన్. 27

తే॥ వచ్చి నృపపుంగవుఁడు ప్రాంశు-వరుని తోడ
మైత్రి యెవ్వారు గూర్తురు-మాకనంగ
నచటి యుద్యోగులీ పంతు-లని వచింప
మైత్రి గావించె నతని కి-మ్మంత్రి వరుఁడు. 28

తే॥ అపుడు మిత్ర త్వమునకెంతొ యలరి నృపతి
యున్నతోద్యోగిగాఁదన-యుర్విసుంచ
విజయనగర పెదాపుర-విభజనమున
నతఁడు వేంకమ పురమందు-నధి వసించె. 29

## వంశ వర్ణన

సీ॥ గౌతమ గోత్రవి-ఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేల సం-స్తుత్యకులుఁడు
వీర రుద్రావనీ-విభుదండనాథుండు
వైరుల నణచిన-కారణమున
వీరప్రధాని' యన-వినుతులఁబొంది, తా,
బలముచే బలిజెలఁ-బారఁద్రోలి
బలిజపల్లి గ్రహించి-వెలయు వాఁడౌ టను
నయ్యాఖ్యయింటి పే-రైచెలంగ

తే॥ నతఁడు కబలాంబయందు బ-య్యనను గాంచె
బయ్యనార్యుఁడు నండూరి-బావ మంత్రి
మంత్రి పదమంది 'రేలంగి'-మాచిరాజు
పేరన సుపుత్రిఁ గామాంబఁ-బెండ్లియాడె. 20

కం॥ బయ్యన కామాంబికలకు
నయ్యన, వీరన, గణేశ్వ, రాప్పయ మంత్రుల్
నెయ్యపు మున్నీరులు, నా,
ధాయ్యక్రమ వైదుషీ ని-ధానులు వెలయన్. 21

కం॥ అందు దిగధీశ వరులఁ బు
రందురునిం బోలు భాగ్య-రాశియగుచు, న
కుక్కుంద, శరదిందు, చందన,
మందారయశుండు వీర-మంత్రి వెలుంగున్. 22

వ॥ అమ్మహాత్ముండు

మ॥ తన నచ్ఛాత్రులతోడ నాసికకుఁ దీ-ర్ఘ స్నానముం జేయఁగాఁ
జవి, వాణిజ్యముఁజేయు నచ్చటి విదే-శప్రాంశు సంఘంబు నో
ద్దను నుద్యోగముఁ జేయుచోఁ బ్రకటుగా-ధారూపకంబుల్ మహా
జన సంస్తుత్యమునౌ శివాజి కథితల్-సంపాద్యముల్ సేయుగా. 23

తే॥ భారతీదేవి వా జిహ్వఁ-బ్రబలకునికి
రంగ దుత్తుంగ గంగా త-రంగ సంఘ
సంగతిని గావ్యరచన పొ-సంగదైన
సచ్చరితమౌట విబుదహ-ర్షంబుగాదె. 16

వ॥ అని యిష్టదేవతాభివందనంబును, నుభయకవి ప్రశంసంబును గావించి, యెద్దియేని సచ్చరిత్రంబు రచయింప నూహించు నవసరంబున, దైవయోగంబుచే, నొక్కనాడు మత్ప్రపితామహ లిఖితానేక గ్రంథంబులు శోధించుచున్న సమయంబున, నొక్క పుస్తకాగ్రచ్ఛదంబు పైనున్న 17

తే॥ "రాజమాన్యమహారాజ-రాజ పూజ్యు
లైన వేంకట శ్రీ విస్స-నార్య వర్య
మత్పితా మహ మాన్యుల-మహిమ చేత
వ్రాయఁబడియున్న ధీర శి-వాజి యొక్క
వచనచరితంబు పద్యకా-వ్యము నొనర్పు" 18

వ॥ ఈ పద్యంబుఁ జదివి యానందంబునొంది శివాజీ రాజ చరితంబను, నిప్పాత్త్రంబుఁ బరిశీలింప, నందిష్టదేవతాస్తుతియు మద్వంశ వర్ణనంబు నుండుటయుఁ గథాక్రమంబు లేమియు, గాంచి, చింతింపఁగొన్నిదినంబులకు నాధునిక కవియైన శ్రీ కొమరరాజు లక్ష్మణసూరి విరచిత' శివాజి చరిత్ర' వచనంబు లభ్యంబైన మత్పితృపితామహాప్సితంబుగఁ బద్య కావ్యంబు రచియింపంబూని, యందు సనాతన కవి ప్రోక్తంబుగ, మద్వంశావతారంబభి వర్ణించెద :- 19

కం॥ కబ్బపుఁగానల మిడిగల
బొబ్బ మెకములుభయ కవి వి-భుం డెఱ్ఱనయున్
బెబ్బులులు పోత, సోములు
గిబ్బలు శ్రీనాథ, భీమ, కేతనలెన్నన్. 11

మ॥ కరముల్ మోడ్చినుతింతు, భారతకృతిం గైకొన్న శ్రీ వేగి భూ
వరు నాతిథ్యము నొందునన్నయు సుధీ-భట్టార్యునిన్, మించి, యా
దరణుండై, నవఖండవాడపురిఁ బ్ర-త్యగ్రాగ్రహారంబుగా
నరయంగై కొను, పావులూరికుల మ-ల్లామాత్యచూడా మణిన్. 12

చ॥ కుకవుల నిందయంచు కవి-కోటి ప్రబంధములందు-పద్యముల్.
ప్రకటముగా రచింతురది బాడియె లక్షణ హీనకావ్యమౌ
సుకవులునైన గాంచి మదిసొంపు వహింతురుగాన కావ్యమన్
ముకురము వెన్కనంటు లవముల్ గొనుబోలిక తప్పులెంచనో
పికఁబడు సత్కవీంద్రులను వేడెదమత్కృతి చిత్తగింపగన్ 13

చ॥ పరతృణలేశముల్ దిగిచి-పానకముల్ గొను ప్రాజ్ఞులట్లు వి
స్ఫురదురుకావ్యకల్పనల-సొంపగువర్ణనలన్ గ్రహించి, యా
నెరసుల సారసోక్తులుగ-నేర్పుమెయిన్‌దగ, దిద్ది, యొప్పు, నా
సరసకవీంద్రులన్ మదిని సన్నుతిఁజేసెదరెల్ల వారలున్. 14

## గురుప్రశంస

కం॥ నుతియించెద మద్గురు వా
క్ప్రతిభుఁ, బాలాంత్రవంశ-వార్ధి శశాంకున్
ధృతరాజయోగరాజును
నతులిత కవివర్య సూర-నార్యుంగొలుతున్ 15

సీ॥ వేలుపుగమిబువ్వ-వెన్ను దన్నుక పుట్టి
కడలిరా మిసిమి మీ-గడలఁ బెరిగి
విను మిటారులగొండ్లి కనుమూతలను దేలి
యర దచ్చికై దొర-యంజమెట్టి
యెద్దడికారిర్ల-కెట్టని వేలుపై
కలుగుడాగుడు మేని-నెలమి బండి
తొలికడరా యీగి-తోట జోలలనూగి
రొంపిపుట్టువు పీట-నింపుఁజెంది.

తే॥ జిడ్డు వంకల దొర యొద్ద-జిలుగుటిసుక
తిన్నెలఁజెలంగి యాడెడు వెన్నుని సతి
పజలనుడువుల కిది మేలు-బంతియనఁగ
శివధరాధిపుఁ గతలింపుఁ జేయుగాత! 7

తే॥ ధర్మరక్షణకైగాని ధరణి యేలు
టఖిల భోగంబులకు గా దను శివాజి
కథల నాచంద్రతారకా-ర్కంబువెలగ
ధర్మమూర్తి యజస్రంబుఁ-దనుపుగాత! 8

కం॥ తుండాగ్రంబున రంభా
కాండంబులరీతి కావ్య-గతని విఘ్నంబుల్
దుండించి, తోడుఁబడ వే
దండాస్యుని వేడుకొనియె-దం, బలుమారున్ 9

## గీర్వాణాంధ్ర కవిస్తుతి

కం॥ ప్రాచేతసునిన్ వ్యాసుని
బ్రాచీనుం గాళిదాసు, బాణుమయూరున్
ధీ చతురుమలఘు బిల్హణు
వాచార్భటు లెసఁగు గవుల-భక్తిం గొలుతున్. 10

గీ॥ మన్నుఁదాలుపుదొరపట్టి-గొన్నవాఁడు
మన్నుఁదాలుపు మోసిన వెన్నువాఁడు
పుట్టపేరులఁదాలుపు-కట్టివేల్పు
లొనరనీ కబ్బమున కసం-బొసఁగుగాత! 4

సీ॥ ఆము లేనుగుమోము సామినోమిన యమ్మ
పుంజుడాల్వేలుపుఁ బ్రోచుకొమ్మ
తెఱవాయిమెకము మే-ల్తేజి గల్గిన తల్లి
బత్తి మొత్తము సాకు-పాలవెల్లి
ఇర్తిగవాతిగు-ర్తైనయు జోగపుమేటి
యాలుడిలెంకల కానవాలు
కలుగుమచ్చువజీరు కడెము జోదరమేను
యేటికోళ్లిడువారి-కీగిమ్రాను.

తే॥ పెండ్లికూతురు తెలిగుండు విడిదసాని
సత నిరాబారులాండ్రసే-సలను గొన్న
జెట్టిసామేన జగమమ్మ గట్టుపట్టి
చెలఁగి శివరాయుకత వెల్గఁజేయుగాత! 5

సీ॥ సకల రాజధిరాజ సభాంతరంబుల
మొదలు విద్వాంసులే-ముదితఁతలఁతు
రక్షాభ్యాసవి-చక్షణంబున బుధుల్
బాలురకేయమ్మ- పాట నిత్తు
రెల్లగృహంబుల నిష శుద్ధ విదియుయం
దర్చింతురేరాణి-యంఘ్రియుగ ము
గ్రంధావలోకన కాలంబున జనుల్
పఠియింతురే దేవి పద్యవితతి.

తే॥ ధీర జిహ్వాగ్ర నృత్తమం-దిర తటీని
వాసి యే యమ్మ యా సర-స్వతి శివాజి
చరితమెల్లెడఁబండితా-దరణముగను
శేముషీమంతులకు నింపుఁ జేయుగాత! 6

ఓం

# ఛత్రపతి శ్రీ శివాజీ చరిత్ర

## ప్రథమాశ్వాసము

కవి కవితా వినోద

**బలిజపల్లి రామమూర్తి**

### దైవస్తుతి

శా॥ శ్రీ గౌరీకమలా సరస్వతుల క-ర్ధిన్, బార్శ్వ, వక్షా, స్యముల్
సౌగంధాంచిత శయ్యలట్లు తగుమై-సంధించు నాశ, స్వభూ,
వాగీశుల్ శివరాడ్చరిత్రమిల, నా-పర్వేందు తారార్కమున్
రాగిల్లన్, గృపఁజూపనాత్మను నజ-స్రంబేను ప్రార్థించెదన్ 1

శా॥ శ్రీమద్భాస్కర కోటికాంతి విలస-చ్చిద్రూపముం దానయై
ప్రేమన్ సర్వజగజ్జనాళికఖిలా-భీష్టంబులన్ గూర్చుచున్
సామీరిన్ బరతత్వవిద్య వెలుగొం-దంజేయు శ్రీ జానకీ
రామబ్రహ్మము శైవరాయు కథ క-ర్ణ శ్రావ్యమొందించుతన్. 2

మ॥ పలుకుంబోడి చమత్క్రియోక్తులకుఁ ద-త్ప్రౌఢిన్ వచింపంగఁ బ్రా
ణుల సృష్టించెడివారితో నుడువగా-నోరొండు వీలుండమిన్.
దల వాకిండ్లను నాల్గు దాల్చి నుడి జం-టల్ వొంగఁగా బల్కుచున్
దెలి దమ్మిం గొలువుండు ధాత,ఁగృతికిన్-దీర్ఘాయువుల్ వేడెదన్. 3

సీ॥ కలుగు డాగుడు ప్రోగులు లివులాగలవాఁడు
కలుగు డాగుడు మెత్త తలిమవాఁడు
పుడుకు గల్బుడుకకై యొడికంబు గలవాఁడు
పుడుకు గల్బుడుకు రా పూసవాఁడు
విజ్ఞాలు డాలుమేల్ ప్రేల్సరి సిగవాఁడు
విజ్ఞాలునడుగుడాల్ వెలయువాఁడు
బల్మానికలబొజ్జబండి గల్గినవాఁడు
బల్మానికలబొజ్జ పడఁతివాఁడు.

సీ॥ అమృతాంశు మృగముతో నాడబోయిన మాడ్కి
నుప్పరంబున దాటు నొక్కమారు
పయ్యెద జింకతో వియ్యంబు గొనురీతి
నుటికి మూలకు బారు నొక్కమారు
ముక్కంటిలేడితో ముచ్చటించెడు భాతి
నుత్తరదిశకేగు నొక్కమారు
తనబంధువులపొందుదనియెదననునట్టు
లుర్విపై బరువిడు నొక్కమారు

గీ॥ పొదలనొకమారు వడిదూరు పొంచిమీరు
పచ్చిక బయళ్లకునుదారు బదరి జారు
డెక్కతుదలను పీనుల చక్కగీరు
బేరుమనిగేరు గిఱుఱించి పెడకుదారు

ఈలేడి వర్ణనము పరమాద్భుతముగ చేయబడినది. చదువు చున్నప్పుడు సౌందర్య పరసీమలలో సహృదయులకు కాళిదాసు అగు పింపకమానడు 'సరి' ఆ లేడి "నరసావజి" కోమరిత "సోయరా" అను అందాల భరిణకు చెందినది. అమె చెలికత్తెలు వ్నారుకదా, మదనుడు ఓ పదునుబెట్టిన బాణములవంటివాడు. వారు శివాజిని నిలదీసి అడిగిరి ఆ అడుగుటలో ఒకగడు సుదనము, ఆతని అనుభవము కొట్టవచ్చినట్లున్నది. ఎంత సత్వ సంపన్నుడైననూ చేసినపని పరస్థలములలో ప్రతాపమును చూపనెంచుట మంచిదిగాదు. ఈసంవాద సౌందర్యము వరూధినీ ప్రవర మును తలపింప చేయుచున్నది.

ఉ॥ ఎయ్యెడకేగు వారలిటుకేటికి వచ్చితిరార్య! శ్రీవనం
బియ్యెడ నేలసొచ్చిరి? వనేందిర బోలుకురంగ తర్ణకం
బియ్యెల నాగపోద్దిగల దిచ్చుట దీనినిబట్టమేరగా
దయ్య! యిదేటిసాహస మహా! పరభూముల సత్వమొప్పునే॥

### సప్తమాశ్వాసము



### అష్టమాశ్వాసము



### నవమాశ్వాసము



### దశమాశ్వాసము

## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము



## షష్ఠాశ్వాసము

## మూడవ ఆశ్వాసము

# విషయసూచి

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

కం॥ విం దారగించి యినకులు
లందలములనెక్కి యింటి-కరుగుడు, లుకజీ
సందేశము విని, యాతని
సుందరి, దరిఁజేరి, కడున-సూయను బలికెన్ 92

## శహజీ వివాహ ప్రసంగము

శా॥ ఆహా! యేమిది! విన్నపంబొకటి నా-థా! నీ సుతన్ ధన్యుఁజౌ
నీహారాంశమహీశవంశునకుఁ బెం-డ్లిం జేయ కీయల్పుఁడౌ
బాహా జన్మనకేఁదలంచుటలయో!-పద్మాక్షి భాగ్యంబు: నే
డోహో! మెత్తురె? సాటివారలసమా-నోల్లుంఠ బాంధవ్యమున్ 93

మ॥ కులమున్ ద్వర్ధి, ధనంబు పూజ్యము, భియు-క్తుల్ జీవసంబుల్ ,మహీ
వలయాధిక్యములేశ, మాత్మ, కుటిల-వ్యాపారసాంద్రంబు తా
వల, మత్యుత్కటకర్కశోగ్రశిఖరీ-భాగంబు స్నిగ్ధంబు, మా
వళిసంఘంబిటువంటి బాంధవము త-న్వాంగీప్సితంబెట్టులా 94

మ॥ జనకుండుత్కట విద్యయున్ సుగుణ సౌ-జన్యాధికంబున్, మహా
జనసంస్తుత్య, రసాధిపత్యమభిలా-షం బొందెడున్ దల్లియున్
ధనబాహుళ్యముఁగోరు; బందుగులు సద్వంశంబొరుల్ భుక్తి గాం
తునకున్ మంజులరూపమున్ గలుగ-సంతోషించెడున్ గన్యయున్ 95

కం॥ కావున మన జీజా రా
జీవాస్యను, భాగ్యరూప-జిత మన్మథునిన్
జీవేశుఁ జేయుఁడన; న
భ్భూవరుఁడిట్లనియెఁ గల్కి-బుద్ధి మరలగాన్. 96

శా॥ పంకేజానన! తొల్లి మత్కులజుఁడౌ-పద్మాక్షుఁడాభీరుఁడన్
శంకన్, రుక్మి జరాసుతాదులు ప్రశం-సల్మానుచున్, ఋక్షరాట్
సంకాశాననయైన రుక్మిణిని నా-చైద్యాధముంగూర్ప నా
తంకంబేర్పడి రుక్మిణీ హరులకు-ద్వాహంబు కాలేదొకో! 97

కం॥ మత్తద్విప బలస త్త్వో
దాత్త మహాశయ వరాంగ ధైర్యప్రభల
త్తుత్తమ కులులకుగాక, య
నుత్తములకులేమి, వీర-లుత్తము లబలా ! 98

కం॥ విను, మున్ను దయపురీంద్రుని
దనయులలో నగ్రజుండు-ధరణీశుండై
మనినఁ, గనిష్ఠుఁడు బాక్సిం
గను నతఁడు, విరక్తిఁదిరుగ-నతనిసుతుండున్. 99

కం॥ భూపాలనంబులేమి ని
గా పురుషుల నాశ్రయించి-కాలముగడపన్
భూపుఁడని యెన్నకుండిరి,
కాపురుషులు గారు వీరు-ఖర ఖర వంశ్యుల్. 100

కం॥ ఆగతి కతిపయ దివసము
లేగన్, మాలోజి, జాధ-వేంద్రుని కడకున్
శ్రీ గల బాగా లిమ్మని
వేగమె వ్రాయంగ, నతఁడు-విన్నంజూడన్ 101

కం॥ ఆలో నహమదు పుర భూ
పాలున్ మాలోజి గని, యవన-వర లుకజీ
బాలను నా కొమరుని బ్రో-
యాలుగఁ జేయుమని వేడు-నంత, నతండున్. 102

కం॥ లుకజీ జాదవు, సన్నిధి
కకలంకతనేగి శహజి-కర్థాంగిగ నీ
దు, కుమారిక నిమ్మన నిం
చుక యాలోచించి హితవ-చోవిలసితుఁడై. 103

సీ॥ పాంచాలి సభలోన-భంగమొందఁగ నీక,
సాకిన కృష్ణువం-శమునఁబుట్టి
దారాపహార సం-హారి సంభవమైన
యినవంశజాతుపా-ణిని గ్రహించి
ఢిల్లీశుమన్నన-నుల్లసిల్లిన రాజ
చంద్రుని గర్భ వా-సమునఁబుట్టి
భూభారహరణ సం-దా భార్గవుల న
తపసులెన్నినసుత-ద్వయముఁగాంచి
తే॥ పెంపుజెందిన నను నీచ-బృందమిట్లు
చిక్కుపరుపంగఁ బ్రోచెడు-దిక్కు నీవె
సర్వమంగళ! కాళి! యో-శంభురాణి
యనుచుగోలున వాపోవు-నంతలోన 222

శా॥ జ్వాలాభీల నిశాతదీధితుల నా-శాభాగముల్ గప్పదో
ర్వాలంబుల్గొని, యుగ్రపారిషద సం-భావైక బాంధవ్యము
ద్వేలన్నించు మహాబ్ధిభంగములకో-విన్, డాసి. యప్పాలసుల్
దూలన్ జేయుచుఁబల్కిరిట్లు తగునా-లోలాక్షి నిర్బంధముల్ 223

చ॥ షాహాజి మహీశుఁడీయమ న-సమ్మతిఁదో విడనాడి తుక్కయన్
మహిళను బెండ్లియాడి కను-మన్న నతోడ విజాపురంబునన్
బహుళ వరూధినీశుఁడయి,-భాసిలుచుండిన వాఁడు గానమి
రహితుని బట్టకీ యసద-నాపుట ధైర్యమె, వీర కర్మమే 224

క॥ లుకజీ జాధవపుత్రిక
నకటా! యీ సాధ్వి, వరు న-నాదృతి పుట్టిం
టికి నత్తింటికి గా కీ
తికమక బంధువులయింట-ధృతిఁజెడియుండెన్ 225

అని పలికిన నంత సభ్యలంబు దొరలు:— 226

కం॥ ఒరులెఱుఁగకుండ శహాజియు
తరుణిన్ శివరాయు విడిచి-తా-శంభాజిన్
దొరకొని బీజపురంబున
కరిగి తుకాబాయి పెండ్లి-యాడెన్ బిదపన్ 218

ఉ॥ బీజపురీంద్రు మన్ననలఁ-బెంపునసంది నతిక్రమించు నా
షాజినవాబు సైన్యములు-సత్వముఁగోల్పరుపంగ నొక్క నా
డాజిఁదొలంగి మొగలుల-హమ్మదుపట్టణ మాక్రమింపగా,
జీజభుజిష్యయుక్తముగఁ-జిక్కె-నరాతి పదాతికోటికిన్ 219

ఉ॥ క్రూరతురుష్క-పాద రజ-రూషిత మూర్ధవిశాల వక్త్రియై
సారెకుదూరు వేలు పయి-నంజ్వరమందుచు వెచ్చనైన ని
ట్టూరుపుగాలిచేఁగమలు-నోష్ఠము బీటలువార, రోజుచున్
దీరనివేదనంఁ గొనితి-తిత్తుఁదొలంగి నతాననాబ్జయై 220

సీ॥ నీలాబ్జములజారు-నీటిచుక్కలతీరు
కజ్జలాపాంగ కం-కణములురల
జలజాతపార్శ్వస్థ-చంద్రఖండమ్మన
చెక్కిలిమెఱుగర-చేత వెలుఁగ
జాలంబులోఁజిక్కు-జక్రవాకములనన్
దృగ్ధారఁదడిసి పా-లిండ్లుముడుగ
ఘనఘనాచ్ఛన్నరా-కా నిశాకరుఁడనా
ముంగురుగుంటి నె-మ్మోముకనల

తే॥ వేడినిట్టూర్పు గాడ్పుల-వెక్కి వెక్కి
యేడ్చె, హా! దైవమా! విభుఁ-డెగ్గు సేయు
సాధ్వి, నబలను సుతవతి-సచ్చరిత్ర
నేడిటుల సేయమంచిదే-నీకటంచు 221

చ॥ అహరహమవ్వధూవరు లఁకాగ్రహముల్ భరమయ్యె నంతటన్
శహజిమహీశుఁడొక్కఁడివ-సంబున-మూర్తినిజాము నాజ్ఞ చే
నహమదునీమఁజుట్టికొని-యాజిజెలంగెడు మోగలేశులన్
దహనుఁడు నింధనంబుల వి-ధంబుననీరు నొనర్చె ధీరుఁడై 212

ఉ॥ మూర్తినిజాంశహచున్ గెలువ-మోగలుకూటువలెన్ని వచ్చినన్
స్ఫూర్తిగ గెల్చుషాజియదు-భూవరులందు శహాజి పెద్దగా
గీర్తనమూర్తిఁ జేయఁదన-కీర్తి నిమించెను నల్లుడంచు నీ
ర్ష్యార్తులనొంది సైన్యయుతుఁడై లుకజీ ధరణీశుఁడొక్కఁడన్ 213

శా॥ స్వస్త్రీత్యంబగు సింధుభేత్పురికి బోవన్ వచ్చు ఢిల్లీశ్వరుం
డస్త్రోకార్చనలిచ్చి పేర్కొని యసం-ఖ్యాధీశకోటీర వి
న్యస్తప్రస్ఫుటరత్న పద్యనజు జే-యన్విప్రశుత్రైశ్వర్య భూ
విస్తారాధిపుఁడై సపత్నబలముల్ వేమారుసాధింపఁగన్ 214

కం॥ ఢిల్లీ కు వెలిమిచేఁదన
యుల్లునితో నప్పుడప్పుడా జులుగలుగన్
బల్లిదుఁడై శహాజి ప్రభుఁ
డిల్లన లుకజీంద్రునొంచె-నట పడిసారుల్ 215

కం॥ అలో నహామదు నాథుఁడు
గాలునిపురికేగ, నతని-కౌశ్యపినెల్లన్
బాలుంబొందిరి ఢిల్లీ
పాలుండును బీజపూరు-వసుధావరుఁడున్ 216

కం॥ బీజపురేంద్రుని నగమున్
షాజయుఁ బాలింపనంత-శహజిన్ లుకజీ
భూజానిదాక ఢిల్లీ
[illegible]కినేములున కంత-సంక్షోహసంగన్ 217

గీ॥ పగిదికిని చుంచు, పనులలోదు బందికొక్కు
వన్నె కనుమేక గంతులు - వైవపులిద్యు
పట్టుటకు గప్ప కఱచిన పడగపాము
రాచకొమరుని నమ్మగారాదుమనకు

శత్రువులను చులకగా చూచినచో అలుసు వచ్చినప్పుడు ఎంతకు పెరుగునో ప్రశిద్ధమగు లోకవ్యవహారములో ఎంతచక్కగ చెప్పబడినది. రాచపగ - త్రాచుపగ - ఈరెండును ముప్పునకేమూలము. లోకజ్ఞానము పుష్కలముగ నున్నగాని, ఇట్టి సూక్ష్మాంశములు, తెలియబడవు. తెలిసిననూ, వాన్కి కావ్యత్వము చేకూర్చుటవలను పడదు.

భాజి - ఖాన్ శత్రువు కోడలినిపట్టి శివాజికి కాన్కగా ఇచ్చుట. ఆమె సౌందర్య పరసీమ అంతటి సౌందర్య వారాన్నిధి జగత్కళ్యాణి యైనచో, అడుగుదమ్ములు సేవింతునె, తల్లియైనచో, ఆదరంబున కౌగలింతునే, చెల్లెలైనచో ఆప్యాయమున చేరదీదునే, బిడ్డయైనచో అంకమందిడి ముద్దు గొందునె, హరి! హరి! పరవనితగాన ఏమని పలుకరింతు. కాంతా కనకములుగదా, ఎంతవారికి అధరీకరించును. పరకళత్రము, అనిర్వర్ణనీయము, ఇంద్రియములకు దాసులై, సార్వభౌములు మహానర్థములకు పాల్పడుదురు. అని ఆమెను తనతల్లి చెంతకు చేర్చెను. శివాజి అచ్చమగు శీలమునకు ఇది మచ్చు తునక కాంతావర్ణనము విన్నంతసేపుచపులూరు చుండును. రాజులకు బహువల్ల భత్వము దోష ము లేదు. కాగా ఆమె పరాక్రమో పలబ్ధ, స్వదతీ సౌందర్య వ ర్ణ న ము ల ను బట్టి ఎట్టివారిక్కినీఇంద్రియ వికారము జనించును: ఆమెను మాతృదేవతగా భావించి సమస్త సౌందర్యమును. ఆభావమునందు విశ్రమింప చేయుటలో శివాజీ శీలఔన్నత్యము తేటపడుచున్నది. రసభావములపైన దువ్వుగలకవిగాని, ఇంతటి సుకుమారముగ ఈపన్ని వేశములు నిర్వహింపలేడు. శివాజి కళ్యాణ పురవీధులలో చనునప్పుడు ఆమగరాయుని చూచుటకై, పురపుర ధుత్రిలు ఎంత ఉత్కంఠపడిరో, ఆవర్ణనము కాళిదాసుని త ల పిం ప చేయును. 3 వ ఆశ్వాసములో శివాజి మృగయా విహారమునకు చనును, అక్కడ ఒక అందమైనలేడి గనబడును,

శా॥ హాలాపాన మదానుషంగ భయదా-హంకార నేత్రారుణ
జ్వాలాభీలకరాళ వక్త్రి, తత, దం-ష్ట్రవ్యక్త నిష్ఠీవ ధా
రా లాలస్ర వసార్ద్రి వక్షులు, పర, ద్రవ్యాంగనాసక్తులా
బాలవ్రాతములిమ్లుచాత్ములకటా!-బాటింపగాయాదవుల్ 206

ఉ॥ వారలలోనింతబిను ల-వారితకర్కశ దీర్ఘ దుష్ట సం
చారమనోవికారులు రు-సాహసకైతవ ధూర్తచింతి తా
చారులరాళశీలు రఘు-సంగ్రహపుష్కల మానసేంద్రియో
దారులకాలక్రమ పర-తంత్ర జగీషవిశేషు లెంచఁగన్ 207

ఉ॥ అందు నృపాలబాలికల-హార్యగరున్మద దారితోగ్ర సం
క్రందనకర్కశాసి నిభ-గాఢ మనస్కులు వాక్స్రవాచ్ఛ్యమ
త్స్యందిరసానులేప, రథ-నాంశుకలున్నిజ నాథహృద్యదై
సందినమిథ్యచేష్టిత స-నాతనకాల భుజంగులెంచగన్ 208

కం॥ అనవినిరోషముఁ-గినుకయు
నినుమడియై కన్నుఁగోనల-నేరుపెక్కఁగా
మనుజవరు మోము చురచురఁ
గనియాసతి యిట్టులనియెఁ-గాఠీ, న్యోక్తుల్ 209

శా॥ ఓ నో, యాదవవంశభూభుజులక-న్యారత్నముల్ తథ్యమి
థ్యానైపుణ్యవచః ప్రవీణులను వా-ర్తల్ దిక్కులన్ బుష్కల
ధ్వానంబుల్ గొనవీనులారవిని యు-ద్వాహంబు మీరొందుట
ధ్యేనుంగున్ హరిణంబుసాదృశముగా-దే, బుద్ధినూహింపఁగా 210

శా॥ అన్యోన్యంబిటు లవ్వధూవరులు ఛా-యాపుత్రయోగాప్తిచే
వన్యాభీరులఁబోలి మిక్కిలి యప-భ్రంశోక్తులన్ బల్కుచో
మాన్యంబించుకలేక చిత్తముల సం-భావ్యంబులంబొంది దా
ర్జన్యప్రాజ్ఞధురంధరస్థిర పృథ-గ్స్వాంతాజ్ఞులైవ్యష్టులై 211

మ|| పునుగున్మేననలంది మేలికపురం-బున్ నల్గుగావించి చా
చినమీఁగాళ్లఁ గుమారునుంచి యొకరా-జీవాక్షి గోర్వెట్టలన్
గనుగంధా మలకంబుచేఁగురులు చ-క్కంబ్రాబామి, యుష్ణోదకం
బినుమార్ద్గోసిళులన్, జెమర్చి, తలనీ-రింకించె దువ్వల్వలన్ 200

కం|| కాలాగురు ధూపంబిడి
ఫాలంబున బొట్టువెట్టి-వాల్గనుదోయిన్
నీలాంజనంబుఁ దీరిచి
బాలున్, డోలనిడి యొక్క-బాలికయూచెన్ 201

కం|| పింగార్జున సద్యో ఘృత
ముంగలపీనఁజున్నుఁబాలుఁ- బోసెను నుగ్గం
చంగన యొక్కతె ముద్దుల
ముంగరముత్తెంబు నవ్వ-మొలకల మెఱయన్ 202

తే|| బాలచంద్రుని లీల న-బ్బాలుఁడంత
కంతకును వృద్ధినందుచు-సంతసమ్ము
తల్లిదండ్రుల మోదంపు-వెల్లిఁదేల్చ
చప్పుడప్పుడుఁదాఁ దప్ప-టడుగులిడగ 203

శా|| సంతోషంబున నొక్కనాడు శహాజీ-తన్నాథుఁడర్ధాంగితో
కాంతా! నీదగుమేనఁగోడలిని వే-డ్కన్ మీర శంభాజికిన్
గాంతన్ జేయుదమన్న నా పెనుభా-గ్యంబెల్ల నీక్షించినన్
స్వాంతం బొప్పునె కాంతనిచ్చుటకు శం-భాజీకి నాసోదరుల్ 204

కం|| అని కడు నిరసనముగ న
వ్వనితామణి పలికినట్టి-వాక్యంబులకున్
మనమున నలిగిన శహాజీ
యనురాగము వీడి యిట్టు-లాసతి ననియెన్ 205

్నకముకుళంబుల గతి
౦ఁగను తెప్పలంటి-యాస్యముఁదెరువన్
ంబుగామి కదలిమి
ు జన్నిళ్లు లొక్క-సతి శిశువుపయిన్ 194

మాలు పురుడు గావున
తుక చిరుగోడవనంది-నీళ్లాడంగా
ుక కలదని ముదుసలి
తులు మై నిమిరి తడవి-మేలొనరించన్ 195

ంతరంబు బాలుం
మారుకని బోలి కాంతు-లొదవుచు నేడ్వన్
ముగఁబట్టి యొక సతి
ారుచుచుండె ననుచు-ఁబల్కెడునంతన్ 196

సలి మంత్రసాని శిర-మున్ వణకించుచు సూరకత్తి చే
ముగాను వట్టి యొక-పాణివడం కఁగనాభి(దుంచి కం
నపిండి మైనలమ-నొండొక ముద్దియ గోరువెచ్చ నా
ము దోయిటం జిలికి-యుంచెఁగుమారుని దల్లిపొత్తిటన్ 197

గమంబున జాతక-ర్మాదులెల్ల
ఁతిఁదీర్చి, జనకుఁడు-సంతసమున
పంస్తుతి సంభవ-చరితుఁడైన
గావునఁబిలిచె, శి-వాజి యనుచు 198

ు తెప తెప మూయన్
మారునకు దూకు- సెగనుంచు చెలుల్
పు వలువఁగప్పిరి
రండం పుఁడైల-మున్ గల నాభిన్ 199

సీ॥ శుద్ధమౌక్తికమూను-శుక్తిసంపుటరీతి
నబ్జారిఁదాల్చు ప్రాగాశపగిది
మణిరాజమును దాల్చు-ఫణిరాజుపోలిక
పుత్తడిఁగరగించు-మూసఁబోలి
వజ్రంబులో గల-వైద్రకాంతమట్టుల
పత్రరూపిత చూత-ఫలముమాడ్కి
ఘనదీపకళఁ- గల్గు-గాజుకుప్పె విధాన
మెఱుపులోపల గల్గు మేఘునట్టు

తే॥ లవయంబుల కాంతుల-నతిశయిల్లె
లేచినిలువంగ దనకొక్క-లేమవలసె
భూతనాథుని రెండవ-మూర్తియైన
యర్భకుఁడు గర్భమున వెల్గు-నవసరమున

క౦॥ పలుకంబారెను జెక్కులు
నలుపెక్కెం జూచుకములు-నడుమున్ బలియన్
బలువయ్యె మరుని జదువులు
నెలలెక్కువ గాగఁ జారె, నెయ్యపుటలుకల్

క౦॥ ఆపన్నసత్వయౌ జిజ
కాపగిదిని నెలలునిండ-నతిశుభదంబై
పాపులు జూడనిరాశి ను
మాపతి యర్ధాంశమునకు-మారుని గాంచెన్

క౦॥ ప్రాలేయాంతర్హితు డౌ
బాలార్కునిభంగి పటికి పాల్వొదవిన యా
మేలిమిపుత్తడి చాడ్పున
బాలుడు మసకంపునీటి-పట్టుననొప్పెన్

కం॥ అంతర్వత్నీత్వముతోఁ
గాంతామణి నెలలు పదియుఁగడచిన పిదపన్
వింత మెయిన్ శిశుభవభర
మెంతయుఁగన్పించె నొప్పు-లెక్కువగాఁగన్ 184

కం॥ తారా, గ్రహ, తిథి, వారము
లారయ శుభవృత్తినున్న యవసరమున నా
నారీలలామకాంచెకు
మారున్ గలుషౌఘుదూరు-మారాకారున్ 185

తే॥ చంద్రశాలాంతరంబునఁజంద్రు పగిది
వెలుగు కూనకు గుడిపె పె-ద్రేవ్వలునంటి
దాసియొక్కత నేరండ-తైలమంపుఁ
జిలుకు బాలింతరాలిమల్-చేపుపాలు 186

తే॥ మఱియు మూఁణ్ణాలు గడిచిన-మంచెపైని
వెదురు వావిలిఁగాచిన-వేడినీళ్లు
తానమాడించిన కప్పుకు-దండమిడగ
మగువనొప్పించెనొక ముది-మంత్రసాని 187

తే॥ అంత పుణ్యాహవాచన-మాదిమైన
జాతకర్మంబులెల్లను జరిపిగురుఁడు
శంభునారాధనంబు చే,-జననమైన
వాఁడుగావున బిలిచె-శంభాజియనుచు 188

తే॥ శుక్లపక్షపు శశివలె-సుతుఁడు పెరిగి
తప్పటడుగులు వెట్టుచు-ధరణిమెలఁగు
తఱిజిజాబాయి మలిచూలు-దాల్చెవాసు
దేవుఁడుదరంబునంగల-దేవకివలె 189

సీ॥ నల్లద్రాపుడుల సూ-డుల్లంబులో వేడి
గుడుసుకై దువనట్టె-బడయుటయును
శేరాజు చెల్లెలు-నోరార నుడువుచు
నింటగల్గిన సిరు-లంటుటయును
వెలిచట్టుపల గుట్ట-ముల నెక్కి దొరవేడు
చుసురులోసెడు విద్దె-నొందుటయును
వెలిగట్టుదొరపట్టి-గిలిగింతలను బెట్టు
చరమేనుదానొందు-చలరుటయును

తే॥ తూము పేరిటఁబారుని-సామిమేని
యోగిరంబిడి మిడికూన-నొందుటయును
బునుకదారిని గొలిచిన-బూసగెననుచు
మిక్కిలిగ వేడి జోతలు-పెక్కులిడగ 180

## పుత్రసంతానము

కం॥ నేలదప్పె తెరవ, మేఱుపులు
తళుకు తళుకుక్కమని మొగులఁదప్పి వెలికి వి
చ్చలవిడి మెఱచిన చొడ్పున
నల రెండొలిచూలునందు-నవయవకాంతుల్ 181

కం॥ నెలలొకటి రెండు మించిన
వెలఁదికినపుడపుడు బొడమె-వేవిళ్లుపై
బలువయ్యెనొడలు చెక్కులు
దెలుపొదవెన్ నూగుటారు-తెల్లంబయ్యెన్ 182

శా॥ భారంబయ్యె సతీలలామకు జగ-త్ప్రాణార్భకార్భాట సం
చారంబున్ గుసుమాస్త్రనిర్భరధను-ర్జ్యానాద ఘీంకార హుం
కారంబున్ దపనీయమంజుల కన-త్కాంచీ మణీఘంటికా
వారంబున్ శుక, కేకి, కోకిల, కన-త్క్వాణాంచితావారమున్ 183

## అనపత్యతాశోకము

సీ॥ పుత్రసంపదలేని - చిత్ర గేహంబులు
కలలఁదోచు పదార్థ - గణమటంచు
కొమరులు గల్గమి - గొప్ప పట్టణములు
ఘన ప్రతిచ్ఛాయల - గతులటంచు
తనయులు బొడమని - ధననిధానంబులు
ధాన్యముల్ దీయు పా - తరలటంచు
ఔరసహీనమై - నట్టి భూ సంపద
శాంబరీ జాల చి - త్రంబులనుచు
తే॥ నాత్మజాతులకై కదా! - యష్టభూతు
లట్టి సంతతిఁబడయని - యట్టివారు
తలపఁబున్నామ నరకంబుఁ - దాటఁజాల
రని విచారించుచున్ గాల - మధిగమింప 177

౦॥ ఆ మిథున మఘవినాశ
స్వామిన్ శ్రేయోధ్వగమన చర్చితచిత్తున్
ధీమహితుఁడౌ కుమారున్
గామించి మహేశు నెన్ని - కం బూజింపన్ 178

॥ పండు వెన్నెల తేటు - నిండు నవ్వుల మీటు
నీటుతో చదలేటి - బోటి తోడ
దొరుపాటుల దార - లోర జూపులఁజూచు
చూపుతో వెన్నెల - పూపతోడఁ
గాటుమబ్బుల బారు - తీరులూరగఁ గేరు
నట్టుతోఁదొలివేల్పు - పుట్టుతోడ
గాలిమేపరిచాలు - ప్రేలు పేరుల గాలు
చెలువతో మువ్వన్నె - వలువతోడ
॥ మేలిడా కేల మున్మొన - వాలుతోడ
తోడవెనకయ్య ముద్దయ్య - తోడఁగూడఁ
గూడిసడయాడు వెలిగిబ్బ - కోడెతోడ
పొడలగెంటము దాలుపు - పొలుచునంచు 179

సీ॥ పోషితపున్నాగ-ఫుల్లసూన పరాగ
రూషితైలాకుంజ-రుచిరములను
కల్పితకాసార-కైరవామోదిత
రోలంబఝుంకార-రోదములను
కేతకీ మమదళా-కీర్ణోత్క-రాంతర
సప్తపర్ణద్రుమ-చ్ఛాయలందు
రాజిత పంకేజ-రత్న నిర్మిత మూల
సహాకార వేదికా-సదనములను

తే॥ సలలితోద్యాన శుద్ధాంత-శక్రరత్న
వంభిరోచులు వారి ద-భ్రాంతి నర్త
న ములు సల్పెడు నీలకం-ఠములతోడ
సంతతక్రీడలందుచు-సతియుఁబతియు 1

కం॥ పతిహితముగ సతిమెలఁగును
సతిహితముగఁబతిమెలంగు-శైలజ సర్వ
స్థితి సుమసౌగంధ్యమ్ముల
గలినట్లైక్యంబుఁ గొంత-కాలము జరుగన్ 1

శా॥ ఆ దాంపత్యమహీన భక్తి శివపూ-జాసక్తి నత్యంతమున్
వేదోక్తిన్ బహు విప్రసంయుతముగా-బిల్వచ్ఛదానీక మా
మోదంబంది లలాటలోచనుని శం-భో! యంచు పూజించుచు
యాదోరాశినిషంగ!శర్వ!యనిసా-ష్టాంగమ్ములన్ జేయుచున్ 1

ఉ॥ భూరి సువర్ణ దక్షిణలు-భూసుర యాచక దీనకోటికిం
పారనొసంగుచున్న వర-సాన్నములాకలిచొక్కు-హీన రు
ద్గార బుభుక్షితా ధ్వగ-కదంబముఁ దృప్తినొనర్చి బీద సం
సారికిశోరసంతతి న-జస్రముఁబ్రోచు ననేకరీతులన్ 17

కం॥ ప్రకటైశ్వర్యములుండియు
నికటస్థలి నాడి పాడి-నెనరుగ మెలఁగన్
సుకరాపత్యములేమిని
సకలంబును లేనియట్టి-చందంబనుచున్ 176

తే॥ నలికమును జెక్కు లురము క్రే-వలుల నూగు
టూరు పొక్కిలి పెందొడ-లందు మెఱుఁగు
లప్పటప్పటఁ గను నాస-లడర నీక
ఆము నెలకొల్పి మలిపెను-నా మిటారి 167

సీ॥ తొడనిగ్గు పావడ-తొలఁగి జిగ్గుమనంగ
మిరమిట్లు కన్నుల-నెరపఁజూచుఁ
జన్నెవ్రలిరుఁగ డ-సందు హారాం దళుకులఁ
బాళిచే నెమ్మది-ప్రీలఁజూచు
నెల్లమై గొనబుల-నల్లి బిల్లి గొనంగఁ
గన్గవ నెన్నొసల్-గదియఁజూచు
నలరు తేనియలూరు-వలిపంపుఁబల్కుల
వినఁగోరి వీనుల-వెడఁదఁజూచు

తే॥ బాళిఁ బురి గొల్పు తాను వి-రాళిఁబొందు
నకట! బ్రతిమాలు మాటి మా-టికిని వేడు
బిట్టు కౌగిట నదుమంగ-నట్టె గవియు
డిగులువడుఁ గుందు నాతేఁడు-వగలఁ బొందు 168

చ॥ మెలపున నీవి కేలను గ-మించి, సడల్చిన, నంతలోన న
వ్వలపుఁగొటారు హస్తముల-వల్వను బట్టఁగఁ బైటనంట డు
వ్వలు వఁదొలంగఁ జేసి, పరు-వంబగు వాతెఱ తేనెఁ గ్రోలుచున్
వలపుల రేని చేతల క-వాఙ్ముఖిగామి నొనంగఁ గోరఁగన్ 169

చ॥ చిరునగవుల్ వెలింజొను పు-సీత్కృతులన్ బొమలెక్కడించు, వా
తెరఁదడవుం, బయంట బిగి-దీరుచు, మోమరపించు, సాము సి
గ్గఱు, కటిచేలఁ జుట్టుటలు-గాంచిన నొప్పియు నొప్పకుండుటల్
కఱుదుననొప్పు సూచనలు-గా మదినెంచి వలంతి ప్రేముడిన్ 170

తే॥ అతను సామ్రాజ్య సింహాస-నాధిరోహ
పట్టభద్రార్హ సౌఖ్య సం-పదల నలరి
ముదితలేజీబు కావి కె-మ్మోవి తేనెఁ
దప్పితీరంగఁ బలుమారు-త్రావి త్రావి 171

కం॥ వెలి యూటఁ జెక్కుటద్దము
లలరిన దమి ముద్దు వెట్టు-నంతటిలోనన్
బలు వగల మోముఁ ద్రిప్పెడు
గిలిగింతలఁ బైట జారి-గ్రేవలబడియెన్ 162

కం॥ జక్కవల డెక్కఁ జూపెడు
నిక్కం జనులు బ్బ సంత-నెలఁతుఁకత్రైకన్
జక్కన ముడియు న్విప్పినఁ
డక్కరి సిబ్బితిని గేల-టం జొనియింపన్ 163

కం॥ సమయమని యెంచి యతఁడా
రమణీ మణి కోక ముడి క-రంబుననంటన్
గ్రమముడిగి వీడఁ బొక్కిలి
నెమకక గన్పడఁగ మించు-నీవియుఁదోచెన్ 164

కం॥ ఊరుయుగంబున నఖముల
గీరికొనంజేసి, చెక్కు-గీటి, కుచంబుల్
సారెకు మీటంగా నీ
త్కారంబుల వెరపుగలిగి-కౌగిటఁబట్టెన్ 165

తే॥ అదిమె యదనని కౌగిట-నదిమి మోవి
తేనెలానంగసాము క-న్గొన చూపు
లారజపుసేగి బొమముడి-యలరు విల్తు
కయ్యమునకింత కాక్ దుష్ప్ర-కరణినొప్ప 166

సీ॥ పౌటకరించిన చన్ను-పొం బనంటుల గోళ్లు
సోకుడు బల్మారు-సోక నీక
అలరు వాతెఱఁ దేనె-లాను-చో ముఃబంటి
వలిపంపు నొక్కు లే-ర్పడఁగ నీక
చన్గవ క్రేవల సంపులనునుగోటి
చెనక్కులు నిరుఁగడఁ జెంద నీక
ఈప్సైను చోటుల-నీర తారలు గాగ
గోనబు ముద్దుల నాస-గొనగ నీక

సీ॥ చేర్చుక్క ముత్తెముల్ - చింద లాడగ నీక
చూపులెల్లడలందు - జొరగనీక
ముఖపాద సరసీ జములుగాక తక్కిన
మేను చూపరులకు గాననీక
అడుగిడ జప్పుడింతైన గల్గగనీక
భాషలేరికి వినబడగనీక
హాసంబులనురదనాంకు రంబులదోప
కెదురైన బురుమల కెదురు రాక

గీ॥ నిత్యనైపథ్యవై గృహ నియమములను
బరిపిశుమేయి తమకు లాచారసరణి
నారకూట మటుంబుఽ నీరు నింపి
బంతులై యేగుదురు గేస్త్రిభామలచట

వ॥ ఇల్లాండ్రు మేల్బంతులవలె పయఃపూర్ణ కుంభములతో అరుగు చున్నారట!

వ॥ ఎంత శాలీనతా భరముతో శుచి ముఖలైయున్నారు? పదవిన్యాస మెంతసుకుమారముగ నున్నది. ఆర్భాటములేదు. అడుగు లిడుటలో చప్పుడు లేదు, నవ్వులో, మొలక నవ్వులట, పువ్వులు వికసించినట్లుండును మధుర భాషిణులు, పువ్వులమ్మువార ట్లుండిరి, పురంధ్రిమణులిట్లుండిరి. కవియొక్క భావనావైశద్యమునకు, వర్ణనావైవిధ్యమునకిది గీటురాయి.
వ॥ శివాజి విజృంభణము, యౌవనోర్వీశునకు చెవుల బడినది, క్రమక్రమముగ దొంగబలిసి బందిపోటగు విధమున, శివాజీనుపేక్షించినచో, మొదలికి మోసమగునని, వృద్ధామాత్యుడు, బీజాపురప్రభువునకు తెలుపరచిరి.

ఆ॥వె॥ కసవు బెరిగెనేని - పసతగ్గు సస్యంబు
లిరుగుబలి సెనేని - యిల్లుగొనును
యేరుపెరిగెనేని - యిరుదెసల్లోగొను
వైరి పెరిగెనేని - వసుధబొందు

## పునస్సంధానము

ఉ॥ పంటవలంతి వేలుపుల-ప్రామినుకుల్ రొదలీద చూళి పై
నంట, దెసల్తుపాసుల హారా-యల్, తలకెంపులు హజ్జలంట వే
గంటు దణానిగారమునఁ-గ్రాలుచు నానులయెల్లి నీడ వా
ల్గంటిని గూడి లోఁగల చో-కాటపుగీమునఁజేరు నంతటన్ 157

మ॥ పురయోషా తతి వీక్షణార్థముగ కా-భూజానివే జాలక
స్ఫురదాగారమునన్ శచీంద్రులవలెన్-శోభిల్ల ధీరో దిత
స్థిరలగ్నంబరుదెంచెనంచువిబుధుల్-శీఘ్రంబ, పుణ్యాంగనా
కరసం స్పర్శనకా వధూవరుల రం-గద్గేహముం జేర్పఁగాన్ 158

ఉ॥ గోలతనంబునన్ జిజయ-కుంచితలజ్జనతాస్యయాగను, గా
బాలిక కేలువట్టి చని-పాను పునంటు కొలంది యాపెఁబ్రో
యాలులసన్ బనుల్ గఱపు-చంతటనంతట నిల్వఁజేయయా
బాలికతోడఁజేరెఁబువుబానుపుఁజెంతకు సంతసంబుగాన్.

ఉ॥ చేరి వధూలలామమును-సెజ్జను జేర్పననేక యత్నముల్
గూరిచి కార్యముంగనక-గొబ్బునఁగన్గవ మూసి సైక చే
నారసికావతంసునిక-రాబ్జముల వొచ్చటనుండఁజేసిఁ తా
చేరలు మెల్లగా వదల-జేసి తటాలున మూసెఁదల్పులస్ 159

కం॥ రాగవతియైన నెచ్చెలి
యీ గతినేగంగ మదిని-నెరింగి యెరుఁగ న
ట్లా గుప్త కరద్వయమున
వేగమ కుచయుగ్మమంటు-విధి విదలించెన్ 160

గీ॥ ఒకటిఁ గాక్షింప విధి రెంటి-నొసంగి నట్టు
లంగసంస్పర్శమును గోరు-నధిపు సకును
తరుణి కుచములు తమ యంత- తాము పట్టు
వడినలజ్జను సతిమోము-పాన్పుఁ జేర్చె 161

కం॥ అని బుద్ధి సెప్ప కూతున
క నేక భూషణములొసఁగి-యల్లునితోడన్
వినయమ్మున నిది గోలయు
గనుక మనంబరసిహితము-గైకొను మనియెన్ 151

కం॥ వియ్యం కుం దగు బంధులు
నెయ్యంబున సత్కరించి-నృప, గురుపులకున్
వెయ్యారులొసఁగి లుకజి యు
చయ్యసఁబయనంబు సేయఁ-జను సమయమునన్ 152

## గృహ ప్రవేశము

తే॥ సంతసంబున శహాజీంద్రు-డంత పట్ట
మహిషితోఁ గూడి యత్త మా-మలకు మ్రొక్కి
"యార్య వర్య శుభా శిషా-వాప్తులగుచు
శలవుగొనియేగెఁ దమదగు-నిలయమునకు 15

కం॥ భేరీ మురజానక భాం
కా రంబులు భటరవములు-గజ బృంహితముల్
పారసీక తురఁగ హేషలు
బోరుకొనం జనిరివారు-పూనాపురికిన్ 15

కం॥ పరిణయఁపు జాను మీఱన్
బరిగొని, రా, జవ్వనపుఁదు-బాసినిఁ దోడ్తోఁ
బురజను లురిది పనంటుల
సరులున్మేలారతులు ప-సంగొనిరాగన్ 15

కం॥ మానికపుఁ బల్లెరంబుల
లో, నిడు,ఁ గపురపుని వాళు-లుంగొనుచునె, రా,
మానినులకొసఁగె నంత క
డాని మెఱుగు గింజెముల కొ-టారులు ప్రీతిన్ 15

కం॥ తదనంతరంబ పెండిలి
విదితంబుగఁ జరిపి, లుకజి-విభుడుందన యా
త్మ దుహితకు సల్లునకొసఁగె
ను దారమణి భూషణంబు-లు దవసితంబుల్ 147

కం॥ సారధి నియుక్త రథములు
దారిత కులశైల దంత-దం తావళముల్
మారుత వేగార్వమ్ములు
భైరవసంకాశ వీర-భట బృందములున్ 148

కం॥ అప్పుడు లుకజీ నృపుసతి
యొప్పులకుప్ప యగు పుత్రి-నుల్లసమున మా
యప్పరొ ! నీకిదె చెప్పెద
నెప్పుడు బ తిదైవమట్టు-లెంచి మెలగు మీ 149

సీ॥ భర్త్రకిష్టములేని-పనులొనరింపకు
పతియాజ్ఞలకు మారు-పలుకకమ్మ
ఇష్టదేవమ్ముల-నిరుప్రొద్దు పూజింపు
మా కొన్న జనముల-నరయుమమ్మ
అత్త మామలయాన-లారడి చేయకు
ఆడబిడ్డలఁ బ్రేమఁ-జూడుమమ్మ
విరసంపుఁ బలుకులు-పెరలను బల్కకు
మరయు మా వరవుళ్ల-తెరవులమ్మ
కలనైన దబ్బరల్ దలఁపున నొల్లకు
మొరులొనరచ్చెడి నుతి-కుబ్బకమ్మ

తే॥ వృద్ధ, గురుదైవ పూజలు-విడువకమ్మ
పెరల బంధులరీతి భా-వింపుమమ్మ
తులువలొక వేళ దూరిన-దూఁకకమ్మ
యార్త రక్షణ దీక్షిత-వగుము కొమ్మ 150

శా॥ బంధువ్రాతము లాప్తముఖ్యస చివుల్-ప్రాంతాధిపుల్, సైనికుల్
గాంధర్వంబుల నెక్కి, రా, యవనఖాన్-ఖానున్ స్వకీయ ద్వీప
స్కంధారోహణుగా నొనర్చి ఋకజీ-ప్రేమనేత, స్థానీయ సం
బంధారామకునం దెదుర్కొనియె-నవ్యప్రౌఢి, వియ్యంకునిన్ 141

తే॥ అంత బంధువులెల్ల ర-న్యోన్యబాంధ
వ ములఁదెల్పుచు హాస్యవా-క్యముల తోడ
నిం పిరొక్కరినొకరు ప-న్నీరు వలపు
బుక్క, బర్గుండ, పునుగుక-ప్పురపుఁ జేర్లు 142

కం॥ ఉత్సాహంబున నిరుఁగడ,
లుత్సవములు సలిపి శర్క-రోడకములచే
వత్సాళులఁ దనియింపుచు
నుత్సేకంబొదవనే గి-రొగి విడిదలకున్ 143

కం॥ ధీరోధత లగ్నంబిదె
చేరెన్ దయసేయుఁడనుచు-క్షితిదేవుఁడొకం
డారయఁ బిలిచిన పెండ్లి కు
మారుఁడు బంధుగులు కాయ-మానముఁ జేరన్ 144

తే॥ నివ నిశా సారలిప్త సుం-దర వివాహ
పీఠమున శాజిఁ గూర్చుండ-బెట్టి కెలన
జవని కనుబట్టి యంత, మై-దువలు పెండ్లి
కూతు రప్పింపఁ గార్తాంతి-కులు, జదువుచు 145

కం॥ తలఁబ్రాల్ వోయుండనఁగా,
వెలఁది తలన్ బతి, వరుఁదల-వెలఁదియు నింపన్
బల శతమంగళసూత్రము
కలికిమెడన్ శహాజి నృపతి-కట్టెన్ వేడ్కన్ 146

తే॥ ఎల్లి పంచమి లగ్నమం-దేగు పెండ్లి
కరుగ వలెఁగాన మీరెల్ల-రాత్మ బంధు
భృత్య సకుటుంబ పరివార-భేదమెంచ
కేగుదేరుఁడీ! యని చెప్పె-నెల్లరకున్ 135

వ॥ మఱియు. 136

తే॥ ఎల్లి పంచమి నాడు మీ-యింట నున్న
బంధుమిత్ర కుటుంబ స-ద్బలము తోడఁ
బరిణయోత్సవ మీక్షింప-బయలుదేరి
రండటంచును జాటించె-రాజ్యమందు 137

కం॥ అంత, బురంబునఁ గల జను
లెంతయు నానందమొంది-యేతేర, మహీ
కాంతుం డొప్పెను దారా
కాంతోదయమైన మహిత-కంధి విధమునన్ 138

కం॥ చతురంగ బలంబులతో
నతి శుభదంబౌ ముహూర్త-మందున సభ్యా
న్నతితో సహామన్న గర
క్షితి బాహ్యారామ వాటిఁ-జేరి విడిసినన్ 139

## వివాహము

చ॥ పణవ, మృదంగ, భేరి ముఖ-వాద్యరవవబులు మున్ ధణంధణం
ధణమని మ్రోయ, దంతి గళ-తాండవఘంటికలున్ ఘణంఘణం
ఘణమని నిక్వాణల్ సెలఁగఁ- గాంస్యవిమర్దళముల్ ఝణంఝణం
ఝణమని పల్క, మాగధుల-సంస్తుతిమున్నె శుభం శుభంబనన్ 140

శా॥ స్మేరాంకూరము లుప్పతిల్ల ద్విజులా-శీర్వాదముల్ సేసి, యో
హో! రాజాగ్రణి! తావకాశ్రితుల మా-హ్వానార్థులా వారమున్
కారుణ్యంబునఁ బ్రోవుఁడే గదము సాం-ధ్యప్రక్రియల్ దీర్పఁగా
నీరాత్రిన్ బయనం బనుజ్ఞ దయచే-యించంగదే! సత్ప్రభూ! 128

కం॥ అని సెలవుం గొని యతఁడొసఁ
గిన, బహుమతి కలరి, వీటి-కిం జని, లుకజీ
మనుజేంద్రుని గని పెండ్లి
కనుకూలముఁ జెప్పి, యిండ్ల-కరిగిరి వారల్ 129

వ॥ అనంతరంబు లుకజీంద్రుండు 130

కం॥ పుర బాహ్యారామంబుల
తరుసంఘ, తటాక, సత్పథ, దుర-ధ్వప్రాం
తరముల విడిదల కార్తీ
స్వర పట సద్మములఁ గూర్చి-జనవర్యుండున్ 131

కం॥ ఏ యెడలఁ జెలువ పందిరు
లే యెడ జలయంత్ర వితతు-లెట సత్రము లం
దే యెడలఁ బరువిచారణ
లే యెడ శ్రుతి పాఠములు, సంహీనతఁ జరిపెన్ 132

## వివాహాలంకరణము - ఆహ్వానము

అట మాలోజి పురంబు నెల్లెడల న-వ్యాగారముల్ బోలి, యు
త్కట చూతచ్ఛద తోరణంబులు పృథ-గ్రంభా తరుస్థాపనల్
పటు ఘంటాపథ వార పార్శ్వము కుర-ప్రత్యగ్ర దీపంబులున్
భటసంధాన విచిత్ర గేహముల సం-దంబొప్పఁగావించియున్ 133

కం॥ హితబంధు సచివ పారో
హితసామంతాశ్రిత నట-భృత్యధరిత్రీ
పతులాది నెల్ల పురజన
తతులం బిలువంగ సచివ-తతి నియమింపన్ 134

## ఆశీః

సీ॥ అభివాదయే ఽహ మా-ర్యవతంసతే ఽభ్యపృ
ధ్వీ వర! శ్రీరస్తు-తే, జయో ఽస్తు ।
తావకాగమనం, కు-తస్త్వార్య! శుభమ
స్త్వహమద్పురా దహ-మాగతో ఽస్మి
ఉపవిశత్విదమాస-నోత్తమం కృపయా, త
థైవాహమస్మి రా-జాధి రాజ!
భవదీయ శాసనం-భద్ర మస్తి కిమస్తి
కళ్యాణ కార్యసాఫల్య తాఽస్తి

తే॥ అనుచుఁ దెచ్చిన శుభలేఖ-న తిముదమున
పీతకౌ శేయమున ముడి-విప్పి, వేగఁ
జేతికొనఁగిన మాలోజి-ప్రీతితోడ
పుచ్చుకొనియుండ నొక్కఁ డా-భూమి సురుల 126

## పత్రికా పఠనము

సీ॥ రాజేంద్ర! లుకజీమ-హీజాని పుత్రిక
యగు జీజాబాయి నీ-యనుఁగు పుత్రుఁ
డగు శహాజీకిని ను-ద్వాహంబుఁ గావింప
నెల్లి పంచమి లగ్న-మిడియె నతఁడు
అహమద్ పాదుషా-యానందమును బొంది
వచ్చెద ననియె వి-వాహమునకుఁ
గావున మీరాప్త-గణముతో విచ్చేసి
వైవాహిక మహోత్స-వంబుఁజరిపి

తే॥ దంపతులఁ బ్రీతి దీవించి-దయ దలిర్ప
మాకు నానందమును గూర్పు-మా! యనంగ
హృదయమలరంగ వారి కు-ర్వీశ్వరుండు
వీడ్యములు హేమ ముద్రికల్-వేయినొసఁగ 127

శా॥ ఛాత్రోపక్రమణాను పూర్వక తప-స్స్వాధ్యాయ హోత్రాగ్ని మం
త్రత్రాణావన, యజ్ఞ హవ్యముఖ సా-నాయ్యాద్య హోమాభ్రన
క్షుత్రప్రావృత ధూమ ధూ సర నిశా స్వ-చ్ఛాంతరుల్ గాంచి స
ద్గో త్రప్రాగ్రజుల గ్రహారమని సంతోషించి యేతేరగాన్ 120

చ॥ శతమఖసంవిధానములు-చందము లాశ్రమ ధర్మముల్ సభా
వితత వివాదఖండనలు-వృత్తవిధాధ్యయనక్రమంబులా
యత మనుధర్మసంహితలు-నాత్మపరుండను నిశ్చితార్థముల్
సుతహితకోటికిందెలుపు-సూరి గృహంబున కేగ నాతఁడున్ 121

## అతిథి సత్కారము

కం॥ విసయ విధేయత నెదురుగఁ
జని వారల నాదరించి-చయ్యన. బాద్యం
బును, నర్ఘ్యమొసఁగి యుచితా
సనములిడి, శుభమరసి, హ్రాద-జలముల శుచులై 122

కం॥ మధ్యాహ్నాహ్నికములునా
ది ధ్యులఁ గూడికొని జరిపి-ధృతి సోమిదమల్
ప ధ్మాన్నములిడ మెక్కి-రి
ద ధ్యం తముగాగ భూమి-దైవ వతంసుల్ 123

కం॥ హరి గోవింద ముకుంద
స్మరణంబులఁదమలములు-జరిపియు దర్భా
స్తరణముల 'నన్నదా తా
చిర' మనుచు గృహస్థు వలని-సెలవుంగొనుచున్ 124

కం॥ ఒడయునిఁ గను.గొన నెం తే
వడి దా వాకుని రాజు-వలనికిఁ బంపన్
మిడిజేఁడు దెలిసి పాఱుఁ
గడువడిఁ దెప్పించి మిగుల-గౌ రవమొ సఁగన్ 125

కం॥ తన వంశజునకు శుభ శో
భనముల్ గలుగు నను నాశ-ప్రాగ్దిశయందున్
విను మానికమ్ము దోఁపఁగ,
దినము దయము జరుపుఁబనులు-దీరిచి పాఱుల్ 114

చ॥ చని చని ముందుఁగాంచిరి ర-సా సురవర్యసంత చుంబిత
స్వన ఘన శాతకుంభపట-జాల విలాస విశాలలోల కే
తన గణముష్ణరుగ్రుచిర-ధామ తురంగ పిధానవారమై
దసరెడు పాలెమున్, రిపు వి-దారణమూల కరాళసాలమున్ 115

మ॥ కని యత్యద్భుతమంది యిప్పురము స్వ-ర్గంగా ప్రవాహా వృతం
బున శోభిల్లు దివంబునాఁబరగు సం-పూర్ణాభమా ఋక్షరాడ్
ఘనపాషాణ వినిర్మితావరణ రం-గద్భిత్తిచంద్రాప్తి సం
జననంబైయని శ్రప్రవాహమగు రా-జద్రుద్ధ కూలంకషన్ 116

కం॥ అని కొనియాడి పునాపురి
ననుపమ హర్మ్యములచిత్రి-తావరణ మహా
ధన కక్ష్యాంతర పటకే
తన వాయుస్పర్శశ్రమము-తలఁగి చనంగన్ 117

తే॥ తండులక్షాళన జలానఁ-దనియఁజేసి
యుదయమందున నదిదరి-నుతికి నట్టి
పుడక గోరంచు వలువలు-మూపులంటి
వారి పూర్ణార కూట కుం-భములు గొంచు 118

కం॥ తడసైన నత్తె చిడిముడి
వడు నప్పా! నడువుమనుచు-పలుకు చరుగున
వ్వడ తి గమిఁ గాంచి బాపల
విడి దలకుం దారిఁ దెలిసి-వేవేఁ జనఁగాన్ 119

క॥ మసమరయ, వ్రాయ, బూదపు
డసఘులు, షట్కర్మనిరతు-లౌ. విప్రులఁ జం
దన తాంబూలములం
దనుపుచు శుభలేఖ నొసఁగ-ఁదక్షిణమందున్ 110

క॥ వారిండ్ల కరిగి దారల
నారసి, కుతుకమున పెండ్లి-కారయ పిలువన్
ఈ రేయిఁబునా పురికిం
దా రేగెదమంచుఁ దెలిపి-తనియని వేడ్కన్ 111

## ప్రయాణము

సీ॥ గన్నేరు పూచాయ-గన్పట్టు నీర్కావి
వలువలు గట్టి పిం-జలను బెట్టి
మునివ్రేళ్ల జీరాడు-కొనచెంగు మల్లించి
కడు పక్కళించి చ-క్కఁగను మలిపి
పెడమోము వెట్టి బి-ఢ్బిడలాడు చెంగులు
వ్రేళ్లతో మణిచియు-వెన్కఁదోపి
వల్కలరజ్జు సం-బద్ధతాళచ్ఛదా
చ్ఛ రవి సిద్ధాంతముల్-సంకలనిడి
తే॥ తమ పితామహ సంపాది-తంబులైన
రాంకవము లుత్తమాంగాంత-రములు దృశ్య
ములుగఁ జుట్టి విభూతులు-మోముల లఁది
మేలి కేలాసమాలికల్-మెడల వైచి. 112

ఉ॥ ఆనగరాని హర్షముల-నగ్రజులంఘ్రుల ముచ్చలంటి నీ
రానిన రాగి జారియలు-హస్తములన్గొని, మేలి దుప్పటుల్
బూనినమూపులం, గొడుగు-లున్ నులిగొమ్ముల మెకమ్ముల త్రోళ్లలా
జానగు దేవతార్చన-సంపులుసించి త్వర త్వరం జనన్ 113

విశ్వకర్మ నిర్మించిన వియన్న గరమా అన్నట్లున్నదట. రాఢ్ఫడ దుర్గరచన. పుష్ప లావికలను-పరమ మనోజ్ఞముగ వర్ణించిన పట్టులు, పూర్వాంధ్ర ప్రబంధములలో, కోకొల్లలున్నవి. వర్ణితమగు వస్తువొక్కటె అయినను కవిప్రతిభనుబట్టి, అభినవోన్మేషణములతో, అది దర్శనమిచ్చును, అదియెగదా, కవితా సౌందర్యమునుపట్టి ఇచ్చు లక్షణము. "క్షణేక్షణేయన్నవతాముపైతి, తదేవరూపం రమణీయతాయాః అని కదా ఆర్యోక్తి. క్షణక్షణ సౌందర్యము, ప్రతిక్షణ మాధుర్యమున కావ్యములలో ప్రసన్నమై పాఠకుల నలరింపచేయ వలయును. పరిచితమైన సన్నివేశమున, కవి పలుకుచున్ననూ. ఆభావనలో ఒకసౌందర్య బోధము అనిదం పూర్వమైస్ఫురింప వలయును. అదియేప్రతిభ. అదిపుష్కలముగ పండినచో మహాకవి అగును.

సీ॥ కోకపైగప్పు బూగుత్తులుగొను తెట్లు
బైటనుండిన వెలబడయవనుచు
పూరెమ్మ లెత్తిన బుచ్చుకొందుమటన్న
గోనునప్పు డారీతు నొనరునను చు
నల్లగల్వల దండ - నాకుజూవుమియన
పైచెండ్లు గోనకవిబడయదగదు,
పున్నాగివిరి. యేల - బొడసూపవన్నను
నేత్రంబు మాటు దానికినినీకు.

గీ॥ చెలువమరుపూజ కొప్పిన చిన్నచెండ్లు
కడగి నంతటి వెలయిత్తుననిన వలపు
లెంతవెలయంచు, సరసుల నెదలమలపి
పూవులమ్మెద రవ్విటి బూవు బోండ్లు

వ॥ ఈపద్యమును భావించినకొలది పరమ సుకుమార శృంగారభావములను కుప్పల తెప్పలుగా వెదజల్లుచున్నది. ఇవి ఇట్లుండగా కులకాంతలను వర్ణించిన తీరు చూడుడు,

శా॥ రంగత్తుంగ తరంగ భంగముల న-భ్రంబంటు నంభోనిధిన్
పంగుండీదఁ దలంచు చందమున నీ-భాస్వత్ కృతింజెప్ప, నే
నంగీకారముఁ బొంది, భంగములఁ దూ-గాడంగలోఁ బొక్కియా
గంగాజూటు కటాక్షనౌకను దరిన్-గానంగ నూ హించితిన్ 46

కం॥ వా. కొమరుఁడు రామా రా
పీ కథ, రచియింప నన్ను-హెచ్చరికింపన్
జే కొంటి నైరు నాలుగు
చౌ కంబిమ్మడియు నొండు-శాలి శకమునన్ 47

తేగీ॥ కృతి రచించుట కుబ్బి యీ-కృతికిఁ పతిని
నరయ, నాత్మను స్ఫురియించె-నఖిల దైవ
దైవములకెల్ల మంత్రాధి-దైవమైన
హరి హరబ్రహ్మలకు దైవ-మర్హుఁడనుచు 48

## షష్ఠ్యంతములు.

కం॥ రంగత్తుంగ తరంగా
భంగాభ్రగునీ కిరీట-భాస్వంతునకున్
మంగళకరునకు వృషభ తు
రంగున కర్ధాంగ శైల రాణ్ణందనికున్ 49

కం॥ దీన జన త్రాణ నిధా
నానూన సుగణనదీ గణా ధీశునకున్
శ్రీనాధ బాణపాణికి
దీనారాచలిధనుః ప్రథిత హస్తునకున్ 50

కం॥ తారా పథ పరిచుంచి త
నీరాకర కర నిషంగ-నిహితాంశునకున్
హీరా తత సితపంకజ
సారమణీ విభూషనకును సర్వేశునకున్ 51